# మహాభారత సాహిత్యము

## ౨


తర్కాచార్య, భాషాప్రవీణ

శ్రీ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి

సీనియర్ తెలుగు పండితులు,

యస్. కె. పి. వి. వి. హిందూ హైస్కూలు,

గాంధీనగరం, విజయవాడ-2.





శ్రీ పబ్లిషర్స్, విజయవాడ-2

ఇందులో

ధృతరాష్ట్రుడు

పాండురాజు

విదురుడు

ధర్మరాజు

భీముడు

అర్జునుడు

నకుల - సహదేవులు

లేకుండగనే చనిపోయెను విచిత్రవీర్యుడు అంబిక, అంబాలిక యను నిద్దరిని పెండ్లాడి సంతతి బడయకుండగనే చనిపోయెను. అప్పుడు సత్యవతి, తనకారణముగా భీష్ముడు బ్రహ్మచారియై నాడు. తనకొడుకులు పుత్రసంతానము లేకయే వంశము విచ్ఛిన్నమైనదని విచారించి భీష్మునితో విచిత్రవీర్యుని భార్యల యందు సంతానమును కనుమనెను. కాని అతడు ప్రతిజ్ఞను నిర్వహింపక మానననెను. అప్పుడు సత్యవతి తనకు పరాశర మునివలన వ్యాసమహర్షి పుట్టినట్లు చెప్పి భీష్ముని యనుమతిపై వ్యాసుని తలచుకొనెను. వెంటనే వ్యాసమహర్షి వచ్చెను. తల్లికి నమస్కరించెను. ఆమె తనవంశమును నిల్పుమని కోరినది. అతడు సకల ధర్మముల నెరిగినవాడు. పరకళత్రములను, అందులోను పూర్వసుహాసినులను తాకెట్లు పొందుదును? అదేమి ధర్మము? మనకది ఆశ్చర్యమును కల్గింపవచ్చును. కాని నియమముతో నొక్కసారి సంతానార్థులై చేయుట వ్రతమువంటిదే కాని దోష దూషితము కాదని అతడెరుగును. దానికి కావలసిన వ్రతమొకటి పట్టుమని చెప్పెను. తాను వెళ్లిపోయెను.

సత్యవతి వ్యాసుడు చెప్పినట్లుగా ఒక్క సంవత్సరము కాలము కోడలిచేత నియమమును చేయించెను సత్పుత్రులు పుట్టుటకై ఆమె నియమములు పట్టెను

సంవత్సరము తిరిగివచ్చినది. ఆనాడు వ్యాసమహర్షి వచ్చెను. సత్యవతి కోడలైన అంబికను ఒప్పించినది. ఆనాడు పగలు కొన్నివేల బ్రాహ్మణులకు భోజనము పెట్టించెను. దేవ ముని పూజలు చేయించెను. రాత్రి కాగానే సింగారించి గదిలోని కంపెను

ఆమె శయ్యపై పవళించెను. సమయము కాగానే వ్యాస మహర్షి శయనాగారమున ప్రవేశించెను. అతని గడ్డము, జడలు చూచు టతో నామెకు భయము కలిగెను. కన్నులు మూసికొన్నది. అత డామెతో సంగమించెను. గ్రుడ్డివాడగు పుత్రుని ప్రసాదించెను.

కొన్ని దినములకు రాగానే సత్యవతి దగ్గరకు వచ్చి 'నాయనా' అంబికకు పుట్టువాడెట్టివాడగును? నీవు త్రికాలజ్ఞుడవు. చెప్పుము, అని కోరెను. అతడు 'నన్ను చూచి కన్నులు మూసికొని యున్నం దున పుట్టబోవువాడు పదివేల ఏనుగుల బలము గలవాడైనను పుట్టు గ్రుడ్డివాడగును,' అని చెప్పెను. అందుచే నతడు రాజ్యాధి కారి కాడని సత్యవతి మరల ప్రార్థించెను. అంబాలికయందు పుట్టువాడు చూపుగలవానిగా నుండవలెనని కోరెను. అతడట్లే యని అంబాలికకు కూడ పుత్రుడు పుట్టునట్లు చేసెను.

వారిద్దరు గర్భవతులై పిల్లలను కనిరి. అంబికకు గ్రుడ్డి వాడు పుట్టెను. అతడే ధృతరాష్ట్రుడు. అంబాలికకు పుట్టిన వాడు, పాండురాజు.

ధృతరాష్ట్రుడు పదివేల ఏనుగుల బలము గలవాడు. దేహపుష్టియున్నది కాని, ఏమిలాభము? పాపము! అతడు గ్రుడ్డివాడైపోయెను. అది తల్లిదోషము. భీష్ముడే ధృతరాష్ట్ర పాండురాజులకు జాతకర్మాది సంస్కారములు చేసెను.

వారిద్దరును చక్కగా పెరుగుచుండిరి. భీష్ముడు వారికి ఉపనయనము చేసెను, వారిని తగిన గురువులవద్ద నొప్పగించెను. వారు తెలివితేటలు గలవారగుటచే తేలికగా రాజులకు ఉప యోగించు విద్యలన్నిటిని నేర్చిరి.

భీష్ముడు తానుపట్టిన ప్రతిజ్ఞ ప్రకారము గ్రుడ్డివాడైనను పెద్దవాడైనందువలన ధృతరాష్ట్రునికే రాజుగా పట్టాభిషేకము చేసెను. నామమునకు రాజతనికి పరిపాలనము చేయుచుండెను. పైనుండి భీష్ముడు సంరక్షించుచుండెను. విదురుడు, వ్యాసునకు అంబిక యొక్క దాసియందు పుట్టినవాడు. ధృతరాష్ట్రునకు తమ్ముడైనవారిలోనివాడు మహాబుద్ధిమంతుడు. నీతివేత్తయును, అతడు తగిన సమయములందు ఆలోచనలు చెప్పుచుండెను. అందరు సహాయులుగా నుండగా రాజ్యముచేయుటకేమి? ధృతరాష్ట్రుడు రాజ్యమేలుచుండెను.

ఇట్లుండగా అతనికి వివాహము చేయవలసిన యీడు వచ్చినది. కాని గ్రుడ్డివానికి పిల్ల నెవరిత్తురు? ఎట్లో పెళ్ళి చేయవలెనని యున్నది భీష్మునకు. అందులోను కన్యకు కావలసిన ముఖ్యలక్షణము రూపము కాదు. గ్రుడ్డివానికి రూపమెందులకు? ఇక వంశమునిల్పుట కుపయోగించుటకై కన్య బహుపుత్రవతియగు యోగ ముండవలెను. ఆమె జాతకము చూచుట కాదు. వారిక గూఢచారులు కావలసిన విషయముల నన్నిటిని క్షణములో తెలిసికొనివచ్చి చెప్పుదురు.

గాంధార దేశమును సుబలుడను రాజేలుచుండెను. అతనికి ఒక కూతురుండెను. ఆమె పేరు గాంధారి. ఆమె రూపలావణ్యములు, సుగుణములుకలది. మరొకటి, శివుని మెప్పించి తనకు నూటొక్క పుత్రులు కల్గునట్లు వరము పొందినదట. ఆమాట వినుటతోడనే భీష్మునకు తప్పక ఆమెనే ధృతరాష్ట్రునకు చేయ బుద్ధి వేసినది. విచ్ఛేదము కానున్న వంశమును వ్యాసమహర్షి నిలిపి

నాడు. ఇప్పుడు తానీమెను ధృతరాష్ట్రునకు చేయించెనా ఇకవంశ విచ్ఛేదము జరుగదు. కాని యామె పెండ్లాడునా? లేదా? అని.

కొందరి బ్రాహ్మణులతో ఆలోచించినాడు అబద్ధమాడి యైన కులము నిలువబెట్టుమని పెద్దలమాట. పెళ్ళిళ్ళవిషయములో నిజము చెప్పక, అబద్ధమాడక యెట్లో దానిని పొసగునట్లు చేయునకు. పెండ్లియైనతర్వాత వారే సర్దుకొందురు కొందరు పిల్లతరఫున బంధువులుగాని, పిల్లవానితరఫున బంధువులుగాని బాధ్యవర్తులను తిట్టుకొందు రనుకొనుచు, వాని సంసారము మగున్నచో అదే పదివేలు. కాకెన్ని తిట్టిపోసిననుసరే అను కొనువారు.

ముసలి బ్రాహ్మణులు సుబలునిదగ్గరకు వెళ్ళి ధృత రాష్ట్రుని బలసరాక్రమాదులను, రాజ్యాభివృద్ధినిగూర్చి ప్రబ లించిరి. అతని దేహసంపద (Personalily)ను గూర్చి వినుట తో తప్పక యిత్తునని రాజు మాటయిచ్చెను.

ఆవార్త క్షణములో అంతఃపురమునకు ప్రాకినది. బంధు వులు నల్గురును రాజువద్దకువచ్చి 'అయ్యో, అవయవములలో కెల్ల తల ప్రధానమైనది. అక్కడనే జ్ఞానేంద్రియము లున్నవి. అందులోను కన్నులు చాల ప్రధానములు. అట్టి కన్నులు లేవుకాని లేకున్న అతడెంత యుత్తముడో?' అనిరి. అనగా 'అతడు త్తముడే కాని గ్రుడ్డితనమే వచ్చినదిలోపము. అతనికి పిల్ల నియ్యదగదు' అను భావమును వెలబుచ్చిరి. వారిమాటలను విన్నది గాంధారి, పెండ్లికూతురు 'మీ రెన్నివంకలు చెప్పకు; నన్ను నా తండ్రిముం దుగా ధృతరాష్ట్రున కిచ్చెను. కాన అతడే నాభర్త. నేను

మరొకరి నింక పెండ్లాడను" అని గట్టిగా పట్టుపట్టినది. అంతటితో వదలక ఆమె ఇక పరపురుషుని చూడరాదని కన్నులకు గంతలు కట్టుకొన్నది. ఆమె కెంతటి పాతివ్రత్యమో! అందరికిని పెండ్లి యైనతర్వాత మగనిపై ప్రేమకు కలుగును. కాని ఆమెకు ముందు గానే ప్రేమకుదిరినది. అది మొదలుగా ప్రేమించెకాను; నీతి నీతికి కట్టువడవలెనుగాని దేనికిని మనస్సును లగ్నము చేసిన దాని యందే ప్రేమకల్గును. మనస్సు నిష్టము వచ్చినట్లు వదలి నచో అదిమూడవిదని మాటకుచిక ఎన్నియో మాటగోరును.

ఆ విషయము తెలిసినది సుబలునకు. తాను మాటనిచ్చి నాడు. పెండ్లికూతు రంగీకరించినది. అంగీకరించుకొనుటయే కాదు. ప్రతిజ్ఞపట్టినది. అతడు తప్పక ఇచ్చునని తనకుమారు డైన శకునిని తోడిచ్చి యామెను వృద్ధబ్రాహ్మణులతో పాటు హస్తినాపురమున కంపెను.

భీష్మునకెంతో ఆనందముకల్గినది. తానను కొన్నది ఫలిం చినందుల కాతడు మురిసిపోయెను. బ్రాహ్మణులకు బహుమా తులు సమర్పించెను. మంచి ముహూర్తమున గాంధారీ ధృత రాష్ట్రులకు వివాహము చేయించెను. అంతేకాదు. ఆమె తోబు ట్టువులు పదిమందికున్నారు. వారందరిని నొక్కరికేయిత్తునని రాజ నుకొనెనో, ఆమెయే అనుకొన్నదో, ఒకేముహూర్తమున వారం దరిని వారియిష్టముపై ధృతరాష్ట్రునకిచ్చి పెండ్లిచేయించెను సత్యవ్రత, సత్యసేన, సుదేష్ణ. సంహిత, తేజశ్శ్రవ, సుశ్రవ, నికృతి, శుభ, సంభవ, దశార్ణ అనువారి పేర్లు. వారందరిని పెం డ్లాడి ధృతరాష్ట్రుడు వారితో కాపురము చేయుచుండెను.

సినది. తనకు పుత్రులేదని యీమె కంత క్రితము విచారము కల్గ లేదు కాని ఈనాడు తనతోటికోడలు పుత్రుని కనియుండగా తాను దైవానుగ్రహమున గర్భవతియై యుండికూడ పుత్రుని కనలేదే అని విచారించినది. ఆ విచారము అంతకంతకు హెచ్చినది. ఆమె యెవరితో చెప్పుకొనును? ఏమి చేయును ? ఏమి చేయవలెనో ఆమెకు తోచలేదు. చివరకు కడుపు మోదుకొన్నది ఆ తాడనమునతో ఆమెకు గర్భపాతమైనది. గర్భము నుండి ఒక మాంసపుముద్దపుట్టినది దాని నేమి చేయవలెనో ఆమెకు తెలియుటలేదు.

అంతలో అచ్చటికి వచ్చినాడు వ్యాసమహర్షి. గాంధారి తప్పుచేసి యున్నందున గడగడ వణికినది. ఒక మూలభయము, మరొకమూల తన ప్రయత్నము వ్యర్థమయినదే యను విచారము ఆమెను అలముకున్నవి. వ్యాసుడు ఆమెనుచూచి అసహ్యించుకున్నాడు. 'ఛీ ఛీ! నీకు బుద్ధిలేదా? ఒకతల్లి చేయవలసిన పని యిదేయేనా? గర్భము పోగొట్టుకొందువా? తెలివి హీనురాలా! ఇదా కర్తవ్యము? ఈ మాంసపు ముద్దనుండి నూటొక్కమంది పిల్లలు పుట్టుదురు. ఇకనైన దీనిని జాగ్రత్తగా రక్షింపుము, అనిచెప్పి అతడా మాంసపుముద్దను నూటొక్కముక్కలుగాచేసి, వాటిని నేతికుండలోవేసి, ప్రతిదినమును చల్లని నీటితో తడుపుచుండుము. కొన్నాళ్ళకు నూర్గురు కొడుకులు, ఒక్కకూతురును పుట్టుదురు. జాగ్రత్త అనిచెప్పి అతడు వెళ్ళిపోయెను.

అక్కడ శతశృంగపర్వతముపై కుంతీదేవి వాయుదేవుని వరప్రసాదముచే భీమసేనుని కన్నది, అదేరోజున కలియంశ

మున దుర్యోధనుడు పుట్టెను. అతడే జ్యేష్ఠపుత్రుడు.

తరువాత ధృతరాష్ట్రునికొక వైశ్యస్త్రీ భార్యగానున్నది. ఆమెకు యుయుత్సుడను బాలుడు కలిగెను. ఆ రోజునుండి వరుసగా రోజున కొకరుగా దుశ్శాసనుడు మొదలైన నూరుగురు కొడుకులు పుట్టిరి. అందరికిని కడగొట్టు చెల్లెలైన దుస్సల పుట్టినది.

ధృతరాష్ట్రునకు పుత్రోదయము వలన నెంతో సంతోషము కలిగెను అంతకంటె నెక్కువగా కూతురు పుట్టినందున సంతోషించెనట. అందుచే తనకు దౌహిత్రుడు పుట్టుననియు, తనకు పుణ్యలోకములు వచ్చుననియు నానందించెను.

తల్లిదండ్రులకుండు నానందము వేరు. పైవారి యాలోచనలు వేరును. దుర్యోధనుడు పుట్టిననాడు గాడిదలు కూసెను. నక్కలుకూసినవి. భూమి కంపించినది. సూర్యునికాంతి తగ్గినది. రక్తవర్షము కురిసినది ఆ అశుభశకునములు చూచి ప్రజలు భయపడిరి.

అందరు పుత్రులును పుట్టిన తరువాత భీష్ముడు, విదురుడు మొదలైన వారందరు నొక్కసారిగా ధృతరాష్ట్రుని వద్దకు వచ్చిరి. అతడు తనపుత్రోత్సాహముతో వారికానందము చేకూర్పదలచెను. కాని వారు వచ్చిన పనివేరు. వారందరు నొక్కమాటగా అతనితో 'ఓరాజా! నీ వెరుగని ధర్మములులేవు. అయినను మాకు చెప్పకతప్పదు. నీ పెద్దకొడుకు పుట్టినవాడెన్నో దుర్నిమిత్తములైనవి. దానికి శాంతిగా కులాభివృద్ధి కోరి ఆయొక్క కొడుకును వదలుము. వందమందిలో నొక్కని విడుచుట ఏమంతబాధకాదు. వదలుము.' అని ఎన్నోరీతుల నీతులు చెప్పిరి.

కాని అతనిది తండ్రి హృదయము. ఎంతయుందినికన్నను తల్లిదండ్రులకందరిమీదను సమముగా ప్రేమయుండును. 'కన్నమ్మకే వాపు, తిన్నమ్మకేవాపు' అన్నది. ఉత్తమాట కాదుగదా! అతడు మాత్రము కొడుకును వదలలేకపోయెను పుత్రమోహమునకు లొంగనివారెవరు ?

అచ్చట కుంతికి ఇంద్రప్రసాదమున అర్జునుడు పుట్టెను. మాద్రికిఅశ్వినీదేవతల ప్రసాదమున నకులసహదేవులుపుట్టిరి. అంత నొక్కనాడు పాండురాజు మాద్రిని కలిసినందున ప్రాణములబాసెను. మాద్రియు సహగమనము చేసెను.కుంతీదేవికూడ చేయబోగా అక్కడి మునులు సంతాన రక్షణకై బ్రతికియుండుమని యామె నూరడించిరి. ఆ మునులుపుత్రులతోసహా ఆమెను హస్తినాపురమునకు తీసికొని వచ్చిరి. వారికి భీష్మవిదురాదు లందరును ఎదురువచ్చి కోటకు తీసికొని వెళ్ళిరి. సత్యవతి, అంబికా, అంబాలికలు ధృతరాష్ట్రుని కొడుకులు అందరును వారికెదురువెళ్ళి లోనికి తీసికొనివెళ్ళిరి ధృతరాష్ట్రుడు గాంధారికూడ చాలగా శోకించిరి. మునులు వారిద్దరినూరడించి 'రాజా! శతశృంగ పర్వతముపై నీతమ్ముడీ సంతానమునువిడిచి పరలోకమునకేగినాడు నీవుపెద్దవాడవు. విచారము తగ్గించుకొని వీరిని ధర్మబుద్ధితో రక్షించుము' అని చెప్పి అంతర్ధానమునందిరి.

అప్పుడు ధృతరాష్ట్రుడు భీష్ముడు మున్నగువారలు అనుమతించగా విదురుడు పాండురాజునకుత్తర క్రియలుచేయించెను. ధృతరాష్ట్రునకు విచారము కొంతతగినది.

తన విచారమునకు తనకు తన తమ్మునియందున్న ప్రేమకు ప్రతిఫలముగా తమ్ముని కొడుకులను భేదబుద్ధిలేకుండ తనకొడుకులతో సమముగా రక్షించుచుండెను. తనశక్తికిలోటు లేకుండ బాలకులనందరిని కంటికిరెప్పవలె కాపాడుచుండెను.

చిన్నపిల్లలకు జగడములెక్కువ, వారినిద్దరినే ఒక్క మార్గమున పెట్టుట చాలకష్టము. మనసుమంచిదైనచో బాధ లేదు. కాని సాధారణముగా ఆలేతవయస్సున నీతినియముల ననుసరించునంతటి బుద్ధియెట్లుండునో. కొందరు చాలబుద్ధిమంతులుగా ప్రవర్తించుట వారియదృష్టము. కొందరు స్వతహాగా చిలిపితనము కలిగియుందురు. పాండవులెంత బలవంతులైనను కోడిబాలుర దుండగములను సహింపమవారు. సహించనివా డొక్కడే; భీముడు. దుర్యోధనాదుల కసూయహెచ్చు. ఈర్ష్య యెక్కువ. వారెల్లప్పుడును భీమునకు ద్రోహముతలపెట్టుచునే యుండిరి. వారుచేయునవన్నియు భీమునకు హితవేయైనవి. దానితో దుర్యోధనాదులిక చాలక యూరకుండిరి.

అంత నొకప్పుడాయూరికి వచ్చిన ద్రోణాచార్యులవద్ద పాండవ కౌరవులకు కలిపి భీష్ముడు, ధృతరాష్ట్రుని యనుమతిపై ధనుర్విద్య నేర్పించుచుండెను. వారందరు క్రమముగా ధనురాది విద్యలలో నేర్పు సంపాదించిరి.

ఒకనాడు ద్రోణాచార్యుడు ధృతరాష్ట్రుడు కొలువులో నుండగా వచ్చి 'మహారాజా! కుమారులు శస్త్రవిద్యలో నేర్పు సంపాదించిరి. సభచేసి వారి పాండిత్యమును చూడవలయును' అని కోరెను. అత డంగీకరించెను. విదురునితో కుమారుల యస్త్రవిద్యా ప్రదర్శనమునకై రంగస్థలమును చక్కగా కట్టిం

కాని అతనిది తండ్రి హృదయము. ఎంతమందినికన్నను తల్లిదం డ్రులకందరిమీదను సమముగా ప్రేమయుండును. 'కన్నమ్మకే వాపు, తిన్నమ్మకేవాపు' అన్నది. ఉత్తమాట కాదుగదా! ఇతడు మాత్రము కొడుకును వదలలేకపోయెను పుత్రమోహ మునకు లొంగనివారెవరు ?

అచ్చట కుంతికి ఇంద్రప్రసాదమున అర్జునుడు పుట్టెను. మాద్రికిఅశ్వినీదేవతల ప్రసాదమున నకులసహదేవులునుపుట్టిరి. అంత నొక్కనాడు పాండురాజు మాద్రిని కలిసినందున ప్రాణ ములబాసెను. మాద్రియు సహగమనము చేసెను.కుంతీదేవికూడ చేయబోగా అక్కడి మునులు సంతాన రక్షణకై బ్రతికియుండు మని యామె నూరడించిరి. ఆ మునులుపుత్రులతోసహా ఆమెను హస్తినాపురమునకు తీసికొని వచ్చిరి. వారికి భీష్మ విదురాదు లందరును ఎదురువచ్చి కోటకు తీసికొని వెళ్ళిరి. సత్యవతి, అంబికా, అంబాలికలు ధృతరాష్ట్రుని కొడు కులు అందరును వారికెదురువెళ్ళి లోనికి తీసికొనివెళ్ళిరి ధృతరాష్ట్రుడు గాంధారికూడ చాలగా శోకించిరి. మునులు వారిద్దరినూరడించి 'రాజా! శతశృంగ పర్వతముపై నీతమ్ముడీ సంతానమునువిడిచి పరలోకమునకేగినాడు నీవుపెద్దవాడవు. విచారము తగ్గించుకొని వీరిని ధర్మబుద్ధితో రక్షించుము' అని చెప్పి అంతర్ధానమునందిరి.

అప్పుడు ధృతరాష్ట్రుడు భీష్ముడు మున్నగువారలు అను మతించగా విదురుడు పాండురాజునకుత్తర క్రియలుచేయిం చెను. ధృతరాష్ట్రునకు విచారము కొంతతగ్గినది,

తన విచారమునకు తనకు తన తమ్మునియం దనున్న ప్రేమకు ప్రతిఫలముగా తమ్ముని కొడుకులను భేదబుద్ధిలేకుండ తనకొడుకులతో సమముగా రక్షించుచుండెను. తనశక్తికిలోటు లేకుండ బాలకులనందరిని కంటికిరెప్పవలె కాపాడుచుండెను.

చిన్నపిల్లలకు జగడములెక్కువ, వారినిద్దరినే ఒక్క మార్గమున పెట్టుట చాలకష్టము. మనసుమంచిదైనచో బాధ లేదు. కాని సాధారణముగా ఆలేతవయస్సున నీతినియముల నుపాటించునంతటి బుద్ధియెట్లుండునో. కొందరు చాలబుద్ధిమంతులుగా ప్రవర్తించుట వారియదృష్టము. కొందరు స్వతహాగా చిలిపితనము కలిగియుందురు. పాండవులెంత బలవంతులైనను తోడిబాలుర దుండగములను సహింతువారు. సహించనివాడొక్కడే; భీముడు. దుర్యోధనాదుల కసూయహెచ్చు. ఈర్ష్య యెక్కువ. వారెల్లప్పుడును భీమునకు ద్రోహముతలపెట్టుచునే యుండిరి. వారుచేయునవన్నియు భీమునకు హితవేయైనవి. దానితో దుర్యోధనాదులిక చాలక యూరకుండిరి.

అంత నొకప్పుడాయూరికి వచ్చిన ద్రోణాచార్యులవద్ద పాండవ కౌరవులకు కలిపి భీష్ముడు, ధృతరాష్ట్రుని యనుమతిపై ధనుర్విద్య నేర్పించుచుండెను. వారందరు క్రమముగా ధనురాది విద్యలలో నేర్పు సంపాదించిరి.

ఒకనాడు ద్రోణాచార్యుడు ధృతరాష్ట్రుడు కొలువులో నుండగా వచ్చి 'మహారాజా! కుమారులు శస్త్రవిద్యలో నేర్పు సంపాదించిరి. సభచేసి వారి పాండిత్యమును చూడవలయును' అని కోరెను. అత డంగీకరించెను. విదురునితో కుమారుల యస్త్రవిద్యా ప్రదర్శనమునకై రంగస్థలమును చక్కగా కట్టిం

పురుని నియోగించెను. విదురు డాతని యాజ్ఞానుసారము రంగ స్థలమును కట్టించెను.

మంచిరోజున ధృతరాష్ట్రుడు గాంధారి మొదలైన వంద మంది భార్యలతోను రంగస్థలమునకు వచ్చెను, కుంతీదేవియు వచ్చినది. వ్యాసాదిమునులు వచ్చిరి. భీష్మాది బంధువర్గమే కాక సామంతరాజు లెందరో వచ్చిరి.

అప్పుడు ద్రోణాచార్యుడు పుణ్యాహవాచనము చేసి వయస్సును బట్టి వారిని వరుసగా నిలువబెట్టి వారువారు నేర్చిన శస్త్రాస్త్రవిద్యల ప్రదర్శింపమనెను. వారు వరుసగావచ్చి తమతమ యభిమానవిద్యలను ప్రదర్శించుచుండిరి.

ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు కదా అతని కేమి కనపడును? గాంధారికన్నులు కలదైనను పతివ్రతయైనందున పతికిలేని దృష్టితన కెందుకని తా నెప్పుడును కన్నులకు గంతలు కట్టుకొనెడిది. అందుచే ఆమెకును సభావిశేషము లేవియును కన్నుల కగపడుట లేదు. అందుచే వారిరువురికినీ చెప్పుడునుబట్టి యేమి జరుగుచున్నది విదురుడు చెప్పుచుండెను.

భీమ దుర్యోధనులు గదాయుద్ధముచేసిరి. అర్జునుడు చూపిన అస్త్రప్రయోగోప సంహారములకు ప్రేక్షకులందరును 'ఆహా' యని ఆనందించిరి. అప్పుడు కల్గిన కోలాహలమువిని 'ఇదేమిటి' అని విదురునడుగగా అతడు 'జనులు అర్జునుని పొగడుచున్నారు. అదియీగోడవ' అనిచెప్పెను. ధృతరాష్ట్రుడు 'చెవులున్నందులకీ నాటికి ఫలితముదక్కెను. పాండవుల విద్యాశక్తులు నేడువినగల్గితిని' అని మనస్సులో సంతోషించి, పైకి పొగడెను.

అప్పుడు రంగస్థలములో అర్జునునితో సమముగా నిల బడగల్గిన వాడొక్క కర్ణుడే. అతనిని జూచి కృపాచార్యుడు 'నీవు తల్లిదండ్రులపేర్లు, నీవంశము చెప్పుము. సరియైన జోడు లైనచో ద్వంద్వయుద్ధము చేయవచ్చు' ననెను. అదివిన్నాడు దుర్యోధనుడు. గదాయుద్ధములో తాను భీమునికి సరిపోవును. కాని ధనుర్యుద్ధములో అర్జునునికి సాటియైన వాడెవ్వడు నతని కగపడలేదు, కర్ణుడు నిలబడుటతో తనకొక స్నేహితుడు దొరకి నందులకు సంతోషించి అతనికి 'అంగ' రాజ్యమిచ్చుటకు తండ్రి యనుమతికోరెను. కొడుకుకోరినది కూడనిదైనను పుత్ర వాత్సల్యముచే ధృతరాష్ట్రుడంగీకరించెను. అప్పుడు దుర్యోధను డారాజ్యమిచ్చి కర్ణుని రాజునుచేసి అర్జునునికి తగిన జోడునుగా జేసెను. ఆరోజుతో కర్ణ దుర్యోధనులు ప్రాణస్నేహితులైరి.

అందరును సమముగా పెరిగి పెద్దవారైనారు. శస్త్రాస్త్ర విద్యలలో నారితేరినారు. ధృతరాష్ట్రుడు భీష్మ విదురులతో నాలోచించినాడు 'ఎవరిని యువరాజును చేయుటయా' అని సహజమైన వినయవిధేయతలు, మంచి గుణములుకలిగియుండుట వలన ధర్మరాజే తగినవాడని చెప్పిరి అట్లే వారిమాట ప్రకా రము యుధిష్ఠిరునకే యువరాజ్యపట్టాభిషేకము చేసెను. భీమా దులు నల్గురు నతని సేవించుచుండిరి. ధర్మరాజాదులకు మంచి పేరు వచ్చినది.

అది దుర్యోధనునకు సహింపరానిదయ్యెను. తన మిత్రు లున్నారు కర్ణ శకుని దుశ్శాసనాదులు. గణికుడని శకుని మంత్రి యున్నాడు. వారందరును దుర్యోధనునికి తాళము వేయువారే. వారితో రహస్యమున దుర్యోధనుడు తనకు యువరాజ్య పట్టా

భిషేకము చేయక ధర్మరాజునకు చేసినందు కసూయపడుచు సహింపరాని విచారముతో మంతనములు నడపెను. అందు గణికుడు 'అపకారము చేయువారి నెంత బంధువులయినను దూరము సేయవలెను' అని హితవు బోధించెను. అతడందుల కొప్పుకొనెను, కాని అది తన చేతులలో లేదు. తండ్రి యిష్టమైనచో నొక్క మాటలో జరుగును. అందున నతడు రహస్యమున తండ్రినిచేరి యిట్లనెను :-

'తండ్రీ! నీ వనాలోచితముగా పాండవజ్యేష్ఠునకు యువరాజ్యమిచ్చితివి వారు మహావీరులని నాకు భయము. ఇప్పుడు వారు రాజులగుటచే జనులు వారినే పొగడుచు, సేవించుచుండిరి. ఇంతకన్న ముందొక ప్రమాదము రాదైయున్నది. నా భయము దానిగూర్చిగాని జరిగినదానిగూర్చి కాదు. భీష్ము డిదివరకే రాజ్యము వదలినాడు. నీవు గ్రుడ్డివాడవేకద! అందుచే సమర్థుడును, ప్రజాదరణపాత్రుడైన ధర్మరాజునే తమకురాజుగా చేయుటకై ప్రధానామాత్యులు తలచుచున్నారు. దానికందరు నొప్పుకొందురు. ఆ విషయము వినబడగానే నాకు బాధ కల్గుచున్నది. ఆ మాటలు నాకు కర్ణశూలములగుచున్నవి. తండ్రీ! పాండవుల నెట్లయిన హస్తినాపురమునుండి వెడలగొట్టుము'అని వేడెను.

ధృతరాష్ట్రునకు ధర్మబుద్ధి మాయలేదు. కొడుకుతో 'నాయనా' రాజైనవాడు తన రాజ్యమును చూచి సంతోషింపవలయును. నేను షడంగ సహితముగా వేదములు లన్నియు చదివితిని. రాజనీతి చక్కగా నేర్చితిని. కాని అంగవైకల్యమున్నందున నేనురాజ్యముమీదికిదండెత్తివచ్చినపుడు పరరాజు

లను గెల్వలేను. రాజ్యానర్హుడనై యున్నాడను అప్పుడు న్యాయముగా రాజ్యార్హుడైనను పాండురాజు సుగుణ వంతుడు మహాబలశాలియు కనుక దిగ్విజయముచేసి రాజులనందరిని గెల్చి ధనాదికమును తెచ్చి నా కర్పణచేసినాడు. అతని బల పరాక్రమాదులకంటె అతని గుణములు ప్రజల నాకర్షించినవి. ఇప్పుడాతని పుత్రులుకూడ అతనిమించిన గుణవంతులు.నామాట జవదాటరు. ప్రజానురక్తులు వీరి నేనేమివంక పెట్టి వెడలగొట్టుదును? అది మహాదోషము కాదా?' అని విచారించెను. అతని మనస్సున పాపబుద్ధి విచారము కల్గించినది. చెడుచేయుటకెంతో మనసు దిటవు కావలెను. ఒక్కసారిగా ఎవడును పాపకర్మ నాచరింపలేడు. దానికి క్రమముగా ప్రోత్సాహ ముండవలెను. ఆ ప్రేరణతో మనసులోని సహజమైన మార్దవము నశింపవలెను. అప్పుడు పాపము నాచరించును. ఒక్కటీ చేసిన తర్వాత ఎన్నైనను వరుసగా చేయును. సంకోచింపడు. అతని మనోదార్ఢ్యము కాదు. పాపచింతలేకపోవుటయే. దానికి ముందెంతో ప్రేరణ యవసరము.

దుర్యోధనుడెట్లయిన తండ్రిని ఒప్పించ దలచివచ్చిన వాడు. ధర్మపన్నములు చెప్పినచో వినిపోవునా? మరల నారంభించినాడు.

'తండ్రీ! నీవు చెప్పినదినిజమే. అదే నాబాధకుకారణము. నీవుండగానే పాండురాజు ప్రజాదరణము జూరగొన్నాడు. ఇప్పుడు మేముండగా ధర్మరాజు, పాండురాజుకొడుకై పైతృక రాజ్యము నేలుచు ప్రజాదరణ పొందుచున్నాడు. ఇకమీద

ఇతని తర్వాత నా రాజ్యమునితని కొడుకు పాలించును. అతనివెనుక అతని కొడుకు రాజగును ఇట్లు క్రమముగా పాండురాజవంశము వారే రాజులగుదురు. కాని మన వంశమున కీజన్మలో రాజ్యము రాదు చూడు నెంతప్రమాదమో? ఒకపర్యాయ ముందాలోచన చేయుము. మాతో పాటు మా కొడుకులు, మనుములు కూడ రాజ్యమునకు దూరమగుదురు. వారికి పాదసేవలుచేసి మేము బ్రతుకలేము. అట్లు కాకుండ నమ్ము చేయదలచినచో నీవు పాండురాజుమీద భక్తి, పాండవులమీద వాత్సల్యమును. ఇకపై దలపకుము ఇప్పుడు జనులందరు వారికి వశ్యులైయున్నారు. అయినను నా వైపు వారల త్రిప్పుకొనుటకే కదా వారికెన్నో బహుమతు లిచ్చుచుందును.నీవు చేయవలసిన పనియేమందువా? వారల నెట్లయిన పురము వెడలగొట్టవలెను. కొంతకాలము నేను యువరాజునై ప్రజలను నా వైపు త్రిప్పుకొందును నామీద జనుల కాదరణ కలిగి, హెచ్చును. అప్పుడు వారు మరల రావచ్చును' అనెను.

ధృతరాష్ట్రుని మనస్సు కొంచెము మారినను ప్రజలేమైన అందురేమో అని జంకినది. నీతిగా బ్రతికినవాడు తటాలున అన్యాయము చేయలేడు కాని వాడుచేసినట్లు తెలియకుండ చేయును.

నాయనా! నా యుద్దేశ్యము చాలా ధారుణమైనదిరా. అదే నే నెప్పుడు అనుకొనుచుందును. చెప్పినంత తేలికగా వారిని వెడలగొట్టవీలుకాదు. అదిగాక దీనికి భీష్మాదు లంగీకరింతురా? కాదు బాబూ వలదు. అని బుజ్జగించెను.

దను. ఇది మీకు పథ్యమునుగా! పుణ్యనదీ తీరముననున్న కాశీపట్టణము సకలభోగములకు పుట్టినిల్లని అందరుకొనియాడు చున్నారు. మీరు సపరివారముగా మీ తల్లితో కలసి అక్కడి కేగి కొన్నాళ్ళు అక్కడ ఉత్సవములు చేయుడు మీ రాజ్య పాలన అక్కడనే చేయవచ్చును. అది పుణ్యక్షేత్ర మగుటచే చనిపోయిన మీ తండ్రికి పుణ్యలోకము కల్గునట్లుగా నెన్నో భూహిరణ్యాదిదానములు చేయుడు. అక్కడ కొన్నాళ్ళుం డిరండు' అని మచ్చికగా చెప్పెను. పాండవులకు దానిలో నేదియో రహస్య మున్నదని వ్యక్త మైనది. మోసముచేయు వారలు తామే తెలివైనవార మనుకొందురు. కాని మోసగింపబడువారుకూడ తెలివైనవారే! కాలము కర్మము కూడినప్పుడు మోసగింపబడుదురు. అదృష్టము కలిసివచ్చెగా దానినిదాటగల్గుదురు. చెప్పినది మెల్లగావినుట సజ్జనలక్షణము అది తెలియకకాదు. బాగుగా తెలిసియే. మోసకారుల లక్షణములు లోకమునకు సువ్యక్తమగుటకై ఎవరికే హానియు రాకుండ జూచుకొనుచు వారిమాటలవినుచుందురు. తెలిసియు పాండవులు నీవుచెప్పినట్లుచేయుదుమనిపెత్తండ్రికినమస్కరించిరి. దుర్యోధను డుబ్బిపోయినాడు. తనయెత్తు పారినదనుకొన్నాడు. అతడే ముఖ్యకారకుడని పాండవులెరుగుదురు. ఇట్లు తెలియునో చెప్పలేము కాని యెంతరహస్యమో యెంతసువ్యక్తముగా అందరికిని కొద్దిసేపటిలో తెలిసిపోవును. దుర్యోధనాదుల గౌరవించిరి. భీష్మాదులకు నమస్కరించి వెళ్ళివత్తుమనిరి. వారిక వెళ్ళుటకు సిద్ధముగా నుండగనే దుర్యోధనుడు పురోచనుడను వానిని పిలిపించి 'నీవుముందుగా కాశికి వెళ్ళి పాండవులకుండు

టకు పిలుగా ఇళ్ళుకట్టవలెను. వరనుకహాస్యమునుమా! లక్క నెయులతో కట్టవలెను. వారికి నమ్మకంపుట్టించి, వారందులో నివసించుచుండగా కాల్చివేయవలెను. దానితో నీకెక్కువ బహుమతినిత్తును. ఇవిగో గాడిదలు కట్టిన రథము. ఇవివాయు వేగముకలవి. వెళ్ళుము, అని పంపెను.

తండ్రిచనిపోవునాటికి పాండవులకువరుసగా 16, 15, 14, 13, సంవత్సరములయియున్నది. హస్తినాపురికివచ్చి పదమూడేండ్లయినది. ఇన్నాళ్ళు వీరితో కలిసిమెలసి యుండిరి. ఇప్పుడు మారణమునకు పోనున్నారు. వారావు వెడలుచుండగా జనులందరు 'ఏమికారణమో? వీరలనెందుకు వెడలగొట్టించుచున్నారో? ఇందేదో మోసమున్నది. భీష్మాదులూరకొనిరే' అని గుసగుసలాడుకొని విచారించిరి. వారందరిని ధర్మరాజు బతిమాలి వెనుకకు పంపించెను. తాము వెళ్ళిరి.

అచ్చటపురోచనుడు దుర్యోధనుని మాటప్రకారము యిల్లుకట్టివాటిని తగులబెట్టబోయి, తానే తగులబడెను. అందు దైవికముగా నైదుగురు పిల్లలతో చనిపోయిన మరియొక యువతిని చూచి అందరును పాండవులే చనిపోయిరని విచారించిరి.

ధృతరాష్ట్రుడు సింహసభలో నుండగా వచ్చి చెప్పిరి. అతి దేమియు నెరుగనట్లు పెద్దపెట్టున వారి గుణగణముల వర్ణించుచు ఆవ అరచినట్లు అరచి యేడ్చెను. ఆమాటవినగానే ధృతరాష్ట్రుని వందమందిభార్యలు నొక్కసారిగా కంఠము లెత్తి యేడ్చుటతో పెద్దగోలయైనది, భీష్మాదులువచ్చి వారినూరడించిరి. ధృతరాష్ట్రుడు కుంతీసహితముగా పాండవులకుత్తరక్రియలు చేసి చేయికడుగుకొనెను.

ష్టినక వెడలి భీష్మునితో చెప్పెను అతడు చాల తప్పనని యనెను.

ధృతరాష్ట్రు డొకనాడు తాను నిర్మింపజేసిన సభను కొడుకునకు జూపి రహస్యముగా 'నాయనా! జూదమెందుకురా నాయనా! దానితో బాలో మీరు భేదము పుట్టును అందువలన మీకు అపాయము కల్గును. పాండవులు, మీరు పరస్పరానురాగముతో నుండుట మంచిది. పాండవుల సంపదను నీ వోర్వలేక పోవుట మేల? వంచన చేసి సుతుల సంపదను గ్రహింపగోరుట పాపము. పాపాత్ములకు సిరి సంపదలు నిలువవు, విదురునకిది సమ్మతము కాదు. నీకు ధర్మరాజు సంపదకంటె నైదురెట్లు సంపదయున్నది. అంతకంటె మహా వైభవముగా యజ్ఞము చేయుము. అందరు మెత్తురు. రాజులందరును నీకు కానుకలు తెత్తురు. నీ కోరిక తీరును.' అని బుజ్జగించెను.

అతని కదేమియు రుచించలేదు. తనకు జరిగిన యవమానమును చెప్పి దానికి ప్రతీకారముగా పాండవుల సర్వస్వము నపహరింపలెనని తన నిశ్చయమును చెప్పెను. అందుకు శకుని 'ఒక్క జూదము తప్ప మరే యుపాయము చేతను పాండవుల సంపదను హరింప వీలుపడదు' అని సలహా చెప్పెను.

ధృతరాష్ట్రు డందుల కంగీకరింపలేదు. 'నేను విదురుని యనుమతముపై నడచుచున్నాను. అతడు అనర్థము లెరుగును. జూదము వలన యుద్ధమగును. బలవంతులతోడి యుద్ధము నాకుండ జేయుట మంచిది. నా మాట ధర్మయుక్తమైనది. ఇప్పుడు నే చెప్పినట్లు వినకున్నచో తరువాత పశ్చాత్తాపపడవలసి వచ్చును. జూదము వలన ఎప్పటిలాగున ఎక్కడివారక్కడ సుఖముగా

మాకు కుటిలనెను. పరోక్షమున నేలహేళనము చేయుదురు? ఆపాండవ పక్షపాతి విదురుడైనా? అదెట్లు పోవుదురు? జూదము పురాణములలో చెప్పబడినది సుహృద్ద్యూతమున దేవసాయుజ్యము కల్గును. అని తండ్రి నెట్లు ఒప్పించెను. ధృతరాష్ట్రుడు విదురుని పిలిచి యొప్పించి సుహృద్ద్యూతమునకు ధర్మరాజును పిల్చుకొని రమ్మని పంపెను. అతడు వెళ్ళి ధర్మరాజాదుల తీసికొని వచ్చెను;

ధృతరాష్ట్రుడు వారికెంతో గౌరవముచేసెను దుర్యోధనుడు ధర్మరాజును జూదమాడుదమనెను. అతడు మహాపాతకము వలదని యెన్నోరీతుల చెప్పెను. కాని సుహృద్ద్యూతము కాన బాధలేదని దైవదుర్విపాకము వలన ధర్మజుడు శకునితో జూదమాడుచు అన్నిపందెముల నోడెను. అది తెలిసికొని విదురుడు ధృతరాష్ట్రునితో జరుగుచున్న అన్యాయమును వివరించి ఇప్పటికైనను జూదము మాన్పింపుమని చెప్పెను. పుత్రుని మీది స్నేహముచే సతడేమియు చేయలేక యూరకుండెను.

ధర్మరాజు తమ్ములను, భార్యను ఓడిపోయెను. పాండవులు వెల్లమొగము వేసిరి. సభ్యులు కన్నీరు పెట్టుకొనిరి. కౌరవులు సంతోషముతో పొంగిపోయిరి. ఆ కలకలము విని 'ఇదేమి?' అని ధృతరాష్ట్రుడు విదురునడిగెను. అతడు చెప్పబోవుచుండగా దుర్యోధను డతనిని వెళ్ళి ద్రౌపదిని ఇల్లుడుప్పుటకై తోడ్కొని రమ్మనెను. అత డంగీకరింపక దుర్యోధనుని నిందించెను. అత డంతతోనాగక దుశ్శాసనునిచేత ద్రౌపదిని రప్పించి కట్టుపుట్టములు విప్పింపజూచెను. శ్రీకృష్ణునిదయచే నది తప్పినను సభ్యులెల్లరు కౌరవుల నిందించిరి, ఎన్నో దుర్నిమిత్తములు పుట్టెను,

అప్పుడు గాంధారి విదురునితోఁగూడ ధృతరాష్ట్రుని నద్దకేగి జరిగిన వృత్తాంతము చెప్పినది. అతడు దుర్యోధనుని పిలిపించి 'అయోనిజ, పతివ్రతయైన పాంచాలిని సామాన్యస్త్రీగా నీడ్చుటన్యాయమా? చిన్నప్పటినుండి నీవు దురాలోచనలతోనే పెరిగితివి. పాండవులు నీపనికి ఎక్కువ క్షమించిరి. వారిపై దురాగ్రహము మానుము.' అని బుద్ధులు చెప్పెను. అతడు తలచుకొన్నంతయు జరిగినది. ఇక హానినను బాధలేదు. అతడు వెడలి పోయెను.

ధృతరాష్ట్రుడు ద్రౌపదిని రప్పించెను. 'అమ్మా! నీవు మహాపతివ్రతవు. నాకోడండ్రందరిలోను నీవు గొప్పదానవు. నీకు కోరినవరములిచ్చెదను. ఊరడిల్లుము' అని యూరడించెను. ఆమె మొదటివరముతో ధర్మరాజునకు దాస్యవిముక్తియు, రెండవ వరముతో తక్కినవల్లురకు దాస్యవిముక్తియు రాజ్యప్రాప్తియు కల్గునట్లుగోరెను. అతడు మూడవవరము కోరుకొమ్మనెను. కాని క్షత్రియస్త్రీ రెండేవరములుగోరుట ధర్మమని చెప్పి ఆమె మూడవవరము గోరలేదు. ధృతరాష్ట్రు డామె ధర్మజ్ఞతకెంతో సంతోషించి ధర్మరాజును పిలిచి యథాప్రకారముగా ఇంద్రప్రస్థమునకేగి రాజ్యము చేసికొమ్మని దీవించెను.

అదిగాక, నీకు నాకొడుకవమానము చేసినాడు. అది మనమున నుంచుకొనకుము. ఉత్తములైన నీవంటివారికి దోషములు విడుచుటయు, గుణముల గ్రహించుటయు సహజగుణములు. అదినేనికఁ జెప్పనక్కరలేదు, నేను బుద్ధిలేక జూదము నాపుచేయలేకపోతిని. వృద్ధుడనైన, నన్ను, గాంధారిని తలచు

కొని దుర్యోధనాదులు చేసిన దుర్న్యాయములను క్షమింపుము. మనకులమునకు మేలగును.' అని చెప్పెను.

దుర్యోధనున కావార్త తెలియుటతో ఒళ్లుడికిపోయినది. కర్ణాది మిత్రులనుతీసికొని తండ్రిపద్దకేగెను. తండ్రితో 'తండ్రీ! శత్రువుల నేరీతినైనను దెబ్బతీయవలయు నని బృహస్పతి చెప్పినట్లు మనమంతటితో నూరకుండరాదు. వారలను మరల జూదముననే యోడింపవలయును' ని చెప్పుటతో ధృతరాష్ట్రు డంగీకరించెను. ప్రాతికామిచే తనమాటగా ధర్మరాజాదుల తోడ్కొని రమ్మని కబురంపి రప్పించెను. పాండవులు మరల శకునితో జూదమాడిరి. ఈసారి దుర్యోధనుడు 'మా తండ్రి మీ కిచ్చిన రాజ్యమును పందెము కాయుటకు వీలులేదు కనుక నూతన రీతి పందెములు వేసికొందము' అని వనవాసము పందెముగా పెట్టి యోడించెను. భీమార్జున నకులసహదేవులు తిరిగి వచ్చుటతో దుర్యోధనాదుల చంపుదుమని ప్రతిజ్ఞలుపట్టి వనవాసమున కేగిరి. అప్పుడు నారదుడు పదునాలుగేండ్ల తరువాత భారతయుద్ధ మగును అందు రాజలోకమునకు మరణము వాటిల్లును. పాండవులకే జయము కలుగునని చెప్పెను.

అది విని విదురుడామాటలను, అప్పుడున్న దుర్నిమిత్తములను ధృతరాష్ట్రున కెరిగించెను. కొడుకుల యవినీతివలన నింకేమి అరిష్టములు పుట్టునోయని ధృతరాష్ట్రుడు విచారింపగా విదురుడు పాండవులను వెనుకకు రమ్మని మరల వారిరాజ్యము వారి కిమ్మని సలహా చెప్పెను. 'అయ్యో! పాండవులు సమర శూరులు. బలవద్విరోధము మంచిదికాదని యెంత చెప్పినను నా కొడుకు వినడు.' అని యెంతో విచారించెనే కాని, విదురుని

మాటలు వినియు విననట్లూరకుండెను. అతనికి పాండవులపై ప్రేమ కాదు; వారు తిరగబడినచో తనవార్లనెక్కడ చావగొట్టుదురో యన్న భయమే. ఆహా. మనస్తత్వ మెంత చిత్రమైనది. పౌరులెల్లరు ధృతరాష్ట్రుని దుర్యోధనుని నిందించిరి.

పాండవు లడవికి పోయిరి కదా! అప్పుడు ధృతరాష్ట్రుడు విదురుని రప్పించి 'ఇంక ఆ పాండవు లేమి సేయుదురో చెప్పుము' అని యడిగెను. అతడు 'మోసము చేసి జూదమున ఓడించితిరి. కాని వారు ప్రతిజ్ఞాకాలము తీరగానే వచ్చి శత్రువుల జంపుదురు. ఆనాడు జూదము వద్దంటిని కదా, నీవు వింటివా? నీ కొడుకును వదలి వేయుము. ఇప్పుడైనను పాండవులకు రాజ్యభాగమిచ్చి వేయుము' అనెను. ఆమాటలకు ధృతరాష్ట్రున కెంతో కోపము వచ్చినది. అప్పటి వరకు నెన్నడును పైకి కోపించని వాడు మండిపడి 'నీ వెప్పుడును పాండవులను పొగడుచుందువు. మావారిని తిట్టుచుందువు; ఎవడైనను కొడుకును వదలగలడా? అది నీవు చెప్పవలసినదేనా? నీవింక ఇక్కడ ఉండవలదు. పాండవులున్నచోటికే పోదువో, మరొకచోటికే పోదువో నీయిష్టము' అని కసరెను. అతని కభిమానము లేదా? వెంటనే పాండవులవద్దకేగెను. అప్పటికి పాండవులు కామ్యకవనమున నుండిరి.

విదురుడు వెళ్లుటతో ధృతరాష్ట్రునకు చేయివిరిగినట్లయినది. ధైర్యము తగ్గినది. హృదయము కన్నులువలె పనిచేయుచున్నాడు విదురుడు. అట్టివాడు వెళ్ళి పాండవులను చేరెనని విన్నాడు. ఉండబట్టలేక వెంటనే విదురుని తోడ్కొనిరమ్మని సంజయునంపెను. అతడడవికేగి విదురునితో చెప్ప తనతో

హస్తినాపురికి తోడ్కొనివచ్చెను. విదురుడు ధృతరాష్ట్రునకు నమస్కరించగా అతడు 'నీవు నీతికోవిదుడవు నన్ను క్షమింపుము' అనెను. విదురుడట్లయినచో పాండవులతో కలసియుండుట మంచిదనెను.

దుర్యోధనునకు మరల విదురుడు పాండవులను తెచ్చునేమో యని భయము వేసి మిత్రులతో నాలోచించి పాండవుల నరణ్యములోనే చంపుట మంచిదని యూహించెను. అది తెలిసి వ్యాసమహర్షి వచ్చి ధృతరాష్ట్రునితో 'నీకొడుకు చెడు పన్నాగములు పన్నుచున్నాడు. నీవూరకుండుటయే ఇంత చేసినది' అనుటతో అతడు 'ఆనాడు జూదమున నంగీకరించితిని. అది యింతచేసినది. పుత్రస్నేహమువలన విడువలేకున్నాను' అనుటతో వ్యాసుడు 'అంతే సంతానముపై ప్రేమయుండుట మంచిదేకాని పాండవులను కూడ కన్నకొడుకులవలె చూడుము' అనెను. ధృతరాష్ట్రుడు 'అయ్యా! నాకొడుకు నామాటవినడు. మీరు చెప్పుడు' అనగా 'నాకవకాశములేదు. మైత్రేయుడు వచ్చి చెప్పునని' వ్యాసుడు వెడలిపోయెను.

అంతట మైత్రేయుడు వచ్చెను. ధృతరాష్ట్రుడాతని పూజించి 'అయ్యా! తమరెచ్చటనుండి వచ్చుచున్నా'రని యడుగగా నతడు 'కామ్యకవనమునుండి పాండవులు నాకెంతో మర్యాదచేసిరి' అని చెప్పెను. ధృతరాష్ట్రుడు తలవంచుకొని 'వాడు నన్ను తలచుకొందురా?' సౌభ్రాత్రమునకు భంగము కల్గునట్లు ప్రతిజ్ఞాసమయమునకు మధ్యలో రారుగదా?' అనుటతో మైత్రేయుడు 'వారేమాట తప్పినచో నింకలోకములో సూర్యచంద్రుల గతులు తప్పవలసినదే!' అని దుర్యోధనునికి

వారితో కలిసి యుండుమని బోధించెను. అతడేలవినును? తన మాట పెడచెవిని పెట్టినందులకు మైత్రేయముని వానితొడలువిరుగు నని శపించి వెళ్ళిపోయెను.

ఒకనాడు హస్తినాపురవాసియగు నొక బ్రాహ్మణుడు కామ్యకవనమునకేగి, అక్కడ పాండవుల మర్యాదలుపొంది తిరిగి హస్తినాపురమునకేగెను. ధృతరాష్ట్రుని వద్దకతడేగగా నతడు 'పాండవులడవులలో నెట్లుండిరి?' అని ప్రశ్నించెను. బ్రాహ్మణుడు 'వారైదుగురును శీతవాతాతపములకు (ఎండ చలిగాలులకు) ఓర్చుచుండిరి. ద్రౌపది వీరపత్నియైకూడ అనాథవలె (దిక్కులేనిదానివలె) శోకముతోనున్నది' అని చెప్పెను.

ఆమాటలు వినుటతో ధృతరాష్ట్రునకు కన్నీరువచ్చినది. కొంతసేపువిచారించినాడు. 'అయ్యో! పాపము! నావలన, దుర్మార్గుడైన నాకుమారుని మూలమున పాండవుల కెన్ని యిక్కట్లువచ్చినవి! ధర్మజ్ఞుడైన ధర్మరాజునకా పాడు దైవమెంత కష్టము కల్గించెను? మేడలలో హంసతూలికా తల్పములపై పరుండి, ప్రాతఃకాలములందు వందిమాగధుల మంగళగీతములకు మేల్కొనవలసిన రాకుమారులు కటికనేలపై పరుండి, నక్కలకూతలువిని లేచునట్టి దుర్గతిపట్టినది. పదివేలయేనుగుల బలముకలవాడు భీముడు, పాపము! అలసినపామువలె అడవిలో నెట్లున్నాడో? అర్జున, నకుల, సహదేవు లెట్లున్నారో? ఆభీముని హృదయము క్రోధపూరితము. నామనస్సులో నెప్పుడును ఆ భీముని రూపే కన్పడుచుండును. అతడే నాకొడుకుల కందరికిని మృత్యువు. ఆనాడన్నగారి మాటకు కట్టుబడి యూరకున్నాడు. కాని వనవాసాంతమున మానడు, భీముడొక పెద్ద దావాగ్ని

వలె వచ్చినా కొడుకుల నెడువనమును తగులబెట్టకుండునా? సరే కానిమ్ము, కర్మఫలమనుభవింపక తప్పునా? నేను వలదన్నప్పుడు నా కొడుకు జూదము మానినాడా? రాత్రి పూర్తియగుసరికి పగలు, పగలు పూర్తియగుసరికి రాత్రియు వచ్చును. అది లోక ధర్మము! కౌరవులకు పోయేకాలము సమీపించినది. వారికి మంచిమాటలు చెవికెక్కవు, అని యెన్నోరీతుల విచారించెను.

ధృతరాష్ట్రుని విచారమును గనిపెట్టినారు దుర్యోధనాదులు. ఎట్లయినను పాండవుల నష్టపెట్టవలెనని యూహించిరి. గోవులను రక్షించు నెపముతో పాండవులున్న వనమునకు వెళ్ళ నిశ్చయించిరి.

మరునాడొక గొల్లవానిని ద్వైతవనమునుండి వచ్చినట్లు చెప్పమని ధృతరాష్ట్రుని వద్దకు పంపించిరి. అతడు వెళ్ళి రాజునకు నమస్కరించి ఆ ద్వైతవనములో పచ్చిక బాగున్నదికాని క్రూరమృగముల బాధ యెక్కువగా నున్నది. అందుచేత నేటాడుట ముఖ్యమని విన్నవించెను. ధృతరాష్ట్రు డాలోచించినాడు. అతనికి కన్నులు లేకున్నను, (లేనందువలనే) ఆలోచనాశక్తి యెక్కువగా నున్నది. వారి కుట్రను తెలిసికొన్నాడు.

'గోవులకు రక్షణాపేక్షకు నుంచిదేకాని, ఆ వనములోనే పాండవు లున్నట్లు విన్నాను. మీరక్కడికి వెళ్ళుట నాకేమియు మేలని తోచదు. అడవిలో నున్నారుకదా అని మీరు వారిని కేళిచేసి బాధింపజూతురు. వారు బలపరాక్రములు కలవారే కాక తపశ్శాలురుకూడ. వారేమియు చేయనక్కరలేదు మనస్సులో కష్టపెట్టుకొన్నను చాలును. మీకు బాధ కలుగును. మీచేత నానా బాధలుపడి నొచ్చుకొని

యున్నారు. అందును భీముడు నిన్ను జూచుటతో కోపిం పకుండునా? అర్జునుడు అస్త్రసిద్ధి పొందక మునుపే యొక్కడును భూమి నంతను జయించిన వాడు. ఇప్పుడు వానికితోడు పాశుపతాస్త్రమును సంపాదించినాడు. అతని కెవరు నెదురునిల్వలేరు. నీవు వారికి కీడుచేయుట కాని, వారు నీకు బాధ కలిగించుటకాని మంచిదికాదు. కాన ఆలమంద లను రక్షించుటకై తగినవారిని పంపింపుము. నీవు స్వతము వెళ్ళవద్దు' అని గట్టిగా చెప్పెను. అప్పుడు శకుని 'ఆ! మేము వారి పరాక్రమమెరుగమా? వారికేల అపకారము చేసెదము? ధర్మరాజు ప్రతిజ్ఞ తప్పడు. అతనితమ్ము లతనిమాట తప్పరు. మాకు వేటాడవలెనని యున్నది. గోసంరక్షణ సేయబోయినప్పుడు వేటాడవచ్చును!' అని యొప్పించెను. ధృతరాష్ట్రుడు మనస్సున గొంచెము సేపాలోచించి 'మీరు వెళ్ళి గోవులరక్షించి, ఆలసిం పక వెంటనే మరలిరండు' అని యనుమతిచ్చెను.

దుర్యోధనుడు సేనతోసహా అడవికేగి గంధర్వులచే దెబ్బలుతినగా భీమార్జునులు వెళ్ళి వారిని విడిపించిరి. తిరిగివచ్చి నాక కర్ణాదులతో నాలోచించి రాజసూయము చేయ తల చెను, కాని పురోహితుడు 'పాండవులు విరోధులై యుండగా నీకు రాజసూయము సేయవీలులేదు. దానితో సమానమైన వైష్ణ వయాగము సేయు' మనెను. దుర్యోధనుడు తల్లిదండ్రులకు చెప్పి వైష్ణవయాగము చేసెను.

అజ్ఞాతవాసము పూర్తియైన తర్వాత పాండవులు ద్రుప దునితో ఆలోచించి అతని పురోహితుని ధృతరాష్ట్రు నొద్దకు రాయబారమంపిరి. అతడు వచ్చి వారి రాజ్యము వారికిచ్చుట

మంచిదనియు, యుద్ధము చేయుట భూప్రజకు నష్టమనియు చెప్పెను. అంతకుముందే కౌరవులు పదునొకం డక్షౌహిణుల సైన్యమును పాండవు లేడక్షౌహిణుల సేనను సిద్ధము చేసికొనిరి. ధృతరాష్ట్రుడు రాయబారము తెచ్చిన బ్రాహ్మణునితో 'అయ్యా! నేను, మంత్రులు, బంధువులు, పెద్దలతో ఆలోచించి సమస్తభూప్రజకు బాధలేనిరీతిగా మరొకని పాండవుల వద్దకు రాయబారముంపెదను కౌరవులకు పాండవులతో కలిసి యుండుట యెంతో మేలగు. మీరికనుందేగుడు' అని అతని సత్కరింపజేసి పంపించెను.

తరువాత సభలోనుండగా ధృతరాష్ట్రుడు సంజయుని పిలిపించి 'పాండవులు ఉపప్లావ్యమునకు వచ్చియున్నారు. నీవు వెళ్ళి వారివిషాదము తగ్గునట్లుగా మాట్లాడవలెను. ముందుగా 'మీతండ్రి మీ వనవాసావాసముతగ్గి అభివృద్ధిలో నుండుట వినిసంతోషించి నన్నిచ్చటికి పంపినాడు' అని చెప్పవలెను సుమా! అని తక్కినవారితో.

'దుర్యోధనుడు వివేకము తెలియనివాడగుటచే నింతవరకు వచ్చెను. కాని పాండవుల దేమియు దోషములేదు. పాలు, నీరు కలిపినట్లుండ వలసినవారుగదా! పితృభాగ మేలవలసినవారు కాని పాండవులు అడవులపాలుగావలసినవారా? వారికి మనలను అన్యాయపరులు, అబద్ధములాడువారు, గర్వముకలవారు' అని నమ్మిరి అయినను ధర్మరాజున్నాడుగా న్యాయముగా నడుచుకొనుటకు! ఇంక లేనిపోని గర్వపుమాటలాడి వారికి భాగమియ్యనిచో సిద్ధముగా కోపించు అర్జునుడు గాండీవమును మోపెట్టినను, కృష్ణుడు సాహాయ్యముచేసినా లోకక్షోభము కాకతప్పునా?

యున్నారు. అందును భీముడు మిమ్ము జూచుటతో కోపిం పకుండునా? అర్జునుడు అస్త్రసిద్ధి పొందక మునుపే ఒక్కడును భూమి నంతను జయించిన వాడు. ఇప్పుడు దానికితోడు పాశుపతాస్త్రమును సంపాదించినాడు. అతని కెవరు నెదురునిల్వలేరు. మీరు వారికి కీడు చేయుట కాని, వారు మీకు బాధ కలిగించుట కాని మంచిదికాదు. కాన ఆలమందల లను రక్షించుటకై తగినవారిని పంపింపుము. మీరుమాత్రము వెళ్ళవద్దు' అని గట్టిగా చెప్పెను. అప్పుడు శకుని 'ఆ; మేము వారి పరాక్రమమెరుగమా? వారికేల అపకారము చేసెదము? ధర్మరాజు ప్రతిజ్ఞ తప్పడు. అతనితమ్ము లతనిమాట తప్పరు. మాకు వేటాడవలెనని యున్నది. గోసంరక్షణ సేయబోయినప్పుడు కీడేలవచ్చును?' అని యొప్పించెను. ధృతరాష్ట్రుడు మనస్సున కొంచెము సేపాలోచించి 'మీరు వెళ్ళి గోవులరక్షించి, ఆలసిం పక వెంటనే మరలరండు' అని యనుమతిచ్చెను.

దుర్యోధనుడు సేనతోసహా అడవికేగి గంధర్వులచే దెబ్బలుతినగా భీమార్జునులువెళ్ళి వారిని విడిపించిరి. తిరిగివచ్చి నాక కర్ణాదులతో నాలోచించి రాజసూయము చేయ తల చెను, కాని పురోహితుడు 'పాండవులు విరోధులై యుండగా మీకు రాజసూయముసేయవీలులేదు. దానితో సమానమైన వైష్ణవ యాగముసేయుము' మనెను. దుర్యోధనుడు తల్లిదండ్రులను చెప్పి వైష్ణవయాగము చేసెను.

అజ్ఞాతవాసము పూర్తియైన తర్వాత పాండవులు ద్రుప దునితో ఆలోచించి అతని పురోహితుని ధృతరాష్ట్రునొద్దకు రాయబారమంపిరి. అతడు వచ్చి వారిరాజ్యము వారికిచ్చుట

మంచిదనియు, యుద్ధము చేయుట భూప్రజకు నష్టమనియు చెప్పెను. అంతకుముందే కౌరవులు పదునొకండు అక్షౌహిణుల సైన్యమును పాండవు లేడక్షౌహిణుల సేనను సిద్ధముచేసికొనిరి. ధృతరాష్ట్రుడు రాయబారము తెచ్చిన బ్రాహ్మణునితో 'బ్రాహ్మణా! నేను, మంత్రులు, బంధువులు, పెద్దలతో ఆలోచించి సమస్తభూప్రజకు బాధలేనిరీతిగా మరొకని పాండవుల వద్దకు రాయబారమంపెదను. కౌరవులకు పాండవులతో కలిసి యుండుట యొకింతయు మెరుగు. మీరు సుఖముండేగుడు' అని అతని సత్కరింపజేసి పంపించెను.

తరువాత సభలోనుండగా ధృతరాష్ట్రుడు సంజయుని పిలిపించి 'పాండవులు ఉపప్లావ్యమునకు వచ్చియున్నారు. నీవు వెళ్ళి వారివిషాదము తగ్గునట్లుగా మాట్లాడవలెను. ముందుగా 'మీ తండ్రి బాంధవులు హాసముతగ్గి అభివృద్ధిలో నుండుట వినిసంతోషించి నన్నిచ్చటికి పంపినాడు' అని చెప్పవలెను సుమా! అని తక్కినవారితో.

'దుర్యోధనుడు వివేకము తెలియనివాడగుటచే నింతవరకు వచ్చెను. కాని పాండవుల దేమియు దోషములేదు. పాలు, నీరు కలిపినట్లుండ వలసినదిగదా! పితృభాగ మేలవలసినవారు కాని పాండవులు అడవులపాలుగావలసినవారా? వారికి మనలను అన్యాయపరులు, అబద్ధములాడువారు, గర్వముకలవారు' అని నమ్మకము అయినను ధర్మరాజున్నాడుగా న్యాయముగా నడుచుకొనుటకు! లేక లేనిపోని గర్వపుమాటలాడి వారికి భాగమి య్యకనిచో నిజముగా కోపించి అర్జునుడు గాండీవమును మోపెట్టినా, కృష్ణుడు సారథ్యము చేసెనా లోకక్షోభము కాకతప్పునా?

జాతునకు నాకు నెంతదూరము? నా నెట్లాతని జేరగలను?' అని ధృతరాష్ట్రుడు వాపోవగా విదురుడు సనత్సుజాతుని తలచుకొనెను. అతడు వచ్చెను. కురురాజతనికి సమస్కరించి వేదాంతోపదేశము చేయుమని కోరెను. ఆమహర్షి వేదాంతవాక్యములుపదేశించెను. దానితో ధృతరాష్ట్రునికి చక్కని జ్ఞానములవడినది. అప్పటికి తెల్లవారినది. సనత్సుజాతుడు ధృతరాష్ట్రుని యనుమతులకు సెలవిచ్చి అంతర్ధానము చెందెను.

మరునాడుదయమున ధృతరాష్ట్రుడు సభ చేసెను. సంజయుడు వచ్చి పాండవుల రాయబారము సమాచారము తప్పకుండ చెప్పెను. అదివిని భీష్మద్రోణులు యుద్ధము మేలుకాదని ఇప్పటికైనను బుద్ధితెచ్చుకొని సంధిసేయుమనగా ధృతరాష్ట్రుడా మాటలు వినీ వినసట్లు సంజయునితో ధర్మరాజు మన బలమెరుగునుగదా! ఎవరిఆసరాచూచుకొని యుద్ధమునకు వచ్చుచున్నాడు?' అని ప్రశ్నించెను.

సంజయుడు 'ఇట్టి వెఱ్ఱి ప్రశ్నలు వేసిచో నేనేమి జవాబిత్తును? ఇప్పటిదాక విన్నదేమిటి? భీముడు, అర్జునుడు, కవలు, ఇంకనుతక్కిన మహారాజులు, అందరికంటె ఎక్కువగా శ్రీకృష్ణుడుండగా నాతనికి జంకేమిటి?' అని చెప్పుటతో ధృతరాష్ట్రునకెంతో విచారముకల్గినది.

అతని హృదయమున భీముని పేరు తలచినంతనే గుండె భీతిపుట్టెను. 'సంజయా! నిన్నుచెప్పితిని అతడు రాక్షసజాతి. అందరు నొకయెత్తు; భీముడొకయెత్తు. అతని పేరు తలపెట్టుటతోనుసరికి నాకు రాత్రినిద్రపట్టదు. అతని కెదురొడ్డి నిలువ గలవాడు లేడు. అతనిగద గదకాదు; యముని కాలదండమే. చిన్నప్పటి

చినది. అంతే. ఇంక నాకేవిచారమేటికి? ఇక చాలు. ఊరకుం
డుము.' అనెను. దుర్యోధనుడు 'వారిని వర్ణించెడివారి మాటలే
నమ్ముదువు కాని మా మాటలనాలింపవు?' అనుటతో అతని
మాటలు వినక ధృతరాష్ట్రుడు 'సంజయా! ధర్మరాజును యుద్ధ
మునకు ప్రోత్సహించెడి వారెవరు?' అని యడిగెను. 'ధృష్ట
ద్యుమ్నుడు ప్రతిమాటకు నిప్పుమీద నేయిపోసినట్లు మాటా
డును. నేనుండగా నీకలుకేల? అనిపురికొల్పును. ధర్మరాజా
తని పొగడును.' అనెను. అప్పుడు ధృతరాష్ట్రుడు కొడుకుతో
'నాయనా! నీకు నీపరిజనులకును సగము రాజ్యముచాలదా?
తక్కినసగము పాండవులకిమ్ము. నేను కాదు; అందరును యుద్ధ
మునకు విముఖులై యున్నారు. నీవే యా కర్ణుని మాటలతో
యుద్ధమునకు దిగుచున్నావు.' అని మందలించగా అతడు 'నాకు
కర్ణ దుశ్శాసనుల ప్రాపుచాలు. నేను వాడిసూదిమొన మోపి
నంత భూమినైననియ్యను.' అనుటతో 'నీకోసము నాకు విచా
రములేదు. నీవెంటవచ్చువారిని గూర్చి విచారించుచున్నాను.
భీమార్జునుల దలచుకొనుము.' అని కొంతసేపు అతడేమైనను
నేమో అనిచూచెను. జవాబులేదు. మరల నొకవేళ తమవారే
గెల్చుసూచన లేమైననున్న నేమో అని ఆలోచించెను.

ఎంత యాలోచించినను పాండవులదే యెక్కువగా
తోచినది. ఏదేలకి పాండవులది దేవతాబలము, కౌరవలది
మానవశక్తియని తోచినది. అప్పుడు మరల కొడుకుతో
'నాయనా! అర్జునుడు అగ్నిదేవుని సేవించి జెండా గుఱ్ఱములు,
రథమును, ధనుస్సు, బాణములను పొందినాడురా! కాక వారి
పుట్టువులకు కారణమైన దేవతలు వారిని రక్షించుచుందురు! అర్జు

నుడు దేవదానవ యుద్ధములో పాల్గొని దానవులను చంపెను గదా! అది నీవెరుగనిదా? ఎన్నివిధాల ఆలోచించినను యుద్ధము మానుటయే మంచిదని తోచుచున్నది. అని చెప్పగా దుర్యోధనుడు 'అట్టివారమును మంత్రసిద్ధులున్నవి. అంత దైవబలము గలవారు పదమూడేళ్ళు వనవాసదుఃఖము నేల అనుభవించిరి? నేను కోపించితినా, వారికి కావు దేవతలసైనను చంపజాలుదు ఇది ఆత్మస్తుతి కాదు. కాని ఆత్మస్తుతి చేసికొనుటకూడ గొప్ప యేనా? 'అని చెప్పి యుద్ధానుకూలముగా మాట్లాడెను. కర్ణుడాతని ప్రోత్సహించెను. భీష్మ బాహ్లీకాదులు మందలించిరి.

అప్పుడు ధృతరాష్ట్రుడు 'నాయనా! నే నొక్కడనే కాదు భీష్మ బాహ్లీకులుకూడ యుద్ధము వలదనియే చెప్పుచున్నారు. వారిభాగము వారికిచ్చి సుఖముగానుండుము. అని విసుగుగా ఓరి తెలివితక్కువవాడా! ఉత్తరగోగ్రహణమునాడు కర్ణుడు లేడా, భీష్ముడు లేడా? ఆనాడొక్క అర్జునుని ఏమియుచేయలేని వారు తక్కిన వారందరిని ఏమిచేయగల్గుదురు?' అని కర్ణునితో 'నీవూరకే సేవకుడు చెప్పినట్లు ముఖస్తుతిమాటలు చెప్పి ప్రోత్సహించుటే కాని నీవలన ఏమియు కాదు. ఆనాడు అర్జును నేమియు చేయలేకపోతివి కో ఇక ఇప్పుడు కృష్ణుడు రథసారథియై యుండును ఇక నీవళమగునా? ఊరుచుచు మాటుచు దుర్యోధనుని చంపుటకునా? యుద్ధమునకు ప్రోత్సహించవలదని మందలించెను. అప్పుడు కర్ణుడు ఉక్రోశముతో భీష్ముడన్న మాటలకు కోపించి 'భీష్ముడు బ్రతికియుండగా అస్త్రముపట్టనని అస్త్రసన్యాసము చేసెను.

అదివిని ధృతరాష్ట్రుడు సంజయునితో 'నాకొడుకు కర్ణునితో కలిసి మృత్యుపాశబద్ధుడైనాడు ఏమిచేయను?' అని విచారించి సంజయునితో నీవు తిరిగివచ్చునప్పుడు ఆఖరిమాటగా అర్జునుడేమన్నాడు?' అని యడిగెను. 'ధర్మరాజు అడిగినట్లు స్వతంత్రభాగము మాకియ్యనిచో ధార్తరాష్ట్రులను నా అస్త్రాగ్నిలో దగ్ధముచేయుదునను అని చెప్పెను. ఆమాటలు విననట్లుగా దుర్యోధనుడు వెళ్ళిపోయెను. ధృతరాష్ట్రుడు తెల్లపోయి కూర్చుండెను. తక్కినవారందరును లేచి వెళ్ళిపోయిరి.

ఇంకను ధృతరాష్ట్రునికి తమవారు నెగ్గుదురేమో అను నాశపోలేదు. అది స్పష్టమగునట్లుగా సంజయునితో 'ఒకవేళ యుద్ధమే జరిగినచో ఎవరు గెల్తురో ఎవరు చెప్పగలరు? అటు నిటు మహాబలశాలు రున్నారు. ఎవరెవరిబలము లెంతెంతయో చెప్పుము మాతము,' అని యడిగెను. సంజయుడు నేను చెప్పలేను వ్యాసుని తలచుకొనుము, అతడు చెప్పగలడు అనుటతో ధృతరాష్ట్రుడు వ్యాసుని తలంచుకొనెను. వ్యాసుడువచ్చెను, అతనికి మర్యాదలుచేసి ధృతరాష్ట్రుడు తన సంశయము నడుగగా సంజయునే చెప్పుమని వ్యాసుడు నియోగించెను. అతడు చెప్పెను.

అందు వాసుదేవుని బలమింతయని యెవరికిని తెలియదని సంజయుడు చెప్పగా నతని తెలిసికొను నుపాయము చెప్పుమనెను. విద్యావిద్యలగూర్చి సంజయుడు చెప్పెను. ధృతరాష్ట్రుడు విని కుమారునితో 'నాయనా! చెడిపోక శ్రీకృష్ణునాశ్రయించుమనెను. అతడు కృష్ణుడు పాండవపక్షపాతి నాసర్వస్వము పోయినను సరే నేనుమాత్ర మాతని నన్నడు నాశ్ర

యింపను. అని చెప్పగా ధృతరాష్ట్రుడు భార్యతో నీకొడుకు నుద్బుద్ధిపించితివా? అనుటతో ఆమెహూడ కొడుకును మంద లించినది.

ధృతరాష్ట్రుడు వాసుదేవాది నామమాహాత్మ్యంబులడిగి తెలిసికొని వ్యాసునితో 'మహానుభావా! నాకు కన్నులు లేనం దున లోకముచూడలేక పోతినేయను విచారము లేదుకాని ఆ పరమాత్ముని గోవిందుని చూడలేకపోతినే యనియే విచారిం చుచున్న, అనెను. నీకాతని చూడవీలుగల్గును అనివరమిచ్చి వ్యాస మహర్షి వెడలిపోయెను. దుర్యోధన సంజయులనుపంపించి, తాను భార్యయు లోనికేగెను.

ధర్మరాజాదులు శ్రీకృష్ణుని రాయబారమునకై హస్తినా పురికి పంపించగా అతడువచ్చుచున్నాడన్న వార్త ధృతరాష్ట్రునికి తెలిసెను. అతనికదివరకే శ్రీకృష్ణునిపై భక్తిదృఢమైనది. భీష్మా దులను పిలిపించి దుర్యోధనునితో 'నాయనా! శ్రీకృష్ణుడువచ్చు చున్నాడట. మునులు సైతము కోల్చెడి భగవానుడు మన వద్దకు వచ్చుచున్నాడు. ఇంతకంటె అదృష్టమేమి కావలెను? అతడు సంతోషించెనా శుభముకల్గును. అనాదరము చేసెనా అశుభముకల్గును. నీవు చక్కగా అతనికి తగినపూజలు చేయు టకు తగినవారిని నియమింపుము. నీవైభవమతనికి వచ్చునట్లుగా చేయింపుము, పట్టణమలంకరింప నాజ్ఞాపింపుము' అనుటతో ఆమాటలువిని భీష్మాదులు సంతోషించిరి. దుర్యోధనుడు 'అట్లే' యని సేవకులకు పట్టణాలంకారములు చేయుడని యాజ్ఞాపించెను.

అప్పుడు ధృతరాష్ట్రుడు విదురునితో నేను మణిమయ రథములు మంచిజాతిగుఱ్ఱములు, రత్నాభరణములను కృష్ణున

కిత్తుము. మనమతనికంటికి నచ్చిన వస్తువులన్నింటి నిత్తము అనగా విదురుడు అతని కిచ్చుటకుంచిదే కాని ఏర్పు అతనికి లంచమిచ్చి పాండవులకు అతనికి భేదము సేయగలచుచుంటివేమో కాని అది అసంభవము. కాక అతడు వచ్చినపని పూర్తి చేసినచో అతడెంతో సంతోషించు ననెను. దుర్యోధనుడు 'నేను అతడడిగినట్లు భూమిని పాలు మాత్రము నియ్యను. ఇంకొకటి అతని రెక్కలు విరిచికట్టినచో పాండవులు సాయములేక రెక్కలువిరిగిన పక్షులవలె నాకు లొంగితీరుదురు.' అనుటతో విచారించి ధృతరాష్ట్రుడు 'ఓరిపాపాత్మా! అట్టిదురూహాలు మానుము రా! అతడు వచ్చుట కురువంశమున కేమికీడుచేసెనురా? అతడేమి చేసెనురా?' అని అదలించెను.

భీష్ముడు 'నీకొడుకెట్టివాడు. ఈ దుష్టులు నశింతురు.' అని గట్టిగా అనుటతో ధృతరాష్ట్రుడు విచారించి కొడుకుతో 'నీవన్నంత చేయుదువు పొమ్మ'ని పంపివేసి తన యిష్టమువచ్చిన యేర్పాట్లు చేసెను.

మరునాడు ప్రొద్దున శ్రీకృష్ణుడు హస్తినాపురికి వచ్చెను. పౌరులుస్వాగతమిచ్చిరి. అతడు కోటగోనికివచ్చి గజముఖశాల ప్రవేశింపగానే ధృతరాష్ట్రుడు భీష్మ విదురుల మాటగాని అక్కడికెదురేగి అతనిని కౌగిలించుకొనెను. కృష్ణునకెన్నో పూజలు, మర్యాదలు చేయించెను. కృష్ణుడక్కడినుండి విదురువాడు యిండ్లకేగి సభకువిచ్చేసెను. అక్కడ అందరుండిరి. మహా మునులు నెందరోవచ్చిరి.

అప్పుడు శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో ధర్మరాజాడిన మాటలు చెప్పెను. దుర్యోధను డంగీకరింపలేదు. మునులు,

భీష్మద్రోణులును హితవు చెప్పిరి. అతడువినలేదు. అంతట ధృతరాష్ట్రుడే 'నాయనా! శ్రీకృష్ణునాశ్రయించి, మీ అన్నయైన ధర్మరాజువద్దకేగి సంధిసేయుము. దీనివలనమనకు కార్యసిద్ధియగును. లేకున్న నెన్నోపాటులువచ్చును.' అని హితవు చెప్పెను.

దుర్యోధనుడు వినకున్నప్పుడు కృష్ణుడు 'కంసుడు నిట్లే యొగిరిపడినాడు. అతని చంపి కులము బాగుచేసితిని. వీనిని అట్లే చేయుదును. దానితో కౌరవపాండవు లేకమగుదురు.' అనుటతో ధృతరాష్ట్రు డదిరిపడి, గాంధారి వచ్చినచో నేమైన కొడుకుకు నచ్చచెప్పునేమోయని విదురునిచే గాంధారిని పిలిపించెను. ఆమె వచ్చి చెప్పినది కాని, అతడువినలేదు. పైపెచ్చు తనకు దగుచెట్లు కృష్ణుని కట్టుదలచెను.

కృష్ణు డదితెలిసి 'హోయివత్తు'నని ధృతరాష్ట్రునితో కౌరవులుచేయు దుండగములు చెప్పగా, నతడు కొడుకును పిలిచి 'ఒరీ! నీవు, నీ స్నేహితులును మీ తరము తెలియక కృష్ణునికి కీడుచేయ దలతురా? దుర్మతులారా! గాలిని పట్టగలరా? కొండను కదల్చగలరా? దావాగ్ని నణపగలరా? వినాశము పొందెదరు' అని తిట్టెను.

అంతలో శ్రీకృష్ణభగవానుడుతనదివ్యరూపముచూపెను. ఆ రూపమును చూచుటకై భీష్మాదులకు దివ్యదృష్టి నిచ్చెను. ఆ కలకలము విని, కృష్ణుని దివ్యరూపమేమో అనుకొని ధృతరాష్ట్రుడు 'దేవా! కరుణింపుము. అజ్ఞానమును క్షమింపుము. నిన్నే శరణు వేడెదను. నీ పాదపద్మములచూడ వీలగునట్లు చేయుము' అని దోసిలొగ్గి ప్రార్థించెను. కృష్ణుడు దివ్యదృష్టి

యిచ్చినాడు. అతడు కన్నులార పరమేశ్వరుని దివ్యరూపమును సందర్శించి, ఆ దేవునకు మ్రొక్కి 'దేవా! నన్ను చూచిన యీ కన్నులతో నిక మరొకరిని చూడనొల్లను. నా కన్నులు తీసి కొనుము' అని వేడెను. కృష్ణు డట్లే చేసెను. అతడెంత భగవద్భక్తుడో? మరొకడెవడైన అలభ్యముగా లభించిన దృష్టిని పోగొట్టుకొనునా?

కృష్ణుడు విశ్వరూపము నుపసంహరింపగా నతని ద్వారమువరకు సాగనంపి ధృతరాష్ట్రుడు తనకొడుకులనుచూపి, "వీరికి నీ యెదుటనేకదా బుద్ధి చెప్పితిని. నేను కులాచారము నిర్వహించుటకై యెన్నో పాట్లుపడుచుంటిని. నేను నిర్దోషుడనని నీ కొక్కనికి తెలిసిన చాలును' అనెను. శ్రీకృష్ణుడు 'జరిగినది చూచితిరికదా! ధృతరాష్ట్రుడు తనతప్పు లేదని చెప్పుచున్నాడు. ముందుపని చూతు' నని వెడలిపోయెను.

యుద్ధమున కిరువాగులవారును సిద్ధమైరి. రుక్మి బలరాములు మాత్రము పాల్గొనలేదు. ఆనాటిరాత్రి ధృతరాష్ట్రుడు సంజయుని పిలిపించి 'యుద్ధము కీడని యెఱుగుదును. అవినీతుడైన కొడుకును అదల్చి మాన్పుట నోరాడక యూరకుంటిని. దైవవశమైనపనికి ఇక వగపెందుకులే. కానున్నది కాకమానదు. రాజులకు యుద్ధములో చచ్చుటమంచిదే యగును. కాక ఇరుపక్షములవారును కురుక్షేత్రమున విడిసినతర్వాత పట్టణములో నేమివింతలు జరిగినవి?' అని యడిగెను. అతడు దుర్యోధనుడు లూకుని ద్వారా చెప్పినమాటలు, అవి విని కృష్ణుడన్నది, అది విని కౌరవులన్నవి అన్నియు జెప్పెను.

రాత్రి తెల్లవారినది. ధృతరాష్ట్రుడు సంజయుడును కూర్చుండిరి. ధృతరాష్ట్రుడు విచారించుచున్నాడు అప్పుడు వ్యాసమహర్షి వచ్చెను. అతని పూజించినాడు ధృతరాష్ట్రుడు. అతని పూజ లంగీకరించి వ్యాసమహర్షి 'కాలమువచ్చినందున రాజులెల్లరు యుద్ధసన్నద్ధు లైనారు, నీకు వగపెందులకు? చూడ వలెనని యున్నచో నీకు దివ్యదృష్టి యిత్తును. యుద్ధమును చూడుము.' అనగా నతడు 'అన్నదమ్ములు ఘోరముగ యుద్ధము చేయుచుండగా నేను చూడజాలను. విన గోరిక యున్నది. ప్రసాదింపుము' అనుటతో వ్యాసుడు సంజయునితో 'ధృతరాష్ట్రునికి యుద్ధవిశేషములను చెప్పుము. నీకు దివ్యదృష్టి నిచ్చుచున్నాను. అందరిమాటలు నీకు వినబడును. అతి త్వరిత ముగా నీవు యుద్ధభూమికి పోగలుగుదువు. అక్కడి బాణములు గాని, అస్త్రములుగాని నిన్నేమియు చేయజాలవు. అందరి మాటలు. రహస్యములు నీకు తెలియునట్లును గ్రహించితివి. అన్నియు ధృతరాష్ట్రునికి చెప్పుము అని నియోగించెను.

అప్పుడు అపశకునము లెక్కువ కాగా వ్యాసుడు 'ఇప్ప టికైనను నీతమ్మునివంతు పాండవులకిమ్ము' అనగా ధృతరా ష్ట్రుడు నాహితముకోరి చెప్పినారు. నే నెన్నోరీతుల కొడుకును నచ్చజెప్పజూచితిని. కాని వారి నొప్పింపజాలక పోయితిని. నాకంతశక్తిలేదు. నాయందేమి తప్పులేదని మీమనస్సులో తెలిసికొని మరి ఈమాట మానుడు. పసిపాకము తప్పనది. ఇంక అతుకదు. అని వ్యాసునిసాగనంపెను.

తరువాత సంజయునితో 'ఆహా! ఈ భూమికై రాజు లెందరు చచ్చిరోయి. భూమియన్నచో నెంతతీపో? ఏది,

భూమిపరిమాణము చెప్పుమని యడిగి యనుమతినిచ్చి తెలిసి కొనెను. ఇక నాపూట యుద్ధభూమికి వెళ్ళి విశేషములు చెప్పు మని పంపెను

అతడు నిరాటంకముగా యుద్ధభూమికేగి పదినాళ్ళతిరిగి ధృతరాష్ట్రు నొద్దకువచ్చెను. అతడీ పదిరోజులును యుద్ధము లోనేమైనదో? ఏమగుచున్నదో? అని బాధపడుచుండెను. సంజయుడు వచ్చి రాగానే కురువృద్ధునకు పాదములపైబడి నమస్కరించి యేడ్చుచు భీష్ముడు పడిపోయెనని చెప్పెను.

ఆమాట వినగానే ధృతరాష్ట్రుని హృదయమున జల్లు మనెను. మూర్ఛపోయెను, సంజయుడు చేసిన శైత్యోపచార ములను మెల్లగా తేరుకొని, కన్నీరు కార్చుచు, కంఠము బొం గురుపోవగా 'అయ్యో! దేవాసురులు లొక్కటైవచ్చినను ఎదురునిల్వగల యోధునకు శిఖండి మూలమయ్యెనా! హావిధీ! ఏమిసంజయా అతనికెవ్వరు సద్దమే వెళ్ళలేదా? అతడు పడు టతో మనసేనఅంతయును పడినట్లే. కురుకుల వృద్ధుయిన భీష్మునిచంపి రాజ్యముచేయదలచిన పాండుపుత్రులకు దైవము తోడగుచున్నాడు. ధర్మమును వెనుకకుత్రోసి అధర్మమేగెల్చు చున్నట్లున్నది. అతనిని కూల్చి రాజ్యముచేయుటకంటె పౌరుష మేమున్నది? పాపముచే చేయున్నావా? సంజయా! మగడులేని మగువలాగున భీష్ముడు పోవుటతో నాసేన అనాధయైపోవదా? ఏమిజరిగినదో వయినముగా చెప్పుము' అని అడుగగా సంజ యుడు పదిరోజులు జరిగిన యుద్ధమును సఫలముగా సల్లితచి చెప్పెను. అబ్బ! నామనసు రాయో? ఇనుమో? ఇట్టిదారుణ వార్తలు వినుచున్నను పగులకున్నది. అయినను విశేషములు

నిశ్శేషముగా చెప్పుము.' అని యడిగిన సంజయుడు చెప్పగా అతడువినెను.

తరువాత సంజయుడు యుద్ధభూమిలో తిరిగితిరిగి ఒక్క నాటిరాత్రి ధృతరాష్ట్రుని నద్దకువచ్చెను. అతడు విశేషము లడిగెను. భీష్ముడు తరువాత ద్రోణుడుసేనాపతియగుటను తెల్పి అతని మరణమును తెల్పెను. ధృతరాష్ట్రుడదివిని 'ఆహా! మహావీరు లిందరుండ దృష్టద్యుమ్నుని చేతిలో ఆచార్యుడు పడెనా? అర్జునుడు చివరికి సుయోధనుని జయించెనా? సంజయా! భీష్మ ద్రోణులు పడినతరువాత ఇంక నావారికి దిక్కెవ్వరు, ఇంక నీవు చెప్పవలదు; నేను వినవలదు' అని మూర్ఛపోయెను. అతనిభార్యలువచ్చి శైత్యోపచారములు చేయగా నతడు లేచి 'అయ్యో! ధర్మరాజుసేనయెంతో యుత్సాహముగా నున్నది. నేనేమి జేయుదును? కృష్ణార్జునులకు భీమునకు నడ్డెవ్వరు? ఇంక నావారికి చావుతప్పదు. భీష్మద్రోణులు జయింప శక్యమైన వారేనా! పాండవులు శ్రీ కృష్ణుని తెచ్చి తమవానిని చేసికొనిరి. దానితో వారికి జయము హస్తగతమై యున్నది. ఇంక వినుట కేమున్నది? అయినను వివరించి చెప్పుమని సంజయుని చెప్ప చూడ ద్రోణుని పడువరకు వినెను.

తరువాత సంజయుడు రెండురోజులయుద్ధముచూచివచ్చి ధృతరాష్ట్రునితో కర్ణుని పౌరుషము వర్ణించి, అతడు చనిపోయె నని చెప్పెను. అంతేకాక భీముడు దుశ్శాసను వక్షస్థలముచీల్చి రక్తము త్రాగెనని చెప్పెను. అది వినుటతో మూర్ఛపోయి లేచి ధృతరాష్ట్రుడు 'సంజయా! నేను సరిగావినలేదు. దుర్యోధనుడు బ్రతికియున్నాడా? ఎవరెవరు చనిపోయిరో చెప్పుము?

అని ఉభయపక్షములలోను చనిపోయినవారిని, బ్రతికియున్న వారిని పేరుపేరు వరుసల అడిగి తెలిసికొనెను. కర్ణునిపాటు చెప్పుటతో 'నా కొడుకు ఆశలన్నియు నిష్ఫలములైనవి కర్ణుని మీాద ప్రాణములు పెట్టుకొనియుండెను. హా! హతవిధీ ఎంత చేసితివి? ఈ వయస్సున ఈ చెవులతో బంధు మిత్ర పుత్రుల మరణవార్త వినవలసి వచ్చెను. సరే, కానిమ్ము. ఏమేమి జరిగి నదో వివరముగా చెప్పు'మని సంజయుడు చెప్పగా కర్ణమృతి వరకు జరిగినవృత్తాంతము వినెను.

తరువాత మరల సంజయుడు యుద్ధభూమికేగి ఒకనాటి మధ్యాహ్నమునకు తిరిగివచ్చెను. అతడువచ్చుసరికి విదురుడు దగ్గరనుండగా కురువృద్ధు లోననుండెను. సంజయుడువచ్చి తనపేరుచెప్పి నమస్కరించి, ఏడుపువచ్చు కంఠధ్వనితో 'రాజా! శల్యుడు చనిపోయినాడు. శకుని, ఉలూకుడు, యవ నాది రాజులందరుచు చనిపోయిరి ఆఖరునకు దుర్యోధనుడొం టరిగాడై చెరువులో దాగగా, భీము డతనిలెట్టి పైకిరప్పించి, మాటప్రకారము గదా దండముతో తొడలు విరుగగొట్టి నేల కూలనేసెనయ్యా! ఈ రీతిగా పదునెనిమి దక్షౌహిణుల సేనయు కాలముతీరుటచే చనిపోయెను.' అని చెప్పుటతో ధృతరాష్ట్రుడు, విదురుడును మూర్ఛపోయిరి. సంజయుడు నీరుచల్లగా నంద రును లేచిరి.

అప్పుడు ధృతరాష్ట్రుడు 'విదురా! తమ్ముడా! నా కిక కొడుకులు లేరు. అక్కరలేనివాడనైతిని. నాకు నీవేదిక్కు. నన్ను

కొంతసేపటికి తేరుకొని కుండలో పెట్టిన పామువలె నిట్టూర్పుచు ఏడ్చెను. విదురునితో 'తమ్ముడా! నీవనినను, కోడండ్రను లోనికిరానివేయుము,' అని వాడు వెళ్ళిపోగా సంజయునితో 'అయ్యో! పాండవులైదుగురు చావరు, నొవ్వరు అని నీవు చెప్పుచుండగా ఆమాటలను నాహృదయము దహించుకొనిపోవుచున్నది. వందమంది కొడుకులు చచ్చినట్లు విని కూడ నాహృదయము పగులదు వజ్రమయమేమో? గ్రుడ్డికన్నులైనను కొడుకుల బాల్యచేష్టలు విన్న ఈ చెవులతో చావులు వినవలసి వచ్చెను. ఆఁ, సుయోధనా! నామీఁద దయలేదా, మాటవల్కవా? వృద్ధులను విడుచుట తగునా? ఎప్పుడు రాజులు చుట్టును గొలిచియుండు నీవు ఒంటరిగాడవై చచ్చితివా? ఇక నన్ను భక్తితోవచ్చి కొలిచి గౌరవించువారెవరు? నాయనా! ఎప్పుడు యుద్ధముమాట వచ్చినను ద్రోణుడున్నాడు, భీష్ముడున్నాడు. అందరికంటె ఎక్కువగా కర్ణుడున్నాడని చెప్పెడివాడవురా? మేమందరము గెల్తుమని చెప్పగా నీ పరాక్రమముతో పాండవులే చత్తురనుకొన్నాను, కాని నీవే వారలచే చచ్చితివేలరా నాయనా! నక్కవంటి శిఖండిచే సింహమువంటి భీష్ముడు చావనా? ద్రోణుడుచచ్చెనా? కర్ణుడు, శల్యుడు రూపుమాసిరే! తమ్ములు సాయపడగా శత్రువులగెల్తునంటివి గాని ఒక్కడును దక్కకుండ ఆవిధి అందరిని ఊచముట్టుగ తన కడుపునపెట్టుకొనెనే? భీముడు గదతో తొడలు విరగగొట్టినపుడు నేలపైబడి యేమనుకొంటివో కుమారా! అని ఎన్నో రీతుల విలపించెను.

మరియు 'భాగ్యవంతులకు మేలుకలుగును గాని మంద దృష్టవంతుల కడ్డెల్లు కల్గనేర్చునా? కొడుకులందరును చచ్చిరి. ఇంక అసువులకు పోవుట యేగతి. లేకున్న భీముడు చెవులు చిల్లులుపడు మాటలతో నన్ను నొప్పింపకుండునా?' అని సంజయుని యుద్ధవార్తలు పూర్తిగా వివరముగా చెప్పుమని వినెను, అశ్వత్థామ రాత్రికిరాత్రి వెళ్ళి పాండవసేనలను చంపుటయు వినెను. తరువాత శ్రీకృష్ణుడువచ్చి ధృతరాష్ట్రునిగాంధారిని ఊరడించెను. అట్లు కొడుకులు, మనుమలు చనిపోవుటతో కొమ్మలు తెగిన మహావృక్షమువలె వికలుడై ధృతరాష్ట్రుడు విచారించుచుండ సంజయుడతని నోదార్చెను. 'అయ్యో! నేను ఎందరు బుద్ధిచెప్పినను వినక లోభముచే వారిభాగము వారికియ్యనందుకింత జరిగెను. నాకువచ్చుకీడు తలపక అందరికిని కీడుకప్పిలచి తిని॥ ఇంక నే బతుకుట యెందుకు? అని విచారించుచుండ సంజయుడు, విదురుడు శాంతవచనములతో నతని తేర్చెను.

వ్యాసమహర్షి వచ్చి వేదాంతము చెప్పి దుర్యోధనుడు కలియంశమున పుట్టెనని చెప్పి ధృతరాష్ట్రు నూరడించెను. అతడు ధర్మరాజు తన్ను గౌరవింపడని జంకుచుండగా దివ్యదృష్టితో చూచి వ్యాసమహర్షి నీకేమియు హానిచేయవలవడా ధర్మరాజు. తను భాగమియ్యనందులకు గానీ వారినిచంపెను. నీవు దుఃఖముమాని, వారియందు బాంధవ్యము కల్గియుండుమని చెప్పి వెడలిపోయెను.

ధృతరాష్ట్రుడు సంజయుడు తోడురాగా భార్యలు, కోడండ్రు మున్నగు స్త్రీ జనముతో కూడి యుద్ధరంగమున కేగెను. అటవిని ధర్మరాజు తమ్ములు, కృష్ణునితో సహా

యుద్ధభూమి కేగి అక్కడ ధృతరాష్ట్రునకు నమస్కరించెను. అతడు ధర్మజుని కౌగిలించుకొనెను.

అంతట భీముడు వచ్చెనని తెలియగానే ధృతరాష్ట్రుని మనస్సుడికిపోయినది. 'నాయనా! రా! అనుచు కౌగిలించుకొనబోగా భీముడు దగ్గరకు వెళ్ళబోయెను. శ్రీకృష్ణు డాతని బలమెరిగినవాడు కనుక ఇంతక్రితమే తయారు చేయించి తెచ్చిన ఇనుప భీముని ధృతరాష్ట్రుని ముందరికి త్రోసెను. అతడు తన కొడుకుల నందరిని చంపెనను కోపముతో భీముడే అనుకొని ఆ ఇనుపవిగ్రహమును కౌగిలించుకొనగా అదినుగ్గయి పోయెను. నిజముగా భీముడే వెళ్ళినచో నున్నములోని శెముకలు లేకుండ పోయెడివాడే. భీముడు వచ్చెననుకొని లోపల సంతోషించుచు, పైకి కల్లబొల్లి యేడ్పు లేడువగా నవ్వుచు కృష్ణుడు 'నీవు విచారింప నక్కరలేదు. భీముడుచావలేదు' అనెను. అంతట ధృతరాష్ట్రుడు తనకోపము నాపుకొనలేక అట్లుచేసితినని, ఇక నెప్పుడును అట్లుచేయనని చెప్పెను. అక్కడ యుద్ధభూమిలో చని పడియున్న వారినెల్లరను తడవిచూచి వారికి తిలోదకములిచ్చెను.

ధృతరాష్ట్రునకు పాండవులపై ప్రేమ కుదిరినది. ధర్మరాజతనికి ఏలోటు రాకుండ పరిచర్యలుచేయుచు, చేయించుచుండెను. భీమాదులు కూడ పరిచర్యలుచేయుచుండిరి. ద్రౌపది, కుంతి, సుభద్ర, ఉలూపి, చిత్రాంగద మున్నగుస్త్రీలు గాంధారిని సేవించుచుండిరి. పొరపాటుననైన దుర్యోధనుని మాట కాని, అతడుచేసిన చెడుపనులనుకాని ఎత్తిపెట్టుటలేదు. సేవకులైనను తలపరాదని ధర్మరాజుగారి ఆజ్ఞ. ఎక్కడ మనస్సు

నొచ్చుకొనునో అని ధృతరాష్ట్రుని కెన్నో సేవలు సేయుచుం డెను. అతడు కొడుకులను మరచి సుఖించుచుండెను. ఇదివరకు వలెనే దానధర్మములు చేయుచుండెను. కొడుకులకు సద్గతులు కలుగుటకై దానములు చేయుచుండెను. అతడు చేసినదానముల నన్నింటిని ధర్మరాజామోదించుచుండెను. ఇట్లు పదిహేను సంవత్సరములు గడచినవి. ఆ మధ్యకాలముననే ధర్మరాజు అశ్వమేధము చేసెను.

ఒకనాడు ధృతరాష్ట్రుడు బంధువులను రప్పించి, ధర్మ రాజును పిలిపించి, అందరు వినుచుండగా 'నా మూలమున మన వంశము నాశనమైనది. అది మీ కందరకు తెలిసినదే. అదే నాకు హృదయశల్యమైనది. దుర్యోధనాదులెన్నో తప్పులు చేసిరి. దానికి ఫలితముగా యుద్ధమున చచ్చిరి. అందువలన వారికి సద్గతులే యబ్బినవి. వారికై నీ వింకేమియు చేయుటవలదు. ధర్మరాజా! నీవు రాజవుకాన నీతో చెప్పక యేమియు చేయ రాదని చెప్పుచున్నాను. ఈ వార్ధక్యమున నింక నేను బ్రతుక దలచుకొనలేదు. వనవాసముచేసి తపోయోగముద్వారా శరీరము విడువదలచితిని. అనుజ్ఞయిమ్ము.' అనుటతో ధర్మరాజు 'తండ్రీ! నీవె రాజవు. నేనుకాదు. నీ కేమిలోటువచ్చినది? వెళ్ళవలదు పోనీ యుయుత్సునకు రాజ్యమిమ్ము. నేనుకూడ నీతో వత్తును.' అనగా అతడు 'నీవు నామనస్సు సంతోషించునట్లు శుశ్రూష చేసితివి. ఇంకను నేను తపస్సు చేసికొనవలదా? అనుజ్ఞనిమ్ము. నీ వనుమతించువరకు భోజనము సేయను' అని పట్టుపట్టెను.

అంతలో వ్యాసమహర్షి వచ్చి 'ఇతని కీ యీడులో తపస్సు చేసికొ... మంచిది. అనుజ్ఞనిమ్మ'నెను. ధర్మజడు

తరువాత నాలోచించవచ్చునని సర్దెను. ఆనాడు భోజనముచేసి రహస్యముగా ధర్మరాజునకు ధృతరాష్ట్రుడు రాజనీతి విశేష ములు తెల్పెను.

తరువాత ప్రజలనందరనురావించి ధర్మజుడు 'మాతండ్రి వనవాసమున కేగదలచిమిమ్మనుజ్ఞ వేడుచున్నాడు' అనగాఅందరు నొక్కపెట్టున నేడ్చిరి. ధృతరాష్ట్రుడు వారితో 'పూర్వులు చక్కగా మిమ్ముపాలించిరి. నా కొడుకెన్నోతప్పులు చేసినాడు. దానికి ఫలితమనుభవించినాడు. ఇప్పుడు ధర్మరాజు మిమ్ము పాలించుచున్నాడు. నాకు వార్ధక్యం వచ్చినది. అడవికిపోవ ననుజ్ఞనిండు' అనికోరెను. ప్రజలందరును వెళ్ళి, యొక్కచో సమావేశమై శంబువను బ్రాహ్మణునిద్వారా తమ యంగీకార మును తెల్పిరి. అదివిని సంతోషముతో నందరిని వంపివేసి. ధృతరాష్ట్రుడు, గాంధారియు తమ నివాసములకేగిరి.

మరునాడు విదురుని ద్వారా ధర్మరాజునకు 'భీష్ముడు మొదలైనవారికి విశేషముగా శ్రాద్ధములు చేయదలచితి'నని కబురంపెను. భీముడు కోపించెను. అన్న యాతని మందలించి 'కావలసినట్లుచేయుము'ని విదురునితో చెప్పివంపెను. విదురుడు వచ్చి ధర్మరా జంగీకరించినట్లు చెప్పెను. భీముని మాటలు చెప్పి అవి లెక్క సేయవద్దనెను. కార్తీకపూర్ణిమనాడు ధృతరా ష్ట్రుడు దానధర్మములు చేసెను. తరువాత వనవాసమునకు సంక ల్పముచేసి నారబట్టలు కట్టుకొని పురోహితాలగ్నులు పుచ్చు కొని ముందునడువగా ధృతరాష్ట్రుడు భార్యలతో వనవాసము నకై పురద్వారము దాటెను. ధర్మరాజాదులేకాక యూరంద రును నేడ్చుచు వచ్చిరి, కుంతిదేవికూడ వారితోపాటు వనము

కేగెను. విదుర సంజయులును వెళ్ళిరి.

వారు భాగీరథీ తీరమున శతయూపర్షి యాశ్రమమున పర్ణశాలలు వేసికొని నివసించిరి. అంతట నారదుడువచ్చి 'పాండురాజు ఇంద్రుని దగ్గర నేయున్నాడు. కుంతి అక్కడి కేగును. విదురుడు యముడే. గాంధారి ధృతరాష్ట్రులు మూడే ళ్ళుతపస్సుచేసి దేహములువిడిచి కుబేరునివద్ద దివ్యభోగము లనుభవింతురని చెప్పెను. ధృతరాష్ట్రు డానందించెను.

తరువాత ధర్మరాజాదులు తల్లినిజూడగోరి అడవి కేగిరి. నెలనాళ్లుండిరి. అందొక్కనాడు వ్యాసమహర్షి వచ్చి తనదివ్య శక్తిచే వారుకోరినరీతిగా యుద్ధమున చనిపోయిన వీరులనొక్క నాడు భూమిలోనుండునట్లు చేసెను. గాంధారి కన్నులకు కట్టు కొన్నగంతలు తీసివేసి కొడుకులను కౌగిలించుకొని చూచి యానందించినది. తరువాత పాండవులు హస్తినాపురమునకు వచ్చివేసిరి. ధృతరాష్ట్రుడుతక్కినవారితో అరణ్యములోనిరాహార దీక్షతో నుండగా నొకనాడు దావాగ్ని చుట్టుముట్టినది. సంజ యుడు తప్పించుకొను మార్గము లేదు. యోగముపట్టుమనెను. ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతియు యోగముపట్టిరి. సంజ యుడు హిమవత్పర్వతమునెక్కెను. వారుముగ్గురును అగ్ని కాహుతులై సద్గతినందిరి. ఆవిషయమును నారదమహర్షి ధర్మ రాజాదులకు చెప్పగా వారు తల్లికి, పెద్దతల్లిదండ్రులకును ఉత్తరక్రియలు చేసెను.

అట్లు ధృతరాష్ట్రుడెన్ని దుర్గుణములు మానవసైజములు గాగలవాడైనను దైవభక్తిచే, యోగశక్తిచే తపోయుక్తిచే నుత్త మగతులందెను.

స్వస్తిప్రజాభ్యః

# పాండురాజు

భారతమున నొక్కొక్కడొక్కొక్క నీతిని నేర్పుటకే పుట్టినట్లు కన్పడును. అది చారిత్రక గ్రంథమే యైనను ఆదర్శ పురుషుల చరిత్రను వర్ణించునదగుటచేతనే దాని కా గొప్పదనము వచ్చినది. తల్లిదండ్రుల తప్పు సంతానమున ప్రతిఫలించును. శక్తి యున్నను, పెద్దలయెడ వినయ విధేయతలు కలిగి యుండుటయే గొప్పదనము. మంచితనమనగా నదియే. శక్తి లేనందున పెద్దలకు లొంగినవాడు చేతకానివాడు, తెలిసితప్పు చేసినవాడు నగును. తాను గొప్పవాడనుకొని యని ఒకతప్పు చేసినచో అదే జన్మమునకు తీరనికళంకమగును. తద్ద్వారా దేహమే కోల్పోవలసి వచ్చును. అట్టినీతులను బోధించునది పాండురాజుపాత్ర. అతడు చాల మంచివాడు. నిష్కల్మషహృదయముతో అన్నగారిని రాజునుగా చేసి సేవించెను. పాండవుల కా పేరీతనిబట్టియే వచ్చినది.

శంతనునకు సత్యవతికిని పుట్టినవారిద్దరు కుమారులు, చిత్రాంగద. విచిత్రవీర్యులు, పెద్దవాడు పెండ్లికాకమునుపే చనిపోయెను. చిన్నవాడు పెండ్లియైనను సంతానము పుట్టక మునుపే గతించెను. సత్యవతీదేవి వంశ విచ్ఛిత్తి యగునని భయపడి, కాపాడుటకై తనకు పరాశరమహర్షి ప్రసాదమున జన్మించిన వేదవ్యాస మహర్షిని తలచుకొన్నది. అతడు వచ్చి నమస్కరింపగనే గ్రుచ్చియెత్తి తనకు వంశము నభివృద్ధిపరచు మని కోరినది. అతడొక యేడాదిపాటు నియమముతో

నున్నచో సంతానప్రాప్తియగునట్లు ప్రసాదింతునను. అత్తే పెద్దకోడలి నుంచినది. కాని యామె వ్యాసునిచూచి బెదరి కన్నులు మూసికొన్నందున గ్రుడ్డివాడైన బాలుడు జన్మించెను. భవిష్యత్తు నెరిగిన వ్యాసుడు గ్రుడ్డివాడు పుట్టునని తల్లితో చెప్పగా, ఆమె మరల నింకొకని ప్రసాదింపుమని వేడినది. అతడు కాదనక యంగీకరించెను.

అంబాలిక చిన్నకోడలు. ఆమెను నియమముపూని యుండుమని అత్తగా రాజ్ఞాపించినది. ఆమె పుత్రసంతానార్థనియై నియమము లాచరించినది. ఏడాది గడచినది. ఆనాటి రాత్రి ఆమె వెళ్ళి గదిలోపరుండియుండగా వ్యాసుడు వచ్చినాడు. అతనిని చూచుటతో ఏదో చెప్పలేని భయము కలిగి వెలవెలబోవుచు ఉండిపోయినది. అతడు తల్లికి మునుచెప్పిన రీతిగా నామెకు పుత్రసంతానమును ప్రసాదించెను. కాని అతడు వెలుపలికి రాగానే తల్లివచ్చి ఎట్టివాడు పుట్టునని యడిగినపుడు 'తల్లిదోషమువలన పాండు దేహుడు (తెల్లనిదేహముకలవాడు' పుట్టునని చెప్పుటతో నామె సంతసింపలేదు.

రోజులుగడచినవి. అంబాలిక ప్రసవించినది. పుత్రుని కన్నది. మునివాక్యము యథార్థమైనది. అతడు పాండురోగియైయున్నాడు. అందుకుతగినట్లె ఆ బాలునికి 'పాండువు' అని పేరిడిరి. అతడు మహర్షి ప్రసాదమున పుట్టినవాడగుటచే పాండురోగియైనను మహాబలశాలియై, తెలివికలవాడై పెరుగుచుండెను.

భీష్ముని యనుమతిపైననే సత్యవతి వంశాభివృద్ధికి పూనుకొన్నది. అతడు ప్రతిజ్ఞప్రకారము తనతమ్ముని కోడు

కుడైన ధృతరాష్ట్రి పాండవులతరఫుననే రాజ్యము సేయుచుండెను. వారికి జాతకర్మాది సంస్కారములు చేయుటయే కాక సకాలమున చక్కని గురువునుంచి వారికి విద్యాబుద్ధులు కరపుచుండెను. వారుకూడ అన్నివిద్యలను అతితక్కువ కాలముననే నేర్చి అందు నేర్పరులైరి.

ధృతరాష్ట్రుడెన్నివిద్యల నేర్చినను, గ్రుడ్డివాడగుటచే వక్తృత్వములోననే కాని ప్రయోగమున నతడు సమర్థుడు కాకుండెను. పాండురాజు పాండురోగము కలవాడైనను, అది శరీరసౌష్టవమునకుగాని, దేహదార్ఢ్యమునకుగాని అడ్డురానిదగుటచే మహాబలిష్ఠుడై నవయౌవనము వచ్చుటతో యౌవరాజ్యమునకు దగియుండెను. కాని భీష్ముడు ధృతరాష్ట్రునే యువరాజునుగా జేసెను. పాండురాజు శక్తియున్నను నీతిశాస్త్ర విశారదుడగుటయేగాక స్వతః మంచివాడగుటచే అన్నగారినే రాజుగా అంగీకరించెను.

అతని మంచితనమునకు, బాహుబలమునకును భీష్ముడెంతో ఆనందించెను. అతడు పెద్దవాడు. పెండ్లిచేసికొనక, తమ్ముల యోగక్షేమముల నరయదలచినవాడు. తమ్ములు పైవాద్యానష్టపోగా తనప్రతిననెరవేరునట్లు తమ్ముని కొడుకుల తరఫున రాజ్యమును రక్షించుచుండెను. తనకోరిక సఫలమగునట్లు తమ్ముని పుత్రులు పెరిగి పెద్దవారైరి.

వారికి పెళ్ళిళ్ళుచేయు బాధ్యత తనదే. మంచిసంబంధమునకై వెదకుచుండెను. ధృతరాష్ట్రునికి గాంధారరాజు కూతురగు గాంధారినడిగి స్వీకరించి పెళ్ళిచేయించెను. ఇక

రెండవవాడున్నాడు. వానికి పెళ్ళిచేయవలెను. ఎవరికన్యక సలక్షణమైనదా అని విచారణలుసల్పెను.

యాదవులలో శూరుడను రాజున్నాడు. అతనికూతుళ్ళలో పెద్దది పృథయనుకన్యక. ఆమె అన్నయే వసుదేవుడు. శూరుడు తనకుమేనత్త కొడుకైన కుంతిభోజుడు సంతానము లేక తనను ప్రార్థించగా కూతురైన పృథను అతనికి కానుకగానిచ్చెను. అతడామెను తీసికొనివెళ్ళి ప్రేమతో పెంచుకొనుచుండెను.

కుంతిభోజుడు ధర్మాత్ముడు. వచ్చినవారికెల్ల కొదవ కుండ పెట్టుటయే అతనిపని. అందు భోజనములు పెట్టుట, సేవలుసేయుటకై పృథను నియోగించినాడు. ఆమెయెంతో ఓర్పుతో ఎవరికేమికావలెనో కనుక్కొని జాగ్రత్తగా శ్రద్ధాభక్తులతో మృష్టాన్నములు పెట్టెడిది.

ఇట్లుండగా నొకప్పుడాతని యింటికి దుర్వాసుడను మహర్షి వచ్చెను. అతడు పరమకోపనుడని అందరు నెరుగుదురు. కాని సంతోషించెనా అంతటి మంచివాడు మరిలేడు. అతనికి సేవలు చేయుటకై కన్యయైన పృథను నిదేశించినాడు కుంతిభోజుడు. ఆమె అంగీకరించినది. మహర్షుల నారాధించుటకై కన్యలనే ఫురమాయింతువారు. వారిసేవలకు మెచ్చుకొనెనా ఋషీశ్వరులు వరము నిచ్చి మెచ్చుచుండువారు. వరము లక్కరలేనిదెవరికి? అందుచేతను వృద్ధునికి కావలసిన వారు కన్యలు. రాజులు బహువ్యాపకములు కలవారు. ఏ పని మీదనో యుండి కర్మము చాలక మహర్షిమాట మరచిరా, వారు అగ్గిమీద గుగ్గిలమై కోపించు స్వభావము కలవారు.

అందుచే కూడ కొంతజంకి పిల్లల కొప్పజెప్పినారు. అట్లే దుర్వాసుని సేవచేయుటకు కుంతి కప్పగించినాడు.

ఆమె చాల నెమ్మదిగలది. దుర్వాసుని మనస్సునకు నచ్చునట్లు పరిచర్యలు చేసినది. ఆ చేసినదెన్నాళ్ళన్నది ప్రశ్న కాదు. ఒక్కపూటయే కానిండు. అతడు సంతోషించినాడు. 'అమ్మాయీ! నీవుచేసిన సపర్యకు మెచ్చితిని. నేను నీకొక్క మంత్రము చెప్పుదును. దీనివలన నీ వేదేవతను తలచుకొందువో అతడు వెంటనేవచ్చి నీకు పుత్రుని ప్రసాదించును' అని చెప్పి మంత్రోపదేశముచేసి వెళ్లిపోయెను.

ఆమె వయసు వచ్చినదైనను చిన్నపిల్లయే, కన్నెపిల్లయే. ఆమె కా మంత్ర మేపాటి పనిచేయునో చూడబుద్ధి వేసినది.

ఒక్కనా డేకాంతముగా గంగానదికి వెళ్ళినది. కాళ్ళు మొగముకడిగికొన్నది. మంత్రమునుజపించినది. సూర్యుని కర్ఘ్యమిచ్చుచు సూర్యునిచూచి, పరిహాసముగా 'ఓ సూర్య భగవానుడా! నాకు నీవంటి పుత్రునిమ్ము!' అని కోరి నీరు వదలినది.

మంత్రమెట్లు వృథాపోవును? సూర్యభగవానుడు ప్రత్యక్షమైనాడు. తీవ్రత్వము తగ్గి చల్లని శరీరముతో, దర్శనీయంబగు కాంతితో ఎదుట నిలువబడినాడు. ఆమెకు భయమువేసినది. అంతవరకు పురుషుని మొగమెరుగని కన్నెపిల్ల ఏదోమంత్రమును పరీక్షింప దలచి రమ్మన్నది. అంతలో వచ్చినా అనుకొన్నది. కాని అతడు పిల్చుటతో తడవుగా

వచ్చి ప్రాలినాడు. ఇప్పుడేమని పల్కరింపవలెను? ఆమె కర్త వ్యమెరుగక దడదడలాడుచున్నది.

సూర్యుడు 'తరుణీ! భయపడకుము. నీకోరినవరమిచ్చి తిని' అని ప్రసాదించెను. కుంతికి సిగ్గువేసినది. తలవంచు కొన్నది. 'దేవా! నా కోర్కముని మంత్రముపదేశింపగా దానిశక్తి నెరుగగోరి తమ్ముపిల్చితిని. నా అపరాధమును సహింపుడు. తెలివిలేక నేచేసిన తప్పును క్షమింపగోరుచుంటి నని మ్రొక్కినది. సూర్యుడు 'నీకు మహర్షి యిచ్చిన వరమెరు గుదును. మంత్రశక్తియు నెరుగుదును. కాని నా దర్శనము వృథాకాదు. నీ యిష్టమేమో చెప్పుము, చేయుదును' అనెను.

అప్పుడా కుంతి 'మంత్రశక్తి నెరుగగోరి యిట్లు చేసి తిని. అదిగాక కన్యకు గర్భమువచ్చినచో తల్లిదండ్రులును, చుట్టములును, పురజనులును నవ్వరా? అందుచే కరుణింపుము' అనుటతో సూర్యుడు 'నీకు సద్యోగర్భమున పుత్రుడుపుట్టును. కాని అందువలన నీ కన్యాత్వముపోదు' అని వరమిచ్చి అం తర్థానమయ్యెను.

ఆమెకు వెంటనేగర్భము వచ్చినది.కుమారుడుపుట్టినాడు. ఆ బాలునికి పుట్టుకతోడనే కవచకుండలములు వచ్చినవి. బాలుని చూచుటతో నామెకు సహజమైన మాతృప్రేమవచ్చి నది. ఎంతో విచారించినది. అతని నింటికి తీసికొనిపోయి నచో అపవాదు కల్గును. అది తనకేకాదు తల్లిదండ్రులకును తీరని కళంకమగును. ఆ బాలునక్కడే విడిచిపోవుటకును మన సొప్పుటలేదు. ఆమె విచారించుచుండగా సూర్యుడు పంపగా ఒక పెట్టె ఆ గట్టునకు వచ్చి చేరినది. ఆమె కానందము కల్గినది.

అందులో బాలుని పెట్టి కుంతి యేమియు నెరుగనట్లు ఇంటికి వచ్చి చేరినది.

ఆపెట్టె యొక సూతరాజునకు దొరికినది. అతడు పెట్టె తెరచి అందులోనున్న బాలుని జూచి సంతానము లేని వాడగు టచే ఆనందముతో తీసికొని వెళ్లి భార్యయైన రాధకిచ్చెను. ఆమె నా బాలుని జూచుటతో ప్రేమపుట్టి పాలువచ్చినవి. వారిద్దరును మిక్కిలి ప్రేమతో అతనిని పెంచిరి. పెట్టెలోనున్న డబ్బుతోపాటు దొరికినందున 'వసుషేణు'డనియు, కర్ణుడనియు రాధేయుడనియు నా బాలునికి వ్యవహారనామము లయ్యెను.

కుంతిభోజున కదేమియు తెలియదు. భగవంతుని యనుగ్రహముచే నామె కేవిధమైన వికారములును కల్గలేదు కదా! ఎట్లు తెలియును? అతడు పరిపాటి ప్రకారము కుంతీ దేవికి స్వయంవరమును చాటెను.

అచ్చటికెందరో రాజకుమారులు వచ్చిరి. పృథ పాండు రాజు గుణగణములను విని అతనిని తనకు తగిన వరునిగా నెన్నుకొనెను. అత డామెను వివాహమై భీష్మున కానందమును కల్గించెను.

తరువాత కొన్నాళ్లకు మద్రదేశపు రాజుకూతురు మాద్రియను దానికి స్వయంవరముకాగా పాండురాజక్కడికేగి భీష్ముని యనుమతిని నామెను కూడ వివాహమయ్యెను. ఆ యిద్దరు భార్యలతోను పాండురాజు సుఖించుచుండెను.

మహారాజు కేవల భోగములకు పుట్టినవారు కారు. వారు రాజభోగములతో కూర్చున్నచో పరరాజులు వచ్చి ఉన్న రాజ్యమును కాజేయుదురు. అందుచే తమ పరాక్రమ

మును రాజులకెల్ల గడు తెలియునట్లు చేయవలెను. దానికై దిగ్విజయము చేయునారు. ధృతరాష్ట్రుడు మహాపరాక్రమశాలియైనను కన్నులు లేనివాడైనను గ్రుడ్డివాడగుటచే రాజుగాను జయింపలేడు. నీతి శాస్త్రవిషయములు చెప్పగలడు. పాండురాజు రాజ్యమేలుటకు సమర్థుడయ్యెను. కాని రాజ్యము పెద్దగారిపేరు మీదనే చేయుచుండెను. సింహాసనముపై పెద్దగారినే కూర్చుండబెట్టి తానే తక్కిన యుద్ధాది కార్యములను చేయుచున్నను పేరు ధృతరాష్ట్రునిదే. ఒకవైపు భీష్ముడు, మరొకవైపు పాండురాజు ధనుర్ధరులై యుండగా, తగినసలహాలనిచ్చుటకు విదురుడుండగా లోటేమి కల్గును!

పాండురాజు దిగ్విజయము చేయదలచెను. చతురంగ బలమును సన్నద్ధము చేసెను. ధృతరాష్ట్రుడు అంగీకరించినాడు. భీష్ముడనుమతించినాడు. సేనా సముదాయము కదలుచుండ ఆదిశేషుని తల బరువుచే వంగినది. సేనల తాకిడికి శేషుని పడగలపై నున్న రత్నములు క్రిందికి రాలినవి. ఆరథములను, ఏనుగులను చూచిన జనులు మేఘములెక్కడ బయలుదేరినవా అనుకొనుచుండిరి. పాండురాజిట్లు తన బాహుబలమును చూపుటకై జైత్రయాత్ర ప్రారంభించెను.

మహారాజులు దిగ్విజయము చేయునప్పుడు తూర్పు దిక్కు మొదలు ప్రదక్షిణక్రమముగా చేయుచుందురు. అట్లే పాండురాజును జైత్రయాత్ర సాగించెను. అతని ప్రతాపమతనికి ముందు నడచినది. తరువాత సేన నడచుచున్నది. అతని ప్రతాపమును వినుసరికే శత్రురాజులు లల్లలనాడిరి. కొందరు ఆతని బలమును చవిచూచి దాసోహముచేసిరి. కొం

దరు చేతులుకాలిన తర్వాత ఆకులుపట్టుకొనుటకు పాత్రులేక ముందుగనే ఏనుగులు, గుఱ్ఱములు, మణులు, మాణిక్యములు ధనకనక వస్తువాహనములు, పలాసనులు మున్నగు వస్తుసంప దలను కానుకలుగా తీసికొనివచ్చి అతని పాదముల నాశ్రయించిరి. శరణాగతులైన రాజన్యులను క్షమించి వారిచ్చినకానుకల నంది పాండురాజు దిగ్విజయముచేసి యింటికిచేరెను.

సముద్రము హద్దుగాగల సకల భూమండలములోను అతనికి కప్పముకట్టని రాజులేడు. కానుకలు రాసులురాసులుగా వచ్చి చేరినవి. వాటినన్నిటిని అతడు అన్నగారగు ధృతరాష్ట్రునకు అర్పించెను. అతడు తమ్ముని సౌభ్రాత్రమునకు చాల సంతోషించెను. అతడుతప్ప మరెవడు శ్రద్ధాళువైన అన్నగారికి కానుకలిచ్చి చెప్పుచేతలలో నడచును?

ధృతరాష్ట్రుడు 'నాయనా! ఆ ధనము నీదే అయినను నా కర్పించితివి. నాకు దానితో ఏమున్నది? మన తాతగారగు భీష్మునకిమ్ము. సత్యవతికిమ్ము. మన తల్లులకిమ్ము. విదురునకు, ఇంకను మిగిలిన ఆప్తవర్గమునకు నిమ్ము. నీకు తోచినట్లుగా దానధర్మములు చేయుము' అని అనుమతించెను. పాండురాజన్నగారు చెప్పినట్లుగా ధనము నంతను భీష్మాదుల కిచ్చి దానధర్మములు చేసెను. వా రెన్నోరీతుల నాతని దీవించిరి.

ఐకమత్యమే బలమన్నది వేదవాక్కుగదా! పాండురాజు అన్నగారిని అశ్వమేధయాగములు చేయుమని ప్రోత్సహించెను. అతడు 'నా కెట్లశ్వమేధము చేయ వీలుపడు'నని వాపోవగా తానుండుననని ధైర్యముచెప్పి అన్నచే నొక వంద

యశ్వమేధములు చేయించెను. అం దేలోపము కల్గకుండ తానశ్వరక్షకుండై పాలించెను. ఋత్విక్కులను యథాశాస్త్రముగా దక్షిణలిచ్చి తనిపెను.

పాండురాజందరికి సన్మార్గము మంచిపనులు చేయుచు మనందరిని మెప్పించెను. వినయవిధేయతలు, మృదుసంభాషణలు పెద్దగారికెంతో ప్రీతికల్గినది. కోరినపనులనెల్ల సానుకూలము చేసి సమీపమున బంధువుల కాతనిపై హితవు కల్గెను. అనుకూలుడై ఆపదలం దాదుకొనుటచే అతడు స్నేహితుల కాప్తుడయ్యెను. విద్వాంసులకు శిష్టమును గుర్తించి బహూకరించుచుటచే హితుడయ్యెను. దిక్కులేనివారలకు అన్నివసతుల తానే చేకూర్చియుండుటచే ప్రీతిపాత్రుడయ్యెను. రాజనీతి ననుసరించుటచే తక్కినరాజులకు గౌరవనీయుడయ్యెను. జనులందరు నాతని 'ఆహాహా! పాండురాజు సకలసద్గుణసమేతుడు; ధనికుడు, శూరు రాజు, పూర్వమున్నగు ప్రాచీనరాజన్య శ్రేష్ఠులను మించినాడని' మెచ్చుకొనిరి. దుష్టశిక్షణ, శిష్టరక్షణలున్నవని చెప్పనక్కరలేదు. బ్రాహ్మణుల నాతనివద్ద దానముపట్టనివాడుగాని, దరిద్రుడుగాని లేనేలేడు.

పేరునకు ధృతరాష్ట్రుడు రాజుగాని, రాజకీయ వ్యవహారముల జక్కగా జూచువాడుమాత్రము పాండురాజే యగుటచే, ప్రజలకందరికి నాతనిపై నెంతో ప్రీతికల్గినది. ప్రజాదరణపాత్రుడై అందరిచేతను మంచివాడనిపించుకొని అతడు రాజ్యమేలుచుండెను.

చిన్నప్పుడు చదువుకొనుట, యౌవనమున, ఆ విద్యను ప్రయోగించుటయు ముఖ్యములు. అర్థమనగా ప్రయోజనము.

దానిని సాధించుటయే పౌరుషము. కామమనగా కోరిక. తినవలెనని కాని, వినవలెనని కాని యున్న కోరికలన్నియు కామములే. వినోదములెన్నోయున్నవి. ప్రధానకార్యమున మనస్సు విసుగుచెందినప్పుడు మనస్సును పునస్స్వస్థీకరణమునకై, వినోదములు పుట్టబడినవి. కాని కొందరవివేకులు వాటినే ప్రధానముగా జూచుకొందురు. అది అన్నమునుమాని కూరను తిన్నట్లుండును.

వినోదములలో కొన్ని యెప్పుడును బాధించనివున్నవి, కొన్నియెప్పుడును బాధించునవే. అందు మొదటివి త్రాగుడు. జూదము, వేట మున్నగునవి. వాటినెల్లప్పుడును విడువవలెనని నీతిశాస్త్రము లన్నియు నుద్ఘోషించుచున్నవి. కాని వదలలేక రాజులు రాజనీతిశాస్త్రరీత్యా అవి దుష్టములుకావని సమర్థించిరి. కాని అది సమర్థనేయగును కాని సరియైన దెన్నటికైన కాగలదా?

పాండురాజునకు వేటయనిన పరమప్రీతి ఎంత చదువరియైనను వ్యసనమునకు లోను కాకుండ నుండలేడు. అది అలవాటులో లేని వారలు ఆ చెడుమార్గమును మానుమని యెన్నో విధముల బోధింతురుగాని వ్యసనాభిష్టులు మాత్రము మానలేరు. వారికా వ్యసనము నవలంబించుటయే ధర్మమనియు, దానికెట్టివిధమైన దోషము రాదనియు తోచును. వ్యసనములచే కలుషితమైన మనస్సులందు నిష్కల్మషమైన విషయము లెట్లు గోచరించును?

రాజులకు వేట ముఖ్యమైనదిగా దోషములేనిదిగా చెప్ప

బడినది. ధనుర్విద్యా కౌశలంబునకు వేటయే గీటురాయి. వేటాడ లేనివాడు రాజుల నెట్లు జయింపగలడు?

అన్నగారి యనుమతిపై పాండురాజు వేటకై హిమవత్పర్వతమునకు దక్షిణపు ప్రక్కనున్న అరణ్యములకు భార్యలతో సహా వెళ్ళెను. వారును పురాంగనలు వేటయనిన వారికిని ప్రీతియేమో? కాక అరణ్యములో భర్తలతోనుండి, ఆడ యేనుగులతో కూడి విహరించు మదపుటేనుగువలె విహరించ దలచెనో? విలాసములకు హద్దేమున్నది? రూపమేమున్నది? ఎవరికెప్పుడెట్లు తోచిన అట్లేకదా! ఇష్టమువచ్చిన ట్లా దంపతులు విహరించుచుండిరి. ధృతరాష్ట్రుడు రాజభటులచే వారికి కావలసిన భక్ష్యభోజ్యాది అన్నపానీయములను వేళకు పంపించుచుండెను. వాటి నారగించుచు యథేచ్ఛముగా వారు కాలము వెళ్లించుచుండిరి.

ఒకనాడు పాండురాజు వేటకై బయలుదేరెను. అడవి యంతయు కలయదిరిగెను. ఒక్క మృగమైనను అతనికి కన్పడ లేదు. అదేమి కర్మమో నాడా అరణ్యములో మృగములకే కరువువచ్చెను. తిరుగగా తిరుగగా జంటకూడియున్న లేడి జంట కనుపించినది. వెంటనే మహాసంతోషముతో నతడా రెంటిని బాణములతో కొట్టెను. రెండును పడిపోయినవి. అందులో ప్రాణావశిష్టమైయున్న మగలేడి మనుష్యవాక్కులతో నిట్లనెను.

'ఓ రాజా! నేను కిందము డనుమునిని. ఇచ్చట నా భార్యతో కూడి తపస్సు చేసికొనుచుంటిమి. మా కన్నుల యెదుట మృగములు కలియుచుండుట చూచిచూచి, ఆ రీతిగా

కలియగోరితిమి. జనసంచారము లేదుకదా యని యిక్కడ నిర్భయముగా మేమిద్దరము పోరూపము ధరించి కలిసి కొనుచుండగా నీవు మమ్ము కొట్టి మాయానందమును భగ్నము చేసితివి.

అదికాక మృగముల వేటాడుట రాజులకు దోషము కాకపోయినను, పసుగ త్తలేనిదానిని, పెంటితో కలిసియున్న దానిని, ప్రసవించుటకు సిద్ధముగా నున్నదానిని, రోగముతో నున్నదానిని చంపరాదు. వేటయే నిత్యజీవికగా నడచుచు. మాంసము నమ్ముకొని బతికెడి ఎరుకలైనను అట్టివాటిని చంపరు. ఇక ధర్మమునకు పేరుపడిన భరతవంశమునపుట్టి, ప్రజలను న్యాయమార్గములపెట్టవలసిన నీవు ధర్మము తప్పి మెలగుట న్యాయమా? నీ వెరుగని రాజధర్మములు గలవా? ఇదేనా నీవు పాటింపవలసినవి?' అని తన బాధనైనను గుర్తింపక హితబోధచేసెను.

పాండురాజు ధర్మమునెరిగినవాడైనను కాలవశమున న్యాయముతప్పి, తప్పుచేయుటయేకాక అతఁడిగినదానికి విప రీతముగా జరిగినది చెప్పనారంభించెను. తన్ను నిందించి నందునఅతనికి కోపమువచ్చినది.

'మునీంద్రా! నీవుచెప్పినదంతయు నిజమొట్లగును? శత్రువులను క్షమించినను మృగములను మాత్రము సహింపరు నమ్మించి చంపకూడదు: మాయారూపములోనైన చంపరాదు. కాని నిజబలమున చంపుటదోషముకాదు. పూర్వము అగస్త్య మహర్షి మృగమాంసముతో నిత్యశ్రాద్ధముచేయుచు, రాజులకు

మృగవధ దోషములేదని శాసించెను. కావునఇది దోషమనుటకు చెల్లదు' అని పల్కెను.

మృగమునకు బాణపుదెబ్బగట్టిగాతగిలినది. ఆబాధ సహింపరానిది గానుండును. బాధసహింపరానిదిగా నున్నప్పుడు శాంతమునకు తావుండదు. ఆమహర్షి విపరీతమైన బాధచే దుఃఖించుచు 'రాజా! సర్వప్రాణి సాధారణమైన ఇష్ట సుఖ సమయమునయున్న మమ్ము, నిరపరాధులను చంపితివి నీవును భార్యతోకలిసి నప్పుడు చనిపోదువు. నీభార్యయు నీతోసహగమనముచేయును! అనిశపించి చనిపోయెను.

అప్పుడు పాండురాజునకు విచారముకలిగినది. తాను ధర్మనిర్ణయము చేయబోయి వాదించినాడు. ఆవాదన యెవరికి కావలెను? ఒకమూల ప్రాణముపోవుచున్నది. ఇకనిర్ణయము మాట దూరముగానుంచి మహర్షిశపించి వెళ్ళినాడు. ఇంకొక్కక్షణము సేపతడు బ్రతికియుండినచో శాపమునకు విమోచనము ప్రార్థించునేమో? తానుచేసినపనికి ఫలితము వెంటనే కనిపించినది.

'అయ్యో! ఎట్టిమంచికెలమునపుట్టిననేమి ప్రయోజనము మంచిచెడ్డలనెరుగగలజ్ఞానమున్ననులాభములేదు పురాకృతకర్మ ములనుభవింపకుండపోవు ఎంతగొప్పవానికిని కర్మఫల మనుభ వింపకతప్పదు గదా! నాతండ్రి కామమోహితుడై సంతానము లేకయే పరలోకమున కేగినాడు. నేను మహర్షి దయవలన పుట్టినవాడనై యుండియు నాకిట్టి చెడుబుద్ధి యేలకల్గవలెను? ఇక నాకు మునివృత్తియే నాకుగతి. అందును ఎట్టిపరిస్థితుల యందైనను హింసను తలపక, సర్వభూతములందును సమచిత్తు

మన్నై ఒకొక్కచెట్టుదగ్గర నొకొక్కరోజున ఫలభిక్ష సేయుచు, అట్లుదొరకనినాడు భోజనములేక యుపవాసము చేయుచు వనవాసము చేసెదను. ఇక నాజీవితశేషమును గడుపవలసినదే. అంతేకాదు, ఒకచెట్టుమొదట కూర్చుండి, ఒడలంతయు బూడిదకొట్టినను చలింపక, సుఖదుఃఖములు, రాగద్వేషములు, శీతాతపములు మున్నగు ద్వంద్వములను సహింతును. ఇంద్రియవ్యాపారములను మాని మనస్సును నిబ్బరపరచి తపము చేయుదును' అని తన కర్తవ్యమును నిశ్చయించుకొనెను.

అడవిలోనే యున్నారుకదా అతని యిద్దరుభార్యలును వారివద్దకేగి వారితో తనకు జరిగిన శాపమునుచెప్పెను. 'నే నిందుకు ప్రాయశ్చిత్తముగా ఘోరతపస్సు చేయదలచితిని. మీరలిక్కడనేయుండి బాధపడక హస్తినాపురమున కేగుడు. అక్కడ మాఅన్నతోను, విదురునితోను నా పరిస్థితిని చెప్పుడు మీర లక్కడనే జీవితశేషమును గడుపుడు' అనెను.

ఆ మాటలు వినుసరికి వారికి కన్నులనీరు తిరిగినది. వలవల యేడ్చుచు 'నాథా! నిన్నువిడచి మేము బ్రతుకజాలము. నీకు విరక్తి కల్గినంతమాత్రమున మాకు కలుగలేదుకదా! అందుకై మీ నిశ్చయమునకు బాధలేకుండునట్లు మా కోరిక నెరవేరునట్లు ఘోరతపస్సుమాని మాతోకలిసి వానప్రస్థముగా తపముసేయుము. అట్లు కాదన్నచో మే మిచ్చటనే చత్తుము. కాని యింటికిమాత్రము పోము' అని గట్టిగా చెప్పిరి.

అతనికి వారి నిశ్చయము తెలిసినది. ఇక తానైన వారిత్రోవలో కలియవలెను, వారైన తనత్రోవకురావలెను.

వారికి వినరు. అందుచే తానే వారిభావముతో కలిసి వారితో 'నేను మీరుకోరినట్లు వానప్రస్థము నవలంబింతును. జటా వల్కల ధారినై ఉదయము మధ్యాహ్నము స్నానముచేసి అగ్నిహోత్రముచేసికొనుచు కందమూల ఫలములతోనే పితృ తర్పణము చేయుచు క్రమముగా దేహ విముక్తి కలుగునట్లు చేసెదను. మీరలును దాని కనుకూలముగా మెలగుడు' అని చెప్పి యొప్పించెను.

భటునిద్వారా అతని నిశ్చయమును ధృతరాష్ట్రునకు తెల్పెను. బ్రాహ్మణులను రప్పించెను. వారికి తనదిగానున్న ధనమును కనకము,నగుబ్బములను, ఏనుగులను, గోవులమంద లను సమృద్ధిగా దానముచేసెను. ఇంకను మిగిలినవాటిని అన్న కప్పజెప్పెను. దానితో అతనికి మమకారము పోయినది. అరణ్యప్రయాణమును సిద్ధముచేసెను. కుంతీ మాద్రు లిరువు రును జటావల్కములను ధరించి మమకారమును వదలి, భర్త ననుసరించియుండు బుద్ధితో అతని ననుసరించిరి, వారు ముం దుగా భర్త కెదురాడినది పాతివ్రత్యముచేతనే కాని మరొకటి కాదు. వారుకూడ భర్తననుసరించి జప తపో నియమము ల నాచరింప దలచిరి. భర్తతో కలిసి యెక్కడ నున్నను సుఖముగనే యుండును. కాని భర్తనువీడి యొకాకులై అత్తిం టనుండి యేమి సుఖమనుభవింతురు?

పాండురాజు ముని నియమముపట్టి భార్యలతోకూడి వానప్రస్థాశ్రమ స్వీకారముచేసి యుత్తరముగా వనముల కేగెను. నాగశైలము, చైత్రరథము, హిమవంతము అనెడి పర్వతములదాటి యుత్తరముగా నేగి గంధమాదన

పర్వతముపై కొంతకాలము తపముచేసెను. అది దేవతలు సిద్ధులచే వ్యాప్తమైయున్న పవిత్రభూమి. అక్కడ మహా నిష్ఠతో కొంతకాలము నియమములాచరించెను.

అక్కడినుండి యింద్రద్యుమ్నమను సరస్సునకేగెను. అక్కడకొంతకాలముండెను. దానికి నుత్తరముగా హంసకూటమను పర్వతమున్నది. అక్కడను కొంతకాలముగడిపి శతశృంగమను పర్వతమునుచేరెను.

అది పవిత్రమైన పర్వతను. ఎత్తైన వందశిఖరములుంటచే దానికాపేరువచ్చినది. అక్కడ యతులు మునులునెందరో యున్నారు. వారిసహవాసమున పాండురాజునకు తపోనియమవిశేషములు తెలిసినవి. సిద్ధులు, యక్షులు, దేవతలునా పర్వతముమీందికివచ్చి విహరించుచుందురు. వారెల్లరును కొనియాడునట్లు పాండురాజు తపస్సుచేయుచుండెను. అతని తపస్సుచూచి మహర్షులెల్లరు మెచ్చుకొనిరి. అతడు బ్రహ్మర్షిసమానుడైనాడు.

ఆదారినే అనేక దివ్యవిమానములు వెళ్ళుచుండెడివి. దేవతలు నిత్యము సంచారములు చేయుచుండిరి. ఆ మార్గమునసే చాలమంది మహర్షులు త్తమగతిపొంది బ్రహ్మలోకమునకేగుచుండిరి. వారినిచూచి పాండురాజు 'అయ్యా! మీరెచ్చటికి వెళ్ళుచుండిరి?' అని అడిగెను.

ఆఋషులు 'రాజా! ఈరోజున అమావాస్య. నేడు బ్రహ్మదేవుని సేవించుటకై లోకములోనున్న పితృగణములు దేవగణములు, ఋషిగణములు నేతెంతురు. అక్కడ పెద్ద సభ జరుగును. అందుపాల్గొనుటకై వెళ్ళుచుంటిమి' అనెను.

అదివిని పాండురాజు తానుకూడ బ్రహ్మసభను జూడగోరి భార్యాద్వయముతోకూడి వెళ్ళుచుండెను. అది మిట్టపల్లములు గానున్నది. అయినను అతడు శ్రమయనితలపక వారివెంట వెళ్ళుచుండెను.

శ్రమపడుచున్న రాజదంపతులను జూచి ఋషులు 'రాజా! మీసుకుమార దేహములుఈ గహనప్రదేశమును నడువలేవు కాక యిది దేవమార్గము. ఊరిక రారాదు. నిలువుడు' అనిరి. అదివిని పాండురాజు వారిభావము గ్రహించెను.

'అయ్యా! స్వర్గద్వారము సంతానము లేనివారికి చేర రానిది. మహాత్ములైనను అనపత్యులైనచో వెళ్ళలేరు. 'అపుత్రస్య గతిర్నాస్తి' (పుత్రులులేనివారికి గతిలేదు) అను వేద వచనమున్నది. నేను పుత్రులు లేనివాడను. ఏమిచేయుదును! ఇకముందునకు రాలేను' అని వాపోయెను.

అతని మాటలు వినుటతో ఋషులకు జాలివేసినది. యోగదృష్టితో రాజుపుత్రసంగతిని జూచిరి. రాజుతో 'నీవు సంతానము లేనివాడవుకాదు. నీకు దేవతల వరమువలన నీకైదుగురు పుత్రులు పుట్టుదురు. నీకక్షయలోకములు కల్గును. కాన సంతానమునకై ప్రయత్నముచేయుము' అని పల్కిరి.

వారిమాటలు వినుటతో పాండురాజున కెక్కుడలేని విచారమును కల్గినది. 'పుత్రునికి పుట్టుకతోనే మూడుఋణము లుండును. అవి దేవ, ఋషి, పితౄఋణములు. వేదాధ్యయనము వలన ఋషిఋణమును, యజ్ఞములుచేసినందున దేవఋణమును పుత్రసంతానముచే పితౄణమును తీరును. నాకు దేవర్షి ఋణ

ములు తీరినను పితృ ఋణము తీరునట్టి యుపాయములేదు. ఎట్లో ఏమో!' అని దుఃఖించెను.

సుఖముగాని దుఃఖముగాని భార్యాభర్తలలో నొకరితో నొకరు చెప్పుకొన్నచో కొంతబాధతగ్గును. ఆనందము హెచ్చును. పాండురాజు తనకుకల్గిన విచారమును పెద్దభార్య యగు కుంతితో చెప్పెను. 'ఎన్ని దానములు, వ్రతములు, యజ్ఞములు చేసినను సంతానములేనివారికి ఊర్ధ్వలోకగతులురావు. నాకు మృగశాపమువలన సంతానము కల్గునట్టి యవ్వార్త లేదు కదా! నీవు నాకు న్యాయమైన సంతానము కల్గునట్లుచేయుము. సంతానము లేకుండ బ్రతికినను, చచ్చినను సమమే. ఇహ - పరము లుండవు. కావున ధర్మమార్గమున సంతానమును పొందుము.

పుత్రులు పన్నెండు రకములు: అందు ఔరసుడు (తనకు కల్గినవాడు) క్షేత్రజుడు ధర్మమార్గమున తన భార్యకు పుట్టినవాడు) దత్తకుడు (ఉదకదానమునకై మరొకరిచే నియ్యబడినవాడు) కృత్రిముడు(తల్లిదండ్రులవీడి తిరుగు వానిజూచి తెచ్చి పెంచినచో వాడు )గూఢోత్పన్నుడు (తన భార్యయందు పరపురుషునికి, ఎవనికో తెలియకపుట్టినవాడు) అపవిద్ధుడు (తల్లిదండ్రులచేవిడువబడి మరొకనిచే చేకొనబడినవాడు) అను నార్గురు పుత్రులును బంధువులు, భాగస్వాములు నగుదురు. మరి కానీన (కన్యకగా నున్నప్పుడు పుట్టినవాడు) సహోఢ గర్భములో నుండగా పెండ్లియాడగా తరువాత పుట్టినవాడు) క్రీత (కొన్నవాడు) పౌనర్భవ (రెండవపెండ్లియాడిన యామె బిడ్డలు), స్వయందత్త (తల్లిదండ్రులు లేక కాని, విడిచి కాని

తనకు తాను కొడుకుగానిచ్చుకొన్నవాడు), జ్ఞాతులు(అన్నదమ్ములపుత్రులు) అను నార్గురు పుత్రులును భాగస్వాములు కానేరరు. మొదటి తెగలోనివారు ఔరసునకు తీసిపోరు. అందులోను దేవర న్యాయముగా కనినవా డుత్తముడు. కావున నా యాజ్ఞానుసారము నీవు క్షేత్రజులను కనుము. నీ చెల్లెలు శ్రుతసేన భర్తయైన శారదండాయని యనుజ్ఞచే ఋతుస్నాతయైన తరువాత బ్రాహ్మణ వరుమువలన సంతానముకన్నదికదా! అది ధర్మ్యము, న్యాయ్యముకాన నీవుకూడ సంతానమును కనుము' అనెను.

అది విని కుంతి 'నాథా! మేము ఎట్టి పతివ్రతలమో నీ వెరిగియుండియు నిట్టిపనికి నియోగించుట న్యాయముకాదు. కలలోనైన పరపురుషుని తలపనిమేము పరపురుషు నెట్లు కూడగలము? పూర్వము వ్యుషితాశ్వుడను మహారాజు చనిపోయియు భార్యకోరికపై నామెను కలిసి సంతానము కలిగించెను. కావున నట్లే నీవును మాయందు సంతానము పొందుము' అన్నది.

అప్పుడు పాండురాజు 'పూర్వము స్త్రీలు నియతమైన భర్తలేక, పురుషులు నియతమైన భార్యలేక మెలగుచుండెడివారు. ధర్మము సర్వప్రాణి సాధారణమై యుండెడిది.

ఆకాలములో శ్వేతకేతునితల్లి, ఉద్దాలకునిభార్య, మహాపతివ్రతగా నుండెడిది. ఆమె ఋతుస్నాతయైయుండగా ఒక వృద్ధవిప్రుడువచ్చి పుత్రునికోరి కామించెను. అది శ్వేతకేతునకు హితవులేకపోయినది. అతడు కోపించి 'ఇది మొదలు స్త్రీలు పరపురుషుని కోరరాదు. పరపురుషసంగమమున సకల

పాతకములును చుట్టుకొనును. ఒకరి భార్యలైనవారలు వానికే కాని మరొకని కోరరాదు. ఇది మర్యాద (నిబంధన) చేసితిని. ఇదందరకు మనుష్యులకును చెల్లును' అనెను. నాటినుండి అది ధర్మమై చెల్లుచుండెను. తిర్యగ్జాతులలోను, ఉత్తర కురుదేశములలోను మాత్రము పూర్వపుటాచారమే నడుచుచున్నది. అప్పటినుండి స్త్రీలు తమ భర్తలందు మాత్రమే భక్తిగలిగి పతివ్రతలై మెలగుచుండిరి. వారు భర్తయనుమతిని మీరరాదు. అదియు దోషమే. భర్త కెరుకలేక చేయరాదుకాని భర్తయాజ్ఞపై చేయవచ్చును. అట్లు కల్మాషపాదుని భార్యయైన మదయంతి వసిష్ఠుని వలన అశ్మకుడను పుత్రుని కన్నది కదా! వేదవ్యాసునివలన మేము కల్గితిమికదా! కావున నా యాజ్ఞానుసారము పుత్రులజూడగోరుచున్నా' నను' అనిదీనముగా నామె కేసి చూచి వేడెను.

ఆమె మనసునకునచ్చినది. అప్పు డామె తనకు చిన్నతనమున దుర్వాసమహర్షి యిచ్చినమంత్రమును, దాని ప్రభావమును చెప్పెను. ఇప్పుడు దాని ప్రభావముచేనే దేవతనైనను రప్పింతునని చెప్పెను. అందుకు పాండురాజు మహానందమున నంగీకరించెను.

ఆమె ఒకనాడు నిష్ఠనోనుండి యేదేవతనారాధింతునో యాజ్ఞనిమ్మనెను. పాండురాజు 'ఎల్లలోకములును ధర్మమునందే నిలిచియుండును. కాన ధర్మదేవతయగు యమధర్మరాజు నాహ్వానింపుమనెను. ఆమె భర్తకోరినప్రకారము నియమమును పూని యథావిధిగా మంత్రమును జపించెను.

అంతట యమధర్మరాజు యోగశరీరముతో వచ్చి యామెకు ప్రత్యక్షమై ఏమికావలెనో కోరుకొమ్మనెను. ఆమె పుత్రుని కోరినది. అట్లే యతడు ప్రసాదించినాడు.

ఆమె గర్భవతియైనది. సంవత్సరము నిండినది. అంతట భాద్రపదమాసమున జ్యేష్ఠానక్షత్రయుక్త అష్టమినాడు చంద్రుడు ప్రకాశించుచుండగా (రాత్రియందు) ధర్మరాజు వంశమున కుంతికి పుత్రుడు పుట్టెను. అప్పుడు శకునములు మంచివైనవి. శతశృంగముమీదనున్న మహర్షులెల్లరును మహాసంతోషముతో నా బాలునికి జాతకర్మను చేసిరి. ఆకాశవాణి 'ఇతనిచే కురుకులమువృద్ధిలోనికి వచ్చును. ధర్మమున స్థిరమైన బుద్ధి కలవాడగును. అందుచే నితనికి 'యుధిష్ఠిరుడను' పేరు తగియుండు'నని పల్కెను. పుత్రోదయమైనదన్న యుత్సాహము పాండురాజున కమితముగా కల్గెను. అతడు పుట్టగానే జనులు పొగడినచో నింకెంతగా కల్గునో యెవరికి చెప్పదరము

ఆ పుత్రకునకు పుత్రుడుదయించినాడు. అంతటితో నతనికి సంతృప్తి కల్గలేదు. మరల నొకనాడు కుంతీదేవితో 'వాయుదేవుని దయవలన మహాబలశాలియైన పుత్రుని కనుము అతనివలన మన కులమునకు రక్షణకావలెను' అనెను. ఆమె అట్లే యని మంత్ర మనుష్ఠించి వాయుదేవు నారాధించినది. వాయుదేవుడు ప్రసన్నుడై నాడు. పుత్రుని ప్రసాదించినాడు. పూర్వమువలెనే అక్కడనున్న మునులాతనికి నామ జాతకర్మముచేసిరి. ఆకాశవాణి 'భీమసేనుడు' అనినామకరణముజేసెను. ఆ పేరునుబట్టి యాతడు ఉద్దండుడుకాగలడని పాండురాజెంతో సంతోషించెను.

ఆనాడు పదవరోజు భీమసేనునికింకను పురుటిరోజులు గడచలేదు. ఆనాడు కుంతి కొడుకునెత్తుకొని దేవతా నమస్కారము చేయుటకై దేవాలయమున కేగుచుండెను. దారిలో భీకరమైన పెద్దపులి యామెకెదురైనది. కుంతీదేవి భయపడి వణకిపోయినది. పాండురాజు పెద్దపులిని సూాడు బాణములతో చంపివేసెను. కాని యూపోపున కుంతీదేవి భయపడి చేతులు వణకినందున బాలుడు క్రిందనున్న రాళ్లపై బడెను. అదిగమనించిన కుంతీదేవి 'అయ్యో! మొర్రో!' అని కేక వేయుగా పాండురాజువచ్చి క్రిందనున్న బాలునిలేవదీసెను. ఆశ్చర్యము! బాలునికేమియు దెబ్బలు తగులలేదు. సరికదా అతడు పైనపడినందులకు అక్కడిరాళ్ళే పిండి పిండయ్యెను. అదిచూచి తల్లిదండ్రులు అదంతయు దేవతల దయయే యని దేవతలకు మ్రొక్కి వచ్చిరి.

అక్కడ భీముడు పుట్టిన రోజుననే ఇక్కడ దుర్యోధనుడు పుట్టెను. అది మొదలు రోజున కొక్కడుగా వందమంది పుట్టిరి. ఆ విషయము మహాత్ములు చెప్పగావిని పాండురాజు తనకుకూడ మహాబలశాలియగు మరొక్కకుమారుడు పుట్టవలెనని యుత్సాహపడెను. మహాత్ములను కోరి మంత్రముపదేశము పొందెను. కుంతినికూడ త్రిలోకవిజయుడైన కొడుకు పుట్టుటకై ఘోరనియమములతో నుండుమని చెప్పెను.

తాను ఇంద్రునిగూర్చి ఒంటికాలిపై నిలుచుండి ఘోర నియమములతో మహానిష్ఠతో నొక్కయేడాది తపస్సు చేసెను. అటు కుంతియు జపముచేసినది. అంతట దేవేంద్రుడు పాండురాజునకు ప్రత్యక్షమయ్యెను. 'రాజా! నీ తపమునకు

మెచ్చితిని నీకు విజయవంతుడైన సుపుత్రుడు పుట్టునని చెప్పి అంతర్ధానమందెను. ఆమాట విన్నంతనే పాండురాజెంతో సంతోషించెను.

ఇక తాను తపముమాని కుంతివద్దకేగి ఆమెతో 'దేవీ! ధనమువలన, చదువువలన, సంతానమువలన తృప్తిపొందిన వారుండరు. నా కింకను పుత్రుల కనవలెననియున్నది. కావున నీవు దేవతలలో పెద్దయైన దేవేంద్రునిగూర్చి జపముచేసి అతని దయవలన మహాపరాక్రమశాలి యగు కుమారుని కనుము' అని యాజ్ఞనిచ్చెను.

ఆమె అట్లేయని పతిమాట జవదాటక మంత్రవిధానమున నింద్రు నారాధించెను. ఇంద్రుడు ప్రత్యక్షమై కుమారుని ప్రసాదించెను. కుంతి గర్భవతియై ఉత్తర ఫల్గునీ నక్షత్రమున లోకోత్తరుడైన పుత్రునికన్నది. అత డుదయించి నప్పుడు దేవదుందుభులు మ్రోసినవి. పుష్పవృష్టి కురిసినది. ఆకాశవాణి 'ఇతడు కార్తవీర్యుని మించినవీరుడు కాగలడు కాన ఇతనికి 'అర్జున'నామము తగియుండును. ఇతడింద్రాదు లనోడించి ఖాండవవనదహనము చేయించును. రాజులనందరి నోడించి ధర్మరాజుచే రాజసూయము చేయించును. దేవతలను తృప్తిపొందించి దివ్యాస్త్రములు పొందును'అని ఉరిమినట్లుగా స్ఫుటమైన వాక్కులతో పల్కెను.

అప్పుడు ప్రజాపతులు, ద్వాదశాదిత్యులు, రుద్రులు, వసువులు, మహర్షులు, గంధర్వులు, నాగులు, అప్సరసలు, అశ్వినులు, విశ్వేదేవతలు నచ్చటికివచ్చిరి. అందరు నొక్కసారిగా సమావేశమగుటతో నా ప్రదేశము సృష్ట్యారంభమున

బ్రహ్మసభవలె నున్నది. కిన్నరులు, కింపురుషులు పాడిరి. అప్సరస లాడిరి. మును లాశీర్వదించిరి. పాండురాజు ముగ్గురు కొడుకులతోను త్రిమూర్తులను కన్నంతగా సంతోషముతో పొంగిపోవుచుండెను.

కుంతీమాద్రులు సవతులు. అయినను వారిలో వారి కేకయ్యమునులేదు. కాని కుంతికి సంతానముకలిగి, తనకు కల్గకున్నందుల కామె మనస్సునకు కష్టమతోచినది. పాండురాజు పుత్రవంతుడయ్యెను. కాని తాను కాలేదుకదా! అటు గాంధారికి వందమందికొడుకులు పుట్టిరి. ఇటు కుంతికి ముగ్గురు రత్నములవంటి కొడుకులుపుట్టిరి. తా నాడుదియైపుట్టి వ్యర్థముగా కాపురముచేయుచున్నదే కాని, సంతానము కల్గలేదు కదా! ఎన్నటికైనను సంసారమునకు ఫలితము సంతానమే అను విచారముతో నామె దీనయైనది.

ఒకనాడు ఏకాంతమున భర్తతో 'కుంతికి ముగ్గురు పుత్రులు పుట్టినారు కాని, నాకుమాత్రము కల్గలేదు. తమ రనుజ్ఞ నిచ్చినచో నామె నాకుకూడసంతానముకల్గున ట్లనుగ్రహించును. మీ రాజ్ఞనిండు' అనికోరినది. అతడు 'ప్రేయసీ! నాకు నిదేవిచారము. నేనుతప్పక కుంతితో చెప్పెదను. ఆమె నీకోరికనెరవేరునట్లు చేయును. బెంగటిలకుము' అని ఆమె నూరడించి అప్పుడే కుంతిని పిలిచెను. ఆమెవచ్చినది. ఆమెతో మాద్రికోరికను తెలిపి 'అశ్వినీదేవతలు దేవతావైద్యులు; బహుసుందరాకారులు; లోకకల్యాణము చేయువారు. వారి నారాధించి ఈమెకు సంతానము కల్గునట్లు చేయుము' అనెను. ఆమె యంగీకరించినది.

మాద్రి నియమమును పట్టియున్నది. కుంతీదేవి మంత్రోపాసనచేసి అశ్వినీదేవతల నాహ్వానించినది. వారు వచ్చినారు. వారికి నమస్కరించి తన సవతికి సంతానము నిప్పింపుడని వేడినది. వా రనుగ్రహించిరి. మాద్రిగర్భవతియైనది. వారి యంశలనే కవలలు పుత్రులుపుట్టిరి. ఆకాశవాణి వారికి 'నకుల సహదేవు' లని పేరుపెట్టినది.

అప్పటి కీరీతిగా ధర్మరాజ భీమ అర్జున నకుల సహదేవు లను నైదుగురుపుత్రులు పాండురాజునకు క్షేత్రజులైన కుమారులై కల్గిరి.

తన చెల్లెలికి సంతానము కల్గినదని విని వసుదేవు డానందమొందెను. తన పురోహితుడైన కశ్యపుని బ్రాహ్మణుని పిలిచి మేనల్లురకు భూషణములు, పట్టువస్త్రములు నిచ్చి వారిని సత్కరింపుమని పంపెను.

కశ్యపుడువచ్చి మేనమామ యిచ్చిన అభరణముల నిచ్చి, పాండవులను దీవించి, పాండురాజుతో వసుదేవుని క్షేమ సమాచారములను చెప్పెను. అతని ప్రార్థనపై అచ్చటనే యుండి ఆపాండవులకు చౌలోపనయనాది సంస్కారములుచేసి విద్యాబోధచేయుచుండెను.

అంతట వసంతఋతువు వచ్చినది. చెట్లన్నియు ప్రాత యాకుల రాల్చి చిగురుపట్టినవి. మొగ్గలతో దిగినవి. పూలువిరి యుచున్నవి. వాటి కమ్మని వాసనలకై వచ్చి తుమ్మెదలు ఝుమ్మ ఝుమ్మని కమ్మగాపాడుచున్నవి. మావిళ్ళు పుల్లముగా పూచినవి. కోకిల లామామిడిపూతలనుకొరికి 'కుహూకుహూ'

అని కూయుచున్నవి. అశోకవృక్షములు నిండుగా పూచినవి. సంపెంగలు విరియపూచినవి.

వికసించిన పద్మములమీదనుండి, చందనాగురు వృక్షములమీదనుండియు గుభాళించు పైరుగాలులు వచ్చుచున్నవి. ఆగాలి తలుగుటతో జంటలుగా నున్నవారికి ఆనందము, విరహులకు విచారము సమముగా హెచ్చుచున్నది. సహావనఫలమునుజనులు యథేచ్ఛముగా ననుభవించుచుండిరి.

కాలము తనపనితానుచేయుచుండును. పంచభూతాత్మకమైన దేహమునకు కాలానుసారముగా ఆయాభూతముల కుద్రేకము కల్గినపుడు ఆయాధాతువుల కుద్రేకము కల్గుచుండును. వసంతసమయము కామోద్దీపకము. పాండురాజు ఇద్దఱు భార్యలతో కూడియున్నను చిరకాలమునుండి తపస్సుచేయుచు నిగ్రహముగా నున్నవాడే. ఇప్పుడు అతనికి కాలము దగ్గరకు వచ్చినది. మునిశాప మూరకపోవునా? కుంతీదేవి పెద్ద భార్యయేకాక, బుద్ధిమెలకువలోకూడ పెద్దదే. ఆమె తాను భర్తను కాపాడుటేకాక మాద్రికికూడ రక్షణచేయుచున్నది.

ఆనాడు కాలము-కర్మము కూడినది. కుంతీదేవి బ్రాహ్మణులకు భోజనములు వడ్డించుచు, ఆకంగారులో మాద్రిని కని పెట్టియుండలేదు. కొంచె మేమరపాటు కలిగినది. జీవితములో నెప్పుడో ఒకప్పు డించుకంత పొరపాటు రాకుండునా? కాని అదే ప్రాణముమీదికి తెచ్చును.

పాండురాజు అంతనిష్ఠాగరిష్ఠుడును కొంచెము చలించినాడు. వసంతము కామోద్దీపనము చేసినది. మాద్రి నానాడు కన్నార్పకచూచినాడు. ఆమెలో ఆనాడేమో క్రొత్తయంద

మతనికి కన్పడినది. ఆకర్షింపబడినాడు. సమయమునకై వేచి యున్నాడు. ఆమెయు నతని దృష్టి కనిపెట్టినది. అతనిమాట నెన్నడు జవదాటనిదే, అందులోను తప్పుపని చేయువార లేలకో ఏకమగుచుందురు. కుంతి యనిన నిద్దరికిని కన్నుకెదురే. ఆమె తమ్ము గమనించుటలేదని గమనించినారు. మాద్రి యెంతో మందలించినది. బలాత్కరించినాడు. ఒక్కసారి కక్కుర్తిగా మాద్రిని కలియబోయినాడుపాండురాజు. అంతే! కన్నులు మూసినాడు. అదే కాలమహిమ! మన తెలివి తేట లక్కడ నేమియు నుపయోగింపవు. ఎంత బుద్ధిశాలియు నాలుక కొరుకుకొనవలసినదే!

అనుకొన్నంతయు జరిగినది. చేసిన తప్పు బయటపడు టయే కాదు. పెద్దప్రమాదము మూడినది. పాండురాజశవ మును కౌగిలించుకొని నెత్తి - నోరు మోదుకొనుచు ఏడు పులు - పెడబొబ్బలు నారంభించినది మాద్రి. లోనుండి కుంతి విన్నదా యార్తధ్వని. ఆమెకు గుండె లాగిపోయినవి. ఎంతప్రమాదమువచ్చినది! జీవితమంతయు వ్యర్థమైనదే. అయ్యో! దైవమా! గతేమి!' అనుచు పుత్రులు తానును భర్త పాదములపైబడి యేడువసాగిరి,

అంతట కుంతి 'మాద్రీ! నీవులెమ్ము. నన్ను భర్తకు దగ్గరగా నుండనిమ్ము. నేనతనికిష్టురాలను; పడిగానుండజాలను. నే నితనితో చనిపోదును. నీవు పుత్రుల రక్షింపుము.' అనగా మాద్రి భయపడుచు విచారముతో దీనయై కుంతితో 'అక్కా! నాకు రక్షించుట చేతకాదు. భర్తహితవు చేయబోయి భగ్న నైతిని కాన పరలోకమందైనను అతనికిష్టము చేకూర్తును

నన్ను పోనిమ్ము. నీవు జాగ్రత్త యెరిగినదానవు. పుత్రుల రక్షింపగలవు వారిని కాపాడిని భర్తకు ఉత్తమగతులు కల్గునట్లు చేయుము' అని యొప్పించినది. ఇద్దరును చని పోగా మహర్షులు కుంతీదేవిని నివారించిరి. మాద్రీపాండురాజులు దగ్ధములైరి.

అక్కడి మునులు వారి ఉత్తరక్రియలు చేయుటకై వారి దేహభాగములు గ్రహించిరి. కుంతీదేవిని, కొడుకులను ఊరడించిరి. బిడ్డలను, తల్లిని హస్తినాపురమునకు చేర్చుటయే మంచిదని తలచి ఆ మహర్షులు వారిని హస్తినాపురమునకు తీసికొనివచ్చి ధృతరాష్ట్రునితో జరిగినదంతయు చెప్పి 'రాజా! ఇదిగో వారి యంగములు. వీటిని యథాశాస్త్రముగ పితృమేధపద్ధతి ప్రకారము సంస్కారము చేయింపుము. ఈమెను పుత్రరక్షణకై బ్రతికియుండునట్లు ఊరడించితిమి. వీరలు దేవాంశసంభూతులు, వంశవర్ధనులు; రక్షింపుము' అని చెప్పి అక్కడనే అంతర్ధానమైరి.

తరువాత ధృతరాష్ట్రుడు తమ్మునికై వగచి, మరదలినూరడించి తమ్మునికి సపత్నీకునకు, యథావిధానముగా నుత్తరక్రియలు జరిపించెను. షోడశమహాదానములు సక్రమముగా నిర్వర్తించెను.

ఇట్లు పాండురాజు స్వయంకృతాపరాధమున మృతినొందెను. జన్మలో చేసిన చిన్నతప్పైనను జన్మ ఘాతమగుననుట కిది చక్కని దృష్టాంతము. సౌభ్రాత్రము పాండురాజుదే. పిత్రార్జితముగా పాండవులకు సంక్రమించినది. అతని వంటివాడు తప్ప, మరెవ్వడైనను గ్రుడ్డివాడైన అన్నగారి

పక్షమున స్వభావానుబలమున దేశముల జయించి రాజ్యము కట్టబెట్టునా? పుత్రవాత్సల్యము భ్రాతృస్నేహమును మించినది కాని, ధృతరాష్ట్రుడుకూడ తనజీవితమున నెన్నోసార్లు పాండురాజు మంచితనమును తలపెట్టుచునేయుండును. అనధికారులైనవారికి రాజ్యమేల యీయవలెనన్న దుర్యోధనునితో ధృతరాష్ట్రుడు చెప్పినకారణమే 'పాండురాజార్జితమే రాజ్య' మని. రాజుపక్షమున రాజకీయోద్యోగస్థు డెవడుగెల్చినను, ఆరాజ్యము రాజుదే. కాని యిక్కడ మరొకవిశేషమున్నది. అన్నగారనధికారియైనప్పుడు తమ్ముడే రాజ్యాధికారియగును. అట్లు సంపూర్ణరాజ్యాధికారి పాండురాజేయైనను, స్వారాజ్యముపై కూడ ఆశపెట్టుకొనక అన్నపక్షమున చేయుటయే అతని సౌభ్రాత్రమున కుత్తమోదాహరణము.

అట్టి మంచిగుణములను తెలిసికొని అలవరచుకొనుటయే మనకు కర్తవ్యము. అట్టిధర్మోపదేశము చేయుటచేతనే భారతము పంచమవేదముగా బరగినది. కొన్నిధర్మములు మనకు చాల విరుద్ధములుగా కన్పడవచ్చును. కాని యాలోచించినచో నవి కష్టసాధ్యములై కన్పడకమానవు. పాండవులు క్షేత్రజులుకదా! ఆమర్యాద మంచిదికాదని కొందరు దురావాకు పోవచ్చును; కాని ఆరీతిగా కేవలసంతానార్థులై దేవతలనేకాదు మనుష్యులనేకోరి రనుకొనుడు. తప్పులేదు. ఆ యిద్దరిలోను ఒక్కసారికో పుత్రసంతానోత్పాదకశక్తి యుండవలెను. మనుసారికోరిక మానసికముగానైన నుండరాదు. అట్టి మనోనిగ్రహములేనివారల కది ధర్మముకాదని కలియుగమున నిషేధింపబడినది. అందుచే ఉద్గ్రంథములలో నున్న విష

యములను విమర్శించుటకు ముందు నాటిమనః ప్రవృత్తులను చక్కగా పరికించవలసియుండును. అది లేకుండ ఆకునందకుండ పోకను పొందకుండ ఏదో నోటికివచ్చినరీతిని చెప్పసాహసించిన-చో దానికి ప్రస్తురము లుండవు.

కావున విద్యార్థులు, చదువరులును సద్భావముతో నీకథల నర్థముచేసికొని, మననముచేసి, సదభ్యాసము చేసికొందురుగాత!

## విదురుడు

కావలసినది నీతిగాని జాతికాదు. నీతిలేనిజాతి పేరుక నదగినది కాదు. చెట్టుపేరు చెప్పి కాయ లమ్ముజూచినచో కొనెడి మూఢులు తక్కువ. ఏ కులమువాడైనను సద్గుణగణములతో గొప్పవాడగునేని వానినెల్లరు మెత్తురు. వాని మాట నీతివాక్య మగును. వాడు శక్తిమంతుడగును. అట్టి వారిలో విదురు డొకడు.

అతడు శాపవశమున శూద్రుడుగా పుట్టిన యముడు. ఆశాప మిది :

న్యాయనిర్ణయము చాలకష్టమైనపని. దానికి ఫలిత మేపాటి యట్టిట్టయినను కనపడును. న్యాయాధికారులు విజ్ఞులైనచో తమజీవితమును అసిధారావ్రతముగా నడుపుకొందురు. తెలిసినవా రెవరును మధ్యవర్తులుగానుండి తీర్పుచెప్పుటకు సాహసింపకుండుట కిదే కారణము.

యమధర్మరాజు ధర్మనిర్ణయముచేసి శిక్షలు విధించు నుద్యోగమున భగవంతుచే నియమితుడైనవాడు. అతడొకసారి పొరపాటుచేసినాడు. తత్ఫలిత మా శాపము.

పూర్వము మాండవ్యుడను మహర్షి తీర్థములన్నియు సేవించెను. చివరకొక నగరమునకు దగ్గరనున్న యడవిలో ఒక యాశ్రమము కట్టుకొని దానిముందున్న చెట్టుమొదట చేతులెత్తుకొని మౌనవ్రతముతో తపముచేసికొనుచుండెను. అంతట నొకనాడు కొందరు దొంగలా నగరమున రాజమందిరమునకు కన్నమువేసి ధనము దొంగిలించిరి. వారిని రాజభటులు వెన్నాడిరి. దొంగలు తప్పించుకొనుటకై పరుగెత్తుచు మాండవ్యముని యొక్క ఆశ్రమములోనికి పారిపోయి దాగిరి.

వెనువెంటనే పరుగెత్తుకొని వచ్చుచున్న రాజభటులు మునినిజూచి 'యీ మార్గమున చోరులువచ్చిరా?' అని అడిగిరి. కాని అతడు మౌనముగా నున్నందున జవాబియ్యలేదు. వారంతటితోపోక, ఆశ్రమము కలయ వెదకి ధనముతోసహా చోరులను పట్టుకొనిరి. అప్పుడాముని టక్కరిగా అట్లున్నాడని అనుమానించి రాజభటులు దొంగలతోపాటు మునినిగూడ రాజుగారివద్దకు తీసికొనివెళ్ళిరి. రాజు దొంగలను చంపించి, మునివేషముననున్నాడని మాండవ్యుని శూలప్రోతుని చేయుమనెను. అనగా కంఠమునుండి ఒకచెట్టునకంటుకున్నట్లు ఇనుపమేకు కొట్టుమనెను. అతడేమియు మాటాడలేదు. రాజభటులు ఆ ముని కాశిక్షవేసి, అక్కడనే కావలియుండిరి. సాధారణముగా ఎవరైనను వెంటనే చచ్చెడివారే; కాని ఆ మునిమాత్రము కొన్నాళ్ళవరకు చావక, బాధపడుచున్ననూ లెక్కసేయక జపముచేసికొనుచుండెను.

ఒకనాటిరాత్రి తక్కిన మహాత్ములు పక్షిరూపమునవచ్చి 'మునీంద్రా! తమవంటివారికి శిక్ష యేమిటి?' అని ప్రశ్నించిరి. అందులకతడు 'చేసికొన్న కర్మము అనుభవింపక తీరదు గదా!' అనెను. అది విన్న నగరరక్షకులు మహారాజున కామాటలు విన్నవించిరి. మహారాజు వెంటనేవచ్చి మహర్షికి నమస్కరించి తెలియకచేసినతప్పును క్షమింపుమని వేడెను. అతని కంఠమునుండి ఇనుపమేకును తీసివేయుమనెను. భటులెంతో ప్రయత్నించిరి. కాని ఆ మేకురాలేదు. అప్పుడురాజు మెల్లగా ఆమేకును ఎరుగగోయించెను. కంఠములో మాత్రమది మిగిలిపోయెను. దానితో అతనికి 'ఆణిమాండవ్యుడు' అని పేరువచ్చినది.

అతడక్కడనుండి వెడలి కొన్నియేండ్లు తపస్సుచేసి లోకములదిరుగుచు నొకసారి యమలోకమున కేగెను. యముని 'నే నేమిపాపము చేసితినని నా కిట్టికష్టతరమైన శిక్ష విధించితివి?' అని ప్రశ్నించెను. యముడు 'నీవు నీ చిన్నతనమున తూనీగలను పట్టి కొఱతనువేయువాడవు. నాటికంతము లకు ముల్లులు గ్రుచ్చువాడవు. ఆపాపఫలితమిది. హింసచేయువారికి ఫలితమనుభవింపకపోవునా?' అనెను. మునికికోపము వచ్చినది. 'బాలురు పుట్టినదిమొదలు పదునాలుగేండ్లవరకు జ్ఞానములేక యుందురు; కాన ఆకాలమున చేసిన పాతకము లాతనివంటవు. నీ వీ ధర్మసూక్ష్మము నెరుగక నాకుశిక్షవిధించితివి. కాన నీవు శూద్రయోనియందు పుట్టుదువుగాక!' అని శపించెను. రాజు శిక్షవిధించినను దానికి ప్రేరకుడు యము

ధర్మరాజేకాని రాజుకాడు. అందుచే సుఖ్యాతి యముడై నాడు. కావున యముడు శూద్రుడై పుట్టవలసివచ్చెను.

సత్యవతీదేవి తనకొడుకులు సంతానములేక చనిపోగా కోడండ్రయందు సంతానము కనుమని వ్యాసునిబతిమాలినది. అత డంగీకరించినాడు. అంబిక, అంబాలికలకు కుమారుల ప్రసాదించినాడు. కాని వారలిద్దరును ఒకడు గ్రుడ్డివాడు, ఒకడు పాండురోగపీడితుడు నయ్యెను. అందుకువగచి సత్యవతి మరల నింకొక్కకొడుకు నిమ్మని వ్యాసుని కోరినది. అత డంగీకరించినాడు. సత్యవతికోడలైన అంబికను వెళ్ళుమన్నది. ఆమె అసహ్యించుకొని తనవేషమువేసి దాసినిపంపినది. ఆమె మహాసంతోషముతో వ్యాసుని ప్రసాదము నందుకొన్నది. ఈవలకురాగానే సత్యవతి 'యెటువంటికొడుకు పుట్టు' నని యడిగినది. వ్యాసుడు 'ధర్మశాస్త్రజ్ఞుడు, నీతికోవిదుడు, సన్మార్గగామియైనవాడే పుట్టును. కాని అతడు శూద్రుడు' అనిచెప్పి అంతర్ధానమయ్యెను. సత్యవతి కప్పుడు తెలిసినది నిజము. విచారించినది. ఆరీతిగా శూద్రస్త్రీయందు వ్యాస ప్రసాదమున జనించిన బాలుడే విదురుడు. యముని యవతారము. అతడు ధృతరాష్ట్ర పాండురాజులకు తమ్ముని వరుసలోని వాడయ్యెను.

అతడు పెరిగి పెద్దయైన తర్వాత మంచి నీతిశాస్త్ర వేత్తగా పేరుగాంచెను. అందుచే ధృతరాష్ట్రుడు రాజుకాగానే విదురుని మంత్రిగా, హితునిగా తనవద్దనుంచుకొనెను. అత డన్నికార్యములందును పక్షపాతములేక న్యాయమార్గమును చెప్పువాడు.

ధృతరాష్ట్రున కితనియందెంతో గౌరవము. ధృతరాష్ట్రున క్షమా క్షేమిటి? భీష్ముడుకూడ ధృతరాష్ట్ర పాండురాజుల పెద్దింటిషయమై విదురునితో నాలోచించియే చేసెను. దుర్యోధనుడు పుట్టినపుడు కల్గిన యపశకునములను చూచి, ఆ బాలుని వదలుమని చెప్పినవారిలో విదురు డున్నాడు. విదురుడే పాండురాజున కుత్తరక్రియలు చేయించెను. కౌరవ పాండవులు అస్త్రవిద్యానిపుణులై ప్రదర్శనము చేయగోరినపుడు రంగాగారము (ప్రదర్శనశాల) కట్టించిన దీతడే. మంత్రి యగుటచేతను, మహారాజైన ధృతరాష్ట్రునకు కన్నులు లేకుండుటచేతను అన్ని కార్యములను ఇతడే నిర్వహించువాడు.

పాండవులపై నితనికి ప్రీతి హెచ్చు. చిన్నతనముననే తండ్రిని కోల్పోయిన దౌర్భాగ్యులగుటయే కాక మహాబలవంతులై యుండియు, వారు వినయ విధేయతలు కలవారగుటయే దానికి కారణము. ఆపై పాండవులకు కౌరవులుచేయుచున్న అపకారములను విని మరింత విచారము, వారిపై నభిమానము కలిగెను. అది సజ్జనులకు సహజమేకదా! ధర్మరాజునకు యౌవరాజ్యాభిషేకమునకు ప్రోత్సహించినవాడు విదురుడే!

పాండవులను వారణావతము (కాశికి) నకు వెళ్లుమని ధృతరాష్ట్రుడు పంపునపుడు విదురుడు ధర్మరాజుతో కొంత దూరము వెళ్ళి అందరికి విన్నను ఎరుగని రీతిగా 'మీరన్నియు నెరుగుదురు. అయినను ఎరుగ జెప్పవలెను. ఏ పనిలేకపోయినను మిమ్ము కాశికి పంపుచున్నాడు రాజు. హితుడువలె పైకి

కనబడుచున్నాడు. కావున మీరు పమాగ్నులవలన భయము కల్గకుండ జాగ్రత్తగా నుండుము' అని చెప్పిపంపెను.

అతని కప్పటికే వారందురాలోచన తెలియును. తరువాత లాక్షాగృహప్రసంగతి తెలిసి, కౌరవులుచేయు దుస్తంత్రములు దుర్మంత్రములు కనిపెట్టుచుండెను. అంతట దుర్యోధనుడు లక్క-యింటికి నిప్పుపెట్టుమని యొకరోజును నిశ్చయించగా, అది జాగ్రత్తగా తెలిసికొని విదురుడు భూమిత్రవ్వుటలో నేర్పరియైన ఒకభటునిపంపి ధర్మరాజాదులకు గుప్త తెలియునట్లుగా దుర్యోధనుని చెడునాలోచన తెల్పెను. ఆ భటుడు (ఖనకుడు) చేసిన సొరంగము ద్వారానే పాండవులు బ్రతికి బయటపడిరి. ఆవిషయమెరిగియు, తెలియనట్లుగా నల్లురితోపాటుగా విదురుడును ఏడ్చెను. తరువాత ద్రౌపదీ స్వయంవరానంతరము పాండవుల చంపవలెనని దురాలోచన చేసిన దుర్యోధనుని మందలించి, పాండవులను హస్తినాపురమునకు రప్పించునట్లుచేసి వారికి అర్థరాజ్యమిప్పించెను.

ధర్మరాజు చేసిన రాజసూయమునకు విదురుడు వెళ్ళి సత్కారములు పొందెను. రాజసూయముగాంచి అసూయపడిన దుర్యోధనుడు జూదమాడుటకు అనుమతింపుమని తండ్రిని కోరెను. అతడు 'ధీరమతి, నయవిశారదుడు, కలాపారగుడు, దీర్ఘదర్శి, అపారహితారంభుడు, బృహస్పతి రచించిన నీతి శాస్త్రమును విదురునికంటె నెరిగినవారులేరు' అని అతనితో ఆలోచలులుచేసెను.

విదురుడు 'జూదమునకు మాత్రము నంగీకరింపను. తీరికూర్చుండి కొడుకులకేల భేదము కల్పించెదవు?' అని యెన్నె

రీతుల మందలించెను. కాని కొడుకు దుర్యోధనునిన్న ధృత రాష్ట్రుడు విదురు నెట్లో యొప్పించి, ధర్మరాజును తోడితెచ్చుట కంపెను. గతిలేక విదురుడు వెళ్ళి ధర్మజుని తోడితెచ్చెను.

ఒకమూల జూదమాట నడచుచున్నది. అదివిషమించు చున్నది. అది తెలిసి విదురుడు ధృతరాష్ట్రునితో ఎట్లయిన జూదమాడుట మానవలెనని నొక్కి చెప్పెను. అంతేకాక దుర్యోధనుని విడిచి కులమునకు ప్రతిష్ఠ నిలుపుమని ధృతరాష్ట్రునితో చెప్పినాడు. దానితో కోపించి దుర్యోధను డాతని తిట్టెను.

జూదమున దుర్యోధనుడు ద్రౌపదిని గెలువగానే విదురుని వెళ్లి ద్రౌపదిని తీసికొనిరమ్మనెను. అందుల కసహ్యించుకొని విదురుడు 'లోకములో అజ్ఞులలో కూడ సాటివచ్చువారు లేరు. దురాత్మ్మకా! నన్ను పురమాయింతువే, యిట్టి తుచ్ఛపు పనికి? దుర్బుద్ధి మానుమ'ని మందలించెను. అంతట దుర్యోధనుడు 'విదురుడు అరిష్టములు వల్కును. నీవుపోయి కొనితె'మ్మని ప్రాతికామిని పంపెను. అతనికి చెప్పి పంపిన ధర్మ సందేహమును తీర్చనిచో ఆరోపము సభ్యులదే అని విదురుడనెను. కాని వినిపించుకొన్నవారు లేరు. ద్రౌపదీ మానభంగము చేయుచున్నందున జరిగిన అపశకునములు చూచి గాంధారియు, విదురుడును ధృతరాష్ట్రునితో చెప్పగా నతడు ద్రౌపదిని పిలిపించి రాజ్యము మరల నిచ్చివేసెను.

రెండవసారి జూదమునకు పిలిచినవాడు ప్రాతికామి. వనవాసమునకు ధర్మరాజాదులు వెళ్లుచుండగా విదురుడు కుంతీదేవి వనవాసక్లేశము పడలేదు, నాయింట నుండునని చెప్పి,

వీరికి హితబోధ కావించి, దీవించి పంపెను. పాండవులు అడవికి వెళ్లినప్పుడు తల కొకరీతిగా చేష్టలుచేయుచు వెళ్లిరి. వారి కారీతి నేల యుండవలసివచ్చినదో విదురుడే వివరించి చెప్పినాడు. అది విని విచారించిన ధృతరాష్ట్రునకు 'పాండవుల పిలిపించి వారిరాజ్యము వారికి'మ్మని చెప్పినాడు. కాని ఆ మాటలను వినీ విననట్లే నటించినాడు ధృతరాష్ట్రుడు.

పాండవులు వనవాసము చేయుచుండగా ధృతరాష్ట్రుడు విదురునితో 'ఇంక పాండవులేమిచేయగలరు?' అని యడిగెను. అప్పుడు విదురుడు 'పాండవులు చాలమంచివారలు. వారికి కోపముపుట్టించి నీకొడుకు ద్రోహముచేసినాడు. వాడు పుట్టిన నాడే అపశకునములైనవి. వానిని విడువుమన్నచో నీవు వినవు. వానిచే కులమునకే అనిష్టము వాటిల్లును. కావున ఇప్పటి కైనను బుద్ధితెచ్చుకొని దుశ్శాసనుని పంపించి పాండవులను బతిమాలి రప్పింపు'మనెను.

అది వినుటతో ధృతరాష్ట్రున కెక్కడలేని కోపము వచ్చినది. అతడు విదురుని ముఖాముఖిగా తిట్టిన దా మొక్క సారే. 'నీ వెప్పుడును నా కొడుకులయభివృద్ధిని సహింపలేవు. అట్టి నీసహాయము నా కక్కరలేదు. పాండవులవద్దకే పోదువో ఎక్కడకు పోదువో పొమ్ము' అని కసరెను. అతనికి ఒడలు మండినది. వెంటనే బయల్దేరి కామ్యకవనమున కేగినాడు. అతనిని దూరమునుండి చూచి 'భీముడు మరల నేదోవార్త తెచ్చుచున్నాడితడు' అనెను. పాండవు లతని కెదురేగిరి. అతడు వారిచ్చు మర్యాదలు స్వీకరించి అక్కడ జరిగినదం తయు వివరించెను. 'అతడు పొమ్మనగా వచ్చితిని. రూప

లావణ్యములు కలిగినతరుణి వృద్ధునిచే పరిణీతయైనట్లు రాజ్యలక్ష్మి కా దురాత్మునిపై విరక్తియేకానిర క్తినిలువనేరదు. ధర్మరహితులైన వారికి రాజ్యములు నిలువవు. అది తనంతతామే వచ్చి నిన్ను పొందును.’ అని అక్కడకే ధర్మరాజుచే మన్ననలు పొందుచు నుండెను.

ధృతరాష్ట్రుడు కోపములో ననేకాని వాని కేమియు జేయుట లేదు. కన్నులులేని యతనికి కన్నులువలెనున్నాడు విదురుడు. వెంటనే అతని రప్పించుటకై సంజయుని పంపెను. అతడువచ్చి ధృతరాష్ట్రుని సందేశము చెప్పగా ధర్మరాజు విదురుని వెళ్లిరమ్మని పంపెను. అతడు రాగానే ధృతరాష్ట్రుడతని క్షమింపుమని కోరెను. అతడు మునుపటివలె కార్యములయందు సహాయము చేయుచుండెను.

పాండవులుపప్లావ్యమునకువచ్చి యుండిరి. ధృతరాష్ట్రుడు పంపగా సంజయుడు రాయబారముచెప్పి ప్రతివార్త తెచ్చెను. ధృతరాష్ట్రునింటికేగి సంజయుడు కొంతగా కొంత పాండవుల ప్రతిసందేశమును చెప్పి మిగిలిన వార్తలను రేపుదయమున వచ్చి చెప్పెదనని తాను విశ్రాంతి తీసికొన నేగెను. ఆ మాటలువినునరికి ధృతరాష్ట్రునకు కొడలు మంటలు పుట్టెను. శాంతికల్గలేదు. అప్పుడు విదురుని రప్పింపుమని భటుని పంపెను. అతడువెళ్లి విదురుని తోడితెచ్చినాడు.

ధృతరాష్ట్రుడు విదురునితో ‘సంజయుడు వచ్చి పాండవులసందేశమును సగము సగముగాచెప్పి, నన్నింతలోతిట్టి మిగిలినది రేపుచెప్పెదనని వెళ్లినాడు, నాకు నిప్పులమీద పొరలుచున్నట్లున్నది. కంటికి నిద్రవచ్చుటలేదు’ అనెను. విదురుడు

'బలవంతుడు తనమీదికెత్తి వచ్చుచున్న ప్రజ బలహీనుడును, ధనముచు పోగొట్టుకొన్నవాడును, దొంగతనము చేయుటకై నిరీక్షించువాడును, కామాసక్తచిత్తుడును నిద్రలేక బాధపడు దురు. అందునీకే బాధవచ్చిపడినది? పరులసొమ్ము తినవలచి తివా!' అని ప్రశ్నించెను. దాని కతడు 'ధర్మరాజాడెడిమాటల రీతి నీవు చెప్పగలవు; చెప్పుము' అనెను. 'అతడు చాలమంచి వాడు. మరొక రీతిగా కీడుమాటలాడడు. నీకొడుకు, నీవు నతనిని బాధించితిరి. అది చాలు. ఇప్పటికైనను తగిన భాగ మిమ్ము. అతడు నీవే నిజముగా తండ్రివని నమ్మియున్నాడు,' అనుటతో ధృతరాష్ట్రుడు 'సరే! రేపుప్రొద్దున సంజయుని మాటలు విని తగినరీతిగా చేయవచ్చునుగాని, యీ పూటకు నిద్రవచ్చుటలేదు. విశ్రాంతినిచ్చునట్లు చల్లని మాటలు చెప్పు'మని కోరెను. అప్పుడు విదురుడు చెప్పినదే విదురనీతి యని పిలువబడుచున్నది. దాని నిట సంగ్రహింతును.

'ఎవడైనను అందరికి హితమైన రీతిగా నడచుకొన వలెను. లోకనింద్యముల విడువవలెను. ఒకని సొమ్మును కాశింపరాదు. సాటివారితో కలిసి - మెలిసి యుండవలెను. కోపము, పొగడ్తల కుబ్బుట, గర్వము, తృప్తిలేకుండుట, దురభిమానము, పనిలేకుండుట - అనునవి దుర్జనుల లక్షణ ములు. ధనము, విద్య, వంశమును దుష్టబుద్ధులకు మదము కల్గించును. అవే సజ్జనులకు అణకువ, వినయము నిచ్చును. నడవడియను సముద్రము దాటుటకు సత్యమొకటే సేతువంటిది. ఓర్పుకలవారిని చూచినచో జనులు నిజమెరుగలేక చేత కానితనము నాపాదింతురు. కాని ఓర్పునకుసాటి యలం

కారము లేదు. పరుషముగా మాట్లాడకుండుట పాపపుపనికి ప్రయత్నింపకుండుట చేయగల్గినచో అతడే కీర్తి పొంద గలడు. శక్తికల్గియు క్షమించువాడును, బీదతనమునకూడ యాచకులకు ప్రీతితో నున్నంత దానమిచ్చువాడును పుణ్య పురుషులు. న్యాయార్జిత విత్తములకు అపాత్రదానము, పాత్రులైనవారి కియ్యకుండుట యను రెండుకీళ్లున్నవి. వేశ్య, జూదము, మద్యము, వేట, అసత్యమాడుట, శిక్షించుటలోని కాఠిన్యము, ధనమును వృథాచేయుట యను నేడును వ్యసనములు (చెడునలవాట్లు). తగినవేషము, తనకు తాను పొగడుకొనకుండుట, మనస్సునకు కష్టముకల్గినను తిట్ట కుండుట, దాన మిచ్చి విచారింపకుండుట, తన కెంత రోజు నడవకున్నను న్యాయమార్గము తప్పకుండుట యను నవియే నడవడి కలంకారములు. స్నేహము, సంభాషణము,వివాదము యుద్ధమును తనకు సమమైనవారితోనే తగును కాని, ఎక్కువ వారితో పనికిరాదు. కొంచెమైనను తగినరీతిగా పంచుకొని తనభాగమును తా ననుభవించుటయే మేలు. కార్యములపట్ల దుఃఖమును సహించి కొద్దిసుఖము ననుభవించినను మంచిదే. అడిగినప్పుడు శత్రువునకైన నిచ్చుటయేమంచిది' అని సజ్జన లక్షణములను చెప్పి 'ఇవన్నియును ధర్మరాజున కున్నవి. వారినిపెంచి పెద్దవారినిచేసితివి. ఇప్పు డూరకొనుటన్యాయము కాదు. వారిపాలు వారి కిమ్ము' అనగా అక్కడక్కడ ఊకొట్టి ధృతరాష్ట్రుడు 'కర్తవ్యము బోధింపు'మనెను.

అప్పుడు విదురుడు 'న న్నున్నదున్నట్లు చెప్పుమని నొక్కి యడిగినచో చెప్పకుందునా? వినుము. దక్కనుకదా

శత్రువుని రాజ్యముని దిగమ్రింగజూచుచున్నావు. అది నీకెట్లసుగునా! చేపయు ఎరవలన నాశనమగు గాలమును మ్రింగ నట్లే' అనుటతో జవాబు చెప్పలేక ధృతరాష్ట్రుడు కొంతసేపు బెంగపడి 'ఏమరా! నీవిందాక చెప్పిననీతులతో నాకు కొంతచిత్తశాంతి కలిగినది. మరల నామనస్సును శిక్షించక చల్లనిమాటలు చెప్పుము' అని కోరెను. అతడు మరల నీతులుచెప్పసాగెను.

'పండకుండగ కోసినచో పంటనష్టమే కాక, విత్తనములు కూడ నష్టమే. అట్లే యేకార్యమైనను పరుల ధనమునకు, విద్యకు, కీర్తికి, బలమునకు మనస్సులో కుళ్ళి కుళ్ళి బాధపడు వాడు రోగములేనివేదన పొందును. మాటలతోనే స్నేహము, పగ, జ్ఞానము, భోగ, పాపపుణ్యములు, దౌర్జన్యమును వచ్చును. కాన చక్కగా మాటలాడవలెను. దేహమునకు గ్రుచ్చుకొన్న బాణముల లాగవచ్చునుగాని మనస్సున నాటిన మాటల నెవ్వడును వెలికితీయలేడు' అని చెప్పుటతో తృప్తినొందక యింకను చెప్పుమని ధృతరాష్ట్రుడు కోరగా విదురు డింకను చెప్పెను.

'ఏరీతిగానైనను పాండవులకు భాగ మిమ్ము. దుర్మార్గుడైన కొడుకును విడువుము. యుద్ధములో పాండవులకే జయము తథ్యము' అనెను. ధృతరాష్ట్రుడు 'నీవు చెప్పినమాటలు నిజమే; కాని కొడుకును విడువలేను. ధర్మో జయతి (ధర్మమే జయించును) అని యూరకుందును' అనుటతో విదురుడు 'దేవా! జ్ఞాతులు గుణహీనులైనను విడువరాదు. అందును నీ అనుగ్రహము కోరియున్న పాండవులను విడుచుట న్యాయ

ము కాదు. నీలో నీవాలోచించుకొని తగినట్లుచేయుము' అనెను. 'నీమాటలతో నాకు బాధతగ్గినది. అట్లే చేయుదు' నని ధృతరాష్ట్రుడనుటతో సంతోషము కల్గినను, ఆమాటలపై విదురునకు నమ్మికలేదు. 'అబ్బ! ఇప్పటికి నీ వొప్పుకొంటివి. కాని రేపు దుర్యోధను డన్నమాటలకు లోబడనప్పుడుగదా అనుకొనుట!' అని ఒక్కసారి నిట్టూర్చెను. 'దైవమునకే యిష్టమువచ్చినట్లు బోవీలగునుకాని, నరమాత్రునకు 'నే నిట్లు చేయుదును; ఇట్లుచేయను' అనుటకు శక్తియెక్కడిది? పురుష కారముకన్న దైవమే హెచ్చు' అనెను. అది నిశ్చితవాక్య ము. ఏ దెట్లు జరుగదలచియున్నదో అట్లే జరుగును కాని మనయిష్టమువచ్చినట్లు జరుపగలమా?

అంతట ధృతరాష్ట్రుడు 'నాకు పరమార్థదృష్టి యెట్లు కల్గునో తెల్పు'మని కోరగా విదురుడు 'నాకు తెలిసినంత వరకు చెప్పితిని. ఇంక మిగిలినవి సనత్సుజాతుడు చెప్పగలడు కాని నావలన కా' దనెను. 'అమ్మో! నాకును, ఆ మునికి నెంతదూరము? అవికూడ నీవే చెప్పుము!' అని ధృతరాష్ట్రు డడుగగా వాటిని నేను చెప్పరాదు. దేవతలకు కూడ తెలియ రాని విషయముల నాత డెరుగును. ఇప్పుడే రప్పింతును' అని భక్తితో నమస్కరించి సనత్సుజాతుని తలచుకొనగా నతడు వచ్చి ప్రత్యక్షమై విదురుడు కోరినట్లు ధృతరాష్ట్రున కాత్మ విద్యోపదేశము చేసెను.

శ్రీ కృష్ణుడు రాయబారమునకై వచ్చుచున్నాడన్న సంగతి తెలిసి ధృతరాష్ట్రుడు కొడుకుచే నగరాలంకరణము చేయించెను. విదురుని పిలిచి 'మన పురమునకు శ్రీ కృష్ణుడు

వచ్చుచున్నాడు. అతనికి మహ మెన్నో గజాశ్వ రథ ధనకనక వస్తువాహనముల నిచ్చి నమస్కృద లెంతో గొప్పగా చేయ వలెను' అనెను. అదివిని విదురుడు 'మంచిదే, కృష్ణుని గౌర వించుట యుక్తమే; కాని పాండవుల కై నాళ్ళనిచ్చుటకు ఓపలేని వారలు కృష్ణునకిచ్చుట కెట్లుసహించగలరు. కాక నీ మనోభావము నాకు తెలిసినదిలే. ఏదో రీతిగా శౌరికి లంచ మిచ్చి కార్యము భిన్నము నొనర్ప చేయజూచుచుంటివేమో? కాని, నీవు మేరుపర్వతము తెచ్చి కట్టబెట్టినను కృష్ణు డర్జునుని వదలడు. అతనికి కావలసినది గౌరవము. జలపూర్ణమంగళ కలశము, అర్ఘ్యపాద్యములు, కుశలప్రశ్నములును, అత డేపనికై వచ్చుచున్నాడో అది పూర్తిచేయుటయే అతనికి హితముకల్గజేయు పద్ధతి' అనుటయో దుర్యోధనను డాపని కొప్పు కొనలేదు. ధృతరాష్ట్రుడు విదురాదులతోకూడి కృష్ణునకు స్వాగతమిచ్చి,అర్ఘ్యపాద్య మధుపర్కములిచ్చి గౌరవించెను.

తరువాత కృష్ణుడు ప్రత్యేకముగా నేను విదురుని యింటికి వెళ్లివత్తునని చెప్పి వెళ్లెను. విదురు డంతకుముందు గానే తన యింటి కేగి, అతిథిగావచ్చు శ్రీకృష్ణున కెన్నో దేవోపచారములు చేసెను. అతనిభక్తికి కృష్ణుడెంతో సంతో షించెను. విదురుడు పాండవుల యోగక్షేమము లడిగి తెలిసి కొని సానుభూతి చూపెను. కుంతికూడ విదురునియింటిలోనే యున్నది. అనగా విదురునియింటిలోనే రేభవన మది.అక్కడికి వెళ్లుచుండగా కృష్ణుని 'నీకు విందు తయారుచేయుదును' అని విదురు డతని యనుమతి గైకొని విందుచేసెను.

కృష్ణుడు కుంతిదేవి నూరడించి, దుర్యోధనునింటి కేగెను. అతడు మాయింట భుజింపుమనగా 'శత్రువులయింట కూడు తినరాదు. నేను విదురునియింటనే తిందు'నని చెప్పి ఎందరుపిలిచినను పోక, విదురునియింటికే వెళ్లెను. విదురుడు సంబరము, ప్రేమ, నిశ్చలభక్తి కల్గి మజ్జనము (స్నానము) చేసి బ్రాహ్మణభోజనమైన వెనుక కృష్ణునికి విందుచేసెను. సుజనులు, తాను వరుసపంక్తిని కూర్చుండి భుజించిరి. భోజనవేళ 'గోవిందా! లోటున్నచో క్షమించుము. మాకు నీవు భుజించుటయే పరమధనము. ఇక మరొకరీతిగా నీకు పూజసేయగలమా?' అనుచు అనేకవిధములైన వినయ వాక్యములతో చల్లగా, హితవుగా చెప్పుచుండగా కృష్ణుడు విందారగించి లేచెను.

భోజనముచేసి లేవగానే మంచిగంధము పూయించి, విద్వజ్జనగోష్ఠి, సంగీతవాద్యసభలు, వినోదకార్యక్రమము లతో కాలక్షేపము చేయించెను. ప్రొద్దుక్రుంకగానే హంస తూలికాతల్పముపై శ్రీకృష్ణుని శయనించుమని విదురుడు తానొకప్రక్క తగినయాసనముపై కూర్చుండి 'దేవా! ఇది యొక పనిగా బెట్టుకొని వచ్చితివే. ఎందుకు? నీ మాటలు దుర్యోధనుడు వినునా? వారందరు చచ్చినచత్తు ముగాక, కాని సంధి పనికిరాదనుమాటపై నున్నారు. అంతే కాక వారు నీకు ద్రోహముతలపెట్టవచ్చును. నీ వటుపోకుము. ఇది నీహితవుకోరి చెప్పుచున్నాను' అని సవినయముగా చెప్పెను. కృష్ణునకది తెలియదా? 'నా కన్నియు తెలియును. కాని 'కృష్ణుడుకల్గించుకొన్నచో సంధి కాకపోయెనిదా?' అని

తెలియనివా రాడుకొనుమాటలను తానియ్యకుంటకై యిట్లుచే సితిని. నీవు హితవుచెప్పితివి. కాని నాకు వా రపకారము చేయగలరా?' అనుటతో 'అవును. చేయలేరు' అనిమెల్లగా కృష్ణునొద్ద సెలవుతీసికొని అతడు పండుకొనెను. కృష్ణుడు 'ఇత నివంటి సజ్జనుడుండబోడ' ని అతనిని మెచ్చుకొనెను.

తెల్లవారుజామున మంగళ వాద్యములతో మేలొ్కల్పులతో శ్రీకృష్ణుడు లేచెను. తెల్లవారుసరికి దుర్యోధనాదులు వచ్చిరి. వారితోపాటు కృష్ణుడు సభకరుదెంచెను. విదురు డచ్చటనే ధృతరాష్ట్రునికివెనుకగా కూర్చుండెను. కృష్ణుడు చెప్పవలసినది చెప్పగా వినక, కౌరవులాతని కట్టబోయిరి. అది చూచి విదురుడు ధృతరాష్ట్రునితో 'రాజా! నీకొడుకులు కృష్ణుని కేవలము మానవునిగా దలచి, కొట్టి, కట్టబోవుచున్నారు. నిప్పుముట్టిన కుసుకు మిడుతలవలె చచ్చిపోరా? వారికి కాలము మూడినది' అని దుర్యోధనునితో కృష్ణుడుచిన్ననాడే తనపరాక్రమము వ్యక్తమగున ట్లేమేమి చేసెనో తెలియదా? ఎందుకు చెడిపోదువు?' అనుచుండగానే కృష్ణుడు దివ్యరూపమును చూపెను. విదురున కా దివ్యరూపసందర్శనమును చూడగల దివ్యదృష్టినిచ్చెను. అతడు తనివితీర నాదివ్యరూప సందర్శనము చేసి ధన్యుడయ్యెను.

విదురుడు యుద్ధమున కేగినట్లు లేదు.

భారతయుద్ధమున నందరును ముడిసిరి. ధృతరాష్ట్రుడు తనకొడుకులమరణవార్త విని, పొంగిపొరలి వచ్చు దుఃఖముతో విచారించుచుండెను. సంజయు డూరార్చినాడు. కాని ధృతరాష్ట్రునికి దుఃఖము తగ్గలేదు.

అప్పుడు విదురు డతనిఁ జూచి 'ఏల అట్లు నేలపైఁ బడి పొరలుచున్నావు? లెమ్ము' అనుచు నిట్లు హితోపదేశముచేసెను:

'లోకములో వస్తువులకు పెరుగుట, నశించుట, ఇష్టమువచ్చిన ట్లుండుట, అసహ్యముగు నట్లు పుట్టుట, చచ్చుట మున్నగునవి నైజములు. యముడు భీరులను, పిరికివారిని సమముగ చంపును. నేర్పు, బలము చావును మాన్పలేవు. యుద్ధము చేసినగాని మరణము రాదా? ఇందు హద్దేమున్నదో? ఎల్లరును చచ్చువారలే. చావకుండ బ్రతుకుట కెవరివశము? కాక నీకొడుకులు యుద్ధములో చచ్చి యింద్రుని కతిథులైనారు; యజ్ఞయాగములచే, తపములచే సాధింపగల్గిన స్థానములను యుద్ధమున చచ్చినవీరులు పొందుదురు. కావున వారికై విచారింప పనిలేదు. సంసారము సాగరమువంటిది. ఇం దెవ్వరికై విచారింతువు? యౌవనము, రూపము, జీవితము అన్నియు ననిత్యములే. ఇవిపోయినవని విచారించుట అవివేకము. ఇష్టమైనపని జరుగకుండుట, అనిష్టమైనది జరుగుట అవివేకులకు సుఖముకల్గజేయును. ఒకబట్టవిడిచి మరొకబట్ట కట్టినట్లు జీవుడు దేహాంతరము నందును. దానికి పండితులు వగవరు. శుక్రశోణితములు కలసుకట్టి పిండముగానై అమేధ్యమధ్యమునుండి క్రమముగా వృద్ధిపొందును. పుట్టినతరువాత బాల్యమున శుచి, అశుచి తెలియకతిరుగును. యౌవనమున విషయాసక్తుడై నానా దుర్వ్యసనములకు తలొగ్గును. ముదుసలియైనతర్వాత ఇంద్రియశక్తులుడుగును. రోగములుపుట్టును. బాధలు హెచ్చును. యముడు తీసికొనిపోగా ఆజన్మను వదలును ఇది మామూలే!

ఒక గహనమైన అరణ్యములో నొక బ్రాహ్మణుడు తిరుగుచుండగా మితిలేని క్రూరమృగములు అడ్డగిలినవి. వాటిని తప్పించుకొనుచు అతడు పోగా దొంగలు కనపడిరి. దిక్కులేక ఎంతదూరము పోయినను ఆ యడవికి అంతు కన్పడలేదు. ఆ భీకరారణ్యమున ఉరులొగ్గి కనుపించినవి. అప్పు డొక్కస్త్రీ వచ్చి అతని కౌగిలించుకొనెను. అయిదు తలలు కల్గిన యేనుగులు పెడకొండలువలె నెన్నో ఆ యడవి నాక్రమించినవి. అక్కడ నొకనూయియున్నది. దానికి తీగలు కప్పియున్నవి. అత డందులోపడి పెద్దతీగ నూతగా పట్టుకొని తలక్రిందుగా వ్రేలాడుచుండెను. లోపల భీకరమగు సర్ప మున్నది. ఆ నూతియొద్దుననే యొకచె ట్టున్నది. దానికి ఆరు తలలును, పండ్రెండు కాళ్లున్నవి. నలుపు - తెలుపు రంగును కల మహాగజమా చెట్టువద్దకురాగా కొమ్మలపై రంగురంగుల తుమ్మెదలు తేనెను సంగ్రహించుకొనుచున్నవి. తెల్లగా, నల్లగానున్న రెండెలుక లాచెట్టును నరకుచున్నవి. ఆ తేనె బొట్లు పడుచుండ నాకుచు నత డట్లే వ్రేలాడుచుండెను. అత నికి తృప్తిలేదు. అసహ్యము లేదు. ఇంకను బ్రతుకదలచియే యున్నాడు' అని చెప్పుటతో ధృతరాష్ట్రుడు 'అత డెవడు? అట్లేల యుండెను?' అని ప్రశ్నించెను.

విదురుడు 'అదే సంసారము. ఆ యడవియే సంసా రము. మృగములు, ఉరులును రోగములు. స్త్రీ ముసలితనము ఐదుతలల యేనుగులు ఇంద్రియములు, నూతిలోని పాము మృత్యువు. తీగ జీవితాశ. నూతిదగ్గరిచెట్టు ఆయుర్దాయము. దానితల లారును ఋతువులు. దానిపాదములు పండ్రెండును

నెలలు. దాని నడుమ నెలుకలు రాత్రింబవళ్లు. తుమ్మెదలు కోర్కెలు. తేనెబొట్లు కోర్కెలనుభవించుట వలన కలిగిన యానందము. అదే సంసారము. దానిపరివర్తనములో తగు లొకొని, ఆ మోహపాశములు త్రెంపుకొనలేకపోవుదుము. కాన నీవిక విచారింపరాదు. నీపుత్రుల కుత్తరక్రియలు చేయు' మనెను. దానితో నతనికి శాంతి కలిగినను కొడుకులపేరు తలచుకొనుటతో మరల విచారము కలిగినది. అప్పుడు వేద వ్యాసుడువచ్చి అతని నూరడించెను.

యుద్ధానంతరమున ధర్మరాజు ధృతరాష్ట్రుని పోషించెను. విదురు డాతని సభలోనికి వెళ్ళుచుండెను. కొంతకాలము గడచినది. ధృతరాష్ట్రునికి వనవాసముచేయ బుద్ధిపుట్టెను విదురుడు, సంజయుడు, కుంతియు గాంధారీధృతరాష్ట్రులతో నడవికి వెళ్ళిరి.

అచ్చట శతయూపరాజర్షి యాశ్రమమున పర్ణశాలలు వేసికొని అందరు నుండిరి. కొన్నాళ్ళకు తల్లినిచూచు వేడుకతో పాండవులచ్చటికి వచ్చిరి. ధృతరాష్ట్రుడు యమునానదీ తీరమునకు స్నానమున కేగెను. పాండవులు నచ్చటికే వెళ్ళిరి. ఒకరి నొకరు కుశలప్రశ్నలు వేసికొనిరి.

అప్పుడు ధర్మరాజు 'అయ్యో! విదురు డిక్కడ లేడే: ఎక్కడి కేగినాడు? నా కతని చూడవలెనని యున్నది' అనెను.

ధృతరాష్ట్రుడు 'విదురుడు మునులవలెకూడ ఆశ్చర్యము కల్గించుచు ఎక్కడనో యొకచోట తిరుగుచుండును. నీరు త్రాగును; గాలి పీల్చును. అంతకన్న నతని కాహార మక్కఱలేదు. శూన్యమైన యడవిలో దైన్యములేక, స్వతంత్రమైన వృత్తితో నుండును' అనుచుండెను.

అంతలో కనుచూపుమేరలో విదురుడు కనబడెను. అతని యొడలంతయు అడవిబూడిద కొట్టియున్నది. జుట్టంతయు జడలుకట్టినది. దిగంబరుడై యున్నాడు. అట్లు కనిపించి ఆయాశ్రమమునకు రాక మరలిపోవుచుండెను. అతని నిట్లు చూచి ధర్మరాజు తక్కినవారి నక్కడనే యాగుమని తానొక్కడే విదురుని వెంబడించెను. విదురుడు చెట్లచాటుననుండి కనపడీకనపడక పారిపోవుచుండెను. ధర్మరాజు కంఠమెత్తి 'ఓ విదురా! నిలు నిలు! నేను ధర్మరాజును. నిన్ను చూడ వచ్చితిని' అని కేకలువేయుచు పరుగెత్తుచుండెను.

కొంతసేపటికా విదురుడు ఒకరహస్యప్రదేశమున నున్న చెట్టును చేరెను. ఆ చెట్టుమొదటను చేరి నిలిచెను. ధర్మరాజతనియెట్టయెదుటనిలబడి నేను ధర్మరాజను; నన్ను పలుకరింపుము. నాకేసి చూడుము అని యనగా సగము సగము కన్నులు మూసికొన్నట్లుగా నున్న ఆ విదురుడు యోగసమాధిచే ప్రాణముల నింద్రియములను గలపి తనశరీరమును విడిచెను. అతని శరీరమునుండి యొక తేజస్సువచ్చి ధర్మరాజులో ప్రవేశించినది.

దానితో అతనికి కాంతి, బలము నెక్కువైనవి. బుద్ధిబల మధికమైనట్లు తోచగా నతనికే ఆశ్చర్యము వేసినది.

అప్పుడా ధర్మరాజు విదురునిశవమునకు అగ్నిసంస్కారము చేయదలచెను. అది తెలిసి ఆకాశవాణి 'ఓరాజా! విదురునివంటి యోగియొక్క శరీరమునకు అగ్నిసంస్కారముచేయుట తగునా? వలదు' అని గట్టిగా వినబడెను.

అంతట నా ధర్మరాజు తమ్ములున్న చోటి కేగి ఆసంగతి చెప్పెను. వా రందరు నాశ్చర్యపడిరి.

ఈరీతిగా శాపవశమున శూద్రుడై జన్మించి యమధర్మరాజు యోగబలమున శరీరత్యాగము చేసెను. అతడెన్నో నీతులు బోధించెను. అన్నిటికన్న వేదాంత నీతులనెన్నిటినో చక్కగా బోధచేసెను. అత డవతారమూర్తి.

ధృతరాష్ట్రునకు కన్నులులేనిలోటులేకుండ తానే అన్నియున్నై కార్యతంత్రముల నడపెను. పాండవులయెడ పక్షపాతముగా కన్పడినను నిజమునకు నిష్పక్షపాతముగానే హితవు చెప్పువాడు. అతడనినట్లు 'ఎన్నిచెప్పినను జరుగదలచినది జరుగకమానదు. ఒక్కదైవము తప్ప మరెవ్వరును ఇట్లు నడుచుననికాని, ఇట్లు నడువగలమనికాని చెప్పలేరు.' ఆరీతిగా మనము కూడ అవశ్యకర్తవ్యత్వ నిశ్చయము కల్గియున్నను న్యాయమార్గమును వదలక ప్రయత్నించుచుండవలెను. కార్యనిర్వాహణము చేయుచుండవలెను.

విదురుడు కృష్ణునకు విందుచేసి భగవంతుని కోరిన దోర్కెలు:

కం. నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యము నితాం
తాపారభూతదయయును
తాపసమందార! నాకు దయసేయగదే!

స్వస్తి ప్రజాభ్యః!

# ధర్మరాజు

అన్నివిషయములలోను మంచివాడుగా పేరెన్నిక గన్నవా డొక్క- ధర్మరాజే! అతడు రాజనీతి నెరిగినవాడు, వినయ విధేయతలు కలవాడు, మహాబలశాలి, సమయ మెరిగి పనిచేయు నేర్పరి, ఆచి - తూచి మాటలాడు వక్తయు. జూదమాడుట యితని కున్న దుర్గుణముగా దోచును. అది మహారాజైనవానికి దాటరాని ధర్మము. సుహృద్ద్యూత, అనుద్యూతముల కాహ్వానించినపుడు వెళ్లకుండ నుండరాదు. అట్లు నీతికి కట్టుబడియే మోసపోయినాడు. ఎన్నికష్టము లను భరించినను మాటమీద నిలుచునట్టి దిట్టరి. అతనిగూర్చి విపులముగా నిందు దెలిసికొందము.

పాండురాజునకు సంతానము కల్గలేదు. సంతానమును కన్నచో గాని, ఉత్తమగతులులేవని విన్నాడు. తనకు భార్యా సంగమమువలన ప్రాణముపోవునని శాపమున్నది. అదంతయు నాలోచించి అతడు సంతానము నెవరివలననైనను కనుమని కుంతిని ప్రోత్సహించినాడు. ఆమె 'మనసాకూడ పరపురుషుని తలపను. ఇప్పుడు పరపురుషు నెట్లు కూడుదును?' అని, తనకు చిన్నతనమందు లభించిన దుర్వాసుడు చెప్పిన మంత్రము మాట చెప్పి, 'యే దేవత నారాధించవలెనో చెప్పు' మన్నది. అతడు 'లోకస్థితికి మూలమైనది ధర్మము. ధర్మస్థితికి మూల మైన ధర్మరాజు నారాధించు'మని యనుమతిచ్చినాడు. ఆమె పవిత్రశీలముతో యమధర్మరాజు నారాధించినది. అతడు సంతుష్టుడై పుత్రుని ప్రసాదించినాడు. ఆకాశవాణి

ఆ బాలునికి 'యుధిష్ఠిరు'డని నామకరణము చేసినది. అతడు 'ధర్మజుడు, ధర్మరాజు' అను నామాంతరములు ప్రసిద్ధుడైనాడు.

వసుదేవునికి చెల్లెలే కుంతీదేవి. చెల్లెలు సంతానవతి యైనట్లు విని వసుదేవుడు తనపురోహితుడైన కశ్యపు డను విప్రునిచేతికి కానుకలిచ్చి పంపించినాడు. అతడు శతశృంగ పర్వతమున కేగి వసుదేవునిసందేశమును చెప్పి, బాలురను విద్యాభ్యాసము చేయుచుండెను.

అంతలో పాండురాజు పరలోకగతుడుకాగా మును లా బాలురను హస్తినాపురమునకు తీసికొనివచ్చిరి. అప్పటికి ధర్మరాజునకు పదునారవయేడు. అక్కడ ధృతరాష్ట్రుడు బాలురను ప్రీతితో పెంచుచు, చదువుచెప్పించుచుండెను. తర్వాత ద్రోణాచార్యునొద్ద విలువిద్యనేర్చెను. ఒకనాడు ద్రోణు డస్త్ర విద్యలో శిష్యుల పరీక్షింపదలచెను. ఒకచెట్టుపై నొకపక్షిని కట్టించి ధర్మరాజునుపిలిచి 'అదిగో ఆచెట్టుపై పక్షి కనపడుచున్నదా?' అనగా, ధర్మరాజు 'కనపడుచున్న' దనెను. 'ఇంకను తక్కినవి కపడుచున్నవా?' అనగా, 'అన్నియు కనపడుచున్నవి' అని సమాధానముచెప్పెను. 'నీకు లక్ష్యశుద్ధి కుదురలే' దని గురుడు అతని వెనుకకు నెట్టెను. అందులో నెగ్గినవా డొక్క అర్జునుడుమాత్రమే.

ధర్మరాజు యువకుడైనాడు. ధృతరాష్ట్రు డతని యువ రాజుగా పట్టముకట్టెను. హస్తినాపట్టణమునకు వచ్చి పదు మూడేండ్లు గడచినవి. ధర్మరాజుమంచిగుణములు లోకుల నాకర్షించినవి. దుర్యోధనున కీర్ష్య పెంపొందినది. మరికొన్నా

ప్పిట్లు ధర్మరాజు యువరాజుగానున్నచో తనకు ఉప్పుపుట్టదని తండ్రిదగ్గరవాపోవ సాగె. జెప్పిన కాశికి పంపెదనని పాండవుల పిలిచి 'కాశీకిపోయి తండ్రికై ధర్మకార్యములు చేయు' డనెను. అందులో నేదోకుతంత్రమున్నదని తెలిసికొనికూడ ధర్మరాజు వెళ్ళ ననలేదు. వెళ్ళునపుడు విదురుడు నేర్పుగా 'విషాగ్నులవలన జాగ్రత్త!' అని చెప్పిపంపెను. అప్పటికే అక్కడ లక్కయిల్లు తయారైనది. దానిసంగతి ముందుగా విదురునిద్వారా ఒక్క ధర్మరాజునకే తెలియును. ఒకనా డతను తమ్ములతో జాగ్రత్తగానుండుడని హెచ్చరించెను. భీము డాలక్కయింటిని నిర్మించిన పురోచనుని చంపెదననెను. కాని ధర్మరాజు 'మనము ముందుగా నట్లుచేసినచో భీష్మునకు నిజము తెలియనందున కోపమురావచ్చును. ముందుగానే మన మిక్కడినుండి వెడలిపోయినచో దుర్యోధనుడు మనల కష్కారము తలపవచ్చును. అందుచే రహస్యముగాపోద' మనెను. భీమునివలన లక్కయింటిలో తగులబడకుండ పాండవులు బ్రతికిరి.

హిడింబాసురుని చంపి హిడింబనుకూడ పొమ్మన్న భీమునితో ధర్మరాజు 'చంపవచ్చినవాని చంపితివి. అది ధర్మమే. దీనిపై కోపింపకుము. ఈమెను దయచూడుము' అని హితము నుపదేశించినాడు. ఆమె సంతోషించినది. అక్కడనున్న చెట్టుక్రింద శాలిహోత్రుని తపఃప్రభావముచే పుట్టినకొలనులోనినీరు త్రాగి, వ్యాసు డుపదేశించినరీతిగా కొన్నాళ్లు గడపిరి. తర్వాత ఏకచక్రపురము చేరిరి. తర్వాత ద్రుపదునిపురి కేగిరి. అక్కడ అర్జునుడు ద్రౌపదిని గెల్చినాక

ధర్మజుడుకూడ ఆమె నైదుగురునుకలిసి పెండ్లాడుట కోరుకొనెను. వ్యాసుడువచ్చి ధర్మరాజుమాట ధర్మయుక్తమని చెప్పి, ద్రుపదుని ఒప్పించెను. అట్లామె నాయైదుగురు పెండ్లి చేసికొనిరి.

శ్రీకృష్ణాదులు వారిని కలిసిరి. ఆవిషయము తెలిసి కౌరవులు వారిని తోడితెచ్చుటకే నిర్ణయించిరి. ధృతరాష్ట్రుడు విదురునిపంపి పాండవులను రప్పించి అందరియెదుట 'వీరికర్థ రాజ్యమిచ్చితి' నని చెప్పెను. ఖాండవప్రస్థమున పాండవులు నివాసముచేసిరి.

కృష్ణుడు దేవేంద్రుని తలచగా, ఇంద్రుడు విశ్వకర్మతో 'దేవతానగరమునకు సాటియైన నగరమును నిర్మింపు' మని చెప్పెను. అతడు మహావైభవసమృద్ధికల్గునట్లు నగరమును నిర్మించెను. దానికి 'ఇంద్రప్రస్థపుర' మని పేరుపెట్టిరి. శుభముహూర్తమున వ్యాస శ్రీకృష్ణుల యనుమతిపై పురప్రవేశముచేసిరి. ధర్మరాజు చక్కగా సధర్మముగా పరిపాలించుచుండ అన్ని వర్ణములవారికి, అన్ని యాశ్రమములవారికిని చాల సుఖము కల్గెను. దేశము సుభిక్షముగాపండి ప్రజల కత్యంతానందదాయకమై యొప్పారినది.

అంత నొకనాడు నారదమహర్షి వచ్చెను. ధర్మరాజతనికి మర్యాదలుచేసెను. అతడు 'నాయనా! మీరు బుద్ధిమంతులు. అయినను కాంతాకనకములే కలహకారణముల గుచుండును. సుందోపసుందులను రాక్షసు లొక్కస్త్రీకై తగవులాడి యొకరిచేతిలో నొకరు మడిసిరి. కాన మీరైదుగురు నొక్కొక్క రొక్కొక్క యేడాదికాపురము చేయుడు.

అప్పుడు తక్కినవా రెవరును వారియింటిలోనికి రాకుండునట్లు నియమము చేసికొనుడు' అని హితవు కరపెను. వా రట్లే నియమముగా నుండిరి.

ఖాండవదహనమున మయున కుపకారము చేసిన దానికి ప్రతిగా నతడు మైనాకపర్వతముపై పదునాలుగు నెలలు నిర్మించిన చిత్రవిచిత్రమైన సభను ఎనిమిదివేల రాక్షసులచే మోపించుకొనివచ్చి ధర్మరాజున కిచ్చెను. ధర్మజుడు పదివేలమంది బ్రాహ్మణులకు తల కొక వేయిధేనువుల దాన మిచ్చి, పాయసాహారము పెట్టించి, శుభముహూర్తమున సభా ప్రవేశము చేసెను. అతనిని సకలరాజులును కానుకలు తెచ్చి సమర్పించి సేవించువారు. సుబల మార్కండేయాది మహా మునులందరును వచ్చి, ఆ సభ జూచి, ఆశ్చర్యపడి, ధర్మజుడు చేయు పూజలనంది, అతని దీవించి వెళ్లుచుండెడివారు.

ఒకనాడు నారదుడు వచ్చెను. అతని కుచితసత్కారము లియ్యగా నతడు సుఖాసనముపై కూర్చుండి ధర్మరాజును రాజనీతివిషయమున ప్రశ్నించెను. అతడు 'నా యథాశక్తిగా అధర్మమార్గము పోగొట్టి, మహాత్ములకథలను వినుచు జాగ్రత్తగా నడుచుకొనుచున్నాను. దేవమునీ ! మీరు చూచిన దిక్పాలకులసభలలో నిట్టిసభ యున్నదా?' అని మయసభను చూపెను. నారదుడు దిక్పాలురసభలను, బ్రహ్మసభను వర్ణించి చెప్పి, "పాండురాజు యమునిసభలోనున్నాడు. హరిశ్చంద్రుడు దేవేంద్రసభలో నున్నాడు. మీ తండ్రి నాతో నీకు చెప్పుమని కొన్నిమాటలు చెప్పినాడు: 'నే నిక్కడనే యుండిపోయితిని. హరిశ్చంద్రుడు రాజసూయము

చేయుటచే నింద్రునిసభలో నున్నాను. తమరు నాపుత్రుని రాజసూయము చేయుమనుడు. దాని మహిమచే నాకు పితృపితామహులతో సహా పుణ్యలోకములు కల్గును' అని చెప్పెను. కావున నీవు రాజసూయము చేయుము. ప్రజా రక్షణ కావింపుము. ఆ యజ్ఞమునకు విఘ్నము చేయుటకై దేవ దానవులు వేచియుందురు. నిర్విఘ్నముగా నాయజ్ఞము పూర్తి యైనచో ఆఖరున ప్రజలకందరికి నాశనమునిచ్చు మహాయుద్ధ ముజరుగును' అని చెప్పి ప్రోత్సహించి నారదుడు వెడలిపో యెను.

ధర్మరాజు సభలోనివారితో 'విన్నారుకదా, నారదుని మాటలు! తండ్రికోరిక కొడుకు నెరవేర్పవలయును. కాని చివర మహారణమగునని చెప్పినాడు. పితృప్రీతిగా చేయవల యునని యున్నది; ప్రజాక్షయమగునని మానవలెననియు నున్నది' అనెను. దాని కందరును రాజసూయమును చేయు టయే కర్తవ్యమనిరి. ముఖ్యముగా భీమార్జునులు 'మాకు బల మున్నందులకు నీ వాయజ్ఞము చేసినగాని ఫలములేదు. రాజుల నందరిని గెల్చి నీచేత నా యజ్ఞము చేయింతు' మనిరి. శ్రీకృ ష్ణుడు లెక్కవేసిచూచి, తప్పక జరుగునని చెప్పి ప్రోత్స హించెను. కృష్ణునిసహాయముననే భీమార్జునులు జరాసంధుని, తక్కినరాజులను గెల్చి ధనముల రాసులుగా తెచ్చిరి.

శ్రీకృష్ణుడు ప్రోత్సహింపగా ధర్మరాజు రాజసూ యము సేయనిశ్చయించెను. అందరు రాజులునువచ్చిరి. భీష్మ విదుర ధృతరాష్ట్రాదులను నకులునిచే పిలిపించెను. ఆయజ్ఞ ముతో మంచిచెడ్డల చూచుటకు భీష్మ ద్రోణులను, ఖర్చుచే

యుంటను వినుచుని, కానుకలు పుచ్చుకొనుటకు దుర్యోధనుని నియమించెను. యాజ్ఞవల్క్యుడు, వ్యాసుడు, జైమిని, నారదాది బ్రహ్మర్షులు సహాయులుగా నుండగా యజ్ఞమును యథావిధిగా చేయుచుండెను. అందు 'శ్రీకృష్ణుని సభాపతిగా పూజింపు'మని భీష్ముడనెను. అప్పుడు సహదేవుడు పూజాద్రవ్యములు తేగా ధర్మరాజు శ్రీకృష్ణుని పూజించెను. అదిచూచి సహింపక శిశుపాలుడు ధర్మరాజాదుల నాక్షేపించెను. ధర్మరాజు శిశుపాలుని బతిమాలెను. అతడు వినలేదు. అప్పుడాఖరునకు శిశుపాలుడు శ్రీకృష్ణునిచేతిలో చచ్చెను. యజ్ఞము వాసుదేవునిదయచే పూర్తియైనది. కృష్ణుడు వెళ్లుచు ధర్మరాజుతో చెప్పగా నతడు 'పరమేశ్వరా! నీవు ద్వారకలో నున్నను మ మ్మొకకంట కనిపెట్టుచునే యుండవలెను సుమా! నిన్నువదలి మేము క్షణమైనను నిర్వహింపలేము' అని కన్నీళ్లతో కృష్ణుని సాగనంపెను.

ఆ యజ్ఞములో కానుకలుపుచ్చుకొనుచున్న దుర్యోధనుని కసూయ పెరిగిపోయినది. అతనిభావమును వర్ణించు పద్య మిది:

భావిపురాతనావ్యతనపార్థివలక్ష్ములు పాండవేయు ల
క్ష్మీప్రభవంబుతోడ నుపమింప సమంబులుగా వశేషరా
జావళితోన నత్యధికులైన సపత్నుల పెర్మిఁజూచి యేఁ
జూచె సహింపనోపక కృశుండ వివర్ణుఁడనైతి నెంతయున్.

మూడుకాలములలోను ధర్మరాజు రాజ్యలక్ష్మితో సాటియైన సంపద లుండవు. అందరిలోను గొప్పవారైన శత్రువులవృద్ధిచూచి సహింపలేకయే నే నిట్లు పాలిపోయి

చిక్కితి ననెను. దీనితో ధర్మరాజువైభవమెంతో తెలియు చున్నదికదా! అదే దుర్యోధనుని పగసాధింపబూనుటకు, ధర్మరాజు కష్టములకు కారణమైనది. మహానుభావుడు నారదుడు హితవుచెప్పినను తనభావమును తాను వదలుకొనడు గదా!

ధృతరాష్ట్రు డొక సభను నిర్మింపజేసెను. దానిని చూచుటకై ధర్మరాజాదులను పిలిపించెను. వారుసభనుచూచి ఆనందించిరి. అప్పుడు దుర్యోధనుడు 'ధర్మజా! సుహృద్ద్యూత మాడుదమా?' అని పిలిచెను. అతడు 'మోసము, జూదము అను రెండును రాజనీతివిరుద్ధములు కదా! దానితో ధర్మార్థములు రెండును నశించును. కాన మన మాడవలదు' అనెను. 'ద్యూతకళలో నేర్పుకలవా డన్నదును జూదమును నిందింప రాదు. కాక బలహీనులు, బలవంతులతో కలిసి యాడిన నపుడు బహుమాయలు పన్నవచ్చు నని యున్నది కదా! కావలసినది జయ మొక్కటే. 'అని శకుని అని' నీవు జూదమాడలేనిచో మానుము' అనెను. దానితో ధర్మరాజునకు పౌరుషమువచ్చినది. 'ఆఁఆఁ నేనుమాత్ర మాడనంటినా? పది మాట లెందుకు? రమ్మని యతడాడ నారంభించెను. దుర్యోధనుని పక్షమున శకుని యాడుచుండెను. సుహృద్ద్యూతమని భీష్మాదులు వచ్చిరి. మొదటినుండి ధర్మజునకు ఓటమియే కల్గుచుండెను. అంతకంతకు కోపము హెచ్చుచుండెను. అందు లోనికి దిగకయే యుండవలెగాని దిగినతర్వాత నెవడు బయ టికి రాగలడు?

అప్పటికి రాజ్యములో నున్న తన సొత్తంతయు నోడి నాడు. 'ఇక పందెమొడ్డినగాని పాచికలు వేయ' నన్నాడు శకుని. రాజ్యమే పందెముగా వేసినాడు ధర్మరాజు. వెంటనే యోడినాడు. ఒక్కొక్కడుగా తమ్ములను, తనను ఓడినాడు. అప్పుడు 'ఓధర్మజా! నీ కింకొకధన మున్నది- పాంచాలి- మరచితివా?' అని హెచ్చరించెను. అసలు కావలసిన దామెయేకదా, వారికి. ఆమెనుకూడ పందెము కాసినాడు ధర్మరాజు. ఓడుట సిద్ధమేకదా! ఇక నేమియులేక తెల్లమొగ మువేసికొని దీనముగా కూర్చున్నాడుకాని, ధర్మరాజు- లేనిచో పాపము ఒడ్డెడివాడే. దుర్యోధనుడు ప్రాతికామిని పంపి ద్రౌపదిని తీసికొని రమ్మనెను. ఆమె ధర్మసంశయ మడిగినదికాని రాలేదు. అప్పుడు దుశ్శాసనుని పంపినాడు రాజు. దుశ్శాసను డామెను లాగికొనిరాగా వస్త్రములు విప్పి నను దోషములేదన్నాడు కర్ణుడు. సరే కానిమ్మన్నాడు రారాజు. అది వినగానే పాండవులు తమ యుత్తరీయములు తీసి క్రిందపెట్టిరి. ద్రౌపది బట్టలు విప్పబోయి, చివరకు వ్యర్థ ప్రయత్నుడైనాడు దుశ్శాసనుడు. భీమసేనుడు కోపముతో ఆయుధ మున్న కేసి చూడగా ధర్మరాజు కనుసన్నచే నాతనిని వారించెను. ధృతరాష్ట్రుడు ద్రౌపదికివరముగా రాజ్యమిచ్చెను. ధర్మరాజు మరల రాష్ట్రై యింటి కేగెను.

మరల అనుద్యూతమునకై (ఒకసారి యోడినవెంటనే చేయుజూదము) రమ్మని పిలిచిరి. ధర్మరాజు మానక ప్రజలందరును విచారించుచుండగా తమ్ములు, భార్యతో కలిసి వచ్చెను. ఈసారి ఇచ్చిన రాజ్యమునొడ్డుట మంచిదికాదని,

'ఓడినవారు నారచీరలు కట్టుకొని పండ్రెండేండ్లు వనవాసము, నొక్క-యేడాది అజ్ఞాతవాసము చేయుట' పందెముగా ఆడు మని శకుని హెచ్చరించినాడు. ధర్మరాజా జూదక మానుదునా యని ఆడిఓడెను. శుభాశుభకర్మఫల మనుభవింపక యెవ్వా రికిని తప్పదుకదా!

విదురునికోరికపై కుంతీదేవిని విదురుని యింటివద్దనే యుంచి సపత్నీకముగా పాండవులు వనవాసమునకు బయల్దేరిరి. అందు ధర్మరాజు ముఖమునకు గుడ్డకప్పుకొని వెళ్లెను. దానికి కారణము- మోసముచే రాజ్యముపోగొట్టుకొనెను కాన, ఆకో పముతో జనులను చూచెనా వారు మండిపోదురని అట్లు చేసె నట! అది విదురుని వ్యాఖ్యానము.

చాలమంది వారివెంట వనవాసముచేయబోగా ధర్మ రాజు వారినిరావలదని మరలించెను. కాని,కొందరు బ్రాహ్మ ణులు మాత్రము వెనుకకుపోలేదు. వారితో 'అయ్యా! ఉన్న దంతయుపోయి, అడవికిపోయెడి మాతో వచ్చి బాధపడుట మీ కేల? వెనుక కేగుడు' అని ధర్మరాజు బతిమాలెను. కాని వారు 'మాకు వేరుదిక్కు- లేదు. మాతిండిమేము తెచ్చుకొని తిందుము. నీతోవచ్చుట కభ్యంతర మేమి?' అనగా ధర్మరా జు కేమియుననలేక అంగీకరించెను. కాని, ఇష్టమృష్టాన్నము లతో తృప్తులగువారిని శాకాహారములచే కృశింపజేయుట తన కభిమతముకాదని ధర్మరాజు విచారించగా శౌనకుడు వేదాంతధర్మోపదేశము చేసెను. అంతట ధౌమ్యుడు మంత్రోపదేశముచేయగా ధర్మరాజామంత్రముతో సూర్యుని సేవించెను. సూర్యభగవానుడు తృప్తిబొంది 'నీతపమునకు

మెచ్చితిని. ఈ పన్నెండేండ్లును వన్యములైన ఫలములు, మూలములు, శాకములు నంటయింటిలోననే అక్షయముగా లభించును. అదంతయు దీనిమహిమ' మని రాగిచెంబె నిచ్చి అంతర్ధానమయ్యెను. అదిమొద లెన్నివేలమందికైనను విందులు సునాయాసముగా చేయుచుండెను.

ఒకనాడు శ్రీకృష్ణుడువచ్చి వారిచే గౌరవములంది సుభద్రాభిమన్యులను తీసికొని ద్వారక కేగెను. ధృష్టద్యుమ్నుడు వచ్చి ప్రతివింధ్యాదులైన ఉపపాండవులను తీసికొని తననగరమున కేగెను. పాండవులు ఇసువదిమంది భటుల తోను, కొన్నివేలమంది బ్రాహ్మణులతోను ద్వైతవనమున కేగిరి. అడవిలో ద్రౌపది బాధలు పడలేక—కాదు—మహా భోగములతో పదివేలమంది కిష్టముగా సంతర్పణములు సేయులేమన్నట్లు వనవాసముచేయుటకు చింతించి, ధర్మ రాజుతో 'ఓర్పు వల'దన్నది. కాని అతడు 'క్షమ (ఓర్పు) చాల మంచిగుణము. ధర్మమును దూషించునానికి ప్రాయశ్చిత్తములేదు. వా రన్యాయము సేయుదురుగాక! నే నేల న్యాయము తప్పవలెను? స్వర్గారోహణసోపానమైనదిధర్మమే!' అని చెప్పెను. భీముడు 'వెంటనే పోయి కౌరవులను జయించె ద'మనెను. వానికికూడ 'అంతతొందర పనికిరాదు. కాలమును నిరీక్షింపక తప్పదు. అందరిసమక్షమున అన్నమాటను దాటరాదు' అని మందలించెను. అర్జునునికి నట్లే సమాధాన మిచ్చెను. అంతట వేదవ్యాసుడు అచ్చటికి వచ్చెను. అతని పూజించిరి. అప్పు డతడు 'ప్రతిస్మృతి విద్యచే అర్జునుడు లోకపాలురను, శివుని సంప్రీతుని చేయును' అనిచెప్పి, 'ఇక

మీ రీ వనములో నుండవలదు. ఇక్కడి మృగముల కభ్యంతరముగా నున్న'దని చెప్పగా, పాండవులు సరస్వతీనదీతీరమున నున్న కామ్యకవనమున కేగిరి. అచ్చట వ్యాసుని యుపదేశప్రకారము ధర్మరాజు అర్జునుని వెళ్ళి తపస్సుచేయు' మని పంపెను.

ఆ వనవాసముచేయురోజులలో పాండవులవద్ద కెందరో మునులు వచ్చిరి. ఎన్నెన్నో నీతుల నుపదేశించిరి; కథలు చెప్పిరి. అట్లొకనాడు బృహదశ్వుఁ డనుముని రాగా 'మావలె కష్టములుపడినవా రెవ్వరైన నుండిరా?' అని ధర్మరాజడుగగా ఆముని నలోపాఖ్యానమును చెప్పెను.

తరువాత నారదమహర్షి వచ్చి తీర్థముల మాహాత్మ్యము చెప్పెను. అప్పుడు ధర్మరాజునకు తీర్థయాత్రలు చేయవలెనని కోరిక కల్గినది. మహర్షులు 'మేము విడిగా భయంకరమైన అడవుల కడ్డముపడి యాత్రలుచేయలేము. కనుక మీ వెంటవత్తు'మనిరి. అతఁడంగీకరించెను. వ్యాసుడు, నారదపర్వతులువచ్చి తీర్థయాత్రవలన పుణ్యములువచ్చునని' చెప్పిరి. రోమశుడు ధర్మములు చెప్పుచు, ధర్మసంశయములను తీర్చుచుండ పాండవులు నైమిశాదివనములను ప్రయాగాది క్షేత్రములను, గంగాదిపుణ్యనదులను సేవించిరి. అక్షయవటములో నుండగా శమఠు డనుముని వచ్చి గయామాహాత్మ్యము చెప్పెను. అక్కడినుండి పాండవు లగస్త్యాశ్రమమున కేగిరి. అక్కడ రోమశుడు చెప్పగా అగస్త్యమునిచరిత్రను వినిరి.

అక్కడినుండి మహేంద్రపర్వతమున కేగిరి. అక్కడ అకృతవ్రణుడు చెప్పగా పరశురామునిచరిత్రను విని, పరశు

రాముని చూచి, మ్రొక్కి, అక్కడనుండి దక్షిణముగావచ్చి, త్ర్యంబకమువద్దపుట్టిన గోదావరినదిని దర్శించెను. తర్వాత ద్రవిడదేశమున కేగి శూర్పాకారపర్వతమున పరశురామ వేదినిచూచి అక్కడ పండ్రెండురోజులు ధర్మరాజు గాలి - నీరు ఆహారముగా పంచాగ్నిమధ్య తపస్సుచేసెను.

అక్కడికి బలరాముడు, కృష్ణుడు తమ పరివారము లతోవచ్చి పాండవులకథను విని వారి నూరడించిరి. వారు వెంటనే శత్రువులను చంపుదమనగా,మాట తప్పరాదని ధర్మ రాజు వారికోపముల నుపశమింపజేసి వెనుకకు పంపించెను. వారందరు వెళ్ళిపోయిరి. అక్కడినుండి పాండవులు నర్మదలో స్నానమాడి వైడూర్యపర్వతముపై శర్యాతి యజ్ఞముచేసిన చోటుచూచి సుకన్యాచరిత్రమును వినిరి. అటనుండి యమునా నదికి వెళ్ళిరి.

తరువాత వారుగంగాతీరమున వెళ్లి యెన్నోతీర్థములను, పర్వతములనుచూచి గంధమాదనపర్వతమున కేగిరి. ద్రౌపది నడువలేక బాధపడుచుండగా అన్నదమ్ములు (భీముడు, నకుల సహదేవులును) ఆమెకు సేవచేయుచుండిరి. ధర్మరాజామె పాట్లుచూచి 'పాపము! మామూలముగా ఈమె కెంత కష్టము వచ్చినది? పాండవులకు భార్యయై సుఖపడునని ద్రుపదుడు తలచెను. కాని యిట్లు బాధపడునని తలపలేదు. అయ్యో!' అని విచారించగా ధౌమ్యాది బ్రాహ్మణు లతనినూరడించిరి. అప్పుడు ధర్మరాజు భీమునితో 'నాయనా! ఈమె యీ దుర్గ మారణ్యమున నడువలేదోయీ!' అనగా నతడు ఘటోత్క చుని తలచుకొనెను. అతడు రాక్షసబృందముతో వచ్చి

యెదుట నిలబడెను. భీము డాతనితో ద్రౌపది నెత్తుకొని నడువుమనెను. కాని, అతడు పాండవులను, ద్రౌపదిని, ధౌమ్యుని ఎత్తుకొనెను. తక్కినరాక్షసులు మిగిలిన బ్రాహ్మణుల నెత్తుకొనిరి. బదరీవనములో వారినందరిని దింపిరి. అక్కడ ఆరు రోజులు పాండవులు గడపిరి.

అక్కడనుండగా సౌగంధికాపహరణము జరిగినది. తర్వాత నొక దివ్యకుసుమమును తెమ్మని ద్రౌపది కోరగా భీము డేగెను. మణిమంతుడను కుబేరునిభటుని చంపెను. అక్కడికి ధర్మరాజాదులు వెళ్ళిరి. కుబేరుడు వారిని సత్కరించెను. అక్కడ నుండగానే అర్జునుడు స్వర్గమునుండి మరలివచ్చెను. అతనివిజయగాథలను ఇంద్రుడువచ్చి చెప్పగా విని ధర్మరాజానందముగా ఇంద్రుని గౌరవించి పంపెను. మరల బదరీ వనమునకు వచ్చి హిమవత్పర్వతముపై నొక్క యేడాది గడపిరి.

అక్కడ నొక్కనాడు భీము నొక కొండచిలువచే పట్టబడెను. అప్పుడు ధర్మరాజక్కడికివచ్చి తమ్ముని విడువుమని పామును ప్రార్థించెను. అది 'నేను నహుషుడను. నే వేయు ప్రశ్నల కుత్తరము లిచ్చినచో నీతమ్ముని వదలుదును. లేకున్నచో మరలిపొమ్మనెను. 'అయ్యా! నీ ప్రశ్నలకు పండితులు తప్ప మరెవరును జవాబియ్యలేరు. అయినను నాచేతనైనంత వరకు ప్రయత్నింతును. అడుగు' మనెను.

పాము : బ్రాహ్మణు డెవడు? అతనికి తెలియదగిన వస్తు వేది?

ధర్మ : సత్య క్షమా దమ శౌచ దాన శీలము లెవ్వని కుండునో వాడే బ్రాహ్మణుడు.

పాము : అట్లయినచో ఆ గుణములున్నచో శూద్రుడు బ్రాహ్మణు డగునా?

ధర్మ : స్వాయంభువమనువు వర్ణవిభాగము చేసెను. బ్రాహ్మణగుణములుకలశూద్రుడుసహ్బ్రాహ్మణుడగును. బ్రాహ్మణుని కాగుణములు లేనిచో శూద్రుడేగును. ధనములేనివాడు ధనముసంపాదింపగలడుగాని, వృత్తము (నడవడిక) చెడినవాడు మరల వృత్తమును సంపాదింపలేడు. కావున ధనముకన్న వృత్తమునే రక్షించుకోవలెను.

పాము : అప్రియము చేసినను, అసత్య మాడినను హింసచేయనిచో అతడు సద్గతి పొందును. ఎట్లు?

ధర్మ : దానము, ప్రియము చేయుట, సత్యము, అహింస అను నాలుగుధర్మములును సమానములే. అయినను అహింస ఎక్కువది. దేవ, మనుష్య, తిర్యగ్జాతులలో మనుష్యుడు దానాదులు చేయుచు అహింసాపరుడైనచో దేవగతిని పొందును; హింసచేసినచో తిర్యగ్జాతి పొందును. అందుచే అహింస గొప్పది.'

అని సదుత్తరము లిచ్చుటతో నహుషుడు సంతోషించెను. శాపవిముక్తు డయ్యెను. ధర్మరాజు నహుషునివలన అధ్యాత్మరహస్యమును నేర్చెను.

అంతట నొక్కనాడొక బ్రాహ్మణుడు వచ్చి 'శ్రీకృష్ణుడు, మార్కండేయముని మిమ్ములను చూచుటకు వచ్చుచున్నారు' అని చెప్పెను. అట్లే ముందుగా కృష్ణుడు వచ్చెను.

కొంతసేపటికి మార్కండేయులువచ్చెను. అప్పుడే నారదుడు వచ్చి మార్కండేయుని ధర్మరాజునకు చక్కనికథలను చెప్పుమని వెడలిపోయెను.

తరువాత మార్కండేయు డెన్నో నీతిబోధకములు, వేదాంతబోధకములు నైన కథలను ధర్మరాజునకు చెప్పి, తనయాశ్రమమున కేగెను.

దుర్యోధను డప్పుడే పాండవులకు తన వైభవము చూపి పరిహాసింపదలచి, వీలైనచో సంహరింప నిశ్చయించియు సేనాసమేతుడై అడవికివచ్చి పాండవులున్నచోటికి దగ్గరగా విడిదిచేసెను. అది గంధర్వభూమియగుటచే వారు వచ్చి అతని చావగొట్టి రెక్కలుకట్టి తీసికొనిపోయిరి. అప్పుడు వారి భటు లేడ్చుచు వచ్చి, ధర్మరాజుకాళ్ళపైబడి, జరిగినది చెప్పి రక్షింపుమని వేడిరి. భీముడు అన్నతో 'కాగలకార్యముగంధర్వులు నెరవేర్చిరి. మనకు జయము కలిగినది' అనెను. అదివిని ధర్మజుడు 'నాయనా! అన్నదమ్ముల బిడ్డల కొక్కొకసారి ధనమూలముగా తగవురావచ్చునుగాని పైవారిచే పరాభవము వచ్చినపుడు వారందరు నొక్కటి కావలసినదే. దీనిని మన ముపేక్షింపరాదు' అని అతనుబతిమాలెను. 'మనబల మొసగుటచే మనము విడిపింతుమను నాసతో నుండును. మనకు పుణ్యము, కీర్తియు వచ్చుసమయమిది. నేను యజ్ఞదీక్షలో నున్నందున కాని లేకున్న నేనే వెళ్ళి యుందును. వెళ్ళుము. నాయజ్ఞము పూర్తికానిమ్ము' అని పల్కెను. అప్పుడు భీమార్జున నకులసహదేవులు వెళ్ళిరి.

యుద్ధములో చిత్రసేనుడను గంధర్వరాజు నోడించి యర్జునుడు దుర్యోధనాదులను కట్లతోసహా తెప్పించి ధర్మరాజుముందర నిలబెట్టించెను. ధర్మరాజు చిత్రసేనునితో 'మావారిని చంపకపోవుటవలన నెంతోపని కలిసివచ్చినది. లేకున్న మావంశమునకే బాధకల్గెడిది. వారికి కట్లువిప్పి వెళ్ళు' మని అతనిని సాగనంపెను. తర్వాత దుర్యోధనునితో 'నాయనా! ఎప్పుడు నిట్టిసాహసకార్యములుచేయకుము.దుర్జనుడాలోచనలేక పనులుచేసి చెడిపోవును. కాన నీవారల తీసికొని నీపట్టణమునకు పొమ్ము. ఇట్లు జరిగినదని మనస్సులో కూడ నేవిధమైన విచారమును పొందకుము' అని బుద్ధిచెప్పి సాగనంపెను. దీనిబట్టియే 'అపకారికి నుపకారము, నెపమెన్నక సేయువాడు నేర్పరి' అన్నసామెత వచ్చినది.

తర్వాత దుర్యోధనుడు వైష్ణవయాగము చేయుచు పాండవులను రమ్మని దూతను పంపెను. ఆదూతవచ్చి యాహ్వానమును తెల్పగా ధర్మరాజు 'దుర్యోధనుడు కర్మిష్ఠుడయ్యెనని విని మనస్సానందమున మునిగినది. కులము పవిత్రమైనది. కాని మేము చేసిన ప్రతిజ్ఞ నెరవేరకుండ అక్కడికి వచ్చుట కంగీకరింపము. కాన ఈ విషయము నతనితో జాగ్రత్తగా తెల్పుము' అనిచెప్పి పంపెను. అట్టి పరుషవాక్యము కూడ నోటినుండిరాకపోవుటయే అతనిలో గొప్పతనము.

ఒకనాటిరాత్రి ద్వైతవనములోని మృగములు ధర్మరాజుకు కలలో కనపడి 'మీరు చిరకాల మిక్కడ నుండి చంపుటచే మా కులములన్నియు నశించినవి. ఇప్పటికైనను

మీరు మరొకచోటికి పొండు' అని చెప్పినవి. 'అట్లే' అని ధర్మరాజు మరునా డుదయ మాసంగతి అందరితోను చెప్పి కామ్యకవనమున కేగుటకు నిశ్చయించెను. అందరు నతని మాట ననుసరించిరి.

అప్పు డచ్చటికి వ్యాసమహర్షి వచ్చెను. అతనితో కొన్ని ధర్మసందేహము లడుగగా నతడు కథల నుదాహరించుచు చెప్పెను. వారి నూరడించి వ్యాసుడు వెడలిపోయెను.

ఒక్కనాడు పాండవులు తృణబిందు మహర్షి యాశ్రమమున ద్రౌపదిని, ధౌమ్యుని విడిచి తాము వేటకై వెళ్లిరి. అంతట నచ్చటికి మార్గరీత్యా వచ్చిన సైంధవుడు ద్రౌపదిని చూచి మోహించి ఆమె వలదనుచున్నను వినక రథముపై నెక్కించుకొని పోవుచుండెను. వేటలో అపశకునములు కాగా యింటికిమరలివచ్చి, పాండవులు జరిగినది విని, సైంధవునిపైకి రథారూఢులై వెళ్లిరి. వారిని చూచి భయపడి సైంధవుడు ద్రౌపదిని దిగవిడిచి పారిపోవుచుండగా భీమాదులు 'మేము సైంధవుని చంపికాని వెనుకకురాము. నీవు ద్రౌపదిని తీసికొని పర్ణశాల కేగు' మనిరి. అతడు 'సైంధవుడు (కౌరవుల) చెల్లెలైన దుశ్శలకు మగడు కాన మనకు చంపరానివాడు. ఈ యొకతప్పునకు మన్నింపుడు. కూతురు విధవయైనచో గాంధారి యేడ్చును' అనిచెప్పి పట్టుకొని తీసికొనిరమ్మని పంపెను. అట్లే భీముడు వానిని పెడరెక్కలువిరిచికట్టి తెచ్చి, ధర్మరాజుకాళ్ల ముందు పారవేసి 'వీడే పాండవదాసుడు' అనెను. ధర్మరాజు 'అట్లైన విడువు'మని అతనితో 'నీవుతప్పు ఎవరైన నిట్టిపాడు పని చేయప్రయత్నింతురా? ఇంద్రియనిగ్రహములేనివాడవు

ని న్నే మనము! వెళ్లుము. మరెన్నడు నిట్టిపాపపుపనికి ప్రయ త్నింపకుము' అని బుద్ధిచెప్పి వదలివేసెను. ఆహా! సభలో ద్రౌపదిని గుడ్డవిప్పునప్పు డేదో మాటకు కట్టుబడి యోర్పుగా నుండెనన్నచో ఇప్పు డేమి వచ్చినది? భార్యను లాగికొని పోయినవానినిస్సైతము మన్నించెను. అట్టియోరిమి ఎవరి కైన నుండునా? అదే ధర్మరాజుయొక్క గొప్పదనము.

అంతట మార్కండేయముని రాగా అతని పూజించి తాముపడినకష్టములను చెప్పి, 'అయ్యా! మేముపడినట్లెవరైన కష్టములుపడిరా?' అని యడిగెను. అప్పుడు మార్కండేయ ముని 'భగవంతుడు శ్రీరామచంద్రమూర్తిగా అవతరించి మీకంటె ఎక్కువ పాట్లుపడెను. అతనిభార్య రాక్షసునిచే ఎత్తుకొనిపోబడి యెన్నోబాధలుపడినది' అని రామాయణ గాథను చెప్పెను. ధర్మరా జంతవరకు రామాయణ కథనే వినలేదేమో!

అది విని 'ఆహా! సీత మొదటి పతివ్రత!' అనగా మార్కండేయుడు సావిత్రికథను చెప్పెను. దానితో ఇంకను అద్భుతము. ఆనందమును కల్గినవి.

పండ్రెండేండ్లు వనవాసము పూర్తికావచ్చినది. అంత నొకనా డొకబ్రాహ్మణుడు తన అరణి (నిప్పుచేసికొను పరి కరము) లేడికొమ్మునకు తగుల్కొనిపోయెనని చెప్పగా దాని తెచ్చుటకై పాండవులు బయలుదేరిరి. ఆలేడి వారిని చాలాదూరము లాగికొనిపోయి, గాఢారణ్యములో అంతర్ధా నమైనది. వా రలసిపోయిరి. ధర్మరాజు దాహమగుచున్నది నీరు తెమ్మని సహదేవు నంపెను. అతడు తిరిగి రాలేదు. నకు

లుని, అర్జునుని, భీమునిం పంపెను. ఎవ్వరును తిరిగి రాలేదు. చివరికి తానే వెళ్ళెను. అక్కడ చెరువునొడ్డున పడియున్న నలుగురను చూచి విచారించినాడు ధర్మరాజు. కన్నుల నీరు తిరిగినవి. చిత్రప్రతిమవలె కొంతసేపట్లే నిలబడిపోయెను. తనలో యిట్లు 'ఎవ్వరును వచ్చినట్లు లేదు, యుద్ధముచేసినట్లు లేదు, మరి వీరేల పడిరో? దుర్యోధనుడు మిక్కిలి క్రూరుడు, దురాత్ముడు, పెక్కుమాయలు చేయువాడు. ఒకవేళ ఏదైన పాపకృత్యముచేసెనేమో? ముఖములు తెలివితప్పి లేవు, కాళ్ళు చల్లబడలేదు, నీరు విషముకలిపినది కాదే; మరి యేలనో! మహావీరులైన వీరి నీయడవిపాలుచేసితిని. ఇక నేనొక్కడను ఇంటికేగినచో కుంతి 'తమ్ము లేరి?' అని అడిగినచో నేమి జవాబియ్యగలను? తొలగించుకొనలేని బాధ కల్గెనే!' అని విచారించినవాడై ముందుగా దాహము తగ్గించుకొనుటకై చెరువులోనికి దిగబోయెను.

అంతలో చెట్టుపైనుండనున్నకొంగ 'ఓ రాజా! ఈ చెరువు నాది. నీతమ్ములు నామాటవినక యిట్లయినారు. నీవుకూడ చౌరవచేసితివా, ఇట్లే అగుదువు. జాగ్రత్త!' అని హెచ్చరించినది. అతడు పైకి చూచెను. పైనకొంగ యున్నది. 'అయ్యా! నీవు కొంగరూపములోనున్న యే రుద్రుడవో, యింద్రుడవో కాని సామాన్యపుకొంగవు కాదు. నీ వెవరవో నిజముచెప్పి, నీయుద్దేశ్యమును చెప్పి నాబాధ తగ్గింపుము' అని కోరగా ఆకొంగ ఒకయక్షుడై యెదుటనిలిచి 'నా ప్రశ్నలకు జవాబు చెప్పి మరి దిగుము' అనెను. 'నానేర్చినకొలంది చెప్పుటకు ప్రయత్నింతును, అడుగు' మని ధర్మరాజాతనితో ననెను.

## ॥ యక్ష ప్రశ్నలు :-

యక్షుడు : సూర్యుని నడుపునదేది? సూర్యుని సేవించుచు నెవరు తిరుగుదురు! అత డస్తమించుటకు కారణ మేది? అతని కాధారమేది?

ధర్మ : బ్రహ్మ నడపును. సురకోటి కొలిచి తిరుగును. ధర్మముచే నస్తమించును. సత్యమే ఆధారము.

యక్షుడు : దేనివలన శ్రోత్రియుడగును? దేనిచే మహిమ పొందును? అతనికి సహాయ మేమి? దేనిచే బుద్ధిమంతుడగును?

ధర్మ : వేదముచే శ్రోత్రియు డగును. తపస్సుచే మహిమ పొందును. ధైర్యమే సహాయము. పండితులసేవచే బుద్ధిమంతు డగును.

యక్షుడు : బ్రాహ్మణుడు దేవత్వము నెందుచే పొందును? సాధుత్వ మెట్లు వచ్చును? అసాధుత్వ మేలవచ్చును? మానవత్వ మెట్లు వచ్చును?

ధర్మ : వేదాధ్యయనమువలన దేవత్వమును, ఎక్కువ వ్రతములు చేయుటచే సాధుత్వమును, మంచినడవడిక చెడినందున అసాధుత్వమును, మృత్యుభయముచే మానవత్వమును పొందును.

యక్షుడు : జీవన్మృతు డెవడు? భూమికంటె బరువైన దేది? ఆకాశముకన్న పొడవైనదేది? గాలికన్న వేగముకలదేది? గడ్డికన్న తరచైన దేది?

ధర్మ : దేవాతిథిపితృభృత్యజనములకు పెట్టక తాను మాత్రమే భుజించువాడు జీవన్మృతుడు. తల్లి, తండ్రి, మనస్సు, విచారము తక్కినవాటి కుత్తరములు.

యక్షుడు : నిద్రించుచు కన్నుమూయని దేది? పుట్టిన తర్వాతకూడ జ్ఞానమురాని దేది? రూప ముండి హృదయము లేని దేది? వేగముచే ప్రకాశించున దేది?

ధర్మ : చేప, గ్రుడ్డు, రాయి, నది.

యక్షుడు : దారి నడచువానికి, రోగము గలవానికి, గృహస్థునకు, చనిపోయినవానికి చుట్టము లెవరు?

ధర్మ : కూడ ప్రయాణము చేయువారు, వైద్యుడు, సద్భార్య, చేసినధర్మమును చుట్టములు.

యక్షుడు : ధర్మమున కాధార మేది? కీర్తి కాశ్రయ మేది? స్వర్గమార్గ మేది? సుఖముల కాశ్రయ మేది?

ధర్మ : దాక్షిణ్యము, దానము, సత్యము, శీలము.

యక్షుడు : నరున కాత్మ యెవరు? దైవికమైన చుట్ట మెవరు? అతనిజీవిక దేనివలన నిర్వహింపబడును? దేనివలన దోషరాహిత్యము నందును?

ధర్మ : కొడుకు, భార్య, మేఘము, దానమును కొనియాడుట.

యక్షుడు : ధర్మములలో గొప్ప దేది? ఎప్పుడును పండున దేది? ఏది లేకుండ జేసినందున ఆనందము కల్గును? ఎవ్వరితో స్నేహ మెప్పుడును చెడిపోదు?

ధర్మ : అహింస, యాగకర్మము, మనసు క్రొవ్వు; సుజనమైత్రి:

యక్షుడు : లోకమునకు దిక్కేది! జలము, అన్నము దేనివలన వచ్చును? విష మేది? శ్రాద్ధసమయ మేది?

ధర్మ : సజ్జనులు, ఆకాశము, భూమి, బ్రాహ్మణారా ధనము, బ్రాహ్మణులరాశ.

యక్షుడు : దేనిని విడిచినందున సర్వజనప్రియుడు, శోకరహితుడు, ధనవంతుడు, సుఖియు నగును?

ధర్మ : గర్వము, కోపము, లోభము, తృష్ణ.

యక్షుడు : పురుషు డెవడు? సర్వధని యెవడు?

ధర్మ : ఎవనికీర్తి భూమ్యాకాశముల వ్రాకియుండునో వాడే పురుషుడు. ప్రియాప్రియములు, సుఖదుఃఖములు నెవనికి సమములో వాడే సర్వధని.

అని చెప్పుటతో యక్షుడు సంతోషించి 'నీతమ్ములలో నొకని బ్రతికింతును; కోరుకొను' మనెను. ధర్మజుడు 'నకులుని బ్రతికింపు'మని కోరెను. 'భీమార్జునుల నేల కోరలే' దనియడుగగా 'నాతల్లికి నేను బ్రతికియుంటిని; కాన మాసవతి తల్లి కొడుకును కోరితి' ననెను. అప్పుడు యక్షుడు మెచ్చుకొని అందరిని బ్రతికించెను. ధర్మరాజు 'నీవుయక్షమాత్రుడవు కావు. నిజము తెల్పు' మనగా 'నేనుయముడను, నిన్ను పరీక్షించుటకే వచ్చితిని. నీఇష్టమైన వరము కోరుకో'మ్మనెను. 'అయ్యా! మాయాశ్రమవాసుడైన బ్రాహ్మణుని అరణి నిప్పింపు' మనెను. 'మృగము లేదు; నేనే ఆయరణిని తెచ్చితిని'అని అరణి నిచ్చివేసెను. మరియు 'ఈపదుమూడవ యేట మీరెక్కడ ఏయేరూపములలో నున్నను మిమ్మెవ్వరు నానవాలు పట్టలేరు. ఆయా రూపము లచ్చొత్తినట్లు మీకు వచ్చును' అని వరమిచ్చెను. అప్పుడు ధర్మరాజు 'దేవా! నాకు కోపమోహాదిదుర్గుణము లెప్పుడును రాకుండు

నట్లును, ధర్మమందే బుద్ధికల్గునట్లును వరమిమ్మని ప్రార్థించెను. అతడట్లే యిచ్చి అంతర్థానమయ్యెను. పాండవులు తమ యాశ్రమమునకు వచ్చిరి.

అంతట పదుమూడవయేడు వచ్చినది. బ్రాహ్మణులకు తమప్రతిజ్ఞను తెలిపి తమకార్యసిద్ధి యగునట్లు దీవనలందిరి. ధౌమ్యుడు వారి యగ్నిహోత్రములను తీసికొని వెళ్ళెను. వారు ఏదేశమున కేగవలెనో, ఏయే రూపములు నుండవలెనో యాలోచించుకొనిరి. అర్జునుడు 'ఒకరిని పరిపాలించుటయే కాని సేవించుట యెరుగని నీ వెట్లు విరటుని సేవింతు' వని విచారముతో ననగా ధర్మరాజు 'నేను సన్యాసివేషమున రాజసభ్యగౌరవములందుచు, చక్కనికథల చెప్పుచు రాజును సేవింతును. శ్రౌతస్మార్త జ్యోతిశ్శాస్త్రములలో ప్రావీణ్యము చూపుచు అతనిమనస్సు నానందపరతును. మధ్యమధ్య జూదపునేర్పు జూపుదును. ఇంకను సమయోచితముగా వినోదముల కల్పింతును. కంకుడనుపేరు చెప్పుదును. నాపూర్వపు జీవితమునుగూర్చి అడిగినచో ధర్మరాజుతో స్నేహముచేసి యుండువాడను. అతనికి వినోదములు కల్గించుటయే నావృత్తి యని చెప్పుదును.' అని తనభావివేషమును వారికి చెప్పెను. వారును తమకు తగినట్లు చెప్పిరి. అందరికి నన్నియు కుదిరినవి. ద్రౌపదివంతు వచ్చినది. ఆమెముఖముకేసి చూచుసరికి ధర్మరాజునకు విచారము కల్గినది. 'ఇదికడుముద్దరాలు, పనులేమియు జేయగనేర; దెంతయున్ మృదు, వొకకీడుపాటునకు మేకొనజాలదు దాత్తచిత్త! యింటిదిరుగు దానికోర్వ నొప్పిదను వాసవరించు పొప్పెరుంగదుతగనొంతులంగొలువగా

నెర వెమ్మయి గల్గు నక్కటా!' అని వాపోయినాడు. ఆహాహా! ఆమెయం దతని కెంతటి ప్రీతి యోకదా!

ద్రౌపది పరిచారికలను ద్రుపదునింటి కంపినది. ధర్మరాజు తన సారథులను ద్వారక కంపెను. ఎవరైనను పాండవు లెక్కడికి పోయిరని యడిగినచో ద్వైతవనమున తమ్ము విడిచి పోయిరని చెప్పుమనెను. ధౌమ్యుడు పాండవులకు సేవాధర్మములను చెప్పెను. తమ యాయుధములను జమ్మిచెట్టుపై కట్టిపెట్టిరి. ధర్మరాజు తనకు రహస్యనామము 'జయుడు' అని పెట్టుకొనెను. అక్కడనున్న సరస్సులో స్నానముచేసి దేవర్షి పితృతర్పణములు చేసిరి. అంతట ధర్మరాజు నాడు కన్పడిన యక్షుని తలచుకొని తనకు సన్యాసివేషము కావలెనని కోరుకొనగా వెంటనే కాషాయవేషము, దండకమండలువులు వచ్చి చేత నిలిచినవి. అతడు ముమ్మూర్తుల సన్యాసియయ్యెను. అట్లే అందరునైరి.

విడివిడిగా పోవదలచి అందరును చీలిపోయిరి. ధర్మరాజు పాచికలసంచిని చంకలో పెట్టుకొని విరాటరాజు నాస్థానమున కేగెను. అప్పుడు విరాటుడు బయట కొలువుదీర్చి యుండెను. దూరమునుండి చూచి 'ఇత డెవరో మహానుభావుడు. జగముల నన్నింటి నేలగల ముఖవర్చస్సుతో నున్నాడు. యతీంద్రుడు కేల యయ్యెనో? అట్టివాడు మనవద్ద కేల వచ్చుచుండెనో? అత డడిగినవెల్ల నిచ్చెదను' అని అతని కెదురేగి నమస్కరించెను. ఆ సన్యాసి రాజును దీవించెను. విరాటుడు నమ్రతతో 'అయ్యా! తమ దేదేశము? తమపేరు – ఊరు ఏది' అని ప్రశ్నింపగా, అతడు 'అయ్యా! ఉన్నదున్నట్లు చెప్పుట యొవ

రికిని చేతకానిది' అని మందహాసము చేయుచు, 'నే నొక బ్రాహ్మణుడను, కురుదేశములలోనివాఁడను. సర్వశాస్త్రములచే శోభించుచున్నాఁడను. వినోదములు చేయగలను. జూదమున నన్నొకడు నాచేతి ధనములన్నియు గెలువగా విరక్తిపుట్టి యిట్లు బయలుదేరితిని. నాపేరు' కంకుఁ డందురు. అసహ్యపుపనులు నాకు చెప్పరాదు. అది చేయుట నాకు గిట్టదు. కాన నీ కిష్టమైనచో కొలువిమ్ము. ఒక్క సంవత్సరము గడువున్నది. అన్నాళ్లు నీవద్దనే యుండి, తరువాత నా కపకారముచేసినవానిపైకి జయించుటకై వెళ్లుదును. అనుటతో విరటుడు అతని నుండుమని సత్కరించెను. కావలసిన వెల్ల తీసికొమ్మనెను. ధర్మరాజు 'నాకు నేతిపదార్థములే భక్ష్యములు. భూమిపైననే పరుందును. అది నాకు వ్రతము' అని చెప్పుటతో 'మీ కిష్టమగునట్లు ఇష్టమువచ్చినన్నాళ్లుండు'మని చెప్పి అతని గౌరవించెను.

విరాటరాజు కొలువులో ధర్మరాజు సభ్యులమనస్సుల కానందము కలిగించుచు జూదములో గెల్చిన సొమ్ములను తమ్ముల కిచ్చుచుండెను.

ఒకనాఁ డాతని సభ కొక మల్లుడు వచ్చి భుజములు చరచుకొనుచు 'ఈ భూలోకములో నాతో పట్టుపట్టగలవాడు లేడు' అనెను. అతని మూర్ధానమున మల్లురందఱును తెల్ల మొగములు వేసిరి. అప్పుడు ధర్మరాజు 'ఇతనికి జోడైనవాని నిదివరకు ధర్మరాజు కొలువులో చూచితిని. ఇప్పు డిక్కడ వంటవాడుండెనే, వలలుడు; అతడు పోటీచేయుగలడు' అనెను. రా జాతని పిలిపించి మల్లురతో పట్టుపట్టవలెననెను. ధర్మరాజు

తనుసన్న చేసెను. అతడు ద్వంద్వయుద్ధముచేసి వాని నోడించెను. రాజు తని సత్కరించెను.

కీచకుడు ద్రౌపదిని పట్టబోయినపు డామె తప్పించుకొని రాజసభకు పారిపోయివచ్చినది. కీచకుని కృష్ణు డంపిన రాక్షసుడు కొట్టుటచే నతడు లేవలేకపోవుచుండెను. రాజసభలో భీముడు నుండెను. అతడు భార్య బాధ చూడలేక దగ్గరలో నొకచెట్టుండగా దానికేసి చూచెను. అది గమనించి నాడు ప్రక్కనున్న ధర్మరాజు. భీము డా చెట్టు పీకి కీచకుని కొట్టునేమో తమ యజ్ఞాత వాసము బయటపడునని భయపడి ఎవరికిని అర్థము తెలియనట్లుగా 'వలలా! జాగ్రత్తగా చూచుచుంటివే చెట్టుకేసి. ఎన్నో పక్షుల కాశ్రయమైన యీ చెట్టే కనపడినదా నీకు వంటకట్టెలకు? లోపలనున్నవిలే కట్టెలు పొమ్ము' అని మందలించెను. అప్పుడు భీముడు తన ప్రయత్నము మాని లోనికిపోయెను. కాని ద్రౌపది తనకు జరిగిన యవమానమును రాజుతో చెప్పుకొనెను. విరటుడు కీచకు నేమియు చేయజాలక ద్రౌపదినే బతిమాలెను. సభలోని వారందరును గుజగుజలాడిరి. అంతట ధర్మరాజు కోపమును దిగమ్రింగి 'ఓ మానినీ! నీవిషయమందరకు తెలిసినదిలే! ఇక మాటలాడుట యెందులకు? లోని కేగుము. నీ భర్తలైన గంధర్వులకిది సమయముకాదుగాని, లేకున్న కోపింప కుందురా? భర్తల దూషింపకుము. సభలో నింతసేపు నీవంటి పతివ్రతకు నిలువదగునా?' అనినను ఆమె కదలలేదు. ఇంకను ఏమో పలుకబోయినది. నురల నతడు 'పలుపోకల పోవుచు, నాట్యము చూపునట్లుగా పాతివ్రత్యము వీడి నిలుచుటేల?' అనుటతో

ఆమె 'నాభర్త నటుడు. నాకు నాట్యము చేతనైనది. అంతే
కాక నాభర్త జూదరియును. జూదరిభార్యకు గొప్పలెక్కడివి?
అనుచు వెడలిపోయెను.

తనబావను భీమునితో చెప్పుకొనుచున్నాడు ధర్మ
రాజు నెంతో పొగడినది. 'నాకు ధైర్యమువాలక యోచించి
తిని కాని, యంతగొప్పనా మంచబావు 'కోపమునకి నొప్పగు
నీగియు, బలిమికి ద్రోణునైనయట్టి బలగమున్నాగోకలంచి త్రము
లకు వ్రేగగు, కోలుపెనగాని సుంతిస్త్రకోనుకొన కమమున' అని
పొగడినది. అది పొగడుటకాదు. ఉన్నదున్నట్లు చెప్పుటయే.

సుశర్మ దక్షిణగోగ్రహణము చేసినట్లు తెలియగానే
విరటుడు సైన్యములను సిద్ధముచేసికొనుచున్నాడు. కంకుడు 'నేనును
గురువువలన ధనుర్విద్య నేర్చితిని. రథము తెప్పించినచో
నేనును వత్తును' అనగా రాజట్లుచేసెను. ఆ యుద్ధమున ధర్మ
రాజు వేయిమందినిచంపి పట్టుబడిన విరాటుని విడిపించునట్లు
చేసెను.

ఉత్తరగోగ్రహణమున ఉత్తరకుమారుడు గెల్చెనని
వార్తవచ్చినది. విరటునకు సంతోషము ఆగలేదు. కంకుని
రమ్మన్నాడు జూదమాడుటకు. కంకుడు 'నీవు సుమూళంబున
నున్నాడవు. నీతో ఆడలేను. కాని కాదనుట యేల?'
యని జూదమాడ నారంభించెను. కొడుకు కౌరవులను
గెల్చెనని విరాటుడు పొంగిపోవుచున్నాడు. 'కంకా!
మావాడు కౌరవులను గెల్చినాడట వింటివా? ఎవ్వరైన వారి
నింతవరకు గెలువగల్గిరా?' అన్నాడు సంతోషమాపుకొనలేక.
వెంటనే కంకభట్టు 'కౌరవసైన్యమును మీవాడుగెల్చుటయా?

ఇంతకన్న ఆశ్చర్యముండునా? అట్లయినచో అత డీపాటికి ప్రసిద్ధికి రాకపోవునా?' అనెను. ఆమాటలకు కోపించి విరాటుడు కన్నులు జేవురింపజేసికొని చూచెను. ధర్మరాజు తన పాటమానలేదు. 'బృహన్నల రథముపైనున్నంతసేపుఉత్తరుడు కౌరవులు కాదు, దేవదానవులొక్కటై వచ్చినను గెలువ గలడు' అనెను. విరాటునికి మండినది. 'ఓయి కంకా! ఎన్నో నాయెదుట వింతలు-వినోదములు కనపరచితివి కాని ఇప్పటిమాట లేల? సారథుల నెందరినో విన్నాము కన్నాము కాని వారేయుద్ధముచేయలేదు. నాకొడుకుగెల్చుట నీకిష్టములేదేమి?' అనెను. అంతటితో కూడ మానలేదు. 'రాజా! బృహన్నల సారథిగానుండుటచేతనే అతడు గెలువగలిగెను. నీవు వెంటనే పట్టణములో బృహన్నలయొక్క విజయమును చాటపంపుము' అనుటతో విరటుడు కోపమూపలేక చేతిలోని పాచికతో శక్తికొలది కొట్టెను. ఆదెబ్బతో ధర్మరాజు తలకు బలముగా దెబ్బతగిలినది. రక్తము కారబోవుచుండెను. ధర్మరాజేమియును కోపించక ద్రౌపదికేసి చూచెను. ఆమె వెంటనే దగ్గరకువచ్చి చీర కొంగుతో రక్తముకారకుండ ఒత్తుచుండెను. 'అదే' మని విరటుడడుగగా 'సద్బ్రాహ్మణులరక్తము క్రిందపడినచో క్షామముకల్గునని యిట్లుచేయుచుంటి' నని ద్రౌపదిఅన్నది.

అంతలో ఉత్తరుడు వచ్చుచుండెను. అతని వెనుకనే బృహన్నలయు నుండెను. అప్పుడు ధర్మరాజు 'బృహన్నలను కొంచెముసే పాపి, ఉత్తరునొక్కనే లోనికి తీసికొనిరండు. లేకున్నచో నారక్తముచూచి అతడుకోపించును. అనెనుసేవకులట్లుచేసిరి. ఉత్తరుడు లోనికివచ్చి తండ్రికినమస్కరించి ధర్మ

రాజు దెబ్బచూచి 'అదే' మని యడిగెను. సైరంధ్రి జరిగినది తెల్పెను. అతడు 'అదేమిటి తండ్రీ! బ్రాహ్మణు నేమన్నను మన మూరకుండవలెను. వారికి కోపము తెప్పింపరాదు. వారికి కోప మువచ్చినచో మన [illegible]' అనెను. ఆ మాటలతో విరటుడు కోపము తగ్గించుకొనెను. పిదప వాత నర్జునునకు కన్పడకుండ తలకు గుడ్డ నడ్డముపెట్టుకొనెను. రహస్యమున తమ్ము లదే మని యడిగిరి. జరిగినది చెప్పగా వారు వెంటనే విరటుని చంపుదుమనిరి. ఇన్నాళ్లును ఇతని ధర్మమూ అని కాలము వెళ్లించి ఇప్పు డితని ద్రోహముచేయుట కృతఘ్నతయగును. కాక యితనికి మనసంగతియును తెలియదుకదా!' అని యూరడించెను.

మర్నాడు పాండవులు సుస్నాతులై తెల్లని వస్త్రముల ధరించి విరటునికన్న ముందుగా రాజసభలోనికివచ్చిరి. ధర్మరాజు సింహాసనముపై కూర్చుండెను. అదిచూచి విరటుడు కోప ముతో 'ఏమికంకా! నీ వీ నాడిట్లు నిర్భయముగా సింహాసన ముపై కూర్చుంటివేల?' అని ప్రశ్నింపగా అర్జునుడు 'త్రిలోక రాజ్యాధిపత్యమునకు తగిన ధర్మరాజు ఈ చిన్న సింహాసన ముపై కూర్చుండుటకే తగడా?' అనుటతో ఆశ్చర్యపడి, భయపడి విరటుడు వారినిజవృత్తాంతము తెలిసికొని వారిని రక్షింపుమని వేడెను.

దుర్యోధనున కింటికి వెళ్లినతర్వాత ననుమానము వచ్చినది- 'అజ్ఞాతవాస సంవత్సరము పూర్తియైనదా లేదా?' అని. భీష్మద్రోణులకు తెలియకుండ నొక దూతను ధర్మరాజు వద్దకు పంపెను. అతడు వచ్చి 'దేవా! అజ్ఞాతవాస సంవత్స

రము నిండకుండ మే మున్నమని తెలిసికొంటిమి కాన మన ప్రతిజ్ఞానుసారము మరల వనవాస, అజ్ఞాతవాసములు చేయవలెను' అనెను. ధర్మరాజు నవ్వి 'పదుమూడేండ్లును నిండెను. ఇప్పుడే వెళ్ళి ద్రోణాచార్యులకు, భీష్మునకు వినుచుండగా దుర్యోధనునకు చెప్పుము. నిండెను అని ముమ్మార్లు చెప్పుము' అని పంపెను. అది చెప్పగా విని దుర్యోధనుడు తెల్లబోయెను. తన తెలివితక్కువకు నొచ్చుకొనెను.

పాండవులు విరాటుని మర్యాదలు స్వీకరించి ఉపప్లావ్య పట్టణమున కేగిరి. అక్కడకు శ్రీకృష్ణాదులు వచ్చిరి. పాండవులను ఊరార్చి సత్కరించిరి. సుభద్రాభిమన్యులును రాగా వారిని ద్రౌపదితోపాటు ఉండుటకు నియమించెను. అచ్చట ఉత్తరాభిమన్యుల వివాహము జరిగినది.

వివాహానంతరము ధర్మరాజాదులు శ్రీకృష్ణ బలరామాదులు కొల్వుచేసిరి. ఇప్పటికి వనవాస, అజ్ఞాతవాసములు ముగిసినవి. ఇక కర్తవ్యమేమో నిశ్చయించుటను సభ్యులు ప్రశ్నగా వేసికొని నిర్ణయింపసాగిరి. కృష్ణుడు 'కౌరవులు వీరి భాగమిచ్చిన మంచిదే. లేకున్న వెంటనే యుద్ధముచేయుటయే' అనెను. బలరాముడు 'కృష్ణునిమాట బాగున్నది. వీరి భాగము వీరు కోరుచున్నారు కాన వారి కిచ్చి తమ సగముతో తాము తృప్తినొందుట కౌరవుల కుచితము. అట్లు చేసినచో వారికే అపాయమును రాదు. కనుక ఆ కార్యమునకై యొక్క దూతను పంపవలెను' అనెను. ధర్మరాజు నాకు జూదపుటాటలో మిక్కిలి నేర్పు లేకుండుటచే ఓడిపోతిని. అది నా తప్పు కాని, వారి దోషము కాదు. ఎంతమంది బంధువులు

వలదన్నను నేనే మానలేదు. కావున వారిని [illegible] లని నిందింపవలదు. నెమ్మదిగా సమయము చూచి న్యాయము నిర్వహింపవలెను' అనెను. ద్రుపదుడు తన పురోహితుని దూతగా పంపుచు, 'ముందుగా రాజులను యుద్ధసహాయమునకై పిలుచుటకు పంపవలెను. ముందు వచ్చిన వారికే వారలు సాయము చేయుదురు' అని చెప్పెను. ఇదే న్యాయముగా నున్నదని శ్రీకృష్ణుడు 'మేము పెండ్లికి వచ్చితిమి. వివాహము జరిగినది. ఇక్కడ నిల్వయుండరాదు. కౌరవులు పాండవులు మాకొక్క రీతియే కనుక ఇద్దరును కుశలముగా నుండుటయే మా కోరునది' అని చెప్పి వెళ్ళిపోయెను.

శల్యుడు మద్రరాజు. మహాబలశాలి. సారథ్యము చేయుటలో నేర్పరి. అతనిపిల్చుటకు దూతలు వెళ్ళిరి. అతడు వచ్చుచుండగా దుర్యోధనునిమంత్రులు వచ్చి అడ్డగించిరి. వారితో నేను పాండవులనుచూచివత్తునని పంపి పాండవులవద్దకు వచ్చెను. అతని గౌరవించి ధర్మరాజు 'మామా! నీవు మాకు సహాయముచేయవలెను. శ్రీకృష్ణుం డర్జునునకు సారథియగుట కొప్పుకొనెను. అర్జునునకు జోడైనవాడు కర్ణుడేకదా! అతనికి నీవుతప్ప సారథ్యము చేయగలవాడు లేడు. నిన్నే రాజరాజు నియోగించును. నీ వెట్లయిన కర్ణునిమనస్సు నొచ్చునట్లు పల్కుచు అతనిమనస్సుపాడగునట్లు చేయవలెను. అర్జునుని రక్షింపవలెను' అని ప్రార్థించెను. అత డందుల కంగీకరించెను.

ద్రుపదునిపురోహితుడు పాండవునపక్షమున రాయబారిగా వెళ్ళి చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయునిద్వారా

నీతివిడిచి, ఇప్పుడు మమ్ము చక్కనిమార్గమున నడువుమని బుద్ధులు చెప్పినా? ఎదుటివానికడ్డపడితమన తెలియఁజేసియున్నచో కార్యము కుదురుచుకాని 'నాకు కుడుపు పోఁక మక్కు,' అన్నచో ఎట్లు? అశక్తులమైనమా మమ్ముల్ని పిలిచి మన్నించు నంతటి చేల కాఁ డతఁడు. చెప్పెడివాడినిమాటలు నాకేకాద న్నాఁడు. నీవు అడియాసతో వచ్చి రిక్తగౌరవములు చేయుచు న్నావు. అతినిసంగతి నీకు – నాకును క్రొత్తనా? మంచిమా టలను ధృతరాష్ట్రుడు వినునా? ఎన్నడైనను కొడుకే బలము కలవాడనును. అతనినే నమ్మెను. బాదప్పుకొనుమ్మనై ఆశపడ కూడదని ఆనాడు విదురుడు చెప్పినమాటలు విన్నచో కర్ణా దులపలుకులు వినకున్నచో ఆనాఁడే పనిచక్కబడియుండెడిది కదా! ఇప్పుడైనను దుర్యోధనాదులు నడిపించిన మార్గమున నడుచునుగాని, మానునా? ఇదివిషయము. దుర్యోధనుని అవిన యము అనివార్యమని తెలిసియో తెలియకయో నీవుమా త్రము మంచిగా మాట్లాడుచున్నావు. మానాటికిని పరాక్ర మము లున్నవి. కాని నే మొక కీడుచేయుటకు ముందంజ వేయము. రమ్మని పిలిచి పాలుపంచుమని కొడుకులకు చెప్పి ఇంద్రప్రస్థమో, మరొకటో యిచ్చిన నద్దందుమా?

కాక వంశదూషకులు, లోకకంటకులునైన వారిని చంపుట ధర్మము. రాజులకు యుద్ధము ధర్మమగునో కాదో నీవేచెప్పుము. ఇంకనుమంచి– చెడ్డలచెప్పుటకుకృష్ణుడున్నాఁడు' అని చెప్పినాడు. ఇందువినయము, న్యాయము, నీతి, ఎత్తిపొ డుపు, భయపెట్టుట అన్నియు గలవు. అట్లు చక్కగామాట్లా డుట ఒక్కధర్మరాజునకే తగును. కృష్ణుడు తగినట్లుచెప్పెను.

సంజయుడు సెలవు పుచ్చుకొనుచుండగా ధర్మరాజు 'దుర్ణ యము, కఠినము, బెండునైనమాట నానాలుకనుండి రాదు. నీవుగాని ఓడుకుడుగాని యిట్టిసంఘకార్యములు సేయగలరు; కాని మరొకరు సేయలేరు.

నీ వక్కడి కేగి ముందుగా పెద్దలైన బ్రాహ్మణులను దర్శించి వారిక్షేమ మడిగితినని చెప్పుము. తర్వాత భీష్మ ద్రోణులకు నానమస్కారము తెల్పుము. మాతండ్రికి దండ ప్రణామము తెల్పుము. దుర్యోధన మశ్వాసనులను కుశలమడి గితి ననుము. మిలిగిన, యుద్ధమునకు తోడై వచ్చియున్నవారికి తగురీతిగా నామర్యాదలు చెప్పుము. కొలువులో నుండగా మాతండ్రితో 'నీ అనుగ్రహమువలన పాండవులు సుఖముగా నున్నారు. చిన్నతనాననే వారిని సింహాసనమున కూర్చుండ బెట్టి రక్షించితివి. ఇప్పు డిట్లుపేక్షించుట న్యాయముకాదు. అని- భీష్మునితో నీవే శంతనునివంశమును నిలబెట్టితివి. ఇప్పుడు నీయిష్టానుసారము నీమనుమలను కలిపి సుఖముగా నుండునట్లు చేయుము. ఇంతజరిగినను ధర్మరాజు యుద్ధము చాయకుకూడ పోడని అందరువినుచుండగా చెప్పుము. దుర్యో ధనునితో- నీవుచేసిన కీళ్లనన్నింటిని ధర్మరాజు క్షమించెను. కౌరవులను యుద్ధమున పొట్టబెట్టుకొనకుము. వారిపాలు వారి కిచ్చి కలిసియుండుమనుము. నీ కాశతీరనందున నే నింతచెప్ప వలసి వచ్చెను. నాప్రార్థనను కాదనక, నా కున్న శాంతిని చెల్లించి, అలజడిపెట్టక యుద్ధముమాని, నీది నీ వనుభవించి యుండుము.

'మనమున పక్షపాతగతి [illegible]దోస మనూనము, ధర్మనీతివ
ర్తనముల రెండువక్కల హితంబుకుదెంపునగల్గునట్టి చో
ప్పున విదురాది సజ్జనులబుద్ధికి రా నుచితంబుతోడి దు
ష్పున బరసందరంబునను [illegible] పులెల్ల నెఱుంగి [illegible]'

ఒకవేళ ధృతరాష్ట్రుడు కొడుకుపైప్రేమ అవనీతిగా నను తెగ- తెంపుగా మాటాడవచ్చును. లోపలు ముచ్చునట్లు, మా మనస్సందరికి తెలియునట్లు చెప్పుము. మరొకటి ఆలోచించి నచో నిన్నక్కడికి పంపుట మంచిదికాదేమో అనిపించు చున్నది. వారు కుటిలమనసులు, క్రూరకర్ములు; నీకే యప కారమైనను చేయుదురేమో! కాన ఒంటరిగా వెళ్ళవలదు' అనగా కృష్ణుడు 'నీ వన్నది నిజమేకాని, నే నొక్కడనైనను నన్నెవ్వరు నేమియు చేయజాలరు. పంపు' మనెను. అప్పుడు ధర్మరాజు 'నీకు హితమైనట్లు చేయుము. అదే లెస్సగా నుండును.

'మ ప్మెలుగు దెవిరె నెఱుగుదు, నెమ్మె మెలుగు దృష్టెది నెఱిమెలుగుదు [illegible] కృష్ణుల పద్ధె [illegible], పోమ్మోవ్వడనీకు నేను బుద్ధులుసెప్పన్' అని చెప్పినాడు. అందుకును చెప్పినాక ధర్మరాజు 'నీ నక్షత్రము రోహిణికదా! రేపు రేవతి నీకు చంద్రతారాబలము లున్నవి. వెళ్ళి కార్యసిద్ధిచేసికొని రమ్ము' అని చెప్పి పంపించెను.

ఆమాటలలో లోకులు తమ్ము మంచివా రనుకొను నట్లుగా, దోషము కౌరవులదేకాని తమ దేపాటియు లేనట్లుగా నిరూపించుచు, త్రాసో - పేడో తేల్చుకొని రమ్మనియే యున్నది. అయిదూళ్ళనిమ్మన్నను అత డియ్యడు, కనుక

కయ్యమునకియ్యకొనుటయే అనుమానము స్పష్టముగానున్నది. అదే మాటలలోని నేర్పు. మరొకరంత గంభీరముగా, ఉదాత్త ముగా చెప్పలేరు. ధర్మరాజుయొక్క స్వభావమును తెలిసి కొనుటకీ సంజయకృష్ణులతో చెప్పినమాటలు చాలును. తాను వెలితిపడక, సంవెయ్యక, లోకువకాక, ఉద్ధతిచూపక చక్కగామాట్లాడెను. న్యాయము, ధర్మము, రాజనీతి, ప్రేమ, గౌరవము అన్నియు నందున్నవి. అదే అతనిలోని గొప్ప దనము.

శ్రీకృష్ణుడు రాయబారమునడపిన వచ్చి విఫలమైన విధము చెప్పగానే ధర్మరాజు యుద్ధసంరంభమును ప్రారంభించుటకు మనస్సంగీకరించుటలేదు. కర్తవ్యమునాదేశింపుమని కృష్ణునడి గెను. అతడు యుద్ధమే కర్తవ్యమనెను. తమ్ములు నదే చెప్పిరి. కృష్ణుని యాజ్ఞానుసారము ధృష్టద్యుమ్నుని తమ యేడక్షౌహి ణులకు నధిపతిగా జేసి, విడివిడిగా అక్షౌహిణి కొకరుగా సేనా పతులను నిర్ణయించి, కురుక్షేత్రమునకు యుద్ధమునకై వెడలిరి.

ద్రౌపదికి కన్పడి, ఆమెయిచ్చిన నివ్వాళులు, గైకొని విప్రాశీర్వాదములు స్వీకరించి, మంగళవాద్యములు మ్రోగించుచు, భటులు తోడరాగా శుభశకునములు విజయమును చెప్పుచుండగా తృణకాష్ఠజలసమృద్ధి కలిగిన సమస్థలముగా నున్న హిరణ్వతియను పుణ్యనదీతీరమున విడిసిరి. అక్కడ కృష్ణుడు పాంచజన్య మూదుటతో నందరు నాగి, వారివారి శంఖముల నూదిరి.

మరునాడు యుద్ధ ప్రారంభదినము. ఉభయ సైన్య ములును సిద్ధముగానున్నవి. అప్పుడు ధర్మరాజు అర్జును

నితో 'అబ్బ! కౌరవసైన్య మెంత యున్నది? అందు నా భీష్ముని తాతగారిని శేకము కనుపడుచున్నది' అనగా నతడు ధైర్యముచెప్పెను.

అంతట నుభయపక్షములవారును న్యాయవిరుద్ధమైన యుద్ధముసేయమని ప్రమాణములుచేసిరి. ధర్మరాజు తన కవచమువిప్పి, ధనుర్బాణములను రథముపైబెట్టి, పాదచారియై కౌరవసేనకేసి వెళ్లుచుండెను. అతనిజూచి ఎందుకో తెలియక అందరు నచ్చెరువడసాగిరి. అప్పుడు ధర్మరాజు భీష్మునిముందుకు పోయి అతని పాదములకు నమస్కరించెను. 'అనఘా! నీ కెదురునిల్చి యుద్ధముసేయుటకై నీయాజ్ఞ గైకొనుటకై వచ్చితిని' అని చెప్పుకొనెను. భీష్ముడు 'మంచిపని చేసితివి. ముందు నాయనుజ్ఞ తీసికొనకుండినచో నిన్ను శపించియుండెడివాడను. నీకు జయమగుగాక! మరొక్క వరము కోరుకొమ్ము' అనెను. ధర్మరాజు 'నిన్నుయుద్ధమున గెలిచెడి యుపాయము చెప్పుమనికోరగా' నతడు 'నన్నెదిరించి నిల్చుటకు దేవతలకైనను శక్యముకాదని నీ వెరుంగవా?' అనెను. 'అందుకేకదా మరి మిమ్ముల ప్రార్థించుట?' అని ధర్మరాజు చెప్పుటతో దయతో 'ఇప్పుడుకాదు, తర్వాత చెప్పెదనులే' అనెను. అంతే చాలనుకొని, ధర్మరాజు కృష్ణార్జునాదులు తన వెనుకరాగా ద్రోణ కృప శల్యులకు నమస్కరించి, వారియనుజ్ఞ తీసికొనెను. ద్రోణుడు 'కృష్ణుడు మంత్రియైయుండ జయమునకోరవసరలేదు. ధర్మపక్షమున కృష్ణుడుండును. కృష్ణుడున్నపక్షమున జయముసిద్ధము' అనెను. అతని చావు కుపాయమడుగగా, 'చేతిలో ఆయుధమున్నంతసేపు

ము' అని చెప్పెను. 'సరే! బ్రతుకు జీవుడా!' అని పాండవు లింద్లకు చేరిరి. అట్లుచేయుటచే భీష్ముడు మరునాడు పడెను.

ద్రోణుడు సేనాపతియై 'ధర్మరాజును పట్టిబంధింతు'నని ప్రతిజ్ఞపట్టెను. ధర్మరాజు హడలిపోయెను. అర్జునుడు ధైర్యముచెప్పెను. చెప్పినట్లే ధర్మరాజును చుట్టుముట్టి యుద్ధము చేయుచున్న ద్రోణునితో సమముగా అర్జునుడు యుద్ధము చేసెను. అంతలో సాయంకాలమగుటచే యుద్ధము చాలించిరి. మరునాడు తన్నురక్షింతునని యుద్ధమున అసామాన్యపరాక్రమముచూపి, వీరస్వర్గము నలంకరించిన అభిమన్యునికై ధర్మరాజు విచారించెను. అప్పుడు వ్యాసమహర్షి వచ్చి అతని నూరడించెను. తర్వాత ద్రోణునితో పోరి, రథమువిరిగి, యేమియుచేయలేక చేతులెత్తి నిరాయుధుడై నిలబడెను. ద్రోణుడాతని నా సమయమున కొట్టలేదు; పట్టలేదు. అంతలో నతడు సహదేవునిరథ మెక్కి పారిపోయెను.

ద్రోణునియుద్ధమున కందరును జంకిరి. అప్పుడు కృష్ణుడు 'అశ్వత్థామ చచ్చెనని చెప్పినచో అతడు ప్రాయోపవేశము చేయు'ననెను. అర్జును డట్టుపల్కుట కంగీకరింపలేదు. భీముడు అశ్వత్థామ యనుపేరుగలయేనుగును చంపి, ద్రోణుని దగ్గర కేగి 'అశ్వత్థామచచ్చె' ననెను. అతడు నమ్మక ధర్మరాజునడిగి తెలిసికొనుటకై వచ్చెను. కృష్ణుడు 'మ మ్మతని పాలుచేయక చెప్పుము. ప్రాణరక్షకై చెప్పునపుడు అసత్యదోషము లేదు' అనెను. భీముడు తాను అశ్వత్థామ యను మాళవరాజు నేనుగును చంపితి ననెను. ఎట్టకేలకు ధర్మజుడు—గట్టిగా 'అశ్వత్థామ చచ్చె' నని, మెల్లగా 'ఏనుగు'

అనెను. ఆమాట వినుటతో ద్రోణుడు అస్త్రసన్యాసముచేసి ప్రాయోపవేశముచేసెను. ఇట్లు భీష్మద్రోణులు పడుటకు కారణము ధర్మరాజే!

దుర్యోధనుడు ధర్మరాజుతో యుద్ధముచేసి మూర్ఛపోయెను. ఒకనాడు ధర్మరాజు కర్ణునితో యుద్ధముచేసి నిలువలేక పారిపోయెను. అప్పుడు అస్త్రము తగిలి, ధర్మరాజును నిందించెను. అది సహింపలేక ధర్మరాజు అర్జునుడురాగానే కర్ణునిచంపివచ్చెనేమోయని సంతోషముతో అభినందించెను. కాని అంతలో కర్ణుడున్నట్లు తెలిసికొని 'కర్ణునకు నే నోడితిని. నీ వోడితివి. భీముడు, నకులు లోడినారు. మనతో గూడినందుకు కృష్ణు డోడినాడు. ఇంక మనము అడవులకు పోవచ్చును. లేదా సాధువులవేషముతో దుర్యోధనునికి దాసులమై యుందము. మాటలుపల్కుటేకాని పనులలో పౌరుషము లేదు' అని తిట్టెను. అది విని కోపముతో అర్జునుడు ధర్మజునితల నరుకుదునని కత్తిదూసెను. గాండీవము మరొకరిచేతి కిమ్మన్న వారిని చంపెద నను ప్రతిజ్ఞను నిర్వహించుటకై అర్జునుడు ధర్మరాజును నిందించెను. వెంటనే అతడు శరణువేడగానే క్షమించెను.

చిట్టచివరిరోజున శల్యుని సేనాపతిగా చేసిరి. 'ఆ నా[illegible] శల్యునితో సమముగా యుద్ధముచేయగలవాడు లే[illegible] కృష్ణుడు ధర్మరాజుతో చెప్పి నీవే మేనమామ యను అభిమానము మాని రాజధర్మమును తలచి యుద్ధము చేయుము. లేకున్నచో ఇదంతయు వృథా యగును' అని హెచ్చరించగా నతడు 'నీవు చెప్పినట్లే చేయుదును. నేను ముందే చెప్పితిని

కదా 'శల్యుడు నాపాలు'అని మీరు నిశ్చింతగా నుండు డని చెప్పెను. ఆనాడు మహోత్సాహముతో శల్యునితో యుద్ధము చేసి చంపివేసెను. దానితో అతని నందఱును పొగడిరి.

ఆఖరున దుర్యోధనుడు మడుగులో దాగగా తెలిసికొని, ధర్మరాజాదు లామడుగుగట్టునకు చేరిరి. అప్పుడు ధర్మరాజే దుర్యోధనుని దూషించెను. తరువాత యుద్ధమున విజయము వచ్చుటతో ధర్మరాజు కృష్ణుని స్తుతించెను.

అశ్వత్థామ ఉపపాండవాదుల నొక్కరాత్రిలో చంపి పారిపోగా, భీమార్జును లతని కట్టితెచ్చిరి. అతనిచూడామణిని తీసికొని, అతనిని మన్నించి, ధర్మరాజు వదలెను.

తరువాత కొడుకులందఱును చనిపోయిన విచారముతో కుములుచున్న ధృతరాష్ట్రుని చూడబోయెను. తమ్ములు శ్రీకృష్ణుడును తోడ నుండిరి. ధృతరాష్ట్రుడు యుద్ధభూమి కేగినట్లు తెలిసి అచ్చటి కేగెను. ప్రక్కనున్నవారు 'ఇతడుధర్మరా'జని చెప్పగా ధృతరాష్ట్రునిపాదములు పట్టుకొని నమస్కరించెను. అతడు ధర్మరాజును కౌగిలించుకొనెను. కాని, మనస్సులో సంతోషములేదు. దుఃఖమువలన ముఖములోదైన్యము కన్పడుచున్నది. అయినను ధర్మరాజువిూదమాత్ర మతనికి పెద్ద కోపము లేదు. ధర్మరాజు గాంధారికి నమస్కరింపగా ఆమె తన కొడుకులందరును చనిపోవుటకు ధర్మరాజే కారణమని కోపముతో నతని దీవించుట కిష్టములేక శపింపబోయెను అంతలో ఆసంగతి దివ్యదృష్ట్యా తెలిసికొన్న వ్యాసమహర్షి వచ్చి, ఆమెకు వేదాంతోపదేశముచేసి, కోపముతగ్గించెను. అప్పుడు ధర్మరాజు మెల్లగా ఆమెదగ్గర కేగి 'నీపుత్రులనంద

రిని చంపించిన క్రూరుని, పాపాత్ముని శాపముతో చంపుము. సపరివారముగా రాజులందరి మరణమునకు కారణమైన యీ దుర్మార్గునికి శాపదండన విధింపవలసినదే! చుట్టాలను, బిడ్డలను చావజూచిన నాకిక జీవ మెందుకు, రాజ్య మెందుకు? ద్రోహిని' అని పల్కుటతో ఆమెకు నోరాడలేదు. కోపముతగ్గించుకొని 'కుంతిని దర్శించుడు' అన్నది. వారు వెళ్ళి తల్లియైన కుంతికి ఏడ్చుచు నమస్కరించిరి. బంధువు లందరును చనిపోయినమీదట జయమువచ్చినను యథార్థ ముగా వారి కానందము కలుగుటలేదు.

పాండవులు బంధువులందరికిని తర్పణములు చేసి గంగాతీరమున గుడారములువేసికొని నెలనాళ్లుండిరి. అప్పుడు మహర్షులెందరో వచ్చి, వారిని చూచి యోదార్చిరి. ఆలో నారదుడు వచ్చెను. ధర్మరాజతనితో 'మాతల్లి తర్పణములు చేయునపుడు కర్ణునకుకూడ చేయుమన్నది. ఆమాట ముం దుగా చెప్పినచో నేను యుద్ధము చేసెడివాడనా? అది వినుటతో నాహృదయములో నిప్పులుపోసినట్లయినది. ఆమె తాను చేసిన ప్రయత్నమంతయు చెప్పినది. జూదమాడెడు రోజున దుర్యోధనునకు హితవుగా నతడెన్నో అవినీతిమాట లాడినాడు. కాని నా మనస్సున నేలకో అతనిపై కోపమే రాలేదు. అతనిశరీరము చూచినచో కొన్ని కుంతిపోలికలు కన్పడెడివి. అవేమిటో అనుకొంటినికాని, యిట్టి కారణమని తెలిసికొనలేకపోయినాడను. ఇప్పుడేమి చేయుదును? ఆ కర్ణుని చరిత్ర చెప్పుము; వినదలతును' అనుటతో నారదుడాతని కథను చెప్పెను. అప్పుడు విచారమునకు తోడు కోపమురాగా ధర్మ

రాజు 'స్త్రీలకు రహస్యముదాచెడిశక్తి లేకుండుగాక!' అని శపించెను. అతని కెంతో పశ్చాత్తాపము కల్గినది. ఆ విచారమును మహాత్ములు శ్రీకృష్ణుడును తగిన పలుకులు చెప్పి యోదార్చిరి. అతని నూరడించి రాజ్యాభిషేకము మంచిదని చెప్పిరి.

ధర్మరాజు సింహాసనమున తూర్పుగా తిరిగి కూర్చుండెను. ఎదుట శ్రీకృష్ణుడు, కుడివైపున భీముడు, ఎడమవైపున అర్జునుడు, వెనుక నకులసహదేవులను రెండుప్రక్కల నుంచుకొని కుంతీదేవి, కృష్ణునికి కుడిప్రక్క గాంధారితో ధృతరాష్ట్రుడు, అతనికి తూర్పున విదురుడు, యుయుత్సుడు, సంజయుడు, కృపాచార్యుడు కూర్చుండిరి. అప్పుడు నానాదేశముల నుండి వచ్చిన రాజులు, పండితులు, వినోదకారులు, వాద్యగాండ్రు, వారకాంతలు నందరును సేవించుచుండగా నవరత్నఖచితమైన కనకపుసింహాసనమున వ్యాఘ్రాసనమువేసి దానిని పూజించి బ్రాహ్మణులు వీర్యవంతములైన మంత్రములు చెప్పుచుండగా ధర్మరాజా సింహాసన మధిష్ఠించెను. ధృతరాష్ట్రుడు సంతోషముతో ధౌమ్యు డందించిన కలశము నందుకొని ధర్మరాజున కభిషేకముచేసెను. శంఖాదులను మ్రోయించిరి. ధర్మరాజా శుభసమయమున నెల్లవారిని తగురీతి గౌరవించెను.

రాజులందరు నెవరియిండ్లకు వా రేగిరి. ధర్మరాజు ధృతరాష్ట్ర విదురులతో 'ఈరాజ్యము మీది. నేను మీపక్షమున, మీయనుమతిని రాజ్యము చేయుదు' నని చెప్పి, ఆరీతిగానే ప్రతిదినమును వారికిచెప్పి ప్రతిపనియు చేయుచుండెను. భర్తలుపోయినవారికి తగు భరణముల నిచ్చెను. అమాత్యు

రిని చంపించిన క్రూరుని, పాపాత్ముని శాపముతో చంపుము. సపరివారముగా రాజులందరి మరణమునకు కారణమైన యీ దురాత్మునికి శాపదండన విధింపవలసినదే! చుట్టాలను, బిడ్డలను చావజూచిన నాకిక జీవ మెందుకు, రాజ్య మెందుకు? ద్రోహిని' అని పల్కుటతో ఆమెకు నోరాడలేదు. కోపముతగ్గించుకొని 'కుంతిని దర్శించుడు' అన్నది. వారు వెళ్ళి తల్లియైన కుంతికి ఏడ్చుచు నమస్కరించిరి. బంధువు లందరును చనిపోయినమీదట జయమువచ్చినను యథార్థ ముగా వారి కానందము కలుగుట లేదు.

పాండవులు బంధువులందరికిని తర్పణములు చేసి గంగాతీరమున గుడారములువేసికొని నెలనాళ్లుండిరి. అప్పుడు మహర్షులెందరో వచ్చి, వారిని చూచి యోదార్చిరి. ఆలో నారదుడు వచ్చెను. ధర్మరాజతనితో 'మాతల్లి తర్పణములు చేయునపుడు కర్ణునకుకూడ చేయుమన్నది. ఆమాట ముం దుగా చెప్పినచో నేను యుద్ధము చేసెడివాడనా? అది విను టతో నాహృదయములో నిప్పులుపోసినట్లయినది. ఆమె తాను చేసిన ప్రయత్నమంతయు చెప్పినది. జూదమాడెడు రోజున దుర్యోధనునకు హితవుగా నత డెన్నో అవినీతిమాట లాడినాడు. కాని నా మనస్సున నేలకో అతనిపై కోపమే రాలేదు. అతనిశరీరము చూచినచో కొన్ని కుంతిపోలికలు కనపడెడివి. అవేమిటో అనుకొంటినికాని, యిట్టి కారణమని తెలిసికొనలేకపోయినాడను. ఇప్పుడేమి చేయుదును? ఆ కర్ణుని చరిత్ర చెప్పుము; వినదలతును' అనుటతో నారదు డాతని కథను చెప్పెను. అప్పుడు విచారమునకు తోడు కోపమురాగా ధర్మ

రాజు' స్త్రీలకు రహస్యముదాచెడిశక్తి లేకుండుగాక!' అని శపించెను. అతని కెంతో పశ్చాత్తాపము కల్గినది. ఆ విచారమును మహర్షులు శ్రీకృష్ణుడును తగిన పలుకులు చెప్పి యోదార్చిరి. అతని నూరడించి రాజ్యాభిషేకము మంచిదని చెప్పిరి.

ధర్మరాజు సింహాసనమున తూర్పుగా తిరిగి కూర్చుండెను. ఎదుట శ్రీకృష్ణుడు, కుడివైపున భీముడు, ఎడమవైపున అర్జునుడు, వెనుక నకులసహదేవులను రెండు ప్రక్కల నుంచుకొని కుంతీదేవి, కృష్ణునికి కుడిప్రక్క గాంధారితో ధృతరాష్ట్రుడు, అతనికి తూర్పున విదురుడు, యుయుత్సుడు, సంజయుడు, కృపాచార్యుడు కూర్చుండిరి. అప్పుడు నానాదేశముల నుండి వచ్చిన రాజులు, పండితులు, వినోదకారులు, వాద్యగాండ్రు, వారకాంతలు నందరును సేవించుచుండగా నవరత్నఖచితమైన కనకపుసింహాసనమున వ్యాఘ్రాసనమువేసి దానిని పూజించి బ్రాహ్మణులు వీర్యవంతములైన మంత్రములు చెప్పుచుండగా ధర్మరాజు సింహాసన మధిష్ఠించెను. ధృతరాష్ట్రుడు సంతోషముతో ధౌమ్యు డందించిన కలశము నందుకొని ధర్మరాజున కభిషేకముచేసెను. శంఖాదులను మ్రోయించిరి. ధర్మరాజా శుభసమయమున నెల్లవారిని తగు రీతి గౌరవించెను.

రాజులందరు నెవరినియుండ్లకు వారేగిరి. ధర్మరాజు ధృతరాష్ట్ర విదురులతో 'ఈరాజ్యము మీది. నేను మీపక్షమున, మీయనుమతిని రాజ్యము చేయుదు' నని చెప్పి, ఆరీతిగానే ప్రతిదినమును వారికిచెప్పి ప్రతిపనియు చేయుచుండెను. భర్తలుపోయినవారికి తగు భరణముల నిచ్చెను. అమాత్యు

ను, ప్రకృతులను మన్నించెను. కుంతికి శుశ్రూష చేసెను. ద్రౌపది కిష్టాభరణములిచ్చెను. అతి తర్పణములు చేయుచు రాజానపదులందరికి మనస్సంతోషసమున్నట్లుగ రాజ్యము చేయుచుండెను.

ఒకనాడు ధర్మరాజు శ్రీకృష్ణునిమందిరమున కేగి అతనిధ్యానించి నాకు వేదాంతోపదేశముసేయుమని ప్రార్థించెను. అతడు 'నన్నిపుడుభీష్ముడు స్తుతించుచున్నందున నామన స్సతనివైపు లగ్నమైయున్నది. అతడు త్రికాలవేది. నీ వా తనివద్ద కేగి జ్ఞానోపదేశము పొందుము' అనెను. అత డంగీకరించి భీష్మునొద్దకు శ్రీకృష్ణునితో కలిసి వెళ్ళెను. భీష్ముడు శ్రీకృష్ణునే చెప్పుమని, తాను బాధపడు చుంటినని చెప్పగా కృష్ణుడు 'నీ కేబాధయు కలుగదు. ఉత్తరాయణము వచ్చు వరకు, ఈ ఏబదియారురోజులును ధర్మరాజునకు ధర్మోపదేశముచేసి సందేహానివృత్తి చేయు' మనెను. అతడు 'నీయను గ్రహమున అట్లే' చేయుదు నని అంగీకరించెను. అటుతర్వాత భీష్ముడు చెప్పుచుండగా ధర్మరా జెన్నో ధర్మములను వినెను.

భీష్మునకు బ్రతికియున్నంత కాలము సేవలుసేసి, యెన్నో ధర్మముల నాతడు చెప్పగావిని ఆతడు పరలోకగతుడు కాగా అతని దేహమున కగ్నిసంస్కారము చేసెను.

తరువాత వ్యాసునితో 'దేవా! నాకు బంధువులను చంపినపాప మెట్లుపోవును?' అని వాపోవగా నతడు అశ్వమేధము చేయుమనెను. అత డట్లు తమ్ములసాయమున అశ్వమేధమునుచేసి వ్యాసునకు తనరాజ్యమునే దక్షిణగా నిచ్చెను. అతడు నీవే యేలుకొమ్మని బతిమాలి ధర్మరాజున కిచ్చివేసెను.

ధృతరాష్ట్రునియెడ మిక్కిలి గౌరవము, భక్తి ఉట్టిపడునట్లు ధర్మరాజు నడచుకొనెను. అది చాలకష్టసాధ్యమైనపని. అతడు కోరినరీతిగా దానధర్మములు చేయుటకు వస్తువుల నిచ్చును. గుళ్ళు గోపురములు కట్టించి ఆ పుణ్యమును తండ్రికే ధారవోయును. తనను సేవింపవచ్చినరాజులెల్లరు నతనినే ముందుగా సేవింతురు. దానితో తాను సంతోషించును. దుర్యోధనాదులకు శ్రాద్ధదినములలో దానధర్మముల నెక్కుడుగా చేయించును. ధర్మరాజు మనసులోకూడ ధృతరాష్ట్రుని దుర్గుణములను తలచి యెరుగడు. అతనివర్తనమునుబట్టి పరిచారకులుకూడ ధృతరాష్ట్రునికథనుగాని, దుర్యోధనుని చెడు గుణములనుగాని నోట నుచ్చరించుటకు జంకుచుందును. 'యథా రాజా తథా ప్రజా' ఇట్లు పదేనేండ్లు గడచినవి.

తా నిక చనిపోవుటకై వనవాసము చేయుదునని ధృతరాష్ట్రుడు చెప్పగా ధర్మరాజు తనవలన నేమైన లోపమువచ్చెనేమోయని నొక్కినొక్కి యడిగెను. అతడు లేదని గట్టిగా చెప్పినమీదట విశ్వసించినను అతనికొడుకగు యుయుత్సునికి రాజ్యమిచ్చి తానుకూడ వనమునకే వత్తుననెను. ధృతరాష్ట్రుడెన్నోరీతుల ధర్మరాజును బుజ్జగించి రాజ్యమేలునట్లు చేసెను; ఎన్నోరాజనీతిరహస్యములను బోధించెను. ఆఖరున తన బంధువులకెల్లరకు శాశ్వతస్వర్గావాప్తికల్గునట్లుగా దానధర్మములు చేయదలచినట్లు విదురునిద్వారా కబురంపగా, భీము డంగీకరింపకున్నను మందలించి ధర్మరాజాతడు కోరినదెల్ల యిచ్చి సంప్రీతుని చేసెను. అతనికారణముగా తా మెన్ని కష్టములు పడినను, అన్నియు పూర్తిగా మరచి, అతనికి

త్రికరణశుద్ధిగా సేవలు చేసెను. ఆహా! ఎంతటి మనశ్శుద్ధి! ఎంతయోర్పు ధర్మరాజుది!

తల్లిని వనవాసమునకై వెళ్ళవలదని యెంత ప్రార్థించి నను వినక యామె వెళ్ళినది. నారదుని ద్వారా వనవాసము చేయుచున్న ధృతరాష్ట్రాదుల యోగక్షేమము తెలిసికొనియు తనివితీరక తానును అడవికేగి రెండునెలలుండి వారికి సేవలు చేసెను. చివరికి ధృతరాష్ట్రు ఢిల్లో వెళ్లుమని యాజ్ఞాపించగా ధర్మరాజతనిమాటను కాదనలేక రాజ్యమునకు వెళ్ళెను. తర్వాత గాంధారీ ధృతరాష్ట్రులును, కుంతియు దేహత్యాగము చేసినట్లు నారదమహర్షి వచ్చి చెప్పగా విని, విచారించి వారి కుత్తరగతులు కల్గుటకై దానధర్మములు చేసెను.

ధర్మరాజు పట్టాభిషిక్తుడై ముప్పదియైదు సంవత్సరములు గడచినవి. ముప్పదారవయేట నతనిరాజ్యమున నెన్నో అపశకునములు, నుత్పాతములును కల్గినవి. దానికి ఫలితముగా బలరాముడు కృష్ణుడుతప్ప తక్కినయాదవులందరును పరస్పర వివాదములతో నాశనమైనట్లు విని విచారించెను. దారుకుడు వచ్చి ధర్మరాజుతో యాదవులుపోయినవిషయము చెప్పెను. అర్జునుడువచ్చి శ్రీకృష్ణు డవతారము చాలించిన విధమును విన్నవించుటతో ధర్మరాజు 'కలికాలమువచ్చినది. మన మిక నుండుట మంచిదికాదు. కాన మహాప్రస్థానముచేయుద, మనెను అందులకు తమ్ములు, ద్రౌపదియు నంగీకరించిరి. అభిమన్యుని కుమారుడైన పరీక్షితుని రాజ్యమున కేలికగా పట్టాభిషిక్తుని చేసెను. సుభద్ర నతనికి రక్షణకై యుండుమని తాను తమ్ములును ఆభరణములు తీసివేసి నారచీరలుకట్టుకొనిరి. ద్రౌప

దితో వా రారుగురుకాగా, వారివెనుక నొకకుక్కకూడ నడచు చున్నది. జూదమునాడు వనవాసమునకు వెడలినట్లుగా వారు వెడలుచుండగా పౌరులందరును విచారించుచు సాగనంపిరి.

వారంతట వరుసగా పోవుచు గంగాతీరమున కేగి అక్కడినుండి తూర్పుగా సముద్రతీరమున కేగిరి. వారు నిరాహారులై యోగబలమున నడచుచుండిరి. అక్కడినుండి దక్షిణ ముఖముగా దక్షిణసముద్రతీరమున కేగిరి. అచ్చటనుండిపశ్చిమ ముఖముగా పశ్చిమసముద్రము చేరిరి. అక్కడినుండి ఉత్తరాభి ముఖులై సముద్రమునొద్దనే నడచి నడచి హిమాచలము దాటి ఎన్నోనదులు, అడవులుదాటి మేరుసమీపమును జేరిరి.

ఆ యేడుగురు నడచుచుండగా ద్రౌపది ముందుగా పడినది. ఆమె యేల పడెనని భీముడడుగగా ధర్మరాజు 'ఈమె కర్జునునిపై ప్రేమ యెక్కువగుటచే పుణ్యములు ఫలింప లేదు' అని చెప్పెను. తర్వాత సహదేవుడు పడగా భీముడు కారణ మడుగగా 'ఇతడు తనకన్న తెలివైనవాడు లేడని గర్వించుచుండును. అందుచే నిట్లు పడె' ననెను. నకులుడు పడగా 'తనయంత యందమైనవాడు లేడను గర్వమితని కెక్కువ' అని చెప్పెను. అర్జునుడు పడెను. భీముడు కారణ మడిగెను. 'ఇతడు కౌరవులనెల్ల ఒక్కరోజులో చంపుదు నని బీరములు పల్కెను. మాటయొకటి – చేతయొకటిగా నుండుట తప్పయ్యెను. కాక యితడు ధనుర్ధారులనందరి నిందించు చుండు, అని కారణమును చెప్పెను. తర్వాత భీముడు పడి పోవుచు కారణమడిగెను.' 'నీవు తిండిపోతువై బలమున్నదని గర్వించి, ఎవరిని లెక్కసేయక, వృథాప్రలాపము లాడుచుం దువు. అందుచే పడితివి' అని చెప్పి, వెనుకతిరిగిచూడకుండ

ప్రయాణము సాగించుచుండెను. అతని వెనుకనున్న దొక్క కుక్కమాత్రమే.

అంతలో ఇంద్రుడు రథముతీసికొనివచ్చి ధర్మరాజును రథమెక్కుమనెను. నాతమ్ములువచ్చినగాని నేను రాననగా, 'వారు ముందుగానే స్వర్గమున కేగిరి. అక్కడ చూచెదవు గాని ర'మ్మనెను. అప్పుడు ధర్మరాజు 'నాతో పురమువిడిచి నదిమొద లీ కుక్క వెన్నంటివచ్చుచున్నది. దీని నెక్కింపు' మన్నాడు. 'కుక్కలకు నాస్వర్గములో తావు లేదు. ర'మ్మని యెంతచెప్పినను వినక 'ఈ కుక్క నన్ను విడువక వచ్చినది. ఇది నామిత్రుడు. దీని విడిచి నేనురాజాలను. నీవు తీసుకొనిపోలేకపోయినచో వెళ్లుము. నే నిందేయుండి. తపస్సు చేసికొందును'అని గట్టిగా పట్టుపట్టి చెప్పెను. అప్పు డా కుక్క యమధర్మరాజురూపమున ప్రత్యక్షమయ్యెను. అతడు చేసిన మంచిపనుల నుగ్గడించి. నీవు నాడు యక్షుడుగా నేను వచ్చి నపుడు నకులు నడిగితివి నేడు కుక్కనైన న న్నెక్కించినగాని స్వర్గమునకు రానని యింద్రుని కెదురాడితివి. ఎంతో మెచ్చు కొంటిని. నీకు శాశ్వత సౌఖ్యములు కల్గు' ననెను. పుష్ప వర్షము కురిసినది దేవతలు విమానములనెక్కి ప్రక్కనవచ్చు చుండగా ధర్మరాజు స్వర్గమున కేగుచుండెను. మధ్యలో నార డుడు వచ్చి 'నీయంతటి పుణ్యాత్ము లుండరు. మేనుతో (బొందితో) స్వర్గలోకమునకు రాగల్గినవారు లేరు' అని పొగ డగా నతడు 'నాతమ్ములను నాపక్షమువారైన రాజులను చూచినగాని నాకు శాంతియుండద'దనెను. 'రాజా! నీకు మానవులకుండునట్టి అభిమానము, స్నేహము పోలేదు. అది పనికి వచ్చునా?'అని యింద్రు డడుగగా ధర్మరాజు 'నీ వేమన్నను

నాకు వారిపై అభిమానముమాత్రము పోదు' అని నొక్కి-చెప్పెను. అప్పు డింద్రుడు తనభటుల 'నాతనికి తమ్ములను, తక్కి-నరాజులను చూపు'మని నియోగించెను. అతనితోపాటు నారదాదులుకూడ వెళ్ళిరి.

అక్క-డ ఒకచోట సింహాసనమున కూర్చుండి దివ్య భోగము లనుభవించుచున్న దుర్యోధను డగపడెను. 'పాపిష్ఠుడైన యితని కీ పవిత్రభోగము లెట్లు వచ్చిన'వని ప్రశ్నింపగా, నారదుడు 'ధర్మరాజా! ఇతడు యుద్ధములో చచ్చినందున వీరస్వర్గము పొందెను. మానవలోకములోనుండు ఈర్ష్యాసూయాది దోషముల నిచట తలపకుము. నీవు యుద్ధమువలన జూదమువలనవచ్చిన పాపములను పోగొట్టుకొనుము' అనిహిత బోధచేసెను. 'ఏ దేమైననుసరే; నాకు ద్రౌపదిని చూపుము అదిగాక కర్ణుడు మాయన్న అంటివే! అతనిని, ఇంకను తక్కి-న రాజులను చూపుము' అని కోరెను. అప్పుడు మునులు 'నీకు హితమైనపని చేయుమని మాకు ఇంద్రు డాజ్ఞనిచ్చినాడు. కాన మీవారిని చూపుదు'ని దేవదూతతో 'వీరి వా రున్నచోటికి విమానమును నడుపు' మనిరి. అతడు తలవెంట్రుకలు ఎముకలతో తొడత్రొక్కి-డిగానుండి, దుర్గంధముతో అసహ్యముగా నున్న దారివెంట, దోమలు ముసురుచుండగా, చీకటిలో దారి కనుపించీ కనుపించనట్లుండగా తీసికొనిపోవుచుండెను.

అక్క-డ దారిలో దారుణమైన పక్షులకూతలు వినపడుచుండెను. అక్క-డనే యున్నది వైతరణీనది. దానిమొద్దున అసిపత్రవన మున్నది. అక్క-డ నానాయాతనల ననుభవించుచున్న పాపకర్ములనుచూచి దేవదూతతో ధర్మరాజు 'మనము పోవలసినచోటు ఇంకను ఎంతదూర మున్నది?' అని అడిగెను.

'ఇక్కడనే మనగమ్యస్థానమున్నది' అని చెప్పుచుండగా, ధర్మరాజక్కడ నిలువలేక మరలిపోవ దలచుచుండెను. అంతలో 'ఓ పుణ్యాత్ముడా! నీవు పోకుము ఒక్కక్షణమాగుము. నీ దేహమునుండి పరిమళించెడిగాలి వీచుచున్నది. దానితో మేము సుఖపడుచున్నాము. కొంచెముసేపు నిలువుము.' అను కేకలు వినవచ్చినవి.

అయ్యో! పాపము! వా రెంత బాధపడుచున్నారో అని ధర్మరాజుకూడ కొంచెముసేపు నిలిచి 'మీ రెవరు?' అని అడుగగా 'కర్ణుడను, భీముడను, అర్జునుడను, నకులసహదేవులము, ద్రౌపదిని' అను కేకలు వినవచ్చినవి. అదివినునప్పటి కతనికెంతో విచారము కలిగినది. 'హా దైవమా! మంచివారై పాపకర్మల నెరుగని వీరు నరకయాతనల ననుభవించుటయా?' అని యింద్రునిపై కోపించి దేవదూతతో 'మా వారికి సుఖము కలుగునట్లు నే నిక్కడనే యుందును. నీవుపోయి మీ రాజుతో నేను రానన్నానని చెప్పుము' అని పల్కెను.

వెంటనే దేవదూత పరుగెత్తుకొనిపోయి యింద్రునితో ధర్మరాజన్నమాటలు చెప్పగా ఇంద్రుడే అక్కడకు వచ్చెను. అతనితోపాటు యముడు సిద్ధమునులు వచ్చిరి. వారు వచ్చుటతో అదంతయు స్వర్గతుల్యముగా పరిణమించినది. సువాసనలు వీచినవి. యాతనలు పోయినవి. ఇంద్రుడు 'ధర్మజా! విచారింపకుము. నిన్ను తీసికొని వెళ్ళుటకై యిందరమువచ్చినారము. రాజైనవానికి నరకము చూచుట తప్పదు. కొద్ది పుణ్యముచేసినవాడు ముందుగా పుణ్యఫలితములను, కొద్ది పాపముచేసినవాడు ముందుగా పాపఫలితమును అనుభవించును. కావున నీవారందరును ముందుగా పాపఫలితము నను

భవించిరి ఇంక సుఖము ననుభవింతురు. నీవును పాపఫలిత ముగా ఒక్కింతసే పిశాచమై నాగి నరకబాధను చవిచూచితివి. ఇక పోవుదము. నీవారును వత్తురు. రమ్ము. అదే ఆకాశగంగ. దానిలో స్నానముచేసి మనుష్యభావమువదలి పవిత్రుడవై రమ్ము' అనెను. యముడును అతని నట్లే చేయుమని సలహా నిచ్చెను. అత డట్లు ఆకాశగంగలో స్నానముచేసెను. వెంటనే అతనికి దివ్యమైన దేహము వచ్చినది.

దివ్యశక్తివచ్చినది. దానితో అతడు నారదాదులు తోడురాగా వెళ్ళుచు ఒకచోట శ్రీమన్నారాయణుని చూచెను. సూర్యులలో పదుమూడవవాడుగా వెలిగెడి కర్ణుని చూచెను. మరుద్గణములో భీముని, అందముగా ప్రకాశించెడి నకుల సహదేవులను, ప్రకాశించెడి ద్రౌపదిని చూచెను. వారిని చూచి వీ రెవరని యడుగగా ఇంద్రుడు పేరుపేరువరు సల ఉపపాండవులను, తక్కినపాండవులను, ధృతరాష్ట్ర పాండు రాజులను, కర్ణుని, అభిమన్యుని చూపి, వసువులలోనున్న భీష్ముని చూపెను. ఇంకను భారతయుద్ధములో పాల్గొని వీరస్వర్గ మును పొందిన వీరులనెల్లరను చూపెను. అచ్చట కొంత కాలము సుఖములనుభవించి ధర్మరాజు యమధర్మరాజు (ధర్ముని) లో నైక్యమయ్యెను.

అట్లు ధర్మువువంశమువలన పుట్టి ధర్మము నెల్లరీతుల నాచరించి, ప్రచారముచేసిన ధర్మరాజు సర్వజనులకు సం స్తవనీయుడు. అతనికున్న యోర్పు, శాంతి, నీతి, ధర్మము, నేర్పు మరెవ్వరికి నుండవు. భార్యయొక్కవలువలను సభలో విప్పుచుండగా మరెవరైన నైనచో చూచుచు నూరకుండ గలరా? కాగలకార్యము గంధర్వులు చేసినప్పుడు అడ్డుపడ

గలరా? తనమీద నాధారపడి తనపంచచేరిన ధృతరాష్ట్రుని వంటి ఆత్మద్రోహిని మరెవ్వరైన క్షమించి మనస్సునకైన నొప్పితోచకుండ తానేకాక పరిచారకులచేకూడ పనిచేయింప గలరా? కొన్నితప్పులుగా తోచినచో అవి చాలస్వల్పములేకాక, కాలవశమున దైవప్రాతికూల్యమున నేర్పడినవే కాని వేరొకటిగాదు. ద్రౌపది ధర్మరాజుపై కోపించి యెన్నో సారులు తిట్టిపోసినది. కాని, విరాటునియింటిలో నుండగనే భీమునితో సంభాషించుచు ధర్మరాజును పొగడినది. అ విధి:

సీ. ఎవ్వనివాకిట నిభమదపంకంబు
        రాజభూషణరజోరాజి నడఁగు
ఎవ్వనిచారిత్ర మెల్లలోకములకు
        నొజ్జయై వినయంబు నొరపు గఱపు
ఎవ్వనికడకంట నివ్వటిల్లెడుచూడ్కి
        మానితసంపద లీనుచుండు
ఎవ్వనిగుణలత లేడువారాసులకు
        కడపటికొండపై గల యబ్రాకు
నతఁడు భూరిప్రతాప మహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలుఁడు కేవలమర్త్యుఁడె ధర్మసుతుఁడు!

ఇది ధర్మరాజుపాత్రయొక్క స్వభావోక్తి; ఆదర్శప్రాయమైనది.

సర్వే ధర్మపరా స్సంతు!

—o—

# భీమసేనుడు

భీముడన్న పేరే మహాభయంకరముగా నున్నది. పంచపాండవులలోను బలములో పేరెన్నికగన్నవా డొక్క భీముడే. అతడు పదివేలయేనుగులబలము కలవాడు. ఏనుగులను తొండములు పుచ్చుకొని బంతులవలె పైకెగురవేసెను. దుర్యోధనునితో గదాయుద్ధముచేసినప్పుడు కృష్ణు డిద్దరిబలాబలముల నెన్నుచు 'భీముడు బలశాలికనుక దుర్యోధనుని గదాఘాతములను లెక్కసేయుటలే'దని చెప్పినాడు. అంతకుమించిన తిండిపోతు. ఔద్ధత్యము కలవాడు. మాటలు వెనుకముందు లాలోచించకుండ అనివేయు స్వభావముకలవాడు. ఇన్నియున్నను ఒక్క సుగుణముమాత్ర మున్నది. అన్నగారిమాట కేనాడును జవదాటియెరుగడు. అది భీమునివంటి బలశాలికి చాలకష్టమైనపని. ఆ ఒక్కసుగుణమే అతనిని మంచిత్రోవలో పెట్టినది. అతడాడుమాటలలో పొల్లుమాటలు హెచ్చున్నను ప్రతిజ్ఞావాక్యములనుమాత్ర మక్షరాల నడపించూపెను. అతడు అతిబలుడగు వాయుదేవునిఅంశమువలన పుట్టుటయే మహాబలుడగుటకు కారణము. వరప్రసాదియైనవాడు సద్గుణఖని కాక యేల మానును? అతనినిగూర్చి సవిమర్శముగా తెలిసికొందము.

పాండురాజునకు స్వయంకృతాపరాధమువలన సంతానముకల్గు నవకాశము పోయినది. మొదట నతనికి కేవలము సన్యాసము పుచ్చుకొందమన్నంత వైరాగ్యము కల్గినను

తర్వాత భార్యలతోఁగూడిసే వానప్రస్థము నిగ్రహించెను. శతశృంగపర్వతముపై తపముచేసుకొనురోజులలో ఋషుల వలన పుత్రులులేనివారికి సద్గతులులేవని విని, పశ్చాత్తాపపడి భార్యయగుకుంతికి క్షేత్రజుల కనుమనియనుమతిచ్చినాడు. ఆమెభర్తయాజ్ఞపై ధర్మునివలనపుత్రునికన్నది. పాండురాజు నకు తనివితీరలేదు. భార్యతో 'నీ వింకొకపుత్రుని కనుము. అతడు బారచంద్రుడు, ఉత్తమస్థిరజవసత్త్వాఢ్యుడై యుండవలె. అట్టి సద్గుణములు మహాబలుడైన వాయుదేవునిదయవలనగాని కలుగవు. కాన భుజవిక్రమముతో కులకులమును రక్షింపగల బాలుని కనుము' అని చెప్పినాడు. ఆమె పతిమాటప్రకారము దూర్వాసు డిచ్చిన మంత్రముతో వాయుదేవు నారాధించినది. ఆతనిప్రసాదమున బాలుడు కల్గినాడు. ఆబాలునకు దివ్యవాణి 'భీమసేను'డని పేరుపెట్టినది.

ఆరోజుననే గాంధారికి దుర్యోధనుడు పుట్టెను. కొందరొక్క కథ చెప్పుదురు. 'భీముడు, దుర్యోధనుడు, హిడింబాసురుడు, కీచకుడు, జరాసంధుడు' ఈ అయిదుగురును సమబలశాలురట! ఇందు ముందుగా నెవనిచేతిలో నొకడు చనిపోవునో తక్కిన మువ్వురును వానిచేతిలోనే చత్తురని జనవాద మున్నదట! జరాసంధుని భీముడు చంపుట విన్ననాడే ధృతరాష్ట్రునికి మాటలుడిగినవట. ఇది సత్యమో అసత్యమో కాని. వీరు సమమైన బలశాలురన్నమాటమాత్రము నిజము.

ఇంకను పురుడునచ్చి పదిరోజులు నిండలేదు; ఆనాడే పదవరోజు. కుంతీదేవి ఆబాలుని ఎత్తికొని దేవతలకు మ్రొక్కటకై దేవాలయమునకు పోవుచుండెనట. పాండురాజు వెనుక,

యుంచెను. అంతలో పెద్దపులి తటాలున వచ్చినది. దానిని చూచి కుంతి భయపడినది. పాండురాజు విల్లెక్కుబెట్టి ఆపులిని చంపెను. కాని, భయపడి చేతులువణకినందున కుంతి యొడిలో నుండి బాలుడు రాళ్ళమీద పడెను. పరుగెత్తుకొని వెళ్ళి పాండురాజు బాలుని లేవనెత్తుకొనెను. కాని, ఆశ్చర్య మేమనగా బాలుడుపడినచోట రాళ్లు నుగ్గునుగ్గైనవి. ఇక బాలుని కేమి దెబ్బతగులును? పాండురాజాశ్చర్యపడి, భార్యకు బాలు నిచ్చి దేవతలకు మ్రొక్కించి, రక్షలు కట్టించి, యింటికి తీసి కొని వెళ్లెను. ఆ బాలు డంత సుకుమారుడు.

పాండురాజు చనిపోయినాక మహర్షులు కుంతిని, బాలురను తీసికొనివచ్చి ధృతరాష్ట్రుని కొప్పజెప్పిరి. అతడు తమ్ముని మీదనున్న ప్రేమతో పాండవులను తనపుత్రులవలెనే చూచు కొనుచుండెను.

చిన్నపిల్ల లల్లరిచేయుట సమంజసమైనదే. అందులో భీముడు విస్తారముగా దుండగములు చేయువాడు. జన్మకాల నక్షత్రములకే యున్నదేమో కాని విరోధము, కౌరవులకు భీమునకును ఒక్కక్షణమైనను పడెడిదికాదు. ఆచిన్నతనములో అతనితో రాగల రాజపుత్రులు లేకుండిరి. పది-పదేనుమంది నొక్కపెట్టున పట్టి క్రిందపారవైచి హుషారుగా గేలిసేయు వాడు. నీటిలో జలక్రీడలాడునప్పుడు కౌరవులను లెక్కబెట్టి పది-పది మంది నొక్కభుజముపై నెక్కించుకొని నీటిలో ముం చుచు, ఎత్తుచు ఏడ్పించువాడు. వారేదైనచెట్టెక్కినచో ఆచెట్టుమొదలంట పీకి పైకెత్తువాడు. ఆరీతిగా అతనిచే చిన్న

తనాన చాలబాధపడినవారిలో ప్రథములు దుర్యోధన దుశ్శాసనులు.

రాజరికము పాండురాజుదా? ధృతరాష్ట్రునిదా? అన్న ధర్మసందేహ మటుంచి, అప్పుడు రాజుగానున్న వాడు తన తండ్రికనుక దుర్యోధనునకు కొంతపలుకుబడియుండెడి దనక తప్పదు. దానిపై నొకరీతి రాజస మేర్పడును. బలము లేదు. కాని, దుర్బుద్ధిలో నందరినిమించినవాడే దుర్యోధనుడు. అతడు భీము నెట్లయిన రహస్యముగా చంపించి పీడవదల్చుకొనవలె నని శకుని మొదలైనవారితో నాలోచించినాడు. భీముని చంపుటతో పాండవులకు బలము తగ్గును. అప్పుడు ధర్మ రాజును కట్టి, కారాగారములో పారవేసి, శత్రువులు లేని రాజ్యము నేలవచ్చునని యనుకొన్నాడు దుర్యోధనుడు. ఒక నాడు భీముడందరి జలక్రీడలో నేడిపించి, శ్రమపడి ఒడలు తెలియకుండ నిద్రపోవుచుండెను. అదే సమయమని దుర్యోధను డతనిని తీగెలతో గట్టగాకట్టించి, లోతైన మగుడులోనికి త్రోయించెను. కొంతలోతునకు వెళ్ళినతర్వాత భీమునకు మెలకువరాబోయినది. ఒళ్లు విరుచుకున్నాడు. ఆ విరుపుతో త్రాళ్ళన్నియు ఏనుగునకు తామరకాడలువలె తేలికగా ఊడి పోయినవి. అతడు మెల్లగాని నీటిపైకి వచ్చివేసెను.

ఒకనాడు దుర్యోధనుడు నిద్రపోవుచున్న భీముని నల్ల త్రాచుపాములచే కరపించుమని పాములవానిని పంపెను. అతడు కరపించుచుండగా భీమునకు మెలకువ వచ్చినది. అస లాపాములకాట్లు చర్మముదాటి లోనికి పోనేలేదు. అయినను అతడు కోపముతో ఆపాములనన్నింటిని పట్టుకొని చెరవురుగు

లను రాచినట్లు నేలపెట్టిరాచి, ఆపాములవాని నొక్కుచరుపు చరచెను. ఆ దెబ్బతో అతడు మంచినీళ్ళడుగకుండ శాశ్వత సుఖము నందెను.

మరొకనాడు ఎవరికి తెలియనట్లుగా దుర్యోధనుడు భీమునకు విషాన్నము పెట్టుమని నియోగించెను. భీముడు తింపబోతు. యుయుత్సుడు వచ్చి ఆయన్నము మంచిదికాదని చెప్పినను, ఆకలిబాధ కాగలేక భీముడు చరచర ఆయన్నమును తిని వేసెను. అ దేమి అదృష్టమో అతని కా యన్నము అమృతాన్నమై జీర్ణమైనది. ఆ రీతిగా ఎన్నిసారులా భీముని చంప జూచినను అవన్నియు కృతఘ్నునకు చేసినయుపకారములువలె నిష్ఫలములైనవి. అందుచే సిగ్గుపడినను విసుగుచెందక దుర్యోధనుడు పాండవుల నెట్లయిన చంపెడియుపాయముకోసమే ఆరాటపడుచుండెను.

ద్రోణునివద్ద కౌరవపాండవులు ధనుర్విద్య నేర్చిరి. అందరును విలువిద్య నేర్చుకొనిరి. అదికాక గదాయుద్ధమును ప్రత్యేకముగా నేర్చుకొని భీమదుర్యోధనులు దానిలో ప్రావీణ్యము సంపాదించిరి. ఒకనాడు ద్రోణుడు విద్యార్థులచే అస్త్రవిద్యాకౌశలమును ప్రదర్శింపజేసెను. అందులో భీమ దుర్యోధనులు గదాయుద్ధప్రదర్శనముచేసిరి. వారు ప్రదర్శనము పేర నిజముగానే యుద్ధముచేయ నారంభించిరి. వారికి లోలోపల క్రోధము లున్నవికదా! ఆకసితీర గదలతో యుద్ధముచేయు చుండిరి. అది కాబోవుభారతయుద్ధమును సూచించుచున్నది. అదిచూచి ద్రోణుడు రంగస్థలనియమములకు భంగముగల్గు

నేమోయని భయపడి, అశ్వత్థామను పంపి, వారియుద్ధము నాపుచేయించెను.

పాండవులను కాశికి పంపుటలో ముఖ్యోద్దేశ్యము వారిపై ప్రజల కనురాగము తగ్గుటనియు, అక్కడ ప్రత్యేకముగా తయారుచేయించిన లక్క-యింటిలో పెట్టి వారిని తగుల బెట్టవచ్చుననియే! ధర్మరాజునకా విషయము ముందుగా తెలిసినందున అతడు భీమునితో 'ఈయిల్లు లక్కది. మన మే మరుపాటుగా నుండరాదు. జాగ్రత్త' అని హెచ్చరించగా భీముడు 'అట్లయిన మన మిందుండనేల? మరోచోటికి పోదము. పురోచనుని (లక్క-యిల్లు కట్టినవానిని) కాల్చివేయుద' మనెను. ధర్మరాజు 'ఇప్పుడే వెళ్ళినచో వారిదోషము ప్రజలకు తెలియదు. అందుచే మనమే చెడ్డవార మనుకొందురు. కాన కాలమును నిరీక్షింపవలెను' అని విసురు తగ్గించెను. ఇల్లు తగులబెట్టురోజు వచ్చినది. దుర్యోధను డారోజున లక్కయిల్లు కాల్చిరమ్మని పురోచనునికి వార్తనందిచ్చెను. అదే వార్తను జాగ్రత్తగా నుండుమని విదురుడు పంపెను. పాండవులా రోజున మహోత్సాహముతో దేవతాపూజలు, బ్రాహ్మణ సమారాధనలు చేసిరి రాత్రి అలసి నిద్రపోయిరి. భీముడొక్కడుమాత్రము మేల్కొనియే యున్నాడు. పురోచనుని కంటెముందుగా తానే పోయి యింటి నంటించి, రహస్యముగా త్రవ్వింపబడిన సొరంగముగుండా అన్నదమ్ములను, తల్లిని దాటించెను. ఆయింటితోపాటు పురోచనుడు కాలిపోయెను.

ఆ నిద్రమైకములో వారు నడువలేకున్నందున భీముడు తల్లిని చంకలో పెట్టుకొని, ధర్మరాజార్జునులను బుజములపై

నెక్కించుకొని, కవలలను తొడలపై నెక్కించుకొని రాత్రి యైనను పగటియందువలెనే ముళ్ళు-రాళ్లు అనుభేదము తెలి యక చురుకుగా ప్రయాణము సాగించెను.

తరువాత వారు మేల్కాంచిరి. గంగదాటి ఎండ కన్నెరుగని, గాలి-వారని కారడవికి చేరిరి. వారికి ఆకలి-దప్పు కలు హెచ్చయినవి. నడువలేకపోగా భీముడు [illegible] నెత్తుకొని నడచి సాయంకాలముకావచ్చుసరి [illegible] అడవి మధ్యలోనున్న మర్రిచెట్టుక్రిందికి చేర్చెను.

అతనికి కూడ దాహ మెక్కువగా వేసినది. ఆ చెట్టెక్కి యెక్కడ కొలనున్నదో అని నల్దిక్కుల పరికించెను. కొలనున్నచోటు చూచెను. అక్కడికి తా నొక్కడును వెళ్ళి కడుపునిండ నీరు త్రాగెను. అక్కడ పెద్దపెద్ద తామరాకులు దొన్నెలుగా జేసి, వాటినిండ నీరుపట్టి మిగిలినవారికై తెచ్చెను.

అతడు వచ్చుసరికి వారందరును నిద్రపోయిరి. పై బట్టలు క్రిందపరచుకొని, కటికినేలపై చేతులు తలగడలుగా పెట్టుకొని నిద్రించుచున్న అన్నదమ్ములను చూచి విధికృత మున కెంతో విచారించెను. వారిని లేపలేదు. నీ రక్కడనే యుంచి, ఇక్కడ చాలసేపుండుట మంచిది కాదు. ఏదైన పట్టణమునకు చేరవలె ననుకొనెను.

అంతలో ఆ వనములోనున్న హిడింబాసురునకు నర వాసన తగిలినది. అత డెన్నడును మానవు లచ్చటికి వత్తురని తలంపలేదు. అయినను ఒకవేళ వచ్చిరేమో చూచిరమ్మని చెల్లెలైన హిడింబను పంపెను. ఆమె అడవి వెదకుచు భీము

డున్నచోటికి వచ్చినది. అతనిఆకారము దానికి నచ్చినది. అట్టి బలశాలి నామె రాక్షసులలోకూడ బహుశః చూచి యుండదు. అతని ప్రేమించినది. దగ్గరకు చేరినది. 'అయ్యా! నేను నిన్ను వలచితిని. మాఅన్న మహాబలశాలి.హిడింబు డను వాని దీ యడవి. ఇక్కడి కెవరును రారాదు. ఇక్కడినుండి బయటికేగుట మృత్యువుకంఠములోనుండి బయటపడినట్లే. నేను కామరూపముగలదానను. మన మిద్దరము నెచ్చట కైన పోదము. నాతో వచ్చి ప్రాణములు రక్షించుకొనుము' అన్నది. అతడు 'ఓసి బేలా! ఎంత దుర్మార్గురాలైనను అన్న దమ్ములను, తల్లిని విడిచి స్త్రీని తగుల్కొనుదునా? ఆ మాట లనకుము' అనుటతో, ఆమె 'నీకు వీరినందరిని రక్షించుట హితమైనచో మాఅన్న రాకమునుపే మరొకచోటికి పోవు దము. వీరిని లేపుము' అన్నది. 'ఎవడో రాక్షసుడు వచ్చునని, సుఖనిద్రపోవువారిని లేపుదునా? కాదు, నాబల మెంతయో తెలియునా? ఒక్కడుకాదు- దేవదానవులొక్కసారివిరుచుకొని వచ్చినను అందరిని చంపుదును గాని, సుఖనిద్ర భంగము సేయను. కావున వానిని రప్పింపుము' అనునంతలో చెల్లెలాల సించుటకు కారణమేమా యని హిడింబుడే అక్కడికివచ్చెను.

అన్ననుచూచి హడలిపోయి హిడింబ భీముని చాటు నకు చేరినది. అతడు 'ఓసి దుర్మార్గురాలా! ఒకమనుష్యుని వలచి నాయాజ్ఞ చేయకుందువా? చూడుము!' అని అదలిం చగా భీముడు 'చూడుము నా బలము' అని వానిమీదికి వెళ్లి 'నిన్ను చంపి యీ వనమును నిర్భయముగా చేసెదను' అని, దగ్గరగాపోయి, చేయిపట్టుకొని తాను యుద్ధముచేయునప్పుడగ

చప్పుడునకు తనవారి కెక్కడ నిద్రాభంగమగునో యని తలచి, సింహము క్షుద్రమృగమును లాగినట్లు దూరముగా లాగికొనిపోయి అక్కడ తన్ననారంభించెను. అచ్చట వా రిద్దరును ఘోరముగా పోరు సల్పుచుండిరి. అందు భీము నొకసారి చేతులమధ్య నొక్కిపట్టి హిడింబుడు పెద్దగాఅర్చెను. ఆ కేకకు అదిరిపడి వారందరును లేచిరి. ఎదురుగా ఎక్కువ సౌందర్యముతో నున్న హిడింబనుచూచి 'నీ వెవరవు? ఏమిటి? అని అడిగిరి. ఆమె తాను భీముని వలచుట, అతడు తన అన్నతో యుద్ధముచేయుట చూపి 'అతడు నాఅన్ననుచంపి,' నన్ను మిమ్ము రక్షించును' అన్నది. స్త్రీలకు భర్తలపైకల్గు ప్రేమకు ఏ ప్రేమయు సాటికాదుగదా! భర్తకై అన్న చచ్చుటను కోరినది.

అంతలో అర్జునుడు భీమునివద్ద కేగి 'ప్రొద్దుగ్రుంకు చున్నది; ఇక రాక్షసులకు బలముహెచ్చునుకాన జాగు సేయక వీనిని సంహరింపుము' అని హెచ్చరించెను. అతడు తన మల్లయుద్ధపాండిత్యము తేటపడునట్లు హిడింబుని ఒక కాలు చివరపట్టుకొని గిరగిర వందసార్లు త్రిప్పెను. అతడు నోట, ముక్కులవెంబడి రక్తము కార్చుచుండెను. మధ్యలో ఎప్పుడో అతనిప్రాణము లెగిరిపోయినవి. వానిని నేలకొన్చి నడుము విరుగగొట్టిపారవేసెను. ఆ చిత్రవధనుచూచి అంద రును ఆశ్చర్యపడిరి. అక్కడినుండి మరొకచోటికి వారు పోవు చుండగా హిడింబి వారివెన్కనే నడచుచున్నది.

భీము డామెను రాక్షసులు పగ లోపల ఉంచుకొని మాయ పన్నుదురు. కాన నీవు మా అన్నపోయినదారినే

పోమ్ము. నిన్ను నమ్మను' అని నిరాకరించెను. ఆమె అతని పరాక్రమమును జూచినదగుటచే భయపడి. తనవలపును కాదనుచున్నందులకు విచారించుచుండగా ధర్మరాజు భీముని తో 'వధకు తగినవాని చంపితివి. ఇది అబల. దీనిపై కోపింప కుము. ఆత్మరక్షణకన్న ధర్మరక్షణయే గొప్పది. మన కాపత్తువచ్చినను ధర్మమునే రక్షింపవలెను. జన్మాంతరమందు సైతము మనల నను సరించునది ధర్మమే' అని నచ్చచెప్పి కోపము మాన్పెను. ఆమె ధర్మరాజునకు భావగారు కనుకను, తనకు ప్రాణదానముచేసినందునను మ్రొక్కినది. అత్తగారికి మ్రొక్కి రహస్యముగా 'అవ్వా! స్త్రీలకు ప్రేమ హెచ్చు కదా! నాకు భీమునిపై నెక్కువ ప్రేమ కుదిరినది. నాబంధువు లను-చుట్టాలను విడిచి వచ్చితిని. నన్ను రక్షింపనిచో ప్రాణం బులు విడుతును. నాయిష్టము నెరవేర్చిననో మీా కిష్టము చేకూర్తును. మిమ్మందరను గావలసినచోట దింపగలను. భూతభవిష్యత్తులు చెప్పగలను. రాబోవువిషయము చెప్పె దను. మీారు దారిలో నొకచెట్టు కన్పడును. అక్కడ నొక సరస్సుండును. అక్కడికి మీారు వెళ్లుటతో వ్యాసమహర్షి మీాహితవుకోరి వచ్చును' అని చెప్పెను. కుంతియేకాదు; అందరును నాశ్చర్యపడిరి. కుంతి కామెపై ప్రత్యేకాభిమాన మేర్పడినది. భీమునితో 'నాయనా! ఇది పరమపతివ్రత. దీనిని మనసార ప్రేమించి పాండురాజునకు హితవు కల్గు నట్లుగా, పుత్రాభివృద్ధికై పెండ్లియాడుము' అని అన్నది. ఆమె చెప్పిన దానిలో తల్లి చెప్పవలసినరీతి యున్నది. కేవల కామవిషయమై తల్లి ఔన్నత్యముకలుగజేసికొనుట

మంచిదికాదు. సిగ్గుకూడ. ఆమె సత్సంతానప్రాప్తికై పుత్రుని నియమించినది. అత డంగీకరించినాడు. హిడింబతో 'ఉత్తమ స్త్రీగుణములు కల్గి, భర్తకనుకూలమైనపనులుచేయుచు పగ లెల్లను మీయిష్టమువచ్చినట్లు విహరించి, రాత్రిమావద్దనుండు' మన్నది. భీముడు పుత్రోత్పత్తి యగువరకు నట్లే యుందునని మాట యిచ్చినాడు.

హిడింబ చెప్పినట్లు జరిగినది. వ్యాసుడు వారికి హితోపదేశముచేసి భవిష్యత్తుచెప్పి హిడింబవిషయము ప్రస్తావించి 'ఈమె పేరు కమలపాలిక. ఈమె భీమునివలన మహాబలశాలి యైన కొడుకును కనును. అతడు మి మ్మాపత్కాలమున రక్షించును' అని చెప్పెను.

కమలపాలిక భర్తయైన భీముని తన కిష్టమైన పర్వతములమీదికి, కొలనులవద్దకు, వనములలోనికి తీసుకొనివెళ్ళి యథేచ్ఛగా విహరించెను. ఆమె కడుపు పండినది. సద్యోగర్భమున బాలుడు పుట్టినాడు. వానికి 'ఘటోత్కచు'డని పేరు పెట్టిరి. పుట్టిన వెంటనే పెరిగి పెద్దవాడయ్యెను. అస్త్ర శస్త్ర విద్యానైపుణ్యము కల్గినది. రాక్షససేన లతని సేవింపవచ్చిరి. అన్నదమ్ములకు తొలిచూలు పిల్లవాడగుటచే అందరు నెంతో ప్రేమతో లాలింపగా కొద్దిరోజులు వారివద్దనే యుండి 'నేను మాతల్లితో సహా వెళ్ళి మారాజ్యమున నుందును. మీకు పనికల్గినప్పుడు తలంచుకొన్నచో వత్తును' అని చెప్పి పెద్దలకు నమస్కరించి దీవనలంది తల్లిని తీసికొనిపోయెను.

పాండవు లక్కడనుండి ఏకచక్రపురమున కేగిరి. అక్కడ బ్రాహ్మణవేషములో నొకబ్రాహ్మణునియింటిలో మకాము

చేసిరి. వేదము చదువుచు మాధుకరముచేసికొని జీవించు చుండిరి. ఆయూరివారు వారినిచూచి మహారాజులుకాదగిన వారికి యేటికిపట్టెనో అనుకొనుచు, మృష్టాన్నములు వడ్డించు చుండిరి. అన్నదమ్ములందరును తెచ్చిన యన్నము నేకరాశి చేసి తల్లి కొప్పగించువారు. ఆమె తిండిపుష్టికలవాడని భీము నకు సగముపెట్టి మిగిలినవారికందరకు తక్కినసగము నిచ్చె డిది. అట్లయినను భీమున కర్ధాకలియే యగుచుండెడిది.

ఒకనాడు కుంతి భీముడును ఇంటిలోనున్నారు. తక్కిన వా రెక్కడికో వెళ్లిరి. అంతలో ఆయింటివారు గొల్లునఏడువ సాగిరి. కుంతి కొడుకుతో 'ఏరి కేదో పెద్దఆపద మూడియుం డును. దానిని తగ్గించుట మనకు విధి' అన్నది. 'అదేదో తెలిసి కొని వచ్చినచో అ దెంతపని? తగ్గింతును' అన్నాడు భీముడు.

కుంతి వెళ్లి అడిగినది. 'ఈయూరిలో బకాసురుడు చేరి యున్నాడు. వానికి వంతుప్రకారము అందరు 'నొక్క మను ష్యుడు రెండుదున్నపోతులను కట్టిన బండినిండుగా అన్నము పెట్టి తోలుకొనివెళ్లినచో మనుష్యుని, దున్నలను, బండె డన్నము నతడు తినునట్లు' ఏర్పాటుచేసిరి. ఆ వంతు మాకు వచ్చినది. ఒక్కడే కొడుకు. అందుచే విచారించుచున్నా'మని వారు చెప్పిరి.ఆమె'మీరువిచారింపపద్దు.నా కైదుగురుకొడుకు లున్నారు. అం దొకని పంపుదును. విప్రహింస చూడలేను' అన్నది. వారు 'మేముమాత్రము విప్రహింస చూడగలమా? వలదమ్మ తల్లీ!' అనిరి. 'అదికాదు. నాకొడుకు మహాబలశాలి. ఇదివర కెందరో రాక్షసులను చంపినాడు. వాని కీ రాక్షసుడు లెక్కకాదు. లేకున్న చో వందమంది సంతాన ముండుగాక!

ఏతల్లియైన నొక్కనిసైనను విడువగలదా?' అన్నది. అప్పుడు వారికి ధైర్యము చిక్కినది. ఆవిషయము వినగానే భీమునకు చేతినిండుగ పని తగులునని యానందము కల్గినది.

ధర్మరాజింటికి రాగానే 'మనవాని కేమైన యుద్ధము తగిలినదా, సంతోషముగా నున్నాడు?' అని తల్లి నడిగినాడు. ఆమె జరిగినకథ చెప్పినది. అతడు 'అ దేమిటమ్మా! వారి కొడుకును రక్షించుటకై నీకొడుకును పంపుదువా? ఇంత దారుణమా?' అన్నాడు. ఆమె 'అతడు మహాబలశాలి. మరే మియు ఫరవా లేదు. కాక, మనల నిన్నాళ్లనుండి రక్షించి నందులకు ప్రత్యుపకారముచేయుటకు తగినసావకాశము చిక్కినది. అది మనము సంతోషింపవలసిన విషయ' మని నచ్చ చెప్పినది.

భీముడు బ్రాహ్మణునితో 'అయ్యా! నాకు కడుపు నిండుగా ఆహారము లేదు. ఈనాడైన మృష్టముగా తిండిపెట్టినచో రాక్షసుని చంపుదును' అన్నాడు. అతడు, బంధువులును బ్రహ్మానందపడి రకరకాల పిండివంటలు, పప్పు, నెయ్యి, బెల్లము, అన్నము రాసులుగా తెచ్చి భీమునకు తృప్తిగా పెట్టిరి. అతడు ఉత్సాహముగా బండి తోలుకొని వెళ్ళు చుండెను.

బకాసురుడూరివెలుపల నున్నాడు. అక్కడ అంత కాలము చంపినవారియెముకలగుట్ట లున్నందున దుర్వాసన వేయుచున్నది. అక్కడికి పోవుట కసహ్యించుకొని భీముడు యమునయొడ్డున బండి నాపి, కాళ్లుకడిగికొని, ఆచమనముసేసి, బండెక్కి గట్టిగా కేకవేసి, రాక్షసుని రమ్మని పిలిచెను. అతడు

వచ్చువరకు ఊరక కూర్చుండ హితవు లేక అన్నము తినుట కారంభించెను. అతని కా బండెడన్నము అల్పాహారవిందు (టిఫెన్)తో సమానము కాబోలు! లేకున్న సామాన్యు డా రాక్షసుని చంపగలడా?

రాక్షసునికి వేళదాటినది. భీముని కేక అతని కందియుండదు. కోపముతో వచ్చుచుండెను. బండి కనుపించినది. క్రొధాకారముతో వచ్చి 'అరి! వీ డెవడో నాకై పంపిన అన్నము తినుచున్నాడే? ఏమి! ఏకచక్రపురవాసుల కింతచుల్కనయైతినా?' అనుచు దగ్గరకువచ్చి భీముని పిడికిలితో పొడిచెను. అతని కా దెబ్బ నాటలేదు. తిండి మానలేదు. అసలు తలయెత్తిచూడలేదు. రాక్షసున కాశ్చర్యము వేసినది. వీ డెవడో సామాన్యుడు కా డనిపించినది. చేతితో కొట్టి లాభము లేదని దగ్గరలోని చెట్టులాగుకొని వచ్చుచుండెను.

భీమున కా ఫలాహారము పూర్తియైనది. బుజములు చరచుకొనుచు వాని కెదురుగా నిలబడి 'పాపమని జంకక అందరినిచంపి తెగతిని క్రొవ్వెక్కితివి. ఆ క్రొవ్వు క్రక్కింతును. నీ పొగరడగింతును. ఇప్పుడే యమపురికి ప్రయాణము కట్టింతును. నిలువు'మనుచు తా నొక పెద్దమద్దిచెట్టుపీకి వానిచేతిలోని చెట్టును విరుగగొట్టెను. కొంతసేపు వారు చేసిన చెట్ల యుద్ధముతో అక్కడ చెట్లు లేకుండ పూర్తియైనవి. ఇక మల్ల యుద్ధ మారంభించిరి. వారు పడుటతో రాళ్ళన్నియు పిండియైనవి. ఒకరినొకరుకొట్టుకొనుచప్పు డూరిలోనికి వినపడినది. భూమి అదరినది. ప్రజలందరును వచ్చిరి. కాని ఒక్కడును వారికి దగ్గరగా పోలేదు. ఒకరినొకరు పొడుచుకొనిరి. తన్ను

కొనిరి. గుద్దుకొనిరి. ఆఖరికి బీముడు బకునివీపుచు మోకా ట్రితో పొడువగా వీపువిరిగి నవద్వారములవెంట రక్తమాంస ములు బయటకు వచ్చినవి. అత డార్చుచు చావగా అతని బంధువులు పరుగెత్తుకొనివచ్చిరి. వారితో బీముడు 'మీరెప్పుడు మనుష్యులను తినకుడు. తిన్నచోవీనివలెనే చత్తురు. జాగ్రత్త?' అనుటతో హడలిపోయి వారెల్లరును పారిపోయిరి. బీముడు బకునిచంపినట్లుగా వానికళేబరము నీడ్చుకొనివచ్చి నగర ద్వారమున పడవైచెను. ఇంటికి వెళ్ళి. తనతల్లికి, అన్నదమ్ము లకును చెప్పెను. ఆయూరిలోనివారెల్లను 'నీ డెవడో మంత్ర సిద్ధుడైన బ్రాహ్మణుడు. బకాసురుని చంపినాడు' అని అద్భు తాశ్చర్యములతో నతని చూడవచ్చిరి. చూచి దీవించి వెళ్ళిరి.

ద్రౌపది నైదుగురును పెండ్లాడిరి. తర్వాత ఇంద్ర ప్రస్థమున రాజ్యముచేయ నారంభించిరి. అప్పు డైదుగురికి నైదుగురు కొడుకులు ద్రౌపదియందు కల్గిరి. అందు బీముని కొడుకు పేరు 'శ్రుతసోముడు'. ధర్మరాజును రాజసూయము చేయుమని నారదుడు శ్రీకృష్ణుడును ప్రోత్సహించిరి. దానికై దిగ్విజము చేయవలెను. రాజులందరిని జయింపవలెను. ఆకాల ములో నున్న రాజులందరిని పేరుపేరువరుసన శ్రీకృష్ణుడు చెప్పినాడు. అందులో గండడుగానున్న జరాసంధుడు మహా బలశాలి యని చెప్పెను. అతని జయించుట కష్టమగునుకనుక యజ్ఞమే మానుదునన్నాడు ధర్మరాజు. బీముడు ప్రారంభమే చేయనివాని కెందును అభివృద్ధి యుండదు. అందుచే తానే ముందుగా పనిచేయబూనవలెను. తనకన్న గొప్పవానితో పోరి గెల్చినను, ఓడినను గొప్పకాని, తనకన్న తక్కువ

వానితో పోరాడి గెల్చినను సిగ్గే! కావున నేను తప్పక జరా సంధునితో యుద్ధముచేయుదును. శ్రీకృష్ణునిదయ, అర్జునుని సహాయ ముండగా నాకుజయముకల్గకపోవుట యేమిటి?' అనెను. శ్రీకృష్ణుడు ప్రోత్సాహమిచ్చెను. ధర్మరాజు 'కృష్ణా! భీమా ర్జునులు నాకు రెండుకన్నులవంటివారు. వారిని నీ కొప్పగించు చున్నాను' అనిచెప్పి,' మీరుముగ్గురును వెళ్ళి'రండు. కార్య సిద్ధియగుగాక!' అని దీవించెను. వారు వెళ్లిరి.

వారుముగ్గురును స్నాతకవ్రతము చేసికొన్నట్లుగా వేషము వేసికొనిరి. జరాసంధుని పట్టణము 'గిరివ్రజము' దానిచుట్టును అయిదుకొండ లున్నవి. నాలుగు ద్వారము లున్నవి. వారు ద్వారమువెంట లోనికి ప్రవేశింపక చైత్యక గిరిశిఖరముమీదనుండి లోనికి వెళ్ళుచుండిరి. అక్కడ దారిలో మూడుభేరు లున్నవి. అవి క్రొత్తవారు వచ్చినప్పుడు మ్రోగును. కాన వాటిని బ్రద్దలుకొట్టి వారు పట్టణమును ప్రవేశించిరి. బలవంతముగా గంధము, పుష్పాలను లాగికొని, రాచికొని, అలంకరించుకొనిరి. వీథివెంబడి వెళ్లుచుండగా పౌరు లందరును వారిని విచిత్రముగా చూడజొచ్చిరి. జరాసంధునకీ విషయము తెలిసి, యెదురుగావచ్చి అర్ఘ్యపాద్యము లిచ్చెను. కాని వారు ప్రతిగ్రహించలేదు. అప్పుడతడు 'మీరు ద్వారమున రాలేదు. గంధపుష్పములను బలాత్కారముగా లాగికొనిరి. ఇ దేమి?' అని యడుగగా, కృష్ణుడు 'శత్రులయింటికి ద్వారమున రాకూడదు. విజయమునిచ్చునదికాన గంధపుష్పాదులను తీసికొంటిమి. మేము క్షత్రియస్నాతకులము. నిన్ను శిక్షింప వచ్చితిమి. రాజులనందరిన్లో పశుపతికి బలినిచ్చితివి. అదే

నీయందు దోషము' అనగా, నతడు 'నేను సత్క్షత్రియుడను పరాక్రమముచే శత్రువులను జయించుట తప్పా? వారిని దేవునికై పట్టితిని. విడువను. యుద్ధముచేయుదును. మీకే ఆయుధములు కావలెనో కోరుకొనుడు' అని, 'ఒక్కనితో ఇంతమంది యుద్ధముచేయుట న్యాయమా?' అనగా, వారు తమపేర్లు చెప్పి, 'నీ యిష్టమువచ్చిన ఒక్కనితో యుద్ధము చేయవచ్చు' ననెను. జరాసంధుడు భీమునితో మల్లయుద్ధము చేయుదు' ననెను. కొడుకునకు రాజ్యాభిషేకము చేసి కార్తిక శుద్ధ పాడ్యమినా డారంభించిరి.

సింహము ఏనుగులవలె, వజ్రము పర్వతములవలె, ఇంద్రుడు వృత్రాసురుడువలె వారిద్దరు నెంతో ఘోరముగా పోరిరి. త్రయోదశినాడు తమతమ నేర్పు తెలియునట్లుపోరిరి. చతుర్దశినాటిరాత్రికి జరాసంధునకు అలసట హెచ్చినది. అదిగమనించి శ్రీకృష్ణుడు 'జరాసంధునకు అలసటకల్గినది. నీతండ్రిని తలచుకొని బలముతో ప్రతివీరుని చంపి నీబలమును వ్యక్తముచేయు'మని ప్రోత్సహించెను. భీము డప్పుడు తండ్రియైన వాయుదేవుని తలచుకొనెను. అతనికి బలము హెచ్చినది. అతనికాళ్లుపట్టుకొని వందసార్లు గిరగిర త్రిప్పెను. దానితో అతడు నోట, ముక్కున రక్తము క్రక్కుకొనెను. చివరికి నేలను వేసికొట్టగా పెద్దచప్పుడయ్యెను. అట్లతనిచంపి పురద్వారమున అతనికళేబరమును విసరివేసెను.

అప్పటికి ప్రొద్దుపొడిచినది. జరాసంధునికొడుకున కభయమిచ్చిరి. జరాసంధునిరథమును తెప్పించి అది చాల మహిమకలదని చెప్పి, కృష్ణుడు గరుత్మంతుని తలచుకొనెను.

అతడు రాధానే రథసారథ్యము చేయుదునని కృష్ణభీమార్జును లు రథ మెక్కి హస్తినాపురమునకు వచ్చిరి. వారి కెదురుగా వెళ్ళి ధర్మరాజు ఎంతో సంతోషించెను.

తరువాత ధర్మరాజు భీముని తూర్పున దిగ్విజయము చేసి రమ్మని పంపెను. అతడు కొంతసేనను తీసికొని వెళ్లెను. పాంచాలరాజతని బహూకరించెను. విదేహరాజునతడు జయించెను. దశార్ణదేశపురాజైన సుధర్మునితో యుద్ధముచేసి ఓడించెను. కాని, అతనిపరాక్రమమునకు మెచ్చి అతనిని తనకు సేనానాయకుడుగా చేసికొనెను. అశ్వమేధరాజైన రోచమానుని, తమ్ముని చంపెను. చేదిదేశముల కేగెను. శిశుపాలుడు రాజసూయప్రయత్నము తెలిసి, సంతోషముతో గౌరవించి కానుకలిచ్చి పంపెను. వారిద్దరు అప్పచెల్లెండ్ర బిడ్డలేయైనను రాజసూయవిషయము తలవంచవలయును. లేనిచో వానిని గెలువవలసివచ్చును. అందరిని గెలువకుండ రాజసూయము చేయరాదు. కాన వారే అనుమతించినచో బాధయేయుండదు. అక్కడ కొన్నాళ్లుండి అక్కడినుండి తూర్పున కేగెను.

పులిందపురములో సుకుమారుని, సుమిత్రుని, కుమారదేశమున శ్రేణీమంతుని, కోసలదేశమున బృహద్బలుని, అయోధ్యలో దీర్ఘయజ్ఞుని, కాశీరాజును, సుపార్శ్వుని, సుధన్వుని, మత్స్యమలదపతులను, కర్ణాటదక్షిణమల్లురను చావగొట్టి ఓడించి, అపరిమితముగా ధనములు కానుకగా గైకొనెను. జరాసంధునికొడుకు నూరడించి, జలోద్భవదేశమును, భల్లాటదేశమును జయించెను. ఇంద్రపర్వతసమీపమున నున్న కొండరాజుల నేడుగురను, శర్మకవర్మకులను, చంద్రసేన

సముద్రసేనులను, కర్ణవత్సపతులను. ప్రాంద్రకవాసుదేవుని తనకు స్వాధీనముచేసికొనెను. వీరందరిని జయించి కానుకలుగా నిచ్చిన కొన్నికోట్ల ధనరాసులను తీసికొనివెళ్ళి అన్నగారి కర్పించెను.

రాజసూయము ప్రారంభమై జరుగుచున్నది. అందు సభాపతిగా అర్ఘ్య మెవ్వరి కిచ్చుట యన్న ప్రశ్న వచ్చినది. భీష్ముడుచెప్పగా ధర్మరాజు శ్రీకృష్ణున కిచ్చెను. అది సహింపక శిశుపాలుడు కొన్నిప్రలాపము లాడెను. అది విని భీముడు కన్ను లెఱ్ఱచేసికొని మండిపడుచు ప్రళయకాలరుద్రునివలె శిశుపాలుని చంపుటకు ప్రయత్నింపబోయెను. అది గమనించి భీష్ముడు కృష్ణుడే సంహరించునని భీమునినివారించెను.

మయసభలో దుర్యోధనునకు జరిగిన యవమానము నకు పాండవులందఱును నవ్విరి. భీమునిచేత ధర్మరాజు దుర్యోధనునికి కట్టుకొనుటకు బట్ట లిప్పించెను.

అసూయచెందిన దుర్యోధనుడు తండ్రితో చెప్పుకొనగా నతడు క్రొత్తగా సభామంటపము కట్టించి ధర్మరాజును జూదము నకు పిలిపించెను. పాండవులందరునువచ్చిరి. ధర్మరాజామాయ జూదములో తమ్ముల నోడెను. వారిగుడ్డలు విప్పు డనగా వారు తలగుడ్డలు, పైకండువాలు తీసి క్రింద పెట్టిరి. ఇక ద్రౌపదిగుడ్డలను దుశ్శాసనుడు విప్పుచుండగా పాండవులు చూచుచు ఏమియు చేయుటకు వీలులేక యూరకుండిరి. కర్ణాదులు తల కొకమాట విసరిరి. అంతట దుశ్శాసనుడుచేసిన పనికి కోపించి భీముడు:

'కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవుల నేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘుని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.'

అని యెల్లరును వినుచుండగా పళ్లుపటపట లాడించుచు ప్రతిజ్ఞపట్టెను. 'ఇట్లు సేయలేకపోయినచో పితృపితామహుల గతికి తప్పినవాడ నగుదు'నని వొట్టుపెట్టుకొనెను. అంత క్రూరం ప్రతిజ్ఞ చేసెనేకాని, అన్నగారిమాట దాటలేదు.

దుర్యోధను డప్పుడు ద్రౌపదిని తనతొడపై కూర్చుండుమని సంజ్ఞచేసెను. అదిచూచి ఓర్వలేక భీముడు:

'ధారుణిరాజ్యసంపదమదంబున కోమలి కృష్ణ జూచి రం
భోరునిజోరుదేశమున నుండగ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయ బాహుపరివర్తితచండగదాభిఘాత భ
గ్నోరుతరోరు జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.

అని ప్రతిజ్ఞపట్టి క్రోధావేశముతో ఆయుధములున్న చోటికి చూడగా భీష్మాదులు, ధర్మరాజు నిది కోపమునకు సమయము కాదని నివారించిరి!.

అప్పుడు పుట్టిన యుత్పాతములకు జంకి, ధృతరాష్ట్రుడు ద్రౌపదికి రాజ్యము వరముగా నిచ్చెను. అంతట భీముడు 'ఆహా! పాండవులకు భార్యకారణముగా రాజ్యము లభించె ననుమాటకన్న కష్టమున్నదా? పురుషునకు తగినసమయ మున తేజస్సులేనిచో లోకువ యగును. కావున నిప్పుడే యుద్ధముచేసె రాజ్యము తీసికొందును' అని కోపముతో

లేళ్ళమన్నమున్న సింహామువలె విజృంభించగా ధర్మరాజాతని చేతిసంజ్ఞతో నివారించెను అత డన్నగారి కెంతవిధేయుడో కదా!

రెండవసారి జూదములో ఓడిపోయి ధర్మరాజాదులు వనవాసమున కేగునప్పుడు బీముడు రెండుచేతులు పెద్దగా బారలుచాచుచు వెళ్ళెను. దాని యుద్దేశ్యమును విదురుడు ధృతరాష్ట్రునితో 'యుద్ధమున బాహుబలమును చూపుటయే' అని చెప్పెను.

అందరును వనమున కేగుచుండిరి. మూడహోరాత్రములు గడచినవి. కామ్యకవనములో ప్రవేశించి నడచుచుండిరి. ఆనాటి అర్ధరాత్రమున రాక్షసమాయలు చూపుచు, భయంకరముగా గర్జించుచు నెదుటగా నొక రాక్షసు డడ్డుండెను. వానిచూచి భయపడి ద్రౌపది హడలిపోయి పాండవుల చాటున దాగినది. ధౌమ్యుడు రక్షోఘ్నమంత్రముల నుచ్చరించి వానిమాయను పోగొట్టెను. అంతట ధర్మరాజా రాక్షసుని 'నీ వెవరవు? ఇక్కడ నేలయుంటివి?' అని ప్రశ్నించెను.

అతడు 'నేను బకాసురుని తముడను. నాపేరు కినాశుడు. కాని అందరును నన్ను 'కిమ్మీరు' డందురు. ఈకామ్యకవనము నాది. అందరిని తిందును. మీ రెవరో నాసత్తా తెలియక యిక్కడకు వచ్చితిరి,' అనెను. 'నేను ధర్మరాజును, ఇతడు భీముడు, వీరు తక్కినపాండవులు. వనవాసమునకై వచ్చితిమి.' అని ధర్మరాజనుటతో రాక్షసుడు 'ఏమీ? వీడేనా బిముడు? ఏమిపుణ్యము చేసితిని. వీనినెప్పుడు చంపుదునా అని వెదకుచున్నాను. వీడేనన్ను వెదకుచు వచ్చినాడు. మా

అన్నను, నాస్నేహితుడైన హిడింబుని చంపినావా? నీనిని మ్రింగి అగస్త్యుడు వాతాపిని జీర్ణముచేసికొన్నట్లు జీర్ణించుకొందును' అని పట్టుకొనబోయెను. తక్కినవారందరు ధనుర్బాణముల సిద్ధముచేయుచుండగా భీము డాతనితో కలియబడెను. ఒక్కక్షణ మక్కడి చెట్లుపీకి, వాటితో యుద్ధముచేసిరి. తర్వాత రాళ్ళతో కొట్టుకొనిరి. అంతట మల్లయుద్ధముచేసిరి. అప్పుడు భీముడు బకునిచంపినట్లే మోకాటితో నడుమువిరుగగొట్టి నీబకహిడింబులు చచ్చిరని తెగయేడ్చితివి. వారు యమపురములో నున్నారు. వెళ్లి వెదకుకొనుమనుచు క్రింద పారవేసెను. ఆ దెబ్బతో వాని ప్రాణములు పరుగెత్తినవి. అక్కడి వారికి రాక్షసభయము తప్పినది. ఆకథను విదురుడు చెప్పుటతో వినగానే ధృతరాష్ట్రునిగుండె గుభేలు మన్నది. తన కొడుకునకు నే నాటికో అదేగతి యగునని అతనిభయము. అ దేల్ల వృథా యగును?

పదునమూడు నెలలు వనవాసము చేసిరి. అంతలో నొకనాడు ద్రౌపది ధర్మరాజుతో యుద్ధముచేయుట మంచి దని చెప్పినది. అదందుకొని భీముడు 'రాజా! నీవు పితృపైతామహమైన రాజ్యమును శత్రువులపాలుచేసి యిట్లు అడవులలో బాధలుపడ నేల? సింహముచే మాంసమును నక్కలుతీసికొన్నట్లు మనచేతిరాజ్య మపహరించి, ఆ దుర్యోధను క్షేమి తలచునో? దుర్మతులు, దుర్జనులునైన కౌరవులను సహించుట యేటికి? ధర్మకామయుక్తమైన అర్థమును విడిచి మిత్రుల కప్రియముగాను, శత్రువులకు ప్రియముగాను ముని వృత్తి స్వీకరించి, 'ధర్మువు ధర్మువు' అని ధర్మువునందే చిత్తము

నిలిపి దుర్బలుడువలె నుండదగునా? బాహుబలము చూపి శత్రువులను జయింపలేనివాడు ఎప్పుడును దుఃఖముతో బాధ పడునుగాని, నీవు బాధపడనేల? నీ వనుజ్ఞ నిచ్చినచో నాఁడే కౌరవులను జయించెడివారము. మన కీ వనవాసమే తప్పెడిది. అయ్యో! ప్రతిజ్ఞను పాటింపవలదా అని మనము నిరీక్షించి నచో, కౌరవులు మనలను చేతకానివారిగా తలతురు. కేవలము ధర్మమునందే దృష్టిపెట్టుకొన్నవానిని ప్రాణముపోయిన వానిని సుఖదుఃఖములు వదలినట్లు ధర్మకామములు విడుచును.

ధర్మకామములు వదలి అర్థమునే సేవించినవాడు పతితుడగును. ధర్మార్థములు లేక కామార్థియైనవాడు చెరువు గుంటలోని చేప ఆనీటికొరకే నశించునట్లు నశించును. ధర్మార్థములు సముద్రమేఘములువలె పరస్పరసహకారమున వృద్ధిపొందునవి. కావున వానిసాహచర్యము తెలిసి త్రివర్గమును సేవింపవలెను. నీ వాచరించు ధర్మము అర్థకామములకు పనికిరాదు. అర్థములేనిచో దానయజ్ఞాదులు నడువవు. లోకములే ధర్మమయములు. ధర్మమునకుమించిన దేదియు లేదు. కాని అర్థహీనమైన ధర్మము క్షత్రియులకు పనికిరాదు. శత్రువులను జయించుట, రాజ్యమును సురక్షితముగా రక్షించుట, పాత్రులకు దానముచేయుట, బ్రాహ్మణపూజ యివి క్షత్రియ ధర్మములు. అవి అర్థమూలములే. కేవల ధర్మాచరణము శత్రుజయమునకు సాధనముకాదు. దేవతలు యుద్ధము చేసి రాక్షసుల జయించిరికదా! కాన నీవు ప్రతిజ్ఞారక్షణ వ్రతము మాని యుద్ధమునకు సిద్ధము కమ్ము. మనకు చాలామంది రాజులు సహాయము చేయుదురు. ఎంత బలవంతు

నైనను పలువురు బలహీనులు కలిసి, తేనె తీసికొనువానిని తేనెటీగలు కుట్టినట్లు బాధించి చంపుదురు. దుర్యోధనుని పై నెవ్వరికిని హితములేదు. కాన రథమెక్కి హస్తినాపురిపై దండెత్తుము. ప్రజాపాలనముకన్న మనకు వేరే ధర్మము లేదు, అని చెప్పెను.

ధర్మరాజది విని 'నీమాట ధర్మయుక్తము, నీతికలది, ఇష్టసిద్ధినిచ్చునదియు. కాని ఆలోచింపదగినదై యున్నది. కార్యఫలము లెప్పుడు మంచిమనసుతో ఆలోచింపగా సిద్ధించు నందురు. వృద్ధులసభలో చేసినప్రతిజ్ఞను రాగకోపములచే మనస్సుచెడి, ఓర్పు లేక, చంచలమైన రాజ్యలక్ష్మి కాసపడి సత్యము, ధర్మము తప్పి, నడువగలనా! కాలమును నిరీక్షించుము' అనుటతో భీమసేనుడు 'జనుల కే క్షణములో చావువచ్చునో తెలియదు. తప్పనిదేకదా! అట్టిపరిస్థితిలో చేయవలసినపనికి జాగుచేయరాదు. మరణమునకుముందుగా ప్రతీకారముచేయనివానిజన్మ నిరర్థకము. ఆనాడు సకల రాజసమక్షమున వారుచేసినఅవమానము నాహృదయములో మెదలుచున్నది. వారిని సంహరింపక నాకోపము తగ్గదు. నీవు చెప్పినది బ్రాహ్మణధర్మముగాని క్షత్రియధర్మముకాదు. నీకు తెలియనిస్మృతులులేవు. కాని శత్రుసంహారముసేయ నిచో అత్యంతము హానికల్గుననియున్నదికదా! మనమెట్లు పదు మూడేండ్లు వెళ్ళించగలము? పదుమూడునెల లున్నాము. కనుక సంవత్సరమునకు బదులుగా నెలలను తీసికొందము. ఈ ధర్మ మున్నదే. విజయారంభమున కిదే తగుసమయము.' అనెను.

అప్పుడు ధర్మరాజు 'నాయనా! నీవు పాండిత్య పరిక్రమ గర్వములలో మిన్నయైనవాడవు. నీవు చెప్పినదే కర్తవ్యము. కాని, ధీరబుద్ధివై ఆలోచించుము. చిన్నపనిని సాహసించి ఆరంభించినను దోషములేదు. కాని ఇది గొప్ప కార్యము. తొందర చేయదగదు. ఆలోచించి చేయవలసినది. ఆలోచించి చేసినపనికి దైవము తోడగును. కాన ఆలోచించుము. మనచే రాజసూయమున జయింపబడిన రాజులందరు నతనిచేత గౌరవింపబడిరి. అతనికై యుద్ధములో ప్రాణములు విడువనున్నారు. అభేద్యకవచుడైన కర్ణుని తలచుకొన్నప్పుడెల్ల నాకు నిద్రరాదు. ఇక భీష్మ ద్రోణ కృపాచార్యులు మధ్యవర్తులే అయినను వారివద్ద నున్నారు. వారినందరిని జయించికాని దుర్యోధనుని జయింప వీలుపడదు' అని చెప్పుచుండగనే వ్యాసమహర్షివచ్చి, వారినిదీవించి, అర్జునునిచే పాశుపతాస్త్రమును సాధింపజేయుమని చెప్పివెళ్లెను. భీముడు తాత్కాలికముగా ఆవేశముగా మాట్లాడినను ధర్మరాజు సకారణముగా చెప్పుటతో నతడూరకుండెను.

మరల నొకసారి అర్జునుడు పాశుపతాస్త్రసాధనకై వెళ్ళి ఆలసింపగా భీముడిట్లు 'అర్జునునికై కృష్ణునిపంపుము. మేమిద్దరము వెళ్ళి దుర్యోధనాదులను జయింతుము. నీవు కాలమును నిరీక్షించువాడవుకనుక పదునాల్గవయేటవచ్చి రాజ్యాభిషేకము చేసికొందువుగాని' అనుటతో ధర్మరాజు అతనిని కౌగిలించుకొని తలముద్దాడి 'నాయనా! నీవు, నర్జునుడు కలిసి కౌరవులను గెల్తురుగాని, సమయమురానిండు' అని యూరడించెను.

ఒకప్పుడు ధర్మరాజు నడువలేకయున్న ద్రౌపదిని చూచి భీమునెత్తుకొనుమనెను. అతడు తలచుకొనగా ఘటోత్కచుడు తన పరివారముతో వచ్చి వారినందరిని ఎత్తుకొని గంగాతీరమున బదరీనారాయణమున దించెను. ఆ బదరీవనములో ఆరురోజులు పాండవులు నివసించిరి.

ఒకనాడు ద్రౌపదీభీములు గంధమాదనపర్వతముపై విహరించుచుండగా వెయ్యిరేకులుకల్గి అందమై మంచిసువాసనకల్గిన తామరపువ్వు వారిముందుపడెను. అదిచూచి ద్రౌపది 'ఆహా! ఈపు వ్వెంత సువాసనగా నున్నది. ఎన్నిపువ్వులున్నను దీని పరిమళమే నల్దిక్కుల వేయుచున్నవి. ఇటువంటి వెన్నోయున్నచో ఎంత ఆనందముగా నుండునో? దగ్గరలో నున్నచో తెచ్చియిమ్ము' అనికోరి వెంటనే ధర్మరాజుదగ్గరకా పువ్వును పట్టుకొని వెళ్ళినది. భీముడు ధనుర్బాణములుచేత ధరించి ఆపు వ్వేమూలనుండిపడినదో వైపునకు ఆబయల్దేరెను. దారిలో తన కెదురైన మృగములను తాకెను. ఏనుగులను పట్టుకొని ఏనుగులపై విసరెను. సింహములను సింహములపైకి విసరెను. చిన్నచిన్న మృగములను చేతితో బాదెను. అతని నడకతొందరలో కాలికడ్డమువచ్చినచెట్లు పడిపోయినవి. ఆపర్వతముపైవిహరించు దేవతలు అతని తాము కన్పడకుండ చూచుచుండిరి. చెట్లువిరుచుచు కొండ లదురునట్లు భీముడు వెళ్లుచుండగా రెక్కలుతడిసినహంసలుకన్పించినవి. దగ్గరలోనే కొలనుండునని అనుకొని అతడు వెదకుచువెళ్ళి చెరువుచేరెను.

అందులోనికి దిగి స్నానముచేసెను. దానిప్రక్కన కొన్నిఆమడల మేర నున్న అరటితోటచూచెను. ఆ తోట

లోనికి ప్రవేశించి శంఖమూదెను. ఆశంఖధ్వని గుహలో నిద్రపోవుచున్న హనుమంతునికి వినబడెను. అతనికి సంతోషము వేసినది. ఇది నాతమ్మునిదే అయియుండుననుకొని అతడు వెళ్లు దారికడ్డముగా పరుండి తోకనాడించెను. ఆ తోకకదిలిన చప్పుడు కొండగుహలలో ప్రతిధ్వనించినది. ఆ చప్పుడు విని ఆశ్చర్యముతో భీముడు నలుమూలలు వెదకెను. ఒకచోట విశాలమైన రాతిపై పరున్న కోతిని చూచెను. అది చాల చిన్నదే కాని బలిసియున్నది. తోకమాత్రము పెద్దదిగా జెండా వలెనున్నది. అది యోగనిద్రలో నుండెను.

దానిదగ్గరకు వెళ్ళి భీముడు సింహనాదము చేసెను. ఆ పెడబొబ్బతో హనుమంతుడు లేచి ఆవులించినాడు. ఆవులింతతో కన్నులనీరు క్రమ్మినది. అట్లే భీముడు అశ్రద్ధగా చూచి 'నీ వెవరవో కాని ముసలితనమువలన కదలలేక పరున్న నన్ను దయలేక యిట్లు లేపవచ్చునటయ్యా? పశుపక్ష్యాదులకు ధర్మము తెలియదుకాని, మనుష్యుడవైన నీ కేల తెలియదు? పెద్దల సేవింపుము. ధర్మము తెలియక మావంటి పేద మృగములకు భయముకల్గునట్లు గర్జిల్లితివే? నీ వెవరవు? ఇక్కడి కేల వచ్చితివి? సిద్ధగతి లేనివా రిక్కడ నుండలేరు. నీ వమృతోపమానములైన పండ్లుతిని మరలిపొమ్ము. నీకు హితవుగా చెప్పితిని. ముసలివాడను. నామాట వినుము' అనెను. భీముడు 'నేను క్షత్రియశ్రేష్ఠుడను. పాండవుడను. భీముడను. ఒకపనిమీద పోవుచున్నాను. దారి యిమ్ము. లేకున్నచో నాడు సముద్రమును దాటివెళ్ళిన హనుమంతుడువలె నీమీదుగా పోదును' అనుటతో 'హామమంతు డేల సముద్రము దాటెనో?' అని యడి

గిన హనుమంతునితో 'సీతను వెదకుటకై వెళ్ళితివిలే. నాకును అంతటిపరాక్రమ మున్నది. ఏమి కనుపరచు చుందువా?' అనెను. హనుమంతు డొక్కనవ్వునవ్వి 'అన్నా! నేను ముసలి వాడను. లేవలేను. వెళ్ళదలచినచో నాతోకను ప్రక్కకు తప్పించి పొమ్ము' అనుటతో భీమున కది తనపౌరుషమునకు లోప మనిపించినది. ఎడమచేతితో తోకను కదపబోయెను. కదలలేదు. రెండుచేతులతోను పట్టెను. తోక లేవనందున భీముడు ముందునకు పడెను. ఒళ్ళంతయు చెమటపట్టినది. అప్పటికి భీమునకు బుద్ధివచ్చినది. గర్వము తగ్గినది. సిగ్గుతో ముఖమువంచుకొని ఆముసలికోతికి దండముపెట్టి 'అయ్యా! ఎఱుగక ఏవో అనరానిమాట లన్నాను. క్షమింపుము. నీ వెవరవో నిజము తెల్పుము' అనుటతో హనుమంతుడు నవ్వుచు 'నేను నీవు చెప్పిన హనుమంతుడనే. నీవు నాతమ్ము డవు. శ్రీరామచంద్రమూర్తి నన్ను శాశ్వతముగా నుందు వని దీవించెను. అందుచే ఇట్లుంటిని' అని చెప్పెను. భీముడు సంతోషించి మరల నమస్కరించి 'నీదర్శనముచే కృతార్థుడ నైతిని. ఆ నాడు సముద్రముదాటినప్పటి నీరూపము చూపుము' అని కోరెను. 'ఆ కాలములోని రూప మీ కాల మున రాదు. నాలుగుయుగములపరిస్థితులబట్టి ఆకారములు మారుచుండును' అనిన హనుమంతుని కోరి, భీముడు నాల్గు యుగములలోని ఆచార భూచారములను తెలిసికొనెను.

అప్పుడు భీముడు నాటిరూపము చూపుమని కోరగా హనుమంతుడు తనపూర్వరూపమును చూపెను. అతడు రెండవ మేరుపర్వతమువలె నుండెను. అది చూచి భీముడు 'ఓహో!

ఎంత భయంకరముగా నున్న దీ రూపము! చాలు. మామూలు రూపమును గ్రహించుము' అని కోరెను. హనుమంతుడు తగ్గి 'నీ కేమి కావలెనో కోరుము. కౌరవులను చంపుమందువా?' అని అడుగగా 'అక్కరలేదు. అందు నా కెదురునిల్చి పోర గల్గిన వీరులు లేరు' అనుటతో హనుమంతుడు 'అట్లయిన నన్ను యుద్ధమధ్యలో తలచుకొనుము. నీయందలి ప్రేమచే అర్జునుని జెండాపూాది కావహించి శత్రువులకు భయముకల్గింతును' అని భీముని కౌగిలించుకొని సౌగంధిక సరస్సునకు మార్గముచూపి హనుమంతు డంతర్ధానమయ్యెను. అత డాలింగనము చేసికొనుటచే భీముని కొళ్లునొప్పులు తగ్గినవి.

అక్కడినుంచి వినోదములు చూచుచు సౌగంధికసరస్సున్నచోటి కేగెను. అక్కడ కావలికాయునట్టి యక్షులు, రాక్షసులు భీమునిచూచి 'వీ డెవడో కృష్ణాజినము కట్టుకొని ఆయుధముధరించి వచ్చినాడు,' అనిఆశ్చర్యముతో చూచుచు అతనికి దగ్గరగావచ్చి, 'అయ్యా! నీ వెవరవోకాని యిది కుబేరునివనము. ఇక్కడి కెవరునురారు. ఈ కొలనులో కుబేరుడు భార్యలతో జలక్రీడలాడును. దీనియొడ్డున దేవర్షులు దేవతార్చనలు చేసికొందురు కావున నీ విక్కడినుండి వెళ్ళిపొమ్ము' అనిరి. భీముడు 'నాపేరు భీముడు. ధర్మరాజుతమ్ముడను. నాభార్య కోరగా ఈ కమలములను తీసికొని వెళ్ళుటకై వచ్చితిని' అనుటతో వారు 'అట్లైన మా కుబేరు నడిగి తీసికొమ్మ'నిరి. భీముడు కోపముతో కన్నులెఱ్ఱచేసి 'ఏమీ! కొండలలోపుట్టిన కొలనునకు కుబేరుడు రాజా? అతని యనుమతి తీసికొనవలెనా? నేను వీరుడను. ఒకరి నడుగను. పరాక్ర

మాశ్రితమైనదాని నెవరికైన నిత్తును. నా కెవ్వరడ్డువచ్చి నను సరే! కోసికొని వెళ్లుదును' అని కొలనులో దిగి నీరు త్రాగి కమలములు కోసికొనెను. కావలివారు వెంటనే అతనితో కలియబడిరి. అతడు వారినందరిని చావగొట్టెను. వారు పరుగెత్తుకొని వెళ్ళి కుబేరునితో చెప్పుకొనిరి. అతడు ధర్మరాజుమీాది గౌరవముతో నూరకుండెను.

ఇక్కడ ధర్మరాజాదులకు అపశకునములు కాగా, ధర్మరాజు ద్రౌపదితో భీము డేడీ? యుద్ధముజరిగెడి సూచనలైనవి. అనుటతో ఆమె జరిగినసంగతి చెప్పినది. అతడొక్కడే వెళ్లెనని ధర్మరాజు వెంటనే ఘటోత్కచునిపై నెక్కి పరివారముతో భీముడున్న చోటికి వచ్చెను. భీముని చూచి కౌగిలించుకొని 'నీ వెప్పుడు నాకు చెప్పకుండ ఒక్కడవు రాకుము' అని మందలించెను. ద్రౌపది ఆ కనకకమలములు పుచ్చుకొని ఆనందించినది. అంతలో యక్షులు వచ్చి 'ఇది కుబేరోద్యానము. మీా రిక్కడ తిరుగరాదు' అని చెప్పగా ధర్మరాజా ప్రాంతమున కొంతదూరములో మకాముచేసికొని ఘటోత్కచాదులను వెళ్లిపొమ్మనెను.

తర్వాత జటాసురుడను మాయలాడు బ్రాహ్మణవేషముతో వచ్చి పాండవులను సేవించుచుండెను. ఒకనాడు భీముడు వేటకై పోగా ఆరాక్షసుడు నిజరూపము ధరించి ద్రౌపదిని, ధర్మరాజును, నకులుని వారి ఆయుధములతో సహా యెత్తుకొని పారిపోవుచుండెను. సహదేవుడు భీముని పిల్చుటకేగెను. మునులు భయపడిరి. ధర్మరాజు 'ఓరి దురాత్మా! ఇదేమి అన్యాయమురా? అన్నము పెట్టినవానికే మోసము

తలపెట్టుదువా? ఇది మంచిది కాదు. మా ఆయుధములు మా కిచ్చి మాతో యుద్ధముసేయుము' అనుచు వానిచేతి వదిలింపబట్టెను. ఆపట్టునకు వానివేగము తగ్గినది.

ఇంతలో భీముడు తిరిగివచ్చుచు వానిని చూచి 'ఓరీ వదలుము. లేకున్న నిన్ను బకహిడింబకిర్మీరులవద్ద కంపుదు' ననెను. వానికి కోపమువచ్చినది. వారిని వదలివేసి 'రారా! నీరక్తముతో బకాదులకు తర్పణము చేయుదును. రా ర'మ్మని మల్లయుద్ధమునకు సిద్ధమయ్యెను. కొంతసేపు వారిరువురు చెట్లు - చేమలతోను, రాలు - రప్పలతోను కొట్టుకొనిరి. తర్వాత రాక్షసునికి బలముతగ్గగా భీముడు బలముగా మెడ విరుగునట్లు పిడికిటితో గుద్దెను. వాడు రక్తముకక్కుకొని బకాదులున్నచోటికి చెప్పుకొనుటకు కేగెను.

అక్కడ నొకనాడు భీముడు ద్రౌపదితో విహరించు చుండగా శ్వేతకీనదిలో పుట్టిన పంచరంగుల పువ్వులు మీద పడగా చూచి ద్రౌపది వాటిని తెచ్చిపెట్టుమని ప్రియుని కోరి నది. అతడు వెంటనే ధనుర్బాణములు తీసికొని శిఖరమెక్కి చూచెను. దాదాపులలో పువ్వులు కనిపించినవి. అత డక్కడికి పోయి శంఖమునూదెను. ఆ ధ్వనికి కుబేరుని సేనలు వచ్చినవి. దానికి సేనాపతియై మణిమంతు డను గంధర్వుడు వచ్చెను. భీముడు వారినందరిని చంపి మణిమంతునికూడ చంపెను. చావగా మిగిలినవారు పారిపోయి కుబేరునితో చెప్పిరి. అతడు పూర్వము సౌగంధికపుష్పములను, ఇప్పుడు వీటిని పుచ్చుకొని తనసేనానిని చంపినవా డెంతటివాడో అనికూడ దలచి వచ్చెను. అంతలో అచ్చటికి ధర్మరాజాదులునువచ్చిరి

కుబేరుడు పాండవులను చూచి గౌరవించెను. ధర్మ రాజు తలవంచుకొనగా కుబేరుడు 'నీవేమియు సిగ్గుపడనక్కర లేదు. మాసేనాపతిని చంపుటమాకపకారముకాదు. అతనికొక శాపమున్నది. పూర్వమొకసారి మేమువిమానముపై కుశవతీనదీ తీరమున దేవతలు సత్రయోగము చేయుచుండగా చూచు టకై సేనాసమేతులమై వెళ్లుచుంటిమి. దారిలో చేతులు పైకెత్తి యమునానదీ తీరమున తపస్సు చేసికొనుచున్న అగస్త్యమునిపై ఈమణిమంతుడు ఉమ్మివేసెను. అతడు 'నిన్ను నీ అనుచరులను ఒక మానవుడు చంపు'నని శపించెను. అందుకు నీతమ్ముడు నిమిత్తమాత్రుడే. కాని 'ధైర్యము, సామర్థ్యము, దేశము, కులము, బలము' అను నైదును కార్య సాధకములు. నీతమ్ముడు కేవలము చొరవపై నాధారపడి యున్నాడు. అది అన్నప్పుడును కలిసిరాదు. వానిని నీవు మంచిత్రోవలో నడుపుము' అని చెప్పి, అక్కడికి దగ్గరలో కొన్నాళ్ళుండుమని, అయిదేళ్లై వెళ్ళిన అర్జునుడు దేవతలకు సాయముచేసి రానున్నాడని చెప్పి వెళ్లిపోయెను.

ఒకనాడు హిమవత్పర్వతప్రాంతములందు వేటకై వెళ్ళిన భీముని ఒకకొండచిలువ పట్టినది. పదివేల యేనుగుల బలముకలవాడైనను భీము డా పామును వదలించుకొనలేక, దీనముగా' మహాత్మా! నీ వెవరవో నిజముచెప్పు'మని ప్రార్థిం చెను. అది పూర్వజన్మజ్ఞానము కల్గి 'నేను నహుషుడను. ఇంద్రుడనై బ్రాహ్మణుల కవమానము చేసి యీ రూపము పొందితిని. నాకు దొరికినవారిని తినుచుందును. నేటికి నీవు దక్కితి'వనెను.

అంతలో ధర్మరాజు భీముని వెదకుచు వచ్చి అతనిని పట్టియున్న పాముతో సంభాషించి, అది కోరినట్లు అడిగిన ప్రశ్నలకు జవాబు లిచ్చెను. శాపమోక్షమైన నహుషుడు ధర్మరాజునకు నమస్కరించి వెళ్ళిపోయెను. భీముని తీసికొని ధర్మరా జింటి కేగెను.

దుర్యోధనుడు తనభార్య, సేనలతో సహా అడవికి వచ్చెను. గంధర్వులు వారిని పట్టుకొనిరి. ధర్మరాజు నాతని సైనికులు ప్రార్థింపవచ్చిరి. అప్పుడు భీముడు నవ్వుచు 'మనకు పనిచక్కనైనది. మనము చేయవలసిన పని గంధర్వులే చేసిరి. ఏ భారమును లేక ఊరకుండగా మనకు జయమువచ్చినది. పుట్టుకల్లరి, పాపములకెల్ల దిట్టయై లోకులనిందలుపడిన దుర్మార్గునకు నేటికిట్టి కష్టము కలిగించినందున బ్రహ్మ నేర్పరియైనాడు. మనలను పరిహసించుటకై వచ్చి, మంచి యనుభవము పొందినాడు. నీ వేమియు కల్పజేసికొనకుము' అని అన్నతో అనెను. కాని అతడు అర్జునుని బతిమాలి పంపెను. భీముడును వెళ్ళి దుర్యోధనుని విడిపించి, కట్లతో తెచ్చి అన్నముందు పడవేసెను. అతడు క్షమించి మందలించి వదలివేసెను.

ఒకప్పుడు సైంధవుడు వచ్చి పాండవులు లేనప్పుడు ద్రౌపదిని లాగికొనిపోవుచుండగా పాండవు లాశ్రమమునకు వచ్చి, అతనిని వెన్నంటిరి. అతడు భయపడి ద్రౌపదిని వదలి పారిపోవుచుండగా ధర్మరా జామె నాశ్రమమునకు గొని పోయెను. తక్కినవారు సైంధవునివెంట పడిరి. భీముడు సైంధవుని పట్టుకొని క్రిందపడవేసి రొమ్ములమీద, మొగము మీద పొడిచెను. అతడు రక్తము క్రక్కుకొని వివశుడై

పడెను. అప్పుడర్జునుడు 'అన్నా! మనఅన్న మనచెల్లెలు విధవ యగునేమోయని యితనిని చంప వద్దన్నాడు. ఇక వదలు' మనగా అన్నగారం తేలే. అతని కెప్పుడు చూచిన కరుణయే కాని, కార్యము పదనుతప్పునని చూడడు. నీవుకూడ అతని ననుసరించుచున్నావా? వీనిని పైచుటయా?' అని కత్తితో తలగొరిగి, అయిదుచోట్ల చిన్నచిన్నపిలకలు పెట్టి 'ఓరీ! బ్రతుకుపై ఆశయున్నచో నీ వెవర వని నిన్నెవరైన అడిగి నప్పుడు పాండవదాసుడ నని చెప్పవలెను' అని పల్కుటతో వాడు ప్రాణములుపోవునేమోఅని అట్లే అందునని ఒప్పు కొనెను. అంతటితో వదలక వానిని వెడచేతులు విరిచికట్టి. రథముపై వేసి అన్నవద్దకు తీసికొనివచ్చి, అతని కాళ్ళముందు పారవేసిరి. 'ఇదుగో పాండవదాసు'డనిరి. అతడు విడువుమని విడిపించెను.

అరణ్యావాసము పూర్తియైనది. అజ్ఞాతవాసమున విరా టుని సేవించుట కర్తవ్యమని నిశ్చయించి, ఎవ రేయే రూప ముల నుండుటయూ అన్న ప్రశ్న వచ్చినపుడు భీముడు 'నేను వంటలవాడనై రుచిగానుండి మనసునకు నచ్చునట్లు వంట చేయుదును. రుచులు ప్రాతవేనైనను క్రొత్తవిగా చూపు దును. క్రొత్తవంటలు వినగానే ఆరీతి నే చేయుదును. నాకంటె మిన్నయైన వంటవాడు పట్టణమున లేడనిపింతును. శరీరము కష్టపెట్టుకొనియైన శాకపాకములను చక్కగా తయారుచేయు దును. ఒకవేళ వంటకట్టెలు విరవవలసి వచ్చినప్పుడు కాళ్ళకు చేతులకు, తొడలకు, నడుపెట్టి విరుతునే కాని కత్తి – గొడ్డలి కోరను. వంటశాల కధిపతితో స్నేహముచేయుదును. ఇక

నుల్లురతో ద్వంద్వయుద్ధముచేసియు, ఒక్కడనే చాలమంది తో పోరియు, చూచువారి కాశ్చర్యము కల్గింతును. పులిని గాని, కారుదున్నపోతునుగాని, మదపుటేనుగునుగాని, సింహమునుగాని పట్టి కాలితో పొడిచి విరటుడు సంతసించునట్లు బలము ప్రదర్శింతును' అని తాను నడచుకొనువిధానమును చెప్పెను.

తరువాత పాండవులు వారిఆయుధముల నొకకట్టగా కట్టి జమ్మిచెట్టుమీద పెట్టిరి. ఆ మహాయుధములకు నమస్కరించుచు ధర్మరాజు 'భీముడు కౌరవులపై కోపముకలవాడు. అతడు మధ్యలో నెప్పుడైన వచ్చినచో మీరు కనపడకుండుదురుగాక!' అని వేడుకొని భీముని బతిమాలి వెళ్ళెను. యక్షుని వరమువలన వారికి కోరిన రూపములు వచ్చినవి.

భీముడు ఒకచేతిలో చట్టము, ఒకచేతిలో గరిటెలు, చంకలో కత్తిపుచ్చుకొని, కృష్ణాజినము కండువాగా కప్పుకొని ధర్మరాజు వెళ్లినత్రోవను గాక మరొకత్రోవను విరటుని సభలోనికి ప్రవేశించెను. రా జాతని దూరమునుండిచూచి దద్దరిల్లెను. ఇత డెవడో సామాన్యుడుకాడు. ఇట్టివాని నింతవరకు చూచియుండలేదు. అనుకొనుచున్నంతలో అతడు దగ్గరగా వచ్చి మ్రొక్కి 'జయము మహారాజా! నేను శూద్రుడను. వంటచేయుదును. నన్నుమించిన వంటవా డీ పట్టణముననే కాదు- ఈ ప్రపంచముననే లేడు. పేరు వలలుడు. నాకు కూడుగుడ్డ ఇచ్చినచాలును. నా నేర్చినట్లు నిన్ను సేవింతును' అనెను. అతని మాటలు విని ఆశ్చర్యముతో విరటుడు 'నీ రూపము రాజ్యమునకు తగియున్నది. నీకు రాజ్యమిచ్చెద నేలు

కోపము' అనగా నతడు మూర్ఖునివలె మొగమప్రసన్నముగా త్రిప్పి 'నా కెందుకు? ధర్మరాజున కిష్టముగా వంటచేసెడివాడను. ఇప్పుడు నిన్ను కొలువవచ్చితిని. మల్లయుద్ధము చేయగలను. నీ కిష్టమైనచో కొలువిమ్ము. లేదా పొమ్మనుము. మరొక చోటికి పోయెదను' అనెను. విరటుడు 'నీ ఆకారమునకు తగి నట్లుండుట మంచిదని చెప్పితిని. కాని నీ యిష్టమువచ్చి నట్లుండుము. వంటశాలకు నీవే అధిపతివి' అని పంపెను. భీము డట్లే యుండెను.

ఒకనాడు విరటునిసభ కొకమల్లుడు వచ్చి 'నాతో సమమైన జగజ్జెట్టి లోకమున లేడు' అనిపల్కగా ధర్మరాజు 'మన వంటలవాడు, వలలుడు చాలమంది నోడించినవాడు. రప్పింపుడు' అనుటతో రాజు వలలుని రప్పించెను. అతడురాగానే ధర్మరాజు కనుసంజ్ఞ చేసెను. విరటుడు 'ఇతనితో యుద్ధమునకు సన్నద్ధుడవు కావలెను' అనుటతో 'అట్లే' యని యొప్పుకొనెను.

భీముడు గర్జించి, రంగస్థలముపై కురికి రాజునకు మ్రొక్కెను. బుజములు చరచుకొనెను. అంతట రెండవ మల్లుడు వచ్చెను. ఇద్దరు నొకరినొకరు చూచుకొనిరి. రంగస్థలములోని మన్ను మొగమునకు బొట్టుగా పెట్టుకొనిరి. కొద్దిగా నెత్తిపై చల్లుకొనిరి. కొంచెము రెండుచేతుల మునివ్రేళ్ళతో పుచ్చుకొని ఎదుటివారిమీదకు చల్లిరి. కుడిచేతులెత్తి ఎడమబుజములు చరచుకొనిరి. అప్పుడు పట్టుపట్టిరి. అనేక చిత్రవిచిత్రరీతుల తననేర్పుచూపి భీముడు రాజునకు వింతచూపెను. చివరికి కచ్చ (నడ్డికి చుట్టుకొన్నగుడ్డ) పట్టు

కొని కాళ్లు చేతులు వ్రేలాడుచుండగా నుపగటుండను వత్తె నేలాడపేసి నేలనునేసి కొట్టెను. ఆదెబ్బతో నతని చేతులు కొట్టి మల్లుడు ముక్కు; నోట నెత్తురొలుకగా ఆర్చెను. అప్పుడు భీముడు నానిపేపున్నై చీలకుండకప్పి 'భళా బలుడ'మని వదలెను. రాజు మెచ్చి బహుమతియ్యగా వాటి నక్కడివారి కిచ్చి తాను వెడలెను.

ద్రౌపదిని కీచకుడు పట్టబోయినపుడామె తప్పించుకొని రాజసభలోనికి వచ్చినది. అప్పుడు భీము డక్కడనేయున్నాడు అక్కడ వదలినదనుకొన్నదో ఇక్కడను అదేనా అని క్రోధరసావేశముతో ప్రళయకాలరుద్రుడు వయ్యెను. దగ్గరలోని చెట్టుకేసి చూచెను- దానిని పెరికి కీచకుని కొట్టవలెనని. అది గమనించిన కంకభట్టు 'దృష్టిపడినదా ఆచెట్టుకూడద. కాయలను- పూచుచున్న చెట్టును బ్రతుకనియ్యవు, పెళ్లీయను. వంటకట్టెలకు లోటులేదులే' అని వ్యంగ్యముగా నివారించెను.

ద్రౌపది ఆనాటిరాత్రి యెవరు నెరుగకుండ భీముని వద్దకేగి అతని లేపినది. అతడంతయు తెలిసినను తెలియనట్లు ఆమెచే చెప్పించెను. అప్పుడు 'అన్న వారించకున్నచో అప్పుడే అందరిని చంపియుండెడివాడను. ఒక్క యాలోచించుము. మన మిప్పుడు కోపింతుమా బయటపడిపోదుము. మన మూలముగా వనవాసముచేయవలసివచ్చినదని వారు విచారింతురు. కావున రహస్యముగా జరుగు నుపాయము నాలోచింపుము' అనెను. ఆమె పాండవుల కిట్టి దుర్గతిపట్టినందులకు వగచి 'యేదియెట్లున్నను కీచకుని చంపినగాని తనకు శాంతిలేదని లేదా ఉరిపోసికొనియో, నీటపడియో ప్రాణము విడుతు'

నన్నది. అది విని భీముడు నవ్వి 'దీని కింతవగ పేల? పదునొకండు నెలలు గడచినవిగదా! ఇంకొక్కనెల. ఇది గడచెనా నీ అవమానమునకు ప్రతీకారము చూతువు. సీత, లోపాముద్ర, సుకన్య, దమయంతి భర్తలతో నానాబాధలు పడలేదా? ఒక్కటికి విసుగు. నీ వతని ఒప్పించి, ఒప్పుకొన్నట్లు నటించి రేపు రాత్రికి నర్తనశాల కొంటరిగా రమ్మనుము. వానిని చంపి నీకు ప్రియము చేయుదును' అని బుజ్జగించి, 'ఎవ్వరును లేవకుండ పొ'మ్మని పంపించి వచ్చి తాను నడ్డివాల్చెను.

ద్రౌపది మగడు చెప్పినట్లు చేసినది. ఆనాటిరాత్రి చంద్రాస్తమయమైనాక వచ్చి భీముని పిలిచినది. అతడు తలపై ముసుగువేసికొని ద్రౌపదివెనుక నర్తనశాల కరిగెను. అక్కడ ఉత్తపక్క యున్నది. దానిపై తాను పరుండి ద్రౌపదిని కొంచెము దూరమున నుండుమని చెప్పెను. అంతట కీచకుడు వచ్చినాడు. వాని కెప్పుడెప్పుడా అన్నట్లున్నది.

వచ్చి పక్కపైనున్న పడతి తన వలపుకత్తెయే అనుకొని చేయివేసినాడు. భీమునకు కోపము వచ్చినది. అయినను కొంచెముసేపు వానిమాటలు వినదలచి యూరకుండెను. కీచకుడు 'తన్వీ! న న్నెందరో వలతురు. లంచము లిత్తురు. కాని నామనస్సు నీయందే లగ్నమైనది' అనెను. భీముడు తన మాటలనేర్పు భార్యకు చూపదలచి మెల్లగా ఆడుదాని గొంతుకతో 'అటువంటివాడవు కనుకనే నిన్ను నీవు పొగడుకొనుచుంటివి. నావంటి ఆడుదానిని వెదకినను నీ వెక్కడనైన చూడగలవా? నాశరీరముతో చేర్చినప్పుడు నీ శరీర మేమ

గునో తెలిసికొందువు. ఎంతతప్పు చేసితినో చూచితివా? నన్ను మరొక స్త్రీతో పోల్చి చూచితివా? నన్ను ముట్టిన తర్వాత నీవు మరొక స్త్రీని పొందుదువా? శరీరము పొందినందుకు ఫలమును పొందుదువు' అని రెండర్థములు వచ్చునట్లుగా మాట్లాడెను. అతనివంటి స్త్రీ లేదు. అతని [illegible] పొందుటతో కీచకునిజీవితమే సరి! పాపము! ద్రౌపది ఆనాడు విన్నది కామినీకాముకుల సంభాషణమును. లోలోన నవ్వుకొన్నది. భీముడు కీచకుని గట్టిగా పట్టుకొని ఒక్కపోటు పొడిచెను. అప్పుడు కీచకుడతడే గంధర్వుడై యుండునని తలచినను జంకక సింహబలుడనుటచే యుద్ధము చేసెను. ద్రౌపది చూచుచున్నది.

తమతమ పౌరుషములు సఫలమగునట్లుగా వారు మల్లయుద్ధము చేసిరి. నిజముగా వారికి సాయమువచ్చుట కైనను ఎవరును లేరు. అంతకంతకు భీమునిబలము పెరుగగా కీచకునిబలము తగ్గజొచ్చినది. అతనిబలము తగ్గుటనుచూచి భీము డతని ప్రక్కలలో పొడిచెను. ఆపోటులు భరింపలేక అతడు క్రిందపడి గిలగిల తన్నుకొనెను. మదపుటేనుగు చిగుళ్లు, పువ్వులతోనున్న చెట్టును కూలద్రోసినట్లు రత్నాలంకారభూషితుడైన కీచకుని నేల కూలద్రోసెను. అంతటితో భీముడు వానిని, చేసినదానికి శిక్షగా వికృతముగా చంపదలచెను. తల, కాళ్లు ముద్దచేసి కడుపులోనికినొక్కి ప్రక్క త్రొక్కు త్రొక్కెను. దానితో అతనిదేహము చిల్లులుపడ్డది. వానిని చలిమిడిముద్దవలె చేసెను. ఆ వాయులలో నున్న నిప్పును తెచ్చి మొల్లో దానినంటించి మంటచేసి ఆ పీనుగును తన ప్రియురా

లికి చూచెను. ఆమె తెల్లపోయి, తలయూచి, ముక్కుమీద వ్రేలుపెట్టి 'ఆహా! కీచకా! ఇందుకై యిట్లు చేసితివిరా? ఇక సుఖింపుము' అని సంతోషించినది.

అప్పుడు భీముడు 'నీ విచారము తగ్గినదా? నా బలము నీకు నచ్చినదా? కోపము తగ్గెనా? సంతోషించితివా? దుర్వృత్తితో నీదగ్గరకు చేరినవారికి బ్రతుకశక్యమా?' అనుటతో విని ద్రౌపది యెంతో సంతోషించినది.

కాని, ఆ కృత్య మంతటితో పోలేదు. కీచకుని తమ్ములొక వందనైదుగు రున్నారు. వారికి తెలిసినది అన్నగారి చావు. వెంటనేవచ్చి 'ద్రౌపదిమూలముగా నిదంతయు జరిగినది; కాన ఈమెతోసహా మా అన్నను తగులబెట్టెదము. అప్పుడుకాని మా అన్నకు మనశ్శాంతి కల్గదు. ఏ గంధర్వులస్తువస్తేనో చూతము' అని ద్రౌపదినికూడ కీచకునిపీనుగుతో కలిపికట్టి శ్మశానమునకు తీసికొనిపోవు చుండిరి. జనులుగుంపులు తండములుగా వచ్చిచూచుచుండిరేకాని నివారింపలేదు. పాండవుల కజ్ఞాతవాసమున పరస్పరము తెలిసికొనుటకు మూడు పేర్లున్నవి. ఆ పేరులతో 'జయ, జయంత, విజయ, జయత్సేన, జయద్బల' అని పిలిచినది. అది విన్నాడు భీముడు. బయల్పడరాదుగదా అని శ్మశానపుదారిలోనున్న ఒక చెట్టును లాగి బుజముపై వేసికొని పెదవులదరుచుండగా, కనుబొమ లెగురుచుండ భయంకరాకారముతో వారి కెదురుగా నిలిచెను.

వారు పాపము! అన్నకు హితవుచేయదలచిరేకాని తమకుకూడ కాలముమూడు ననుకొనలేదు. ఆ అకాల యముని చూచుటతో ఆశవము నక్కడ పారవేసి గంధర్వులు

వచ్చిరని పరుగులారంభించిరి. కొందరు పల్లములలో దాగిరి. కొందరు చెట్లెక్కిరి. కొందరు భయములో పరుగెత్తలేక కాళ్లు గుదులుపడగా నానాబాధ పడుచుండిరి. భీముడు వారిలో నొక్కనినైనా పోనియ్యక చేతులతీట తీరునట్లు చంపి, ద్రౌపదికట్లు విప్పి, ఆమెను సుధేష్ణయింటికి పొమ్మని తాను వేరొకత్రోవను వంటయింటిలోనికి పోయెను.

సంధిచేయుటయా మానుటా అను సంశయములో నుండియు ధృతరాష్ట్రుడు భీముని తలచుకొని విచారించునాడు. అతనిమాట లివి:

'భీముఁదలంచినన్ మనము భీతిఁగలంగుచునుండునాకు రే
లేమియు నిద్రరా దతని నెత్తుటమూర్కొనఁజాలునట్టివాఁ
డీ మొనలేఁ డతం డలుకనెత్తిన యా గద కాలదండము
ద్దామవిలాసుఁడై కురుకదంబములో విహరింపకుండునే?'

అ దాతని విచారము. మెల్లగా చెప్పిన నెవడును వినడు. భయ ముండవలెను. దుర్యోధనునకా భయము పోగాలము సమీపించినందున కల్గనేలేదు.

శ్రీకృష్ణుడు రాయబారమున కేగును నీ యుద్దేశ్యమేమో చెప్పుమని భీము నడిగెను. అప్పు డతడు ధర్మరాజుకన్న నెక్కువయోర్పుగా చెప్పినాడు. యుద్ధసన్నాహమున నుండు మన్న శ్రీకృష్ణునితో "యుద్ధము జరుగు నని మమ్ము భయపెట్ట నక్కరలేదు. ఏ రీతిగా నైనను దుర్మతియగు దుర్యోధనుడు శమించు నుపాయము చూడుము. ఆ పాపాత్ముడెట్లును నీమాట వినడు. వాని కెవరు నడ్డముచెప్పరు. అతని యాప్తులతనియిష్టమువచ్చినట్లే పోనిత్తురు న న్నెప్పుడును

చంపజూచుచునే యుండును. అట్టివానితో కలసిమెలసి యుండుట నా కిష్టము లేదు. కాని ధర్మరాజు, అర్జునుడునుకూడ వంశవిచ్ఛిత్తికై భయపడుచున్నారు. పాండవులు కౌరవులు కలిసి పాలు - నీరువలె నుండగా అతడే ఇంత తెచ్చిపెట్టెను. అతడొక్కడే కులక్షయమునకు కారణ మందురు. అది తప్పదు. అయినను నీవు పరోక్షరీతిగా (యుద్ధముజరుగు నట్లు) పల్కుట యేటికి? వానిని చేతనైనంతవరకు చక్క దిద్దుము. తాను చచ్చునరకు నతడు కపటము మానజాలడు. భారతవంశమునకు నిందవచ్చు ననుసంశయ మా దురా త్మున కేల కల్గును ?

నీవు భీష్మునకు వినుచుండగా దుర్యోధనునితో నా మాటగా ఇట్లు చెప్పుము: 'మన మన్నదమ్ములమై యుండి, ఒకళ్లు తలెత్తిచూచుచుండగా ఒకరితో నొకరము పోట్లాడు కొనుట యేటికి? పెద్దవారిమాటవిని, భూమిపంచి, అనుభ వించుట మంచిది' అని చెప్పి, కృష్ణా! ఏ రీతిగానైనను సంధి యగునట్లు చేయుము. మేము వారును కలిసియుండుట ప్రజలందరికి క్షేమము?" అని సంధికోరి చెప్పెను. అది విను టతో కృష్ణున 'కితడు యుద్ధమునకు జంకెనా?' అనిపించినది. హెచ్చరింపదలచి 'నీవు సంధియే కోరినను నేను నర్జునుడును యుద్ధమును పూర్తిచేయగలము' అని పల్కుటతో భీముడు 'ఓహో! నీవును, అర్జునుడును భారతయుద్ధమును కడతేర్చు చుండగా మేము పెద్దమిట్ట (ఎత్తైన ప్రదేశము) ఎక్కి పిరాడ వలె గాజోలు! ఇప్పటికి పోయిరమ్ము. భీము డిప్పుడు వృథా మాటలకు కోపింపడు' అని, 'యుద్ధమే జరిగెనా ఏనుగుల

కుంభస్థలములు ముక్కలగునట్లు, గుజ్జములు నేలపై పడునట్లు నాగదకు పండుగగునట్లు చేయగా నీవే అశ్చర్యపడుదువు లే' అని స్థిరముగా చెప్పుటతో నతఁడు సంతోషించెను.

భీష్ముఁడు భీముని అతిరథ శ్రేష్ఠునిగా పేర్కొని 'అతని మహాబల మమానుషము, పరాక్రమము అసమానము' అని చెప్పెను. యుద్ధములో భీముని చేతిలో భానుమంతుడను కళింగదేశపురాజు చచ్చెను. ఒకనాడు దుర్యోధనుడు భీముని పైకి వెళ్ళగా నతడు తనమీద వేసిన బాణములకు లెక్క సేయక నవ్వుచు ఒక్కబాణమును వేసెను. దానితోనే దుర్యోధనుడు రథముపై స్మృతితప్పి మూర్ఛపోయెను. సైనికులందరును భయపడిరి. భీము డార్చెను. తరువాత నొకనాడు దుర్యోధనుడు వేసిన బాణములకు భీముడు మూర్ఛపోయెను. వెంటనే తెప్పిరిల్లి యుద్ధము చేసెను. ఆరవనాడు భీముడు రథముపైనుండి యుద్ధముచేయుటకు తనివిచెందక గదపుచ్చుకొని యుద్ధరంగమున కష్టపడి తుత్తునియలుగా చేయుచుండెను. అది చూచుట కెంతో భయము, నాశ్చర్యము వేసినది.

ఎనిమిదవనాడు భీముడు సునాభుడు మొదలైన ధార్తరాష్ట్రులను చంపుచుండగా దుర్యోధనుడు భీష్మునితో 'భీము డీ రోజున క్రోధావేశముతో వచ్చుచున్నాడు. నీవు చూచుచు నూరకున్న నెట్లు? అడ్డుపడుము' అని విచారించగా, భీష్ముఁ డెదుర్కొనవిచారించి 'నాయనా! కోపించిన భీముని కెదురు వెళ్ళి నీ తమ్ములను రక్షింప నెవరితరమును గాదు. వారికి వీరస్వర్గ. అట. అయినను ప్రయత్నింతు' ననెను. ఆమాటలు విని ధృతరాష్ట్రుముచేత డెంతో విచారించెను.

ద్రోణుని సేనాధిపత్యదినములలో (11 వ రోజు)
భీముడు శల్యునితో గదాయుద్ధము చేసెను. ద్రోణుని మూడవ నాటి యుద్ధమున సైంధవుని వరప్రభావమువలన నెవరు నతని కెదురు నిల్వలేకపోయిరి. మరొకనాడు భీముడు అడ్డులేని రీతిగా వీరుల నెదిర్చెను. మరొకనాడు భీముడు కర్ణుడు తన్నెంతనాపజూచినను ఆగక శత్రుంజయాది ధార్తరాష్ట్రులను చంపెను. తర్వాత కర్ణుడు భీము డాయుధములేక యుద్ధము చేయకపోగా, కుంతికిచ్చినమాటప్రకారము కర్ణు డతని చంపక తిట్టి వదలెను.

తర్వాత భీముడు దుర్మద, దుష్కర్ణులను ధార్తరాష్ట్రులను చంపెను. కర్ణుడు యుద్ధముచేయురోజులలో భీము డొకనాడు కర్ణునెదుర్కొని అతనిపైకి శక్తినేయగా నతడు మూర్ఛపోయెను. అప్పుడు భీముడు రథముదిగి కర్ణుని నాలుకను కోయుటకై కత్తిలాగగా, శల్యుడు నివారించెను. భీముడు 'అర్జునుని ప్రతిజ్ఞ నెరవేరుటకై వీనిని నేను చంప'నని విడిచిపోయెను. అప్పుడే శ్రుతవర్మాది ధార్తరాష్ట్రుల నార్గురిని చంపెను. ఒకనాడు భీముడు శకునిని మూర్ఛపోవునట్లు కొట్టెను.

అది కర్ణుని సేనాధిపత్యమున రెండవరోజు. భీముడు దుశ్శాసనుడు నెదుర్కొనిరి. వారిద్దరికి బద్ధవైరము. ఆది పగ దీర్చుకొనుటకు తగిన రంగస్థలము. ఆరోజున దుశ్శాసనున కాయువు మూడనున్నది. భీముని ప్రతిజ్ఞ పూర్తి కద్దలచియున్నది. భీముడు 'తమ్ముడా! ఆ సభలో నీదగ్గర తీసికొన్న ఋణమంతయు వడ్డీతో తీర్చెదను. నా ప్రతిజ్ఞనడ్డెడు వ్యక్తి

తీ స్తును. నిలుము. నేడు నీపుణ్యము పుచ్చినది. బ్రహ్మకు నీపై నేటికి దయపుట్టి నిన్ను నాచెంతకు తెచ్చినాడు' అనగా, అతడు 'ఓ యబ్బో! మీరుపడినపాట్లు లోకప్రసిద్ధములు. ఆమాట లెందుకు? వీరుడవైనచో యుద్ధము సేయు' మనెను. ఒకరిమీద నొకరు బాణములు వేసికొనిరి. భీముని రథాశ్వములు చచ్చెను. అతనికి రథము పోయినది. ఆ విచార మతని కింతయును లేదు. గదను బుజముపై కెత్తినాడు. ప్రళయకాల యమునివలె దుశ్శాసనునిరథముపై బడి గుఱ్ఱములను, సారథిని చంపినాడు. అతడును క్రిందికి దిగి తోమరమెత్తుకొని భీముని పై కురికెను. అతడు పదునూ రేండ్లు పడినపాట్లు, ప్రతిజ్ఞ మన స్సులో బాధించుచుండగా గదతో దుశ్శాసను నొక్కటి కొట్టెను. ఆదెబ్బతో అతడు నెత్తురు క్రక్కుకొనుచు నేలపై బడెను.

అప్పుడు భీముడు పెద్దపులి లేడిపిల్లను చంపునట్లుగా వానిమెడమీద కాలువేసి వానితో 'ఏమిరా! ఆనాడు సభలోఅన్నవి చాలక వెదకికొనుచు నావద్దకు వచ్చితివే? ఏమందువో ఇప్పు డనుము. నాకు వినవేడుకగా నున్నది' అని వెక్కిరించెను. అతని చూచునరికి భయమువేసి దుర్యోధనునిసేనలోనివా రెవ్వరు నట కేసి పోలేదు. అంతట దుశ్శాసనుని చేతితోపట్టుకొని గిరగిరత్రిప్పును. నేలనువేసి కొట్టును. మోకాలితో పొడుచును. మొగముపై తన్నును. కన్నులెర్రచేసి చూచును. మెడ గట్టిగాత్రొక్కి నిల్చుండును. నవ్వును. అట్లు తన భీమపరాక్రమము వ్యక్తమగునట్లుగా వీర విహారముచేయుచు, 'ఓరీ! ఆనాడుచేసితినే ప్రతిజ్ఞ! నీరొమ్ము

చీల్చి రక్తము త్రాగుదు ననె. ఇదిగో త్రాగుదును. నీకు దిక్కె-
వ్వరో కొంతెత్తి పిలువుము' అనుచు, కత్తితీసి మొగము
మీఁద జళిపించెను. నరసింహస్వామి హిరణ్యకశిపుని రొమ్ము
చీల్చినట్లు చీల్చి, దోసిటితో రక్తముతీసికొని త్రాగును.
'ఆహాహా! ఏమిరుచి! చిన్నప్పుడు తల్లిపాలు త్రాగితినట!
ఆ వేరుచియో జ్ఞప్తికి లేదు. ఎన్నో తేనెలు, త్రాగితిని కాని
నా కేదియును ఈరక్తమంతరుచిగా లేదు' అనుచు ఒంటి
మీఁదికి చల్లుకొనును. ఇంకను వాని ప్రాణము పోలేదు. భీముఁడు
వానికేసి చూచుచుండును. వారిసైనికులు రాక్షసుఁడేమో
అన్నంత భయముతో పరుగెత్తిరి. ఒక్కఁడును యుద్ధము
చేయుట లేదు.

ఒక్కసారి గద చేతఁబట్టి, మరల కౌరవసేనలను భయ
పెట్టి, పారఁద్రోలి, మరలివచ్చి, దుశ్శాసనునికాలు గట్టిగాపట్టు
కొని 'ఓరీ! మమ్ములను పశువు లంటివిగదరా? ఆమాటలు
నిలువఁబడినవా? దున్నపోతా! ఏ వే పశువవురా? నీమాటకు
ఎవరయిన మారుపల్కుదురటరా? నన్నెన్నిపాట్లు పెట్టితిరి? అది
కాదు; సభలో అందరువినుచుండఁగా తిట్టుదువే. జూదమా
డినవారు లేరా, గెల్చినవారు లేరా? నీవలె నెవ్వరైన పాడుపని
చేయుదురా? ధృతరాష్ట్రుఁడా నాఁడు వలదన్న నే బాధయు లేకుం
డెడిదే! ఆనాఁడు 'నీకు భర్త లేఁడు' అన్న స్త్రీయొక్క భర్త
వచ్చి నిన్ను చంపుచున్నాఁడు. అప్పుడు భర్త గల స్త్రీలు
నేఁడు విధవలై పోదురు. ఇదిగో పను. నేను చేయవలసినపను
లలో ఒకటైనది. ఇక రెండవది - దుర్యోధనుని నెత్తిపై
తన్నుట - ఉన్నది. ఇకపోయి నెరవేర్చెదను' అని వానిని

పూర్తిగా ప్రాణములుపోవునట్లు చంపెను. కర్ణాది యోధు లది కన్నులారా ప్పగించి చూచుచుండిరేకాని, అడ్డగించలేక పోయిరి. అదిచూచి ధార్తరాష్ట్రులు కొందరు రాగా, వారిని కూడ భీముడు చంపెను. ఎవరైనను సహాయము వత్తురేమో అని కాచుకొని యున్నాడు ప్రక్కన అర్జునుడు. అతనికి పనియే తగులలేదు. ఆరోజుననే కర్ణుడును పడెను. వారు రాజులు. యుద్ధములుచేసి పగ సాధించుకొనునట్టి మేటివీరులు.

పదునెనిమిదవనాడు భీముడు సేనాధిపతియగు శల్యు నితో తలపడి గదాయుద్ధము చేసెను. అది వీరులకు కన్నుల పండువయ్యెను. రక్తము శరీరమునంతను కప్పగా పూచిన మోదుగచెట్లవలె వారు మిక్కిలి ప్పుదలతో కొంతసేపు యుద్ధముచేసి, గదాఘాతములచే ఇద్దరును మూర్ఛపోయిరి. తక్కినవారు చేసిన శైత్యోపచారములచే నిద్దరును లేచి, మరొకవీరులతో కలియబడిరి.

శల్యుడు ధర్మరాజుచేతిలో చనిపోగా మిగిలినకౌరవులు భీమునిపైకి దుమికిరి. అతడు వాడిబాణములతో వారి నంద రను చంపెను. అంతేకాక అప్పుడు 500 రథములను, 700 ఏనుగులను, 800 గుఱ్ఱములను, 10,000 కాల్బలమునుచంపెను. ఇక మిగిలినది సుయోధనున కొక్క తమ్ముడుమాత్రమే సుద ర్శనుడు. వానినికూడ భీముడు చంపివేసెను. ఆఖరునకు దుర్యోధను డొక్కడుమాత్రమే మిగిలెను. ఆ రథికులలో కృప, కృతవర్మ, అశ్వత్థామ లుండిరి. అప్పటికి పాండవ సేనలో 2,000 రథములు, 700 ఏనుగులు, 500 గుఱ్ఱములు, 10,000 కాల్బలము, ధృష్టద్యుమ్నుడు నుండిరి.

మడుగులో దాగిన దుర్యోధనుడు ధర్మరా జనినమాట లకు రోషముకల్గి, గద చేతపట్టి పైకివచ్చెను. అతడు పాండవు లైదుగురు నున్నను, భీమునితో యుద్ధము చేయగోరెను. శ్రీ కృష్ణుడు భీమునితో ప్రోత్సాహకరముగా మాట్లాడి, 'ఇతనికి గదాయుద్ధములో పరిశ్రమ హెచ్చుగా నున్నది. నీవు చాల ప్రయత్నించి యుద్ధముచేయవలెనుసుమా!' అని హెచ్చ రించెను. భీముడు 'ఈగదతో వీని ప్రాణములు తీసికొందును. నీవు నిష్కంటకముగా రాజ్యమేలు'మని ధర్మరాజుతో అని, దుర్యోధనునితో 'ఇది తప్పు – ఇది చెడ్డది అని మనస్సులో విచారింపక మమ్మెన్నో పాట్లు పెట్టితివి. వాటికన్నిటికి ఫలిత మిప్పుడే నీ వనుభవింతువు. పాపము! మీ మేనమామ ముందుగా పోయినాడు. నీ వొక్కడవే మిగిలినావు. వెళ్ళు దువుగాని రా' అని పిలిచెను. అతడును కోపముగా 'నాతో గదాయుద్ధమున ఇంద్రుడైనను చాలడు. నీ వొక లెక్కా? రమ్మ'ని సిద్ధపడెను.

ఇంతలో బలరాము డచ్చటికి వచ్చెను. ఆయన భారతయుద్ధమున ఎవరిపక్షము పూనక తీర్థయాత్రలు చేయ వలసివచ్చి వెళ్ళెను. ఆనాడు భీమదుర్యోధనుల గదాయుద్ధ మని తెలిసి, వారు తనశిష్యులు, తగినజోడు అగుటచే చూడ ముచ్చటవేసి వచ్చెను. ఆ వీరు లిద్దరును చేతులలో గదలు పుచ్చుకొనియే గురువుగారికి వందనముచేసిరి. అతడు వారి నాదరించెను. కాని దీవింపలేదు. అది దీవించుసమయము కాదుగా!

వారు యుద్ధమునకై శమంతకపంచక మున్నచోటికి కేగిరి. అక్కడ వారిద్దరును చూచు వారికి వింత, ఆశ్చర్యము, భయము తోచునట్లు పోరిరి. మధ్యమధ్య ఇద్దరును మూర్ఛ పోయినను వెంటనే తెప్పిరిల్లి యుద్ధము చేయజొచ్చిరి.

ఆ యిద్దరియుద్ధమును చూచుచున్న అర్జునుడు కృష్ణునితో వారితారతమ్యము చెప్పు మనెను. కృష్ణుడు 'భీమునకు బల మెక్కువ. దుర్యోధనునికి పరిశ్రమ హెచ్చు. ఈ పదమూడేండ్లు నితడు గట్టిగాకృషిచేసెను. ఇద్దరును విద్యచక్కగా నేర్చినవా రగుటచే ధర్మయుద్ధమున మనకు జయము రాదు. కావున ప్రతిజ్ఞవంకగా తొడలు విరుగగొట్టవలెను. గదా యుద్ధములో నాభికి దిగువ కొట్టగూడదు కనుక నతడు కాచుకొనడు' అని చెప్పగా అర్జునుడు భీముడు చూచుచుండగనే తొడలుచరచెను. అదిగ్రహించి సందుదొరకగానే దుర్యోధనునితొడపై గదతో కొట్టెను. ఒకతొడవిరిగి అతడు క్రింద పడెను. అప్పుడు భీముడు తన ప్రతిజ్ఞచేసినరీతిగా నత్తిపై ఎడమకాలితో తన్నెను.

అంతటితో అతనికోపము తగ్గలేదు. దుర్యోధనుని మొగముకేసి చూచుచు 'ఓరీ! మమ్ము పశువు లంటివే. నీవే ధర్మహీనుడవైన పశువవురా, బంధుద్రోహీ! ఇదిగో! ఇది మాయజూదము కాదురా, గదాయుద్ధము!' అని తక్కిన వారితో 'నాడు ద్రౌపదిని సభకీడ్పించినమహారాజు ఇడుగో. చూడుడు! ద్రౌపదిచేసిన తపస్సు ఫలించి ఈశుభము జరిగినది' అని, 'ఇదివరలో మనము గొడ్డుపోయితి మన్న దుర్జనులను బంధుమిత్రపరివారములతో యుద్ధములో చంపితిమి. చాలు.

ఇక స్వర్గమో, నరకమో కానిండు! దానికై విచారింపము' అని పల్కెను. ధర్మరాజు 'తలదన్నుట మంచిదికా'దనెను.

బలరాము డప్పుడు నాగలి చేబూని 'ఇ దేమి అన్యాయము! నాభికిదిగువ కొట్టునా? చూడు నీ వే మగుదువో?' అని భీమునిపై కోపగించెను. భీముడు తక్కినవా రున్నా రను ధీమాతో ధైర్యముగా నుండెను. కృష్ణు డతని కడ్డువచ్చి చేతులతో అన్నను పట్టుకొని 'శాంతింపుము! ప్రతిజ్ఞానిర్వాచనమునకై యిత డిట్లు కొట్టినాడు. కాక, గదాయుద్ధములో నిలచి యున్నప్పుడే నీవుచెప్పిననియమముకాని, పైకెగిరి మీదికి పడునప్పుడు తన్ను రక్షించుకొనుటకై యెక్కడైనను కొట్టవచ్చును. మరొక్కటి: మైత్రేయుడు దుర్యోధనునితొడలు విరుగునని శపించెనుకదా! అ దేల వృథాపోవును!. కావున నీవు కోపింపవలదు' అని సర్దిచెప్పెను. బలరాముడు 'ఇటువంటి పాడుగెలుపుగెలిచిన భీముడు పొగ త్తలుపొందిన పొందనిమ్ము! కాని, వీరస్వర్గము దుర్యోధనునకు వచ్చును' అని రథమెక్కి తనయూరికి పోయెను. అతడు మధ్యవర్తి: ఒకరితో అతనికి పనిలేదు.

అశ్వత్థామ నిద్రపోవుచున్న ఉపపా డవాదివీరుల నందరిని చంపెను. మరునా డుదయము ద్రౌపది భీమునితో ప్రతీకారముగా అశ్వత్థామను కట్టితె మ్మన్నది. భీముడు నకులుని సారథిగా చేసికొని వెళ్లెను. కాని అత డశ్వత్థామకు చాలడని కృష్ణు డర్జునునితో 'వెనువెన్కనే వెళ్ళెను. అశ్వత్థామను బంధించి అర్జును డీయగా శిరోరత్నమును తెచ్చి భీముడే ద్రౌపది కిచ్చెను.

యుద్ధభూమికి వెళ్ళిన గాంధారీధృతరాష్ట్రులను చూచుటకై పాండవులు వెళ్ళిరి. ధర్మరాజు నమస్కరించిన తర్వాత ప్రక్కనున్నవారు భీము డితడే యనిరి. భీము డన్న పేరు వినుటతో ధృతరాష్ట్రుని కోపముప్పొంగిపోయినది. అతనిని నలిపివేయ దలచెను. శ్రీకృష్ణున కది తెలియుటచేత దగ్గరకు వెళ్ళబోవుచున్న భీము నాపి, అదివరకే తయారుచేయించియుంచిన యినుప భీముని ధృతరాష్ట్రునిదగ్గరకు బంపెను. అతనికి కన్నులు లేనందున అది నిజముగా భీముడే అనుకొని గట్టిగా తన కసి తీర కౌగిలించెను. అత డెంత బలశాలియో కాని, ఆ యినుప బొమ్మ ఆ కౌగిలింతతో నుగ్గయిపోయెను. తర్వాత విచారించుచున్నట్లు నటించిన ధృతరాష్ట్రుని శ్రీకృష్ణుడు మందలించెను. అప్పుడు బుద్ధి తెచ్చుకొని నిజముగా భీముడు దగ్గరకు వెళ్ళగా కౌగిలించుకొని దీవించెను.

ఇక గాంధారికి నమస్కరింపబోయిరి. ఆమె వంద మంది కొడుకులు పోయిన కడుపుమంట నాపుకొనలేక శాపమియ్యదలచినంతలో వ్యాసమహర్షి వచ్చి యామె నూరడించెను. అప్పుడు భీముడు భయముతో వణకుచు 'అమ్మా! ధర్మమో అధర్మమో ప్రాణరక్షకై అప్పు డట్లు చేయవలసి వచ్చెను. దయతో క్షమింపుము. నీకొడుకు బలముకలవాడైనందున అట్లు గాని యోడింపవీలులేదు. అదిగాక మాకుజరిగిన పరాభవము నీ వెరిగినదేకద! ఆనాడు ప్రతిజ్ఞపట్టితిని. అప్పుడే నెరవేర్చుటకు అన్నగారిమాట అడ్డువచ్చినది. ఒక్కటివినుము; కృష్ణుని రాయబారమునకు పంపునపుడు 'అన్నదమ్ములమైన మన మొకరు తలెత్తిచూడగా యుద్ధముచేయనేల? పంచుకొని

సుఖాంతము' అంటినికదా! నీ కొడుకు శాంతింప లేదు. ఏమి చేయుదును? ఇదంతయు నీవే ఆలోచించుము' అనుటతో ఆమె 'అప్పుడుగాని మావానికి నీవు చెప్పిన దుర్గుణములన్నియు నున్నవి. కాని శత్రువును చంపవచ్చును కాని, నెత్తురు త్రాగెడి క్రూరాత్ము లెందైన నున్నారా?' అనెను.

భీముడు 'ఆనాడు ద్రౌపదిబట్టలు విప్పినాడు కోపముతో రక్తము త్రాగుదునని ప్రతిజ్ఞపట్టితిని. అది చెల్లించుకొనుటకై రక్తము త్రాగునట్లు పెదవికి చేర్చితి నంతే! శత్రుసేనకు భయముకల్గించుటకై అట్లుచేయవలసివచ్చెను. కాని, తల్లీ! ఇతరులరక్తము త్రాగినను మహాపాతక మందురే? అందులో తమ్ముని రక్తము త్రాగుటకు నే నంత వెఱ్ఱివాడనా? అంత పాపకర్ముడనా? అంతదయమాలినవాడనా?' అనుటతో గాంధారి కతనిపైనున్న కోపము తగ్గినది. ఎంత చెడు పనిని-ఆవేశములో చేసినను తర్వాతనైనను పశ్చాత్తాపపడుట, సమయమున కనుకూలముగా మాట్లాడుట ఉచితజ్ఞుని లక్షణము. అదెరిగినవాడు కనుక నే భీము డట్లు చెప్పెను.

గాంధారీధృతరాష్ట్రులను ధర్మరాజెంతో ప్రీతిగా గౌరవముతో సేవించుచుండెను. కాని భీముడు వారెవరు నెరుగకుండ, గాంధారీధృతరాష్ట్రులు వినునట్లుగా అల్లంతదూరమున నుండి 'ఈ గ్రుడ్డివాని కొడుకుల నొకరిని దిగపెట్టకుండ చంపితిని. నాచేతులలో పడినవాడు బ్రతికి బయటపడుట లేదు. తెలివితక్కువవారై కౌరవులు వచ్చిరి, చచ్చిరి. నాదైవమునకు మంచిగంధముపూసి పూలమాల లర్పింతును. నా కట్టి

భాగ్యము కల్గజేసిరి. ఆహా!' అనుచుండును. ఆ మాటలు చెవినిపడగానే వారిమనస్సు తరిగికొనిపోయెడిది. ఎవరు నా మాటలు వినలేదు. ధర్మరాజుతప్ప ఎవరువిన్నను ధర్మరాజు నకు చెప్పరు. అత డిట్లు వానికి సహింపడు.

ధృతరాష్ట్రుడు వనవాసముచేయదలచి చిట్టచివరినాటిగా తనకొడుకులకుగా దానధర్మములు చేయవలె ననగా భీముడు 'అమ్మ! ఇదివరలో చేసిన దానధర్మములు చాలవా! మనము చేయవచ్చునులే. ఆ దుష్టబుద్ధియే చేయనక్కరలేదు. అతడు మనలనుపెట్టిన బాధల మరచితివా? భీష్మాదులు నా కెక్కడికి పోయిరి? వారికి మనము నేడు బంధువులమైతిమే! పాంచాలి నవమానించినరీతి, వనవాసములో పడినపాట్లు మర చితివా? అప్పు డీయనగారు నీకు తండ్రికాదా? భీష్మాదుల బాంధవ్య మా నా డెక్కడికిపోయెను? చెప్పవచ్చునే విదురుడు, ఎరుగడే వారిరీతి?' అని విసుగులో తిట్టగా ధర్మరాజు నివారించెను.

పాండవులందరునుకలిసి ఆఖరున మహాప్రస్థానము చేయుచున్నప్పుడు ధర్మరాజు ముందును, వెనుక వరుసగా తమ్ములు నడచుచుండిరి. అందరు కొక్కరే పడుచుండగా వారు పడుటకు కారణమేమో? అని భీముడు ధర్మరాజు నడిగి తెలిసికొనెను. తాను పడబోవుచు అందుకు కారణమునుకూడ తానే యడిగెను' అతడు 'నీభోజనము మిక్కిలిహెచ్చు. తీవ్ర తలో భుజశక్తిలో నీ కెవరును సాటిలేరని తలచి, ఎవరిని లెక్కసేయక వృథాప్రలాపము లాడుదువు. ఆ డంబములే

తప్పడు నీ విట్లు యోగశక్తి చెడి, పడుటకు కారణమయ్యెను' అని చెప్పి వారి దేహ మక్కడనే విడచి ధర్మరాజు వెళ్ళి పోయెను. నరకములో బాధపడు భీముని ధర్మరాజు రక్షించుమని యింద్రుని కోరెను. అతడు స్వర్గమిచ్చి మన్నించెను. తరువాత భీముడు మరుద్గణములో కలిసి శోభించెను.

భీము డెంత ఉద్ధతుడో, అంతయు వినయముకలవాడు. బలము, మదము కలవానికి వినయముకల్గుట అరుదు. కాని అదే అతని అభివృద్ధికి కారణమైనది. ధర్మరాజు ననుసరించి యుండుటచేతనే — వారికి పేరుప్రతిష్ఠలు వచ్చినవి. బాహుశౌర్యమున తానే పేరందినను అన్నగారిని సేవించుచు, అతనిమాటకు జవదాటకుండుట యెంత కష్టతరమో అనుభవముపై తెలిసికొనవచ్చును. పర్యాలోచన చేయగా భీమునిలో మంచిగుణములే హెచ్చుగా కనపడుచున్నవి. రాయబారపు వేళ అతడన్నమాటలు, గాంధారిని బ్రతిమాలినవిధానము పరికించగా 'ఈమాటలు భీమసేనునివేనా?' అనిపించును. అతడు మహాబల (వాయు) వరప్రసాది. అతని కసాధ్యమేమున్నది? అతనిపేరు నేటికిని నిల్చియున్నది.

# అర్జునుడు

లోకోత్తరమైన కార్యములను నిర్వహించుటకు భగవానుడు తనతోపాటు మరికొందరి నవతరింపజేయును. అట్టి మహాపురుషులలో అర్జునుడొకడు. ఇతడు మానవమాత్రుడు కాడని భారతమున పలుచోట్ల చెప్పబడినది. భీష్ముడు పాండవవీరులను విభజించుచు, 'అర్జునుడు శాంతబలము కల వాడని చెప్పలేకపోయెను. స్వైరంపృథకు వగమించుచు పరమేశ్వరుడు 'అర్జునుని నిర్జింపజేయుట నాతరముకాదనెను. అంతేకాక భారతవీరులలో అర్జునుడొక్కడే స్వర్గమున కేగి, ఇంద్రునకు సహాయపడినవాడు. తక్కినకాలములలో చాల మంది రాజులు ఇంద్రునకు సాయపడినట్లున్నది కాని, ఇందీత డొక్కడే. ఆ మహానుభావుని కారణముగానే భగవానుడు స్వనాచాతత్త్వోపదేశమును లోకుల కందిచ్చెను. అట్టిమహానీయుని చరిత్రను సంగ్రహముగా తెలిసికొందము.

కుంతీదేవి కిద్దరు పుత్రులు పుట్టిరి. అక్కడ గాంధారికి వందమందికొడుకులు పుట్టిరి. అది విని పాండురాజున కింకను పుత్రులనుగనవలె నని తలచినది. ఋషులవలన దివ్యమంత్రోపదేశము పొందెను. ముల్లోకములను జయించు కొడుకును పొందవలెనని తపస్సు చేసెను. ఒకసంవత్సరము కాగా, ఇంద్రుడు ప్రత్యక్షమై కోరిక సిద్ధించు ననెను. అప్పుడతడు కుంతీదేవితో 'ధనములోను, విద్యలోను, సంతానములోను తృప్తి పొందినవాడు లేడు. కాన నీ విం్రదునివరమువలన

లోకము లన్నిటిని రక్షింప సమర్థుడైన కొడుకునుకనుము' అని ప్రోత్సహించెను. ఆమె పతియాజ్ఞను శిరసావహించి, మంత్ర జపముచేసి, ఇంద్రు నారాధించి అతని ప్రసాదమున కొడుకును కన్నది. ఆకాశవాణి 'ఈ బాలుడు కార్తవీర్యార్జునునికంటె బలముకలవాడగుటచే 'అర్జున' నామమునకు తగియుండును. ఇతడు దేవేంద్రాదుల నోడించును. రాజులనెల్లరను జయించి ధర్మరాజుచే రాజసూయము చేయించును. దేవతలవలన దివ్యాస్త్రములుపొంది విరోధుల జయించును' అని ఉరిమి నట్లుగా గట్టిగా చెప్పెను. అట్టి వంశకీర్తికరుడు పుట్టినందుకు పాండురాజు, కుంతియు నెంతో సంతోషించిరి. అప్పుడుపూల వాన కురిసినది. దేవదుందుభులు మ్రోగినవి. దేవత లంద రును వచ్చి ఆ బాలుని దీవించి వెళ్ళిరి.

పాండురాజు చనిపోగా కుంతీదేవి పంచపాండవులతో హస్తినాపురికి చేరినది. అప్పటి కర్జునునకు పదునాలుగేండ్లు. ధృతరాష్ట్రుడు తమ్మునికొడుకులకు తనకొడుకులతో కలిపి విలువిద్యల నేర్పించెను. అర్జునుడు కృపాచార్యునొద్ద, ద్రోణా చార్యునొద్ద విలువిద్య నేర్చెను.

గురువున కెక్కువ ధన మిచ్చిన వానిపై అభిమాన ముండును. అంతకన్నను ఎక్కువ తెలివికలవానిపై అభి మానముండును. వాడు శిష్యుడు కాకపోయినను, తన పేరు నిలుపబెట్టును. ఆ ఫలితము గొప్పది. విలువిద్య నేర్చెడి వారిలో అర్జునునికి సాటి మరెవరును లేరు. అది ముందు నుండియు తెలియుచునే యున్నది. ద్రోణు డతనిమీద నొక

కన్ను వేసియే యున్నాడు. గురుని కరుణాదృష్టికి పాత్రు డైనవా డెవడు బాగుపడడు ?

విలువిద్యలో శబ్దభేదనము నొకటి. చప్పుడునుబట్టి బాణముతో కొట్టుట, దాని నలవరచుకొనుటకు నతడు చీకటిలో అన్నము తినుచుండును. అశ్వత్థామ దుర్యోధన పక్షపాతి. కర్ణు డొక్కడే అర్జునునితో చదువులో పోటీపడు వాడు. కాని అతడును దుర్యోధనపక్షపాతియే. అశ్వత్థామ ఒకనాడు అన్నముపెట్టువానితో అర్జునున కెప్పుడును చీకటిలో అన్నము పెట్టవలదని చెప్పెను. కాని ఒకనాటి రాత్రి అర్జునుడన్నము తినుచుండగాగాలికి దీపమారిపోయినది. అర్జును డాగకుండ అన్నమును తినుచునే యుండెను. ఇట్లు అత డసూయాపరు లెందరున్నను లక్ష్యముసేయక, దైవ సాహాయ్యమున, గురుకృపవలన, వినయవిధేయతలవలన అస్త్ర శస్త్ర విద్యలలో నేర్పు సంపాదించెను.

అర్జునుని ధనుష్టంకారము వేరు. అది ద్రోణునకు గుర్తే. ఒకనాడు ద్రోణుడు అర్జుననివద్దకు వచ్చి 'వత్సా! నీశిష్యవృత్తికి మెచ్చితిని. నిన్నుమించెడి ధనుర్ధరులు లేకుండు నట్లు చేసెద'నని మాటయిచ్చెను. అందుకు తగినట్లా విద్య లోని రహస్యములన్నియు నేర్పెను. పరశురాముని తర్వాత నర్జునునకే ధనుర్ధరుడను పేరువచ్చినది.

ఒకనాడు కురుకుమారులు అడవికి వేటకేగిరి. అక్కడ వారికుక్క తప్పిపోయి లోనికేగినది. అక్క డొకడు దాని మొరుగు విని దానినోటిలో బాణమువేసి ఆబాణము చివరకు తగిలి పొడవుగా నుండునట్లు మరి ఆరుబాణములు వేసెను.

అది ఆపుచ్చు కురుకుమారులవద్దకు వచ్చినది. అంతసులువుగా వేసినవా డెవరా అని వారందరును వెళ్ళి తెలిసికొనగా అతడు హిరణ్యధన్వుడను నెుకరాజకొడుకైన యేకలవ్యు డని తేలినది. పైగా అతడు ద్రోణునిశిష్యుడ ననెను. ఎప్పుడో ఒకనాడు విలువిద్య నేర్చుకొనుటకై ద్రోణునివద్దకు రాగా అతడు రాజకుమారులకేకాని నేర్ప ననెను. అతడు వెళ్ళిపోయి ద్రోణుని ఆకారముతో మట్టిబొమ్మనుచేసి దానికి మ్రొక్కి బాణములు వేయుచుండువాడు. ఆరీతిగా అతనికి పరోక్ష ములో గురుభక్తి హెచ్చినది. ఇప్పటికిని గురువునకు తెల్పి యుని శిష్యులను 'ఏకలవ్యశిష్యు' లనుట పరిపాటి.

ఆమాట వినుటతో అంతవరకున్న అర్జునునకే యెక్కువ కష్టముతోచినది. రహస్యముగా గురునికలిసి 'అయ్యా! నాతో సమమైనధనుర్ధరుడు లేకుండునట్లుచేయుదుమనిమాటయిచ్చి ఏకలవ్య వానికి నేర్చితిరే?' అనెను. అత డేమియు నెరుగడు కనుక తెల్లబోయి అడవిలోని ఏకలవ్యునికడ కేగెను. అతడుభక్తితో గౌరవించి మ్రొక్కగా గురుదక్షిణగా అతనికుడిచేతిబొటన వ్రేలిని కోరెను. అత డాలోచింపక నరికి యిచ్చెను. దానితో అతని శరలాఘవము పోయినది. ఒళ్ళుమ్మకొన్నందులకు, మాటనిలబెట్టుకొనుటకు ద్రోణునకట్టి అకార్యము చేయవలసి వచ్చినది. ఏకలవ్యుడే యున్నచో అర్జునునకట్టి పేరు వచ్చె డిదో? అల్లెందు కగును?

ఒకనాడు ద్రోణుడు శిష్యుల లక్ష్యశుద్ధిని పరిక్షించు చుండెను. ఒక చెట్టుచివర ఒకకృత్రిమపక్షిని పెట్టించి దాని తలను లక్ష్యముగా చూడుమని, తరువాత చెట్టు, కాయలు కన

పడుచున్నావా అని అడుగగా అంబరమును గమనించుచున్నానని చెప్పిరి. కాని, అర్జునకుమారుడు 'నా కొక్క పక్షితల తప్ప మ రేదియు కన్పడుటలే' దని చెప్పెను. అతని ఏకాగ్రబుద్ధికి ద్రోణు డెంతయు సంతసించెను లక్ష్యమే కాని మిగిలినవేమియు కన్పడరాదు. అది భావనాబలము. చదువుకోరిన, చదువు వ్యసనము కలవానికి తిండిరుచి తెలియదు. చదువు కతే కాని మరొకటి రాదు. చదువుశబ్దమే కాని వేరొండు వినపడదు. అట్టి యేకాగ్రత కుదిరిననాడు చదువుకాని, మరొకటి కాని రాదు.

ద్రోణు డొకనాడు స్నానమునకై గంగ కేగెను. అతడు స్నానము చేయుచుండగా మొసలి తొడ పట్టుకొనెను. అతడు విడిపించుకొనగల్గియుండియు, రాజకుమారులను పిలిపించెను. వారు కన్పడనిదానిని మేము కొట్టలేమనిరి. అర్జునుడు శబ్దభేది సాధనమున అయిదు బాణములతో దానిని చంపివేసెను అప్పు డతనికి మెచ్చి గురుడు దివ్యబాణము లిచ్చెను.

రాజకుమారు లందరును విద్యలో నేర్పరులైరి. వారి విద్యను పెద్దలకు చూపవలయునని గురున కుత్సాహము కల్గి ధృతరాష్ట్రునితో చెప్పెను. అతడు దానికి తగిన రంగస్థలము ఏర్పాటు చేయించి, ప్రదర్శనదిన మేర్పాటు చేసి, ఆనాటి కందరను రప్పించెను. ముందుగా తక్కినవారందరును ప్రదర్శనలు జరిపిరి.

అంతట అర్జునుడు మనోహరమగు బంగారుకవచము తొడిగికొని, అమ్ములపొదులుకట్టుకొని, విల్లు చేతబట్టి రంగస్థలమునకు వచ్చెను. ఆజానుబాహువు, నల్లనికలువవలె మరియు

నట్టి అతనిచూచి జనులందరును 'వీడె మంచి నేర్పుగలిగించిన వాడు, భరతవంశోద్ధారకుడు, పంతికచుప్పు చల్లగా పుట్టిన వీరుడు' అని పొగడిరి. ఆపొగడ్తవిని ధృతరాష్ట్రుడును ఆనందించెను. అటుపు ఆగ్నేయాస్త్రమును నిష్ఫలముయముచేసి, వాయవ్యాస్త్రమున నెసరప్పించి ఆర్పెను. మేఘాస్త్రమున మబ్బులను రప్పించి, అనిలాస్త్రమునగాలిపుట్టించి మేఘములను విడగొట్టెను. తనకువచ్చిన అస్త్రములన్నిటి ప్రభావము చూపి, తాను కన్పడకుండ కొంతసేపు, చిన్నవాడై, పెద్దవాడై చిత్రవిచిత్రగతుల నడచిచూపెను. పసగత్తెడి సింహములపై ఒక్కబాణమునే వేసినట్లు అయిదేసి బాణములనువేసియు, త్రాడునకు ప్రేలాడ గట్టిన ఆవుకొమ్మునకు పొడవైన కర్రనాటె నిరువదొక్కబాణములు వేసియు, గద కత్తి మున్నగు పరికరములతో చమత్కారములు చేసియుకూడ చూచెడివారికి వినోదము కల్గించెను.

అదిచూచి సహించలేకపోయా యనునట్లు కర్ణుడు రంగస్థలమునకువచ్చి 'ఓం! నీవేకాదు నేర్పుకాడవు. మేమును నేర్చితిమి. చూపుదు'నని అర్జునునకు సిగ్గును, అర్జునునకు ప్రతికూలముగా చేసినందున దుర్యోధనునికి ప్రియమును చేసెను. దుర్యోధను డతనిని కౌగిలించుకొని నాతో స్నేహముగా నుండుమని చెప్పి, అర్జునునితో ద్వంద్వయుద్ధము చేయుమనెను. అర్జునుడు 'పిలువకుండ తగుదునమ్మా యని వచ్చిన ప్రతివానితోను నేను యుద్ధము చేయ'ననెను. కర్ణుడు 'ఇది వీరుల రంగస్థలము. వీరు లెక్కడికి వత్తురు. దానికి పిలువ నక్కరలేదు. శక్తియున్నచో బాణములందుకో' మ్మనెను.

అర్జునుని తనవారు ప్రోత్సహించిరి. అంతట కర్ణార్జునులు అస్త్రములతో ద్వంద్వయుద్ధముచేసిరి. అప్పుడు భీష్మ ద్రోణ పాండవు లర్జునుని పక్షము, దుర్యోధనాదులు కర్ణునిపక్షము నైరి. అప్పు డాయుద్ధము మరింత పెరుగకుండ నివారించి, మధ్యగా నిలువబడి, కృపాచార్యుడు కర్ణునితో 'అర్జునునితో యుద్ధముచేయదలచినచో నీ తల్లిదండ్రులపేరు చెప్పి సమానమైన జోడుగా నతనితో చేయుముగాని' అనెను. అతడు తన కుల పితృాది నామములు చెప్పుటకు సిగ్గుపడి, తలవాల్చుకొనెను. దుర్యోధను డది చూచి అతని నంగరాజ్యమిచ్చి రాజును చేసెను. అంతట ఆనందము నాపలేక సూతుడువచ్చి కొడుకును కౌగిలించుకొని తల ముద్దాడెను. అది చూచి భీముడు నవ్వుచు 'నీ కులమునకు తగినట్లు కొరడా చేతపట్టి, గుఱ్ఱములను తోలక, అర్జునునితో యుద్ధముచేయుదువా? ఉత్తమక్షత్రియున కనుభవయోగ్యమైన రాజ్యము నీకు తగునా? పురోడాశము (యజ్ఞపాయసము) [illegible] యజమాన భోజ్యమగుగాని కుక్కకు తగునా?' అని హేళనచేయుటతో జవాబు చెప్పలేక కర్ణు డాకాశమునకేసి చూచుచు నూరకుండెను. దుర్యోధనుడు 'శూరులజన్మము తెలియదు. మీ రందరు దేవతలకు పుట్టినవారేకదా! సహజ కవచకుండలములు కల యితడు సామాన్యుడుకాడు. అంగరాజ్యమే కాదు, సకలభూరాజ్యము నేలుట కర్హుడు' అనెను. అందరు ఇండ్లకు పోయిరి. దుర్యోధను డానాడు 'ఇక అర్జునునివలన భయములే' దని గుండెపై చేయివేసికొని నిద్రించెను.

మరునా డుదయమున ద్రోణుడు రాజకుమారుల నంద రిని రావించెను. వారు వచ్చిరి. అతడు గురుదక్షిణ నిమ్మని యడిగెను. వా రాతనికి నమస్కరించి నిలువబడి కావలసిన దేదో కోరుకొనుమనిరి. అతడు రాజ్య వైభవ మదాంధుడైన ద్రుపదుని సజీవముగా (బ్రతికియుండగా) కట్టి తెమ్మని కోరెను. వారందరును రథముల నెక్కి ద్రుపదుని పట్టణమైన కాంపిల్యనగరము మీదికి ప్రయాణమైరి. ద్రోణుడు పాండవులును కొంచెము వెనుకగా ప్రయాణమైరి. అర్జునుడు ద్రోణునితో 'ఆచార్యా! కౌరవులు ముందుగా వెళ్ళిరి. వీరి కా ద్రుపదుడు సాధ్యపడునా? చూతము' అని నవ్వుచు పల్కెను.

కౌరవులు ముందుగా వెళ్లి ద్రుపదుని నగరమును ముట్ట డించిరి. వారువచ్చి ముట్టడించిరని తెలియగానే ఉగ్రుడై ద్రుపదుడు సేనతో వచ్చి వారిని తాకెను. ధనుర్విద్యావేత్త లలో గొప్పవాడని పేరొందిన ద్రుపదునికి తగువారైన రాకుమారులతో యుద్ధముచేయుట అన్న సామాన్యమే! అయినను వారిని యుద్ధరంగముననే మందలింప వచ్చునని మొదలొత్తెను. వారును తమపరాక్రమమును, నేర్పును చూపిరి. కాని అతనిముందు తాళలేక పారిపోయిరి.

అప్పు డర్జునుడు ద్రోణునికి, ధర్మరాజునకు మ్రొక్కి 'మీ రిక్కడనే యుండుడు. నేను, భీముడు కవలుసాయముగా వెళ్ళి ద్రుపదుని కట్టి తెత్తు' నని వెళ్లెను. భీముడు ముందు న్నాడు. నకులసహదేవులు ప్రక్కలందు రక్షకులుగా నున్నారు. ద్రుపదునిసేన మీదికి కలియబడగానే భీము

డాయుధములన్నిటికి మిన్నయైన గదతో ఏనుగులను, గుర్ర ములను చంపెను. మనుష్యులమాట లెక్కయే లేదు. వీర విహారము సల్పెను. అతని ఘోరయుద్ధమున కాగలేకపోయిరి.

అర్జునుడు శరసంధానముచేసి సైన్యములు చెల్లా చెదరగునట్లు కొట్టుచుండెను. సాంసుగా అతనిని ద్రుపదుని తమ్ము డెదుర్కొనెను. కాని అతడు కొద్దిసేపటిలోనే పారి పోయెను. ద్రుపదుడువచ్చి ద్వంద్వయుద్ధమునకు దిగెను. ఆ యిద్దరి యుద్ధములో బాణములతో ఆకాశమున చీకటి క్రమ్మెను. తక్కినవారందరును వారియుద్ధమే చూడ జొచ్చిరి. అప్పుడు ద్రుపదు డర్జునునివిల్లు విరుగగొట్టి సంతో షముతో ఆర్చెను. వెంటనే అర్జునుడు కత్తి చేతపట్టి ద్రుపదునిరథముపై కురికి అతని నొడిసిపట్టెను. సేనలు హాహా కారములు చేసినవి. అర్జును డా ద్రుపదునిరథపు పగ్గములతో కట్టి తీసికొనివచ్చి గురువుగారికి నమస్కరించి 'ఆచార్యా! ఇదిగో గురుదక్షిణ' అని మ్రొక్కెను.

అత డట్లు పగసాధించగలిగినందుల కెంతో సంతోషిం చెను. తనకోరికను నెరవేర్చినందుల కర్జును నెంతయు మెచ్చుకొనెను. ద్రోణునికి ద్రుపదునిపై కసిగానున్నది. అందుచే అతని నవమానింపదలచి, నవ్వుచు 'ఓహో! ఏ దేవ రయ్యా! ద్రుపదమహారాజులా! వీరికి ఇంతదీనముగా పట్టు పడవలసివచ్చెనే? ఆహాహా! తనకున్న ఆమహారాజ్యమదాం ధకారము పోయెనా? మే మెవరమో ఎరుగుదురా? ఇకనైన జ్ఞాపకము వచ్చినదా?' అని వేళాకోళముచేసి వదలివైచెను. అతడు బ్రాహ్మణుడుకనుక క్షమించి వదలివేసెను. కాని

క్షత్రియుడే నైనచో చంపకవదలుదా? బ్రాహ్మణకోపము, గడ్డితో చేసిన నిప్పువలె క్షణికములుకదా!

అర్జును డా రీతిగా తనకున్న నేర్పుచూపి గురుదక్షిణను చెల్లించెను అప్పటియుద్ధములో భీముడు గదాయుద్ధకౌశలు డనియు, అర్జునుడు సాటిలేని ధనుర్ధారి యనియు జనులు పొగడసాగిరి.

ద్రోణుడు అర్జునునికున్న బలపరాక్రమములకు, వినయ విధేయతలకు సంతోషించి తనవద్దనున్న అస్త్రములలో కెల్ల మహామహిమగల బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగోపసంహారముతో నుపదేశించెను. 'దీనినగస్త్య మహర్షి అగ్నివేశుడను మునీశ్వరున కిచ్చెను. వారు నా కిచ్చిరి. నీవు దీని నోపగలవాడ వని నీ కిచ్చితిని. దీనిని మానవులపై ప్రయోగింపరాదు. తక్కువశక్తికలవానిపై దీనిని ప్రయోగించినచో ఇది లోకములను తగులబెట్టును. నిన్ను బాధించు మానవులపై ప్రయోగించినచో చాలసులభముగా వారిని సాధించును' అని దానిమహిమను చెప్పి, 'మరొక్క గురు దక్షిణ యియ్యవలెను. అదేమిటనగా; నేను యుద్ధముచేయు నపుడు నీవు నాతో ప్రతియుద్ధము చేయరాదు' అనుటతో అర్జును డట్లుసేయుట కంగీకరించెను. అ ట్లతడు గురువునకు ప్రీతిపాత్రుడై సకలాస్త్రములను నేర్చెను.

ద్రుపదునకు ద్రోణునిపై పగ పెరిగినది. ఎట్లయిన పగ తీర్చుకొనదలచి అడవికి వెళ్లి యాజు డను మునితో 'అయ్యా! నాకు ద్రోణునితో వైరమున్నది. అతనిని యుద్ధములో చంపునట్టి కొడుకును, అర్జునుడు నన్ను యుద్ధములో

ఓడించినందున ఆ పరాక్రమశాలికి భార్యయగునట్టి కూతురును పుట్టునట్లు యజ్ఞము చేయింపుము. తమకు లక్ష ధేనువులను దక్షిణగా నిత్తు' నని ప్రార్థించెను అతని కెట్టి యూహా కల్గెనో చూడుడు! అర్జునువంటివానిగా తయారుచేసిన ద్రోణుని చంపవలెనట! తనోడించినను, రాజునకు పౌరుషము ముఖ్యమైనది కనుక ఆ పరాక్రమవంతు డల్లుడు కావలె నట! ఆహా! ఏమి కోరిక! అతడు మహారాజు; తగినట్లు కోరినాడు.

యాజు డట్లు చేయించుట కొప్పుకొని పుత్రకామేష్టి యాగమును చేయించగా, అందు హోమగుండమునుండి బాలుడు, బాలికయు పుట్టిరి. వారికి ధృష్టద్యుమ్నుడు, కృష్ణ అనుపేర్లు ఆకాశవాణియే నియమించినది. ద్రుపదుడు సంతోషముతో యాజునకు దక్షిణలిచ్చి పంపెను. ధృష్టద్యుమ్నుడు ధనుర్వేదపారగు డైనాడు. ద్రౌపది వివాహయుక్తవయస్సులో నున్నది.

పాండవులు లక్క-యింటిలో తగులబడినట్లువిని, ద్రుపదుడు తనప్రయత్నమంతయు వృథా యైనదే! మహర్షి వాక్యము వ్యర్థమగునా? యని తనపురోహితునితో ననగా, అతడు 'పాండవుల కేమియు ప్రమాదము కల్గలేదు. నేను ఉపశ్రుతియను విద్యవలన తెలిసికొంటిని. స్వయంవరము చాటించినచో నీ కోరిక నెరవేరు'నని ధైర్యముచెప్పి, కర్తవ్యముపదేశించెను. అతడూరడిల్లి పుష్యశుద్ధ అష్టమి రోహిణీనక్షత్రమున స్వయంవర మేర్పాటు చేసి, ఎవనును ఎత్తలేని పెద్ద విల్లు చేయించి, మత్స్యయంత్రము కట్టించి, 'ఎవ్వరావిల్లునెత్తి

మత్స్యయంత్రమును కొట్టుదురో వారికి ద్రౌపది నిత్తు' నని చాటింపువేయించెను. ఈ సంగతి ఏకచక్రపురములో నున్న పాండవుల కొక బ్రాహ్మణుడు తెల్పెను. వారందరును కుంతీ సమేతముగా కాంపిల్యనగరమునకు బయలుదేరిరి.

దారిలో ఎన్నో అడవులు దాటి వెళ్ళుచు, వ్యాస మహర్షిని చూచిరి. నమస్కరించి తమ్ము దయజూడు మని కోరిరి. అతడు 'మీకు మేలుచేకూరును. ద్రుపదునిపట్టణమున కేగుడు. అతని కూతురు కృష్ణ, పూర్వజన్మమున శివునిగూర్చి తపస్సుచేసి, అయిదుగురుభర్తలు కల్గునట్లు వరముపొంది, పెరిగియున్నది. వెళ్ళి రండు' అని దీవించి పంపెను.

వారక్కడినుండి రేయింబవళ్లు ప్రయాణముచేయుచుండిరి. ఒకనాడురాత్రి గంగలో సోమశ్రవ మను తీర్థమున స్నానముచేయుటకై వెళ్లుచుండిరి. అర్జునుడు ముందు కొరవి చేతపట్టుకొని దారిచూపుచుండెను. వారికాలిచప్పుడు అక్కడ స్నానముచేయుచున్న గంధర్వుడు విన్నాడు. అంగారపర్ణుడను వాడు భార్యలతో కూడి అందు జలక్రీడ లాడుచుండెను. నిర్జనమై దేవసంచారయోగ్యమైన ఆ యడవిలోనికి అర్ధరాత్రిమున వచ్చువా రెవరా? అని కోపించి,అంగారపర్ణుడు 'మీ రెవరో దారితప్పి వచ్చుచున్నారు. నే నంగారపర్ణ డను కుబేరునిస్నేహితుడను దూరముగా తొలగిపొండు' అని అదలించెను.

అర్జును డది విని 'ఏమేమీ! స్వర్గమునుండి భూమికి దిగిన గంగ నీదా? అడవి నీదా? ఆహా! ఏమిమాటలు? నీబెదరింపులకు జడియునట్టివారము కాము?' అనుటతో కోపించి

గంధర్వుడు వాడిబాణముల నర్జునునిపై వేసెను. అతడు చేతి లోని కొరవితో ఆ బాణములు తనకు తగలకుండ తప్పించు కొని 'ఓరీ! నాకు గురూపదిష్టమైన ఆగ్నేయాస్త్ర మున్నది. కాచుకొ'మ్మని ప్రయోగించెను. ఆ అస్త్రము గంధర్వుని రథమును తగులబెట్టెను. అది తనమీదికి వచ్చుచుండగా భయపడి మూర్ఛపోయిన గంధర్వునిజుట్టుపట్టుకొని యీడ్చు కొనివచ్చి ధర్మరాజుముందర పారవేసెను. ఆ గంధర్వుని భార్య, కుంభీనసి 'ఓరాజులారా! నన్ను రక్షింపుడు. నాకు పతిభిక్షనిండు' అని వేడినది. ధర్మరాజు గంధర్వుని విడువు మని దయతో ననగా అర్జును డట్లే అతనివదలి 'ధర్మరాజు నిన్ను దయదలచి వదలినాడు. పొమ్ము. భయపడక బ్రతు కుము' అని వదలెను.

అప్పు డంగారపర్ణుడు 'యుద్ధములో నీవలన పరాజ యము పొంది, యింకను వెనుకటి పేరుంచుకొందునా? నాకా పాటి సిగ్గులేదనుకొంటివా? ఇంతజరిగినతర్వాత పేరుమార్చు కొనవలెను. కాన నీవువేసినఅస్త్రమువలన రథము తగులబడి నను మాయచే అనేకచిత్రరథములను కల్పించుకొనగలం దున నా పేరు 'చిత్రరథు' డని ప్రసిద్ధ మగుగాక! నీ బలమునకు మెచ్చితిని. నీ స్నేహము కోరితిని. నేను తపస్సుచే సాధించిన 'చాక్షుషి' యను విద్యను నీ కిచ్చు చున్నాను. దీనివలన ముల్లోకములలో దేనిని చూడవలె నన్న వెంటనే చూడవచ్చును. నీ వుత్తమవంశసంజాతు డవుకన్క నీ కీ దివ్యవిద్య నిచ్చుచున్నాను. దీనిని తీసి కొనునప్పుడు నీవు ఆరుమాసములు వ్రతముచేయవలెను.

మీ యైదుగురికి మంచివేగము కలిగి కామవర్ణము, కామగమనము కల గంధర్వహయములను చెరి నూరేసి యిత్తును. నాకు ఆగ్నేయాస్త్ర మిమ్ము' అని పల్కెను. అర్జునుడు 'అట్లే' అని అతనికి ఆగ్నేయాస్త్ర మిచ్చి గుర్రములను తీసికొని వాని వలన తమపూర్వికులైన తపతీసంవరణులకథను తెలిసికొనెను. అప్పటినుండి చిత్రరథుడర్జునునకు స్నేహితుడయ్యెను.

అర్జును డతనిసలహా ప్రకారము ధౌమ్యుని పురోహితునిగా పొందుటకై అంగీకరించి, అతని కస్త్రమిచ్చి 'అవసరము వచ్చినపుడు తీసికొందుము. గుర్రములను నీవద్దనే యుంచు' మని చెప్పి అన్నదమ్ములతో గంగదాటి ధౌమ్యుని చేరెను. అక్కడ ఉత్కచతీర్థమున తపస్సుచేసికొనుచున్న ధౌమ్యుని పురోహితుడుగా నుండుమని వేడిరి. ఆయన అంగీకరించెను. అతడు తమకు పురోహితుడైనందుకు వారు సమస్తభూరాజ్యము లభించినంతగా సంతసించిరి.

అక్కడినుండి దక్షిణపాంచాలముల కేగుచుండగా దారిలో అక్కడి కేగెడి బ్రాహ్మణులను కలిసికొని వారితో పాటు తాము ప్రయాణము చేసిరి దారిలో వ్యాసమహర్షి కన్పడి, పాండవులకు రాబోవుశుభములను చెప్పి దీవించి వెళ్లి పోయెను. పాండవులు కాంపిల్యనగరమున కేగిరి. అప్పటి కప్పుడే నానాదేశములనుండి రాజులు స్వయంవరమునకైవచ్చి విడిసియుండిరి. అక్కడ వారు కుమ్మరియింటిలో మకాము చేసిరి. బ్రాహ్మణరూపములతోనే భిక్షావృత్తి చేయుచుండిరి.

ద్రుపదుడు పాండవేయులకై వెదకించినను లాభము లేకపోయెను. స్వయంవరమునకై రాజులందరును వచ్చియుండిరి. వారి నందరిని తగురీతిగా పూజించి మర్యాదలు చేసెను. ధృష్టద్యుమ్నుడు రాజులతో 'ఈ విల్లు నెక్కుపెట్టి అయిదు బాణములతో పైనున్న మత్స్యయంత్రమును నేలకు కొట్టిన వాడే ఈబాలికకు భర్త యగును. ఇది పురోహితుడు చెప్పిన విధానము. కావున అట్లు చేయవలసినది' అని పలికెను. అక్కడికి కౌరవులును, తక్కిన రాజకుమారులు తొందరగా వచ్చియుండిరి. బ్రాహ్మణసముదాయములో పాండవులున్నారు. వారి నెవరును ఆనవాలు పట్టలేకపోయిరి. దేవతలా స్వయంవరము చూడవచ్చిరి. వారు ధరించిన పుష్పాలదండల వాసనలతో అక్కడి ప్రదేశము గుప్పుమనెను. కృష్ణుడును వచ్చెను. అతడు బ్రాహ్మణమధ్యమునున్న అర్జునునిచూచి సంతోషించి అతడే తప్పక వరించు ననుకొనెను.

రాజకుమారులు ద్రౌపదినిచూచిరి ఆమె చాలఅందగత్తె. ఆమెయందమునకు వారి కెంతో బాధ కల్గినది. వెంటనే ఆమెను పెండ్లిచేసికొనవలె ననిపించినది. కాని వింటిని ఎత్తుటకు శక్తిచాలక ఆప్రాంతమున కేగుసరికి అధైర్యముతో పెదవులు కొరికికొనిరి. కొందరు విల్లువంచిచూచి విఫలులైరి. కొందరు ఎట్లైనను వంచలేమని సిగ్గుతో ఊరకుండిరి. మనకెట్లును చేతకాదని కొందరు వచ్చినదారిపట్టిరి. యాదవులు ప్రయత్నింపబోయిరి కాని, కృష్ణుడు నివారించినందున మానిరి శిశుపాలుడు, జరాసంధుడు, శల్యుడు, కర్ణుడును ప్రయత్నించి కొద్దికొద్దిగా ఎత్తగల్గిరి కాని, పూర్తిగా నారిబిగించలేకపోయిరి.

అప్పుడు అర్జునుడు ధర్మరాజు ననుమతి తీసికొని ధనుస్సువద్ద కేగెను. అతని యుత్సాహము చూచుటతో బ్రాహ్మణుల కాశ్చర్యము కల్గినది. నవ్వువచ్చినది. 'ఆహాహా! ఏమి యీతనిసాహసము? ఇంతమందిరాజకుమారు లెంతో నేర్పుకల్గియుండికూడ ఎక్కుపెట్టలేనివింటి నితడు ఎక్కుపెట్టగలడా! బ్రాహ్మణజాతికే నవ్వు రప్పించునే!' అని అనుకొనుచుండిరి. కొందరు 'అతని కెంతో నేర్పుండియుండును. లేకున్నచో ఊరక వింటివద్ద కెవడు వచ్చును? ఇతడు గురుప్రసాదమున నెగ్గవచ్చును' అనుకొనిరి.

అంతట అర్జునుడు ధనుస్సుదగ్గర కేగి గురువులకు నమస్కరించి, వింటికి ప్రదక్షిణముచేసి మ్రొక్కి, ఇదివర కల వాటున్నవాడువలెనే ఆ ధనుస్సు నెత్తిపెట్టి జనులందరు నాశ్చర్యపడుచుండగా అయిదుబాణములతో మత్స్యయంత్రమును కొట్టెను. జనులందరు ఆశ్చర్యపడిరి. 'కందమూల ఫలాదులు తిని, తపస్సు చేయుటచే శరీరము చిక్కినను బ్రాహ్మణులకు తపోబలము హెచ్చుగానుండును. వారి కసాధ్యము లేదు. ఇతడు సునాయాసముగా కొట్టినాడు. నిజముగా బ్రాహ్మణుడో? లేక బ్రాహ్మణరూపమున నున్న ఇంద్రుడో? దేవతయో?' అని అనుకొనిరి. వారిరొద మిన్ను ముట్టినది. అర్జుని పొగడెడి దేవతలరొద భూమిని వ్యాపించినది. దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసినది. బ్రాహ్మణులు జయము తమదే అను సంతోషముతో పైమీద బట్ట లెగురవైచుచు కేకలు వేసిరి.

ధృష్టద్యుమ్నుడు ద్రౌపది వెనుక అర్జును డుండు చోటున కేగెను. ద్రౌపది పెళ్లికొడుకును కనుక సిగ్గుతో మెల్లగా వచ్చి తనచేతిలోని పూలహారమును అర్జునుని మెడలో వేసెను.

రాజకుమారు లది చూడలేకపోయిరి. తాము రాజ కుమారులై చేతకాక యుండగా ఒక బ్రాహ్మణుని కట్టి మర్యాద జరుగుచుండగా ఏ రాజు చూచి సహించగలడు? వారందరు నొకటైరి. 'ఈ రీతిగా మనలను ద్రుపదు డవమా నించునా? ఈ పాటి భాగ్యమునకు మనలనందరిని రప్పించుట ఏటికి? మనమందరము నుండగా బ్రాహ్మణుని పూజించునా? ఎంత పాపకార్యము చేసినను బ్రాహ్మణుడు చంపదగినవాడు కాడు. కాక తనవిద్యను చూపి తాను పిల్లను గెల్చెను. బ్రాహ్మణుని పోనిత్తము. ఇంతచేసిన ద్రుపదునిపై యుద్ధము చేయుద'మని రాజులందరు నొక్కమాటగా కూడి పలుకు కొని విండ్లెక్కుపెట్టిరి. ద్రుపదు డేమియు చేయలేక అల్లుని తరఫుననున్న బ్రాహ్మణులమధ్య దాగెను. బ్రాహ్మణులు నీ కేమియు భయములేదని ద్రుపదునికి ధైర్యముచెప్పి కృష్ణా జినపు కట్టలు, దండములు ఎత్తి రాజులపైకి దండెత్తిరి. వారినిచూచి నవ్వుచు అర్జునుడు 'అయ్యా! మీ రెవరును హడావిడి పడ నవసరములేదు. నాఅస్త్రములతో ఈ రాజుల నేమిచేయుదునో చూడుడు' అని తాను, భీముడును శత్రు సేనలపైకి కలియబడిరి. భీము డక్కడనున్న చెట్టునుపికి దండ ధరుడైన యమునివలె యుద్ధముచేయసాగెను.

అప్పుడు కృష్ణుడు బలరామునికి వారినిచూపి వారిద్దరును భీముడు, అర్జునుడును. లక్కయింటిలో కాలెనని అనుకొన్నాముకాని వారెట్లు బ్రతికిబయటపడిరి. భగవంతుని దయ వలననేటికి వీరిని మరలచూడగల్గితిని' అని చెప్పుటతో బలరాముడును సంతోషించెను.

కర్ణు డర్జునుని, శల్యుడు భీముని తాకిరి. అర్జునుని యుద్ధమునేర్పుచూచి కర్ణుడు 'నీవు ఇంద్రుడవో, పరశురాముడవో, అర్జునుడవో యైయుండవలెను. ఇంకెవరును నా యెదుట నిలిచి యుద్ధముచేయలేరు' అనగా అర్జునుడు 'నేను నీవు చెప్పినవారిలో నెవడనుకాను. నిలిచియుద్ధముచేయుము' అనెను. కర్ణుడు బ్రాహ్మణులను జయించుట కష్టమని తలచి మరలిపోయెను.

భీముడు శల్యునితో ద్వంద్వయుద్ధముచేసి క్రిందపడవేసి నేలనువేసి కొట్టి వదలెను. శల్యుడు ఒళ్లు దులుపుకొనుచు, వెళ్లిపోయెను. అదిచూచి దుర్యోధనాదులు ఆశ్చర్యపడుచుండగా, కృష్ణుడు 'ఇతరులకు సాధ్యముకాని మహాకార్యమును సాధించి, ఈ బ్రాహ్మణశ్రేష్ఠుడు ద్రౌపదిని పొందగల్గినాడు. ఇక నితని నెవ రాక్రమింపగలరు? వద్దు, మానుడు' అనెను. అది విని రాజకుమారులందరును మరలిపోయిరి.

పాండవులు మెల్లగా ద్రౌపదిని తీసికొని యింటికేగిరి. 'అమ్మా! నే మొక్కభిక్ష తెచ్చితిమి' అనగా కుంతి మామూలుగా అన్నమే అనుకొని, అందరును సమముగా అనుభవింపుడు' అన్నది. తీర ద్రౌపదిని చూచుసరికి తెల్లపోయి 'అయ్యో! మాట అంటినే! ఒక్కస్త్రీని ఇంతమంది పెం

యాడుటయెట్లు?' అనిభయపడినది. కాని 'ధర్మరాజుమాత్రము
తల్లిచెప్పినరీతిగా గాక ద్రౌపదిని పెండ్లియాడు మని అర్జును
నితో చెప్పెను. అతడు 'పెద్దవానికి పెండ్లికాకుండచిన్నవాడు
పెండ్లియాడుట ధర్మవిరుద్ధముకాన నీవే యామెను పట్టమహి
షిగాస్వీకరింపుము' అనెను. ధర్మరాజు తమ్ములకు నామెపై
ప్రీతి పుట్టినట్లు చూపులచే తెలిసికొని 'యీమె మన యైదుగు
రికి భార్యగా సృష్టింపబడినది. కావున గురువాక్యప్రకార
మైదుగురము పెండ్లాడుదము.' అనెను.

అప్పుడు బలరామకృష్ణు లక్కడికి వచ్చిరి. వారికి
తగిన మర్యాదలు చేసిరి. ధర్మరాజు కుశలప్రశ్నలు వేసి. 'మే
మెవరికి తెలియకుండ నిక్కడనుండగా, మీ రెట్లు తెలిసికొంటి
రయ్యా?' అనగా, కృష్ణుడు 'సూర్యుడు దాగినచో ఆనవాలు
తెలియదా? మీరు దాగదలచినను మీ తేజస్సు దాచుటకు
వీలగునా? మానవాతీతమైన యిట్టి అద్భుతకార్యమును అర్జు
నుడు తప్ప మరెవరు చేయగలరు?' అని తాము గుర్తుపట్టిన
రీతిని చెప్పగా విని ధర్మరాజు ఆనందించెను. బలరామ
కృష్ణులు పాండవులతో కొంతసేపు ఇష్టాగోష్టిసలిపి వెళ్లిరి.

అంతట ధృష్టద్యుమ్నుడువచ్చి వారి నిత్యకృత్యము
చూచి వెళ్ళి తండ్రితో చెప్పగా నతడు పురోహితుని పంపి
నను వారే జాతివారో తెలిసికోలేక నాలుగువర్ణములవారికి
పనికివచ్చు రథముల నంపగా పాండవులు రాజోచితమైన
రథములనెక్కి ద్రుపదునియింటి కేగిరి. అక్కడ వ్యాసాను
మతిని ద్రుపదు డంగీకరించగా ద్రౌపది నైదుగురును పెండ్లి
చేసికొనిరి.

తరువాత ధృతరాష్ట్రుడు రాజ్యమియ్యగా ఖాండవ ప్రస్థమును రాజధానిగా చేసికొనిరి. ఇంద్రుడు విశ్వకర్మను పంపి ఒకమహానగరమును నిర్మింపజేసెను. అదే 'ఇంద్ర ప్రస్థము.' అది పూర్తికాగానే సుముహూర్తమున ఆనగరప్రవేశము చేసిరి.

వారు సుఖముగా కాలక్షేపము చేయుచుండగా నారదుడు వచ్చి సుందోపసుందులకథ చెప్పి 'స్త్రీమూలకముగా అన్నదమ్ములకైనను విరోధము వచ్చును. కాన, మీరు ఒక్కొక్కరొక్కొక్క సంవత్సరము కాలము ద్రౌపదితో కాపురము చేయుడు. మధ్యలో నెవరైన ఆయింటివానికి తెలియక ఆయింటికి వెళ్లినచో ఒక్కయేడాది తీర్థయాత్రలు చేయునట్లు నియమము పూనుడు' అని చెప్పెను. వారు దాని కంగీకరించి ఆ మునియెదుటనే ప్రతిజ్ఞపట్టిరి.

కాలము సుఖముగా గడుచుచున్నది. వారు నియమ ప్రకారము నడచుకొనుచుండిరి. అప్పుడు ధర్మరాజు నొద్ద నున్నది ద్రౌపది. ఒక బ్రాహ్మణుని హోమధేనువును దొంగలు తోలుకొనిపోయిరి. అతడువచ్చి అర్జునునితో 'విజయా! నాధేనువును దొంగలు తోలుకొని పోయినారు. దానిదూడ నిన్నటినుండి తెగ అర్చుచున్నది. నీవు ఆలసింపక వెంటనే విల్లమ్ములు చేపట్టి రమ్ము' అనెను. ధనుర్బాణములు ధర్మ రాజున్నయింటిలో నున్నవి. అక్కడి కతని మెరుక లేకుండ పోరాదని తెలియును. కాని బ్రాహ్మణున కొక్కయాపద వచ్చినపుడు, అది ఆలసింపరానిదైనప్పుడు తాను, బాధపడి నను ప్రజలబాధతీర్చుట రాజునకు ధర్మమని అర్జునుడు

వెంటనే వెళ్ళి సనుర్బాణములు తీసికొనివెళ్లి బలవంతులైన చోరులను వధించి అతనియావు సతనికొప్పజెప్పెను. అక్కడికి కాపని పూర్తియైనది.

అత డింటికి మరలివచ్చి ధర్మరాజునకు మ్రొక్కి 'అన్నా! ప్రజలను హద్దుమీరకుండ పరిపాలింపవలసిన మనమే హద్దుమీరినచో అపకీర్తి వచ్చును. కావున నాకు పండ్రెండునెలలపాటు తీర్థయాత్రలు చేయుటకనుజ్ఞ యిమ్మ' అని కోరెను. అంతట ధర్మరాజు 'నాయనా! క్రూరకర్ములైనను బ్రాహ్మణులబాధను పోగొట్టువారికి నే పాపములు నంటవు. నీకు ప్రతిజ్ఞాభంగ మేమిటి? అదిగాక దొంగలను చంపక యుపేక్షించినందున బ్రూణహత్యా దోషము వచ్చునని యున్నది. నీవు దొంగలను చంపి బ్రాహ్మణకార్యము నెరవేర్చితివి. కాన నీకు ప్రాయశ్చిత్తముచేసికొను నవసరములేదు' అనెను అర్జునుడు 'నిజమల్లే. కాని జనులు మరొకరీతిగా నిందింతురు. కావున మనము అపకీర్తి రాకుండ చూచుకొనవలెను. ఏదోరీతిగా సర్దుకొన్నచో ధర్మలోపము వచ్చునని మహాత్ము లందురు. కాల వ్రతముచేయునట్లు నన్ననుగ్రహింపుము' అని కోరుటతో ధర్మరా జంగీకరించెను.

అర్జునునకు వేదవేదాంగపారగులైన బ్రాహ్మణులు, శాస్త్రవేత్తలు, పౌరాణికులును తోడుగా వెళ్ళిరి. వారి నందరిని పూజించుచు మర్యాదలుచేయుచు, వారు చెప్పెడి పుణ్యకథలను వినుచు అర్జునుడు తీర్థయాత్రలు చేయుచుండెను.

ఇంద్రప్రస్థమునుండిబయల్దేరి తీర్థముల సేవించుచుగంగా ద్వారమున కేగి గంగానదిలో స్నానముచేసెను. అక్కడనే కొన్నిరోజు లుండి, స్నానముచేయుచు, ఆ గంగాతీరముననే హోమము చేయుచుండెను:

ఒకనాడు ప్రాతఃకాలమున అర్జునుడుగంగలో స్నానము చేసి స్నానాంగ దేవర్షి పితృతర్పణములు చేసికొనెను. బ్రహ్మ యజ్ఞ పితృతర్పణములు చేసెను. ఇక అగ్నిహోత్రములు చేయుటకై వచ్చుచుండగా అతని నొక నాగకన్య చూచినది. చూచీచూచుటతో అతనివలచినది. అత డింద్రనీలమాణిక్యము వలె నల్లగా అందముగా నున్నాడు. మంచి దేహపుష్టి ఆమెను మోహపరచినది. ఆమె మొకలు పరవశమైనది. వెంటనే అతనిపై మాయప్రయోగించి కనుగప్పి నాగలోకములోని తన మేడకు తీసికొనిపోయినది. అతని యగ్నిహోత్రమునుకూడ అక్కడకు తేబడినది. అతడు అగ్నిహోత్రముచేసికొన్నాడు.

అప్పుడు కన్నుపైకెత్తి చూచినాడు. ఎదురుగా కన్య కన్పించినది. అతనికి నవ్వువచ్చినది. ఆమెతో 'తరుణీ! నీవెవ రవు? నీ పేరెవరు? నన్నిక్కడ కేల తెచ్చితివి?' అని యడి గెను. ఆమె 'నేను ఉలూచియను నాగకన్యకను. ఐరావతు డను ప్రసిద్ధమైన నాగకులములోని కౌరవ్యుని కూతురను. నిన్నుచూచి కామార్తనై కోరికపుట్టి తీసికొనివచ్చితిని. నన్ను పెండ్లిచేసికొనుము' అన్నది. అందు కర్జునుడు 'నేను ఏడాది వ్రతముపట్టి తీర్థయాత్రలు చేయుచుండగా, వచ్చి, యిట్లు చేయుట తగునా? నీ కోరిక నే నెట్లు తీర్పగలను?' అన్నాడు. ఆమె ముఖము వంచుకొన్నది. కేవలము సిగ్గుపడి యూరక

కున్నచో కోరిక యెట్లు తీరును? 'ఈ విషయమంతయు నే నెరుగుదును. ద్రౌపదికై మీరు చేసిన ప్రతిజ్ఞ యెరుగుదును. ఈ తీర్థయాత్రసంగతి తెలియనిదానను గాను. ఒక్కటి ఆలోచింపుము. ప్రాణరక్షణము ముఖ్యమో? తీర్థయాత్రయే ముఖ్యమో యోచింపుము. నిన్ను విడిచి నే నొక్కక్షణమైన నుండజాలను. నీ వాదరింపనిచో నిప్పుడే ప్రాణముల విడుతును. ఆపై నీ చిత్తము' అన్నది.

అత డాపద్ధర్మముగా ఆమెకోరిక నెరవేర్చుట కంగీకరించినాడు ఆ రాత్రి ఆమెను సుఖసౌలికల నూపినాడు. తెల్లవారుసరికి సద్యోగర్భమున నామె కొకపుత్రుడు పుట్టెను. అతనికి 'ఇరావంతుడు' అని పేరుపెట్టి, ఆమెను గద్దచెప్పి, అర్జును డుదయముననే తా నిదివర కున్న చోటుకు వచ్చి చేరెను.

అప్పటివరకు అర్జునునికై అది–ఇది వెదకిన అతని పరివారమునకు అతడు కన్పడగానే ఆనందమైనది. అతడు జరిగిన దంతయు చెప్పి, వారికి సంతోష మినుమడింపజేసెను.

అక్కడినుండి అగస్త్యవటమున, భృగుతుంగము, హిరణ్యబిందు తీర్థములను సేవించి, తూర్పుదేశమున కేగెను. నైమిశారణ్యమున జగన్నాథుని సేవించెను. ఉత్పలిని, కౌశికి, నంద, అపరనంద, గయగంగ, గంగాసాగరసంగమము అను పుణ్యక్షేత్రములను చూచుచు సముద్రతీరము వెంబడి కళింగదేశమున ప్రవేశించెను. కళింగమునుండి ఉత్తరదేశములకేగి తూర్పుసముద్రతీరమున పురుషోత్తముని సేవించెను. మహేంద్రపర్వతమును చూచి, దక్షిణగంగ యని ప్రసిద్ధ

గాంచినగోదావరీనదిని సేవించెను. సప్తగోదావర మనబడు భీమేశ్వరము (దక్షారామము) ను సేవించి, శ్రీశైలమును దర్శించెను. శిష్టాగ్రహారము లెక్కువగానున్న వేగీ దేశ వైభవము దర్శించుచు దక్షిణసముద్రతీరమున కేగి కావేరీ సాగర సంగమమున స్నానముచేసెను.

ఏడాది నిండినది. పదుమూడవ నెల వచ్చుసరి కర్జునుడు పాండ్య దేశములోని మణిపూర పురమున కేగెను. దానిని పరిపాలించెడి చిత్రవాహనుడను రా జాతనికి మర్యాదలు చేసెను. అర్జునుడు చిత్రవాహనుని కూతురైన చిత్రాంగద తనకు భార్యయైన బాగుండు ననుకొనెను. ఆ విషయము చిత్రాంగదునికి తెలిసినది. అతడు అర్జునునితో 'నీకు కన్యక నిత్తు'నని చెప్పుటకు నాకెంతో ఆనందముగా నున్నది; కానిదీనికి కొంచెము నీకు చెప్పవలసిన దున్నది. శ్రద్ధగా వినుము. మా పూర్వికుడగు ప్రభాకరుడనురాజు తనకు సంతానము లేక పోగా పరమేశ్వరునిగూర్చి తపస్సు చేసెను. పరమేశ్వరు డాతని తపస్సునకు మెచ్చి నీ కొక్కకొడుకు పుట్టును. నీవంశీయులకెల్లయగు' నని ప్రసాదించెను.ఇంతవరకు నట్లే జరిగినది. కానినాకుమాత్రము కుమారునకు బదులు కుమార్తె పుట్టినది. ఈమెను నేను పుత్రుడుగా పెంచుచున్నాను. నీవుదయయుంచి ఈమెకు కల్గిన కుమారుని నాకు పుత్రుడుగా నియ్యవలెను. ఇదే నీ వీమె కియ్యవలసిన శుల్కము' అని చెప్పుటతో అట్లి చ్చుట కర్జును డంగీకరించెను. అతనికి కావలసినది కన్యకాని కుమారుడు కాడు. అందుచే అతడు తేలికగా నంగీకరించెను.

ఒక్క సుముహూర్తమున చిత్రాంగ దార్జునులకు వివాహము జరిగినది. అర్జును డక్కడింట నున్నాడు.

ఒకనాడు అర్జునుడు బ్రాహ్మణులతో కూడి ఆ సము ద్రతీరమునమున్న తీర్థములను సేవించుటకై బయల్దేరి సౌభద్ర తీర్థమున కేగెను. అక్కడ అయిదుచెరువు లున్నవి. వానికి 'పంచతీర్థము' అని పేరు. అతడు వానిలో స్నానము చేయుటకై నడిక్కట్టను. అంతలో అక్కడివారు 'వీనిలో దిగ కలదు. వీటిలో నూరేండ్లనుండి క్రూరమైన మొస ళ్లున్నవి. అవి యాత్రికులను చంపుచున్నవి' అని చెప్పిరి. అత డది విని నవ్వి 'తీర్థయాత్రలుచేయుటకై బయల్దేరి, పంచతీర్థములలో స్నానముచేయ జంకి వెనుకకు మరలుట మగతనమా ?' అనుచు లోనికి దిగెను. అతడు కదపుటలో నీరు కదిలినది. అందున్న మొసలి వచ్చి అర్జునుని కాలు పట్టినది. అతడు దానిని సునాయాసముగా పైకి పారవేసెను.

వెంటనే అదొక దివ్య స్త్రీయై నిలిచెను. అర్జును డాశ్చర్యముతో 'నీ వెవరవు ? ఇంతకాలమువరకు నీవు మొసలి వేల యైతివి ? ఇప్ప డిట్లేల స్త్రీ వైతివి ? నీ పేరేమి?' అని యడిగెను.

ఆమె 'నేను 'వంద' యను నప్సరసను. కుబేరుని ప్రియురాలను. నా చెలికత్తెలు 'సౌరభేయి, సమీచి, బుద్బుద లత' అను నల్గురు నీ తీర్థములలో మొసళ్లుగా నున్నారు. వారికికూడ శాపవిమోచనము చేయు'మన్నది. అర్జునుడు 'వారికి శాప మేల వచ్చెనో చెప్పు' మన్నాడు. ఆమె యిట్లు చెప్పసాగినది:

'మేమైదుగురము లోకసంచారము చేయుచు భూలో కమునకు వచ్చితిమి. అక్కడ ఒకవనములో తపస్సు చేసికొను చున్న మునిని చూచితిమి. మా కాతనితపస్సునకు విఘ్నము చేయబుద్ధి వేసినది' అందరము నతనిముందు ఆడితిమి, పాడితిమి, పరిహాసములు చేసితిమి. అతడేమియు చలింపలేదు సరికదా మాయాటనవలన అతనికి కోపమురాగా మమ్ము మొసళ్లు కమ్మని శపించెను. మేము అప్పుడు చేతులుజోడించి మా తప్పు క్షమించుమని ఆ మునిని వేడితిమి. అతడు ఎట్టకేలకు దయ తలచి 'మీరు పట్టుకొనగా మిమ్మెవడు బయట పారవేయునో అతడే మీకు శాపమోక్షము చేయును' అని అనుగ్రహించెను.

ఆదే పది వేలని మేము అట్టి మహాపరాక్రమవంతు డెవడు, ఎప్పుడు వచ్చునో అనుకొనుచు విచారముతో వచ్చు చుండగా, మాకు దారిలో నారదమహర్షి కనబడినాడు. మే మతనికి నమస్కరించి మా అవస్థ చెప్పితిమి. అతడు మాపై దయచూపి 'మీరు విచారింపకుడు. బ్రాహ్మణశాపము నెవ డును మరలింపలేడు. మీరు దక్షిణసముద్రతీరమున కేగి అక్కడి పంచతీర్థములలో నుండుడు. ఒక నందయేండ్లకు భరతకులములో పుట్టిన అర్జునుడు వచ్చి మీకు శాపమోక్షము కల్గజేయును' అని చెప్పి వెళ్ళెను. మేము అప్పటినుండి మొన్న టి పాడుజన్మము తప్పునా? అని వేయిదేవతలకు మ్రొక్కుచు నీకై యెదురుచూచుచుంటిమి. నేటికి నీ దయవలన నేను బయటపడితిని. తక్కినవారిని కూడ బయటపడవేసి రక్షించుము' అని చెప్పి నమస్కరించినది.

అర్జునుడు తనమూలముగా వానందించుటయే పరమార్థముగా తలచి, తక్కిన నాల్గుచెరువులలోను దిగి నల్గురికికూడ శాపమోక్షము చేసెను. వారానందించి, అతనికి నమస్కరించి దేవలోకమునకు వెళ్లిపోయిరి. అదిమొదలా తీర్థములకు 'నారీతీర్థము' అనిపేరు వచ్చినది

అర్జునుడు మణిపూరు పురమునకు వచ్చి భార్యతో కొన్నాళ్లు సుఖముగా కాలము గడపెను. అక్కడ చిత్రాంగద గర్భవతియై పుత్రుని కన్నది. అతనికి 'బభ్రువాహను'డని పేరుపెట్టి, వానిని చిత్రవాహనునకు వంశము నిల్పుటకై యిచ్చి, భార్యాపుత్రుల నక్కడనే వదలి, తాను తీర్థయాత్రలకు బయలుదేరెను.

అక్కడినుండి గోకర్ణక్షేత్రము సేవించి, పడమర సముద్రతీరమునయున్న ప్రభాసతీర్థమును సేవించెను. అక్కడికి ద్వారకానగరము దగ్గరలో నున్నదని విని అర్జునుడు సుభద్రయందు అదివరకే ప్రేమకలిగియుండుటచే ఆమెను చూచుటకును, తనకు మిత్రుడైన శ్రీకృష్ణుని చూచుటకును ద్వారక కేగదలచెను. యాదవులకు యతులన్నచో గౌరవము హెచ్చు. అందుచే అర్జునుడుకూడ యతివేషము ధరించెను. తన కోరికె నెరవేర్చుటకై కృష్ణుని దలచెను. శ్రీకృష్ణుడు భక్తజనరక్షకుడు కనుక వెంటనే అర్జునునిముందు ప్రత్యక్షమయ్యెను. ఇద్దరును జన్మాంతరమున నరనారాయణులు కనుక ఆ సహవాసమువలన కొంతసేపు సల్లాపము లాడుకొనిరి.

మరునా డుదయముననే కృష్ణుడు అర్జును నక్కడనే యుండుమని తాను ద్వారకకేగి రైవతకోత్సవము జరుగునని చాటింపు వేయించెను. రైవతకమనగా ఆనగరమునకు దగ్గరలోని పర్వతము. దానిపై జరుగు ఉత్సవము రైవతకోత్సవము. ఊరిలోని వారలెల్లరును సంతోషముతో ఉత్సవములకు వచ్చిరి. రుక్మిణీ సత్యభామలతో కృష్ణుడును వచ్చెను. కృష్ణుడర్జునునితో కలిసి ఆకొండపై తిరుగుచుండగా సుభద్రవచ్చి యతి యనుకొని అర్జునునకు నమస్కరించి వెళ్లినది. అతడామెయే సుభద్రయని నిశ్చయించుకొని ఆమెయందమునకు చాల ఆశ్చర్యపడి, ఆమెకేసి తదేక దృష్టిగా చూచెను. కృష్ణుడది కనిపెట్టినాడు. 'యతులకు కన్నెలపై దృష్టి పడరాదు' అని వేళాకోళము చేసినాడు. వెంటనే అతడే ననుకొనునో యని 'ఊరక యంటినిలే. నేను నిభావము తెలిసికొంటిని. నా తల్లిదండ్రులకు చెప్పి నీ కోరిక సఫలము చేయుదు' నని, అర్జును డక్కడ నున్నట్లు ధర్మరాజునకు తెల్పుటకై ఇంద్రప్రస్థమునకు చారులను పంపెను.

అంతట బలరామాది యాదవు లచ్చటికి వచ్చిరి. అర్జునుడు నిజమైన యతియే అనుకొని పాదములకు నమస్కారములు చేసిరి. ఆ వర్షాకాలమం దక్కడనే యుండి చాతుర్మాస్య వ్రతము నెరవేర్చుకొమ్మని ప్రార్థించిరి. అర్జును డంగీకరించెను. అతనిని ద్వారకకు తీసికొనివెళ్ళి కన్యాంతఃపురమున నివాస మేర్పరచి సుభద్ర నాతనికి పరిచర్యలు చేయుటకై పురమాయించిరి. ఆమె భక్తితో ఆ యతిని సేవించుచున్నది. కృష్ణుడు రుక్మిణీ సత్యభామలతో 'ఆ యతి

మన అర్జునుడు, సుభద్రకోసమని వేషము వేసినాడు. అవ
సరము వచ్చినపుడు మీ రతనిని కనిపెట్టియుండు' డని
చెప్పెను.

సుభద్ర సేవ నానాటికి హెచ్చుచుండెను. అర్జునుడు
కూడ సుభద్రను సేవించుచుండెను. ఆమె నెంతసేపు చూచి
నను తనివితీరక అన్నము మాని యైన చూచుచుండెను. ఆమె
రూపము నే ధ్యానించుచు, అదే జపించుచుండెను. అదివరల
నామెయు అర్జునుని రూపమును వినియున్నందున అతడే
అర్జునుడేమో అని మధ్యమధ్య ఆమె కనుమానము కల్గినది.
కాని మనిసిబోలిన మనిసి యుండునుకదా యని సర్దుకొన్నది.

ఒకనాడామె యతితో 'అయ్యా! మీరు తీర్థయా
త్రలు సేవించినారు. ఇంద్రప్రస్థమున కేగితిరా? అర్జునుడు
మా బావ. తీర్థముల కేగినట్లు వింటిని. మీ కెక్కడను కన్పడ
లేదు కదా!' అని యడిగినది. అతడుండబట్టలేక 'తరుణీ!
నేనే అర్జునుడను, నీకై యిక్కడ తపస్సుచేయుచున్నాను.
జాగేల? నన్ను గాంధర్వ విధిని పెండ్లాడుము' అనెను. ఆమె
పెద్ద లున్నారు! వారే పెండ్లిచేయుదురు. అంత తొందరేల!'
అని సిగ్గుతో నివారించి, అంతఃపురమున కామె వెడలి పోయి
నది. ఆమె వెళ్లినట్లు తెలిసికొని కృష్ణుడు రుక్మిణీదేవిని అర్జు
నునకు భోజనాది సదుపాయముల తీర్చుట కేర్పాటుచేసెను.

అంతటితో ఏమగును? పెండ్లి కావలెను. బలరాము
డొక్కడే ఆ పెండ్లి కంగీకరించనివాడు. అందుచే కృష్ణుడు
దేవకీ వసుదేవాదుల కావిషయము చెప్పి రహస్యముగా
వారినిమాత్ర మక్కడ ఉండుమని బలరామాదులను శివ

పూజోత్సవములు నెపముపెట్టి రైవతక పర్వతమునకు పంపెను.

ద్వారకలో పెండ్లి వేడుక సిద్ధమైనది. అర్జునుడు తలచగానే ఇంద్రుడు దేవతాగణములతో వచ్చెను. సుభద్ర తరఫున శ్రీకృష్ణుడు, యాదవులును వచ్చిరి. మహోత్సవముగా వివాహము జరిగినది. కృష్ణుడు అర్జునుని కౌగిలించుకొని ఆదరించి అతనికి అక్షయతూణీరములు, విల్లు ఉన్న బంగారు రథము నిచ్చి, దానినెక్కి సుభద్రను తీసికొనిపొమ్మని తాను బలరామాదు లున్నచోటికి కేగెను.

అర్జునుడు సుభద్రను తీసికొని రథముపై వెళ్లుచుండగా నగరరక్షకు లడ్డగించిరి. వారి నందరిని అర్జునుడు చావగొట్టెను. వారు పారిపోయి బలరామాదులతో చెప్పుకొనిరి. బలరాముడు సభచేసి 'అర్జును డంత దొంగవేషమువేసి ఇట్లు చేయునా? మనమంత చేతకానివారమా?' అని, కృష్ణునితో 'నీ ప్రోత్సాహము లేకుండ, నీకు తెలియకుండ అర్జును డారీతిగా చేయలేడు; చేసియుండడు' అనుటతో కృష్ణుడు 'అదేమన్నమాట? నా కేమియు తెలియదు. అతడు తన మేనమరదలిని తీసికొని పోవుటకు నాకెందుకు చెప్పవలెను? అందుకు తగాదా? కాక మనకు లొంగుటకు అత డంత చేతకానివాడు కాడు. మన కెందుకు? ఊరకుండుడు, అని చెప్పెను. అతనిమాటలు వారు విన కేమి చేయుదురు?

అర్జునుడు సుభద్రను తోడుకొని తనకు తోడుగా నిచ్చిన కొందరు యాదవవీరులతో ఇంద్రప్రస్థపుర ప్రాంతమున కేగి విశ్రమించి సుభద్రతో 'మనమిద్దరము నొక్క-

సారిగా వెళ్లినచో ద్రౌపది యేమైనను అనునేమో? ఆమె అన్న స్త్రీగును కాన నీవు ముందుగా వెళ్లు'మని పంపెను. ఆమె కొంతపరివారముతో ముందుగా ఇంద్రప్రస్థములోకి వచ్చి ద్రౌపదికి నమస్కరించినది. ఆమె 'నీభర్త ప్రతిపక్ష వీరులను జయించువాడగును. నీవు వీరమాత వగుము'ని దీవించినది. కుంతీదేవికిని మ్రొక్కినది. ఆమెయు దీవించినది. తర్వాత అర్జునుడును పురము ప్రవేశించి అన్నలకు నమస్కరించి తమ్ములను కౌగిలించుకొనెను.

అంతలో శ్రీకృష్ణుడు బలరామ ప్రముఖ యాదవులతో కలిసి చెల్లెలికి అరణమునిచ్చుటకై వచ్చెను. వారు వచ్చుచున్నట్లు తెలిసి ధర్మరాజు వారి కెదురు సన్నాహము చేయించి మర్యాదలుచేసి పూజించెను. శ్రీకృష్ణుడు చెల్లెలికి, బావకు తక్కిన బంధువర్గమునకును తగినరీతిగా కానుకలు సమర్పించెను. పాండవు లిచ్చిన కానుకల నందుకొని బలరామాదులు ద్వారక కేగిరి. కృష్ణుడొక్కడే అర్జునునితో ప్రొద్దు పుచ్చుచు ఇంద్రప్రస్థమున నుండెను.

సుభద్రకు అభిమన్యుడు పుట్టినాడు. పుత్రోదయమైననాడు ధర్మరాజెన్నో దానములు చేసెను. తరువాత ద్రౌపదికి - పంచపాండవులకును క్రమముగా ప్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేను' లను ఉపపాండవు లైదుగురు పుట్టి పెరుగుచుండిరి.

అంతట వేసవికాలము వచ్చినది. తాపము హెచ్చుగానున్నది. అర్జునుడు వేడికి తాళలేక కృష్ణునితో 'మన మీ వేసవికాలమున యమునానదీ ప్రాంతముననున్న అడవి కేగి

వేటాడుచు, అక్కడనున్న సరస్సులసమీపమునుండి వచ్చుగాలి సేవించుచు విహరింత'మనెను. అత డంగీకరింపగా ఇద్దరును వెళ్ళి విహరించుచుండిరి.

ఒకనాడు వారిద్దరును ఖాండవవనసమీపమున మంచి గంధపుచెట్టు క్రిందనున్న చంద్రకాంతవేదికపై కూర్చుండి చల్లగాలి సేవించుచు ఇష్టాగోష్ఠి సేయుచుండిరి. అంతలో అగ్నిహోత్రుడు అలసి - సొలసి బ్రాహ్మణరూపమున వారి వద్దకు వచ్చెను. వా రాతని పూజించిరి. అతడు 'నేను తిండి పోతును. నాకు కడుపునిండుగా తిండిపెట్టినచో సంతోషింతును' అనెను. వారు 'నీకేమితిండి కావలెనో కోరుకొ'మ్మనిరి. అప్పుడతడు నేనగ్నిని నాకు శ్వేతకి యనురాజు నూరేండ్లు చేసిన యజ్ఞము కారణముగా అజీర్ణము కలిగినది. ఈ ఖాండవ వనమును తగులబెట్టినచో నారోగము తగ్గును. ఇంద్రుడు, తక్షకుడను నాగేంద్రుడు తనకు స్నేహితుడై దీనిలో నున్నందున దీనిని అమృతమువలె రక్షించుచుండును. మీరు శస్త్రాస్త్రవేత్తలుకాన నాపని నిర్విఘ్నముగా కొనసాగునట్లు చూడుడు' అని కోరెను. అర్జునుడు 'అయ్యా! నీవుకోరినట్లు చేయుటకు శక్తికలదు. కాని దానికి తగిన ధనుర్బాణములు, రథమును నాకులేవు. తగినఆయుధము లితనికి లేవు. అవియిచ్చినచో ఇంద్రుడడ్డువచ్చినను లెక్కసేయము' అనెను. అప్పు డగ్నిహోత్రుడు వరుణుని తలచి, అతనికి సోముడిచ్చిన బ్రహ్మనిర్మితమైన ధనుస్సు, అక్షయతూణీరములు, గంధర్వాజములైన గుర్రములుపూన్చిన రథమును తీసికొని అర్జునునకు ఇప్పించెను. చక్రమును, గదను కృష్ణునకిప్పించెను. వాటిని

తీసికొని కృష్ణార్జునులు సంతోషించి అగ్ని దేవుని 'నీపని నీవు చేసికొను'మనిరి. అగ్ని తన తేజోరూపమును ధరించి ఖాండవ మును దహింప నారంభించెను.

అగ్ని తనంతట తానువచ్చి మండించునప్పుడు కాలని దే ముండును? పచ్చి వెచ్చి అను భేదములేకుండ అన్నియు తగులబడుచుండెను. పక్షులు మృగము లెన్నో తగులబడినవి. మధ్యలో మయుడనువాడువచ్చి శరణువేడగా అర్జును డాతని వదలెను.

దేవతలు వెళ్లి దేవేంద్రునితో ఖాండవము తగులబడు చున్నదని చెప్పిరి. అతడు మేఘములను పంపించి అగ్నిని చల్లార్పుటకై అడవిపై కురిపించెను. అర్జునుడు బాణములను పంజరముగా వేసి ఒక్క నీటిచుక్కయైనను క్రిందకు పడ కుండ చేసెను.

ఖాండవవనము ఘోరముగా తగులబడుచున్నది. అందులోని పశుపక్ష్యాదులు బయల్పడనేరక కాలిపోవు చున్నవి. తక్షకుని కొడుకైన అశ్వసేనుడు తల్లిచే తనతోకను నోట కరిపించుకొని పారిపోవుచుండగా అర్జునుడు అశ్వ సేనుని తోకతోపాటుగా అతని తల్లితలగూడ నూడవేసెను. అశ్వసేనుని చంపబోగా ఇంద్రుడు మోహినీవిద్యచే అర్జు నున కతడు కన్పడకుండ చేసెను. తక్షకుడు వారితోపాటు బయటికి రానందున లోపలనే తగులబడెనేమో యని భయ పడి యింద్రుడు అర్జునునిపై ఘోరమైన బాణములతో ఆకా శమును కప్పి మేఘములను ప్రయోగించెను. అర్జునుడు మారు తాస్త్రముతో వాటినన్నిటిని పారద్రోలెను.

కృష్ణునిమీదికి దేవతాసేనలు కవియబడినవి. ఇటున్న వారు ఇద్దరు; అటు చాలమంది ఉన్నారు. అగుగాక! వీ రిద్దరు వారందరిని పికాపికలగునట్లు బాణములచేతను, చక్రముతోను మోదుచుండిరి. దాని కా దేవతాసేన లాగ లేకపోయినవి.

అప్పు డాకాశవాణి 'దేవేంద్రా! నీవు మరచితివేమో కాని, వీ రిద్దరును నరనారాయణు లను మహాత్ములు. మహా తపశ్శక్తిసంపన్నులు. వీరి కెవరు నెదురు నిల్వ లేరు. నీ మిత్రుడైన తక్షకుడు సుఖముగా నున్నాడు. వాని కై బెంగ పడకుము. ఈ వనము తగులబడు నని బ్రహ్మ చెప్పినాడు. అది ఆపుట నీ వశము కాదు. వృథాగా ప్రయత్నించకుము' అని చెప్పినది. దానితో ఇంద్రుడు వెనుకకు మరలెను.

నముచి యను రాక్షసుని తమ్ముడైన మయుడు తక్షకునియింటిలో తిరుగుచు పారిపోవుటకు వీలులేక విచారించు చుండగా కృష్ణు డతని చంపబోయెను. అతను అర్జునుని శరణుకోరెను. అతడు అభయ మిచ్చి కృష్ణుని ఒప్పించి మయుని రక్షించెను. మందపాలు డను మహాత్మ్ముడు సంతానము లేకుండ తపస్సుచేసినను ఉత్తమలోకములకు రానీయనందున ఖాండవవనములో నున్న పిచ్చుకను పెండ్లిచేసికొని, దానివలన శీఘ్రముగా సంతానమును పొందెను. అవి నాలుగు పిల్లలున్నవి. ఖాండవము దగ్ధమగుచున్నదని తెలిసికొని ఆముని అగ్నిహోత్రుని తనపిల్లలను రక్షింపుమని ప్రార్థించెను. ఆని కూడ స్తోత్రములతో అగ్నిని ప్రార్థింపగా దయదలచి వాటిని వదలివేసెను. ఇట్లు ఖాండవదహనమున అశ్వసేనుడు,

మయుడు, మందపాలుని పుత్రులు శార్ఙ్గకులు నల్గురును మొత్త మార్గురే రక్షింపబడిరి. అగ్నిహోత్రుడు తృప్తిగా ఆవనమును తగులబెట్టి కృష్ణార్జునులను దీవించి వెళ్లిపోయెను. అప్పు డింద్రుడు రాగా కృష్ణార్జును లాతనికి మ్రొక్కిరి. ఇంద్రుడు వారిని కౌగిలించుకొని, అర్జునునకు ఆగ్నేయ, వారుణ, వాయవ్యాది దివ్యబాణముల నిచ్చి కృష్ణుని ఇతనికి తోడుగా నెప్పుడు నుండుమని ప్రార్థించి వెళ్లిపోయెను.

కృష్ణార్జునులు మయునితో కూడ ఇంద్రప్రస్థమునకు వచ్చిరి. ధర్మరాజు జరిగినది విని వారి నెంతో ప్రశంసించెను. మయుడు 'నా ప్రాణరక్షణ చేసినందులకు బదులుగా నేమి చేయుగునో సెలవిండు. నేను రాక్షసులకు విశ్వకర్మను. శిల్ప కళాకుశలుడను' అనివిన్నవించుకొనెను. అర్జునుడు కృష్ణుని మొగము కేసి చూచెను. అతడాలోచించి 'ధర్మరాజున కానం దము కల్గునట్లును, భూలోకములోనివారికి వింతగా నుండు నట్లును, మణిమాణిక్యములతో ప్రకాశించెడి ఒకచక్కని సభను నిర్మింపు'మని యాజ్ఞాపించెను. మయుడు 'భూలోక ములో కాదు, దేవలోకమునకూడసాటిలేని రీతిగా నిర్మింతును పూర్వము వృషపర్వునికి నిర్మించుటకై రత్నమయములైన పరికరములను సంగ్రహించిబిందుసరస్సులో దాచియుంచితిని, వాటితో నిర్మించి తెత్తును' అని అప్పటి కప్పుడు తనవద్ద నున్న ఒకగదను భీమునకు, దేవదత్త మను శంఖమును అర్జు నకు నిచ్చి, వారివద్ద సెలవుతీసికొని తాను ఈశాన్యదిక్కుగా పోయి కైలాసమున కుత్తరముగా మైనాకపర్వతము మీదను నున్న హిరణ్యశృంగమున కేగి, అక్కడ తాననుకున్న సభను

పదునాల్గు నెలలో నిర్మించి, ఎనిమిదివేలమంది రాక్షసులచే మోయించుకొని వచ్చి ధర్మరాజున కిచ్చెను. అదే మయసభ.

ధర్మరాజు నారదుడు, మిత్రులు, మంత్రులు చెప్పిన మాటలపై పితృప్రీతిగా రాజసూయముచేయ దలపెట్టెను. దానికి ముందుగా మహాబలశాలియైన జరాసంధుని కృష్ణ భీమార్జునులు వెళ్లి, భీము డతని చంపగా మిగిలినవారిని తక్కినవారు చావమోది జయించుకొని వచ్చిరి. తర్వాత ధర్మరాజు నల్గురు తమ్ముళ్లను నాలుగు దిక్కులకు పంపెను.

అందులో అర్జునుడు ఉత్తరదిక్కున కేగెను. పుళింద రాజగు ప్రతివింధ్యు నోడించి, ఆ పరిసరములలో నున్న మండలేశ్వరుల నెందరినో జయించి ప్రాగ్జ్యోతిషముపైకి దండెత్తెను. దానికి రాజైన భగదత్తుడు అర్జును నెదుర్కొ నెను. వారి కెనిమిదిరోజులు ఘోరయుద్ధము జరిగినది. చిట్ట చివరకు భగదత్తుడు జంకి, అర్జునునకు నమస్కరించి, 'నేను ఇంద్రునకు స్నేహితుడను; నీవు ఇంద్రుని కొడుకవు. నీతో యుద్ధముచేయుట మంచిదికాదు. నే నోడితిని. నీ వేది చేయు మన్న నది చేయుదును' అని కోరగా అర్జునుడు 'నా అన్న గారు రాజసూయము చేయుచున్నారు. దానికి నీవు కప్పము కట్టుము' అనుటతో నతడు యథాశక్తిగా అతనికి కప్పము కట్టెను. దానిని తీసికొని, కులూత దేశాధిపతియైన బృహంతు నోడించెను. ఉత్తర కులూత, వామదేవ, మోదాపుర, సుదామ, సంకులము లను దేశములను జయించెను. దేవ ప్రస్థ రాజైన సేనాబిందు నోడించెను. విష్వగశ్వుని జయించెను. పార్వతేయుల గర్వము తగ్గించెను. మరియు బర్బర,

శబర, తురుష్క, మాళవ, పౌండ్ర, కాశ్మీర, త్రిగర్త, లోహిత, సుశర్మ, గాంధార, కాంభోజ, కోసల రాజులను జయించెను. సింహపురమును జయించి వనచరదస్యులను స్వాధీనము చేసికొనెను. శ్వేతపర్వతముదాటి కాంభోజ కటకరాజు చేయు పూజలనందికొని హాటకదేశములో నున్న మానససరస్సును, ఋషికుల్యమును చూచెను. అక్కడి రాజులు బహూకరింపగా రంగు రంగుల గుఱ్ఱములను స్వీకరించి హరివాసమను పురముపైకి దండెత్తెను.

ఆ నగరద్వారపాలకులు అతనినిచూచి ఆశ్చర్యపడిరి. చేతులుమోడ్చి 'అయ్యా! నీవెవరవో అమానుషుడవు. ఎప్పుడైన ఇక్కడివరకు రాగలిగిన రాజు లున్నారా?వీటిని ఉత్తర కురుభూములందురు. నీకేమికావలెనో చెప్పుము. చేయుదుము' అనిరి. అది విని అర్జునుడు 'మాఅన్న ధర్మరాజు రాజసూయ యాగము చేయుచున్నాడు. ఆ ఉత్సవమునకు మీ వద్దనున్న వస్తు వేదైననిండు' అని కోరెను. వారు అమూల్యములైన రత్నాంబరములను తెచ్చి యిచ్చిరి. అర్జును డాయా రాజులు తెచ్చియిచ్చిన కానుకలను, కప్పములను స్వీకరించి ఆ ధన రాసులను తెచ్చి ధర్మరాజున కర్పించెను. అపరిమితమైన ధనము తెచ్చుటచే అతడు 'ధనంజయుడు' అను బిరుద నామము వహించెను.

ధర్మరాజు రాజసూయము పూర్తియైన తర్వాత అతని సంపత్తిచూచియు, మయసభలో తనకు జరిగిన అవమానమును సహింపలేకయు దుర్యోధనుడు తండ్రితో ఆలోచించి ధర్మరాజును సుహృద్ద్యూతమునకు రమ్మని

మాయజూదమున నోడించెను మొదటిసారి ఓడినను ద్రౌపది కిచ్చిన రాజ్యము ననుభవించిరి. వెంటనే అనుద్యూతమున కాహ్వానించి దుర్యోధనుడు ధర్మరాజు నోడించెను. అప్పుడు వనవాసమున కేగునప్పుడు అర్జునుడు ఇసుకచల్లుచు వెళ్లెనట. దాని యుద్దేశ్యము ఇసుకకంటె ఎక్కువగా బాణములువేసి శత్రువుల సంహరింతునని. యట ఈ విషయమును విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పుటచే తెలిసినది.

వనవాసము పదుమూడు నెలలైనది. భీమునకది సహింపరానిదిగా నుండెను. ఒకనాడు ద్రౌపది ధర్మరాజుతో తన కష్టమును చెప్పుకొనగా, భీము డామె మాటలను బలపరచెను. ధర్మరాజాలోచనలో దిట్టరికాన భీముని శాంతపరచి 'భీష్మ ద్రోణులు అస్త్రవిద్యారహస్యముల నెరిగినవారు. వారిని గెల్వదగినప్పుడుకాని మనకు జయము దొరకదు' అనుచుండగా కార్యసిద్ధివలె వ్యాసమహర్షి వచ్చెను. అతనికి ప్రత్యుత్థానాభివాదనములు సేసిరి అతడు ధర్మరాజునకు రహస్యముగా 'ప్రతిస్మృతి' యను విద్య నుపదేశించి దీని నర్జున కుపదేశింపుము. అతడు ఈశ్వరునిగూర్చి తపము చేసినచో అస్త్రము పొందగలడు' అని చెప్పి వెడలెను.

వ్యాసుని వాక్యానుసారము ధర్మరాజు ద్వైతవనము నుండి కామ్యకవనమునకు బసమార్చి అక్కడ అర్జునునితో రహస్యముగా 'నీవు వెళ్ళి ఇంద్రుని ప్రీతిపొందించుము. అతని దయవలన శైవమంత్రమును పొంది శివు నారాధింపుము. అతడు నీ కస్త్రమిచ్చును. వాటివలన మనకు శత్రువిజయము కలుగగలదు' అని చెప్పెను. అర్జునుడు మహోత్సాహముతో

స్వస్తి వాచనపూర్వకముగా ధనుర్బాణములను తీసికొని ఈశాన్యమూలగా ప్రయాణమై హిమాలయ, గంధమాదన పర్వతములను దాటి ఇంద్రకీలపర్వతము నెక్కెను. అక్కడ అతనికి 'నీ వికముందు కేగవలదు' అనుమాటలు వినవచ్చినవి. అత డామాటలపై లక్ష్యముంచి అక్కడనే ఆగి యొక్క చెట్టు క్రింద విశ్రమించెను.

ఆ ప్రక్కనే ఒకచెట్టునెదుట ఒకముసలి బ్రాహ్మణు డున్నాడు. అతని ముఖమున బ్రహ్మవర్చస్సు తాండవ మాడుచున్నది. చాల చిక్కి [illegible]క్కబక్కనై యున్నాడు. అతడు అర్జునునిచూచి 'నాయనా! నీ వెవరవు? ఎక్కడనుండి వచ్చితివి? మంచి తేజోవంతుడవే! నీ విక్కడుండుట యెందుకు గాని, నేను సిద్ధిపొందినవాడనే. నీకు కోరికలిత్తును. తీసికొనుము. ఇది శాంతమైన తపశ్శాలురకు స్థానమైనది కాని, కత్తులు-కటారులు విల్లు-బాణములు పుచ్చుకొన్న నీవంటి క్షత్రియులకు నిలువదగినది కాదు. ఇక్కడ ఆయుధముల ధరించి యుండరాదు. వాటిని వదలిపెట్టుము' అని చెప్పెను. అర్జునుడు ధీరుడుకాన ఆమాటలకు జంకలేదు. అతని ధైర్యమునకు మెచ్చుకొని ఆ బ్రాహ్మణుడు ఇంద్రుడుగా మారినాడు.

అతడు పరీక్షచేయుటకై వచ్చిన యింద్రుడే. అర్జునునితో 'నీకు కావలసిన వరము లిచ్చెదను కోరుకొను' మనెను. అతడు 'నాకు దివ్యాస్త్రములు కావలెను' అని కోరెను. ఇంద్రుడు 'పుణ్యలోకములు, దేవత్వము, ఇంకను వేటినైన కోరుకొ'మ్మనెను. అర్జునుడు 'మేము శత్రువులచే

పరాజయింప బడితిమి. వారిని జయించుటకై నాకు దివ్యా
స్త్రములే కావలెను కాని, దేవత్వము నా కేటికి? నా సోదరు
లందరు నడవిలో కుములుచుండ నే నొక్కడను స్వర్గ
సౌఖ్యము లనుభవించినచో నన్ను లోకులు మెత్తురా!' అను
టతో మెచ్చుకొని ఇంద్రుడు 'అట్లయినచో నీవు ఈశ్వరుని
గూర్చి ఘోరమైన నియమములతో తపస్సు చేయుము.
అతడు నీకు అస్త్రములను ప్రసాదింపగలడు' అని చెప్పి అంత
ర్థాన మయ్యెను.

అర్జునుడు దానినే తపోవనముగా చేసికొని యోగము
ద్వారా పరమేశ్వరుని గూర్చి తపస్సు చేయుచుండెను. మనో
వాక్కాయములను నియమములో నుంచుకొని మూడేసి
రోజు లుపవాసము చేయుచు ఒక నెల తపస్సుచేసెను. ఆరేసి
రోజులకు తినుచు రెండవనెల, పక్షముపవాసముతో మూడవ
నెల, చేతులు పైకెత్తి, ఒక్కకాలి బొటనవ్రేలు నేలమోపి
గాలియే ఆహారముగా నాల్గవనెల తపస్సుచేసెను

అతని తపస్సు- నియమములు చూచుసరికి మహర్షుల
కాశ్చర్యము వేసినది. వారీశ్వరునివద్దకేగి 'దేవా! అర్జునుడు
చేతులెత్తి ఘోరముగా తపస్సు చేయుచున్నాడు. ఆ తపో
గ్నిజ్వాలలనుండి పొగలు బయల్దేరినవి. తమ రాతని కరుణించి
ఆ మంటల తగ్గింపు'డని విన్నవించిరి. పరమేశ్వరుడు నవ్వుచు
'అతని కోరిక నే నెరుగుదును. అతని కోరిక నెరవేర్తును.
మీరువెళ్లి తపస్సులు చేసికొనుడు' అని చెప్పి పంపెను.

పరమేశ్వరుడు సంతసించినాడు. కాని యింకను చిన్న
పరీక్ష యున్నది. దానిలో నెగ్గినగాని అస్త్రప్రదానము చేయ

రాదు కాబోలు!

పరమేశ్వరుడు కిరాతవేషము ధరించినాడు. మెడలో పూసలు వేసికొని చేతిలో విల్లు పుచ్చుకొన్నాడు. పార్వతి భర్తవలెనే ఎరుకసానియైనది. ప్రమథు లందరును ఎరుక లైరి. వారి భార్యలు ఎరుకవనితలైరి. ఎరుకరాజు వెనుక నందరును బయల్దేరిరి. ఎరుకరాజు వేటకై ఆ వనమును ప్రవేశించినాడు. శివుని యాజ్ఞచే మూకాసురుడు అడవిపంది రూపము ధరించి అర్జునుని పైకి ఘోరరూపమున వెళ్లు చుండెను. దానిని చూచి అర్జునుడు విల్లెక్కుపెట్టి కొట్టబోవు చుండగా వెనుకనుండి ఎరుకరాజు 'అది నాపంది; దానిని కొట్టకుము' అని కేకలువేసెను. అర్జునుడు వాటిని లక్ష్య పెట్టక పందిని బాణముతో కొట్టెను. అటునుండి యెరుక రాజు బాణము వేసెను. ఇద్దరి బాణములు రెండు ప్రక్కల లోను తగిలి ఆ పంది కవ్వమువలె తిరిగి అర్చి చచ్చినది. ఆ రూపము విడిచి మూకాసురు డంతర్ధాన మయ్యెను.

అప్పు డెరుకరాజు కొన్నివేల ఎరుక వనితలతో నిలువగా అర్జునుడు 'నీ వెవడవు? స్త్రీలతోకూడి వేటాడ వచ్చితివే? నే వేసినపందిని కొట్టి వేటధర్మము నేల పాటింప లేదు?' అనుటతో, అతడు 'నవ్వుచు 'మాటలు సరిగా రా నిమ్ము. అది నాపంది. నా పందిని నేను కొట్టితిని. నా దెబ్బతో చచ్చిన పందిని సిగ్గులేక నీదని చెప్పుకొనుచున్నావే! మూర్ఖునివలె లేని పరాక్రమము చెప్పుకొనుచున్నావు. మాటలు నాముందు పనికిరావు. మగవాడవైనచో విల్లె త్తుము' అని అర్జునునిపై బాణము వేసెను.

అర్జునునికి కోపము వచ్చినది. బాణవర్షము కురి పించినాడు. ఎరుకరాజు వర్షము కురిసినప్పుడు కొండవలె చలింపక దానిని సహించెను. అది చూచి అర్జును డాశ్చర్య పోయెను. 'నా బాణములను సహించుచున్నా డితడు ఎవడో మారురూపము ధరించిన దేవుడై యుండును. నా బాణము లన్నియు, అవివేకియందు ప్రయోగించిన సుభా షితములవలె వ్యర్థము లగుచున్నవి' అనుకొని, అట్లయి నను ధైర్యము వీడక పిడుగులవంటి బాణముల నాతని పైకి వేసెను. అంతలో అక్షయతూణీరములలో బాణము లయిపోయినవి. అర్జునుని కాశ్చర్యము మరింతైనది. అయినను అతడు ధైర్యము వహించి, గాండీవమెత్తి ఎరుక రాజుపై వేసెను. అది మాయమైనది. కోపము మరింత హెచ్చి పార్థుడు కత్తినెత్తి ఎరుకనెత్తిపై కొట్టెను. అది వృథాయైనది. ఇంకను చెట్లను-రాళ్ళను ఎరుకపైకి వేసెను. అవన్నియు ఎరుకను చేరగానే మాయమైనవి.

అప్పు డర్జునుడు ద్వంద్వయుద్ధమునకు దిగెను. ప్రమథు లెల్లరు నర్జునుని ధైర్యసాహసములకు మెచ్చుకొనుచుండిరి. కొంతసేపు పోరగా శివునిచేతి నలుగుడు తాళలేక అర్జునుడు మూర్ఛపోయెను. అంతట అర్జునుని ధైర్యసాహసములకు మెచ్చి, శివుడు ప్రత్యక్షమయ్యెను. 'అర్జునా! నీతపస్సునకు, నీ క్షత్రియధైర్య సాహసములకును మెచ్చితిని. నీకు సాటిరాజు లీపృథివిలోలేరు. జగత్తునంతను నీవే జయింతువు. నాస్వరూపమును చూడు' మని అతనికి దివ్యదృష్టినిచ్చెను. అర్జునుడు ఈశ్వరుని దివ్య స్వరూపము చూచి పొగడెను.

మరియు 'దేవా! నేను తెలియక నిన్నెన్నో తిట్టితిని. నీతో యుద్ధముచేసితిని. అది మన్నింపుము' అని వేడుకొనెను. శివుడు అతని చేయిపట్టుకొని 'నీవు చేసిన పొరపాటును క్షమించితిని. నీబల మతిమానుషము. నీవు పూర్వజన్మమున నరుడను ఋషివి. కనుకనే నాతో యుద్ధము చేయగలిగితివి. నీవిల్లు-బాణములు నివిగో. వెసి తీసికొమ్ము. నీయిష్టమేదో కోరుకొనుమ'నెను. అర్జునుడు 'ప్రభూ! దయదలచి నాకు పాశుపతాస్త్రము నిమ్మని ప్రార్థించెను.

శివుడు కరుణించి అర్జునునకు మంత్ర, ధ్యాన, జప హోమ పూర్వకముగా సంధాన మోక్షణోపసంహారములతో సహా పాశుపతాస్త్రము నుపదేశించి 'వత్సా! దీని కసాధ్యమైనది జగత్తులో లేదు. అల్పులపై దీనిని ప్రయోగించినచో ఇది లోకములను తగులబెట్టును. దీనివలన నీవు లోకములను జయింపగలవు' అని చెప్పి అంతర్ధానమయ్యెను.

అంతట అతనిచేతిలో కోటిసూర్యులవలె వెలుగుచున్న అస్త్రమును చూచి దేవదానవులు కంపమొందిరి. అంతలో లోకపాలకు లక్కడికి వచ్చిరి. యముడు 'నీవు నీ శత్రువుల నందరిని జయింతువు. నీకు గొప్పకీర్తి వచ్చున'ని అతనికి దండము నుపదేశించెను. వరుణుడు వారుణపాశముల నిచ్చెను. కుబేరుడు కుబేరాస్త్ర మిచ్చెను. ఇంద్రుడు వచ్చి సంతోషముతో అర్జునుని కౌగిలించుకొని 'నీవు దేవదానవులను జయింపగలవు. నీకు అస్త్రము నిచ్చెదను. నేను పంపెడి రథముపై స్వర్గమునకు రమ్ము' అని వెళ్ళిపోయెను.

అంతలో మాతలి (ఇంద్రుని రథసారథి) రథమును తీసికొనివచ్చి 'అర్జునా! నీకు శివునిశరీరము తగులుటచే దేవత్వము వచ్చినది. నీ వీ రథము నెక్కవచ్చును. నీకై యింద్రుడు నిరీక్షించుచుండును రమ్ము' అని రథముపై నెక్కించుకొని అమరావతి కేగెను.

అక్కడ ఇంద్రుడు అర్జునున కెదురుగా వచ్చి యెంతో మర్యాదచేసి తన సింహాసనముపై కూర్చుండబెట్టుకొనెను. దేవతలందరును ఒకమానవమాత్రున కంతమర్యాదచేయుటయే మా యని ఆశ్చర్యపడుచు అతని కేసి చూచుచుండిరి. అప్పుడు రోమశు డను ముని వచ్చి యింద్రునితో 'ఇదేమి? మానవుని నీ సింహాసనముపై కూర్చుండబెట్టుకొను చుంటి వేమి?' అనగా, ఇంద్రుడు 'ఇతడు నరు డను మహర్షి. ఇప్పుడు భూమిలో జన్మించినాడు. మహాతపఃపరాక్రమసంపన్నుడు. ఇతడు దానవులను జయించి దేవకార్యమును చక్కపరచును' అని, 'తమరు వెళ్ళి పాండవులతో నిత డిక్కడున్నట్లు చెప్పి వారికి ఆత్రము కల్గకుండునట్లు చేయుడు' అని పంపెను. ఆ మహర్షి వచ్చి పాండవుల కా విషయమును చెప్పెను. అప్పటికి మానవమానమ ప్రకారము అయిదుసంవత్సరముల కాలము గడచినది. అక్కడ అప్సరసలనాట్యముతో సాయంకాలమైనది. అర్జునుడు ఇంద్రుడు విడిపెచ్చిన భవనమున పరుండెను.

అప్పుడు ఊర్వశియను అప్సరస దేవేంద్రు నాజ్ఞప్రకారము చక్కగా సింగారించుకొని వెన్నెలవలె పల్చనైన కోక కట్టుకొన్నది. కస్తూరి కలిపిన మంచిగంధము పూసికొన్నది.

పరిమళించెడి పువ్వులను కొప్పులో ముడుచుకొన్నది. తనకు కూడ అర్జునుని కలియవలెనని కోరిక హెచ్చగా వచ్చి, మెరుపు తీగవలె అర్జునుని యెదుట తళుక్కుమన్నది. అర్జును డామెను చూడగానే 'తల్లీ! ఇక్కడి కేల వచ్చితివి? ఏమి సెలవు?' అనుటతో, ఆమె 'నీగుణగణములు విని, నీపై ప్రేమకుదురగా ఎప్పుడు నిన్ను కలియుదునా అని యువ్విళ్ళూరుచుందును. నేటికి నాఅదృష్టవశాత్తు నాకు కన్పడితి వనుకొనుచుండగా 'తల్లీ!' అని వంకరమాటలాడుట నీవంటిసరసునకు న్యాయమేనా? ఈలోకములో స్త్రీపురుషులు యథేచ్ఛముగా విహరింతురు. ఇక్కడ వావివరుసలు లేవు. నీవిక్కడికి వచ్చుటతో దివ్యపురుషుడవైతివి. నన్ను కరుణింపుము' అన్నది.

అర్జునుని కామెమాటలతో ధైర్య మేమాత్రమును తగ్గలేదు. అతడు నిర్వికారుడై 'హరిహరీ! ఎంతమాటలాడితివి? ధర్మమునకు ద్రోహమువచ్చునట్లు పల్కకుము. సృష్టిస్థితిలయకారకులైన దేవతల కెట్లుచేసినను చెల్లునుకాని, నాబోటి మానవుడుమాత్రము ధర్మవిరోధము జరుపరాదు. ఇచ్చటి యాచారము నాకు పాటింపజెల్లదు. నీవు మావంశీయుడగు పురూరవునికి భార్యవగుటచేతను, ఇంద్రునికి సేవకురాలవగుటచేతను నాకుతల్లివరుసలోనిదాన వైతివి. కావున తల్లీ! నన్ను కరుణింపుము' అని ప్రార్థించెను. ఆమె కామాటలు శూలములవలె నైనవి. కోపముతో కన్ను లెర్ర జేసికొన్నది. నేను కోరిరాగా నాకోరికను విఫలముచేసితివి కాన, నీవు నపుంసకుడవై స్త్రీలమధ్య నివసింతువుగాక!' అని శపించి తన యింటి కేగినది. అంతట తెల్లవారినది.

జరిగినదంతయు విన్నాడు ఇంద్రుడు. అర్జునుని ఇంద్రియనిగ్రహమున కెంతో ఆశ్చర్యపడినాడు. సభలోనికి వచ్చిన అర్జునుని మర్యాదలతో గౌరవించి 'జరిగినది విన్నాను. ఆ శాపము నీకు వరమునంటిదే. అజ్ఞాతవాస సంవత్సరమున నీవు నపుంసకుడవై స్త్రీలకు నాట్యము నేర్పు దువు. ఆ రీతిగా అప్పుడు నీ కది ఉపయోగించును' అని మర్యాదలుచేసి తాను గురువై అర్జునునకు సకల దివ్యాస్త్ర ములను ప్రయోగోప సంహారములను, నివర్తన, ప్రాయశ్చిత్త, ప్రతిఘాతములను నేర్పెను. తర్వాత గురుదక్షిణగా సముద్ర మధ్యలో దాగియున్న నివాతకవచు లను మూడుకోట్ల రాక్ష సులను చంపు మనెను. అర్జును డంగీకరించెను. ఇంద్రుడు తన దివ్యభూషణములను, కిరీటమును, అభేద్యకవచమునిచ్చి గాండీ వమునకు నారి తానే తొడిగి, పదివేలగుర్రములు కట్టిన రథము నిచ్చి మాతలిని రథసారథిగా నియోగించి, రాక్షససంహా రము చేయుమని పంపెను.

అర్జును డా రథ మెక్కి బయలుదేరి సముద్రతీరమును చేరెను. సముద్రమధ్యలో నున్న రాక్షసుల పట్టణమును చేరెను. ఆ పురద్వారముదరి కేగి శంఖమును పూరించెను. ఆధ్వని విని ఎవడో కాలముమూడి తనవద్దకు వచ్చెనని రాక్షసులు మదముతో ఆయుధముల చేతపూని యుద్ధమునకు వచ్చిరి. అర్జునుడు వారిపై పడేసి బాణములు వేసెను. వారు రథము ముందునకు కదలకుండ అడ్డగించిరి. మాతలి రథమును తోలలేకపోయెను. అప్పుడు విజయుడు తానే రథము నడుపు కొనుచు వారిని బాణములతో ముంచెత్తెను. వారు మాయల

నుపయోగించబోగా నన్నిటికిని ప్రత్యస్త్రముల నుపయోగించి వానిని నిష్క్రియములుగా చేసెను. వారందరును విశ్వేషముగా చచ్చిరి.

తరువాత మాతలి తెప్పిరిగి రథమును తోలగా. ఆ పట్టణమును ప్రవేశించి అర్జునుడు ఆ నగరశోభను చూచి, మాతలితో 'ఇంత అందమైన పట్టణమును వదలి ఇంద్రుడు అమరావతిలో నుండ నేల?' అని ప్రశ్నింపగా. అతడు 'తాను దాచుకొనుటకే ఇంద్రుడు దీనిని నిర్మించుకొనెను. కాని రాక్షసులు బలవంతులై దీని నాక్రమించుకొనిరి. ఇప్పుడు నీవు వీరలను జయింపగలవా?' అని పలికి అతనియనుమతి రథమును ముందుకు తోలెను.

దారిలో ఒక తపోవనము సుందరమైన పట్టణము కన్పడగా అర్జునుడు 'ఏ దేమి పట్టణ'మని మాతలి నడిగెను. అతడు 'ఇక్కడ 'పులోమ, కాలక' అను రాక్షసస్త్రీలు కొన్నివేలయేండ్లు తపస్సుచేసి బ్రహ్మను మెప్పించిరి. ఈ బంగారుపట్టణములో నున్నంతకాలము రాక్షసులు దేవతల చేత అవధ్యులగుదురని వరముపొందిరి. ఇది హిరణ్యపురము. ఇందు పౌలోమ, కాలకేయులను రాక్షసు లుందురు' అని చెప్పుటతో అర్జునుడు 'వారిపనికూడ పట్టిపోదము' అనగా మాతలి రథమును ఆ యూరిదగ్గరకు తోలెను

ఆ రథపుచప్పుడు వినగానే రాక్షసులు గర్వముతో నతనిపైకి యుద్ధమునకై వచ్చిరి. అర్జునుడు వారిపైకి బాణములువేసెను. వారు పట్టణముతోసహా పైకెగిరిరి. కాని అర్జు

మరెంత కష్టమగునని, అర్జునుడు వారిపైకి పాశుపతాస్త్రము ప్రయోగించెను. ఆమంత్రప్రభావమువలన సింహశార్దూలాది క్రూరమృగములుపుట్టి వారినందరిని చంపినవి. అట్లు వారి నందరినిచంపి, ఇంద్రుని చేరి మ్రొక్కెను. అతడర్జునుని గౌర వించి 'నీవు దేవకార్యమును నిర్వహించితివి. నీకై నీసోదరులు నిరీక్షించుచున్నారు. నీ వేగి వారల కానందముకల్గజేయు'మని రథముపై నాతని ధర్మరాజాదు లున్నచోటికి పంపెను. ఇన్నాళ్ళకు వచ్చిన అర్జునునిచూచి వా రెంతో ఆనందించిరి. అర్జునుడు అన్నలకు మ్రొక్కి తమ్ములను కౌగిలించుకొని, భార్యకు మిగిలినవారికి హితవుగా తాను అస్త్రమును, విజయ మును సాధించినరీతిని వర్ణించెను. అది విని వారు జయము చేతికివచ్చినట్లే సంతోషించిరి. అర్జునుని విజయవృత్తాంత మును విని ధృతరాష్ట్రుడు మిక్కిలి విచారించెను. పదునూ డేండ్లు గడచుటతో తమవారికి బాధ తప్పదని అత డను కొనెను.

పాండవులు ఆ మంత్రాస్త్రముల ప్రభావము చూపుమని కోరగా అర్జునుడు సకలమంత్రములను ప్రయోగించి ఉపసం హారము చేయుచుండెను. అప్పుడు నారదుడు వచ్చి 'ఇవి ప్రత్యక్ష దేవతాకములైన మంత్రములు. వీటిని ఎదుట నెవ రును లేనప్పుడు ప్రయోగించరాదు. వీటితో వినోదము చేయుట మంచిదికాదు'అని చెప్పుటతో అర్జునుడు వాటి నుప సంహరించుకొనెను. ఇంక మిగిలినవాటిని ప్రయోగింపలేదు.

వనవాసము కొన్నాళ్ళైనది. పాండవుల నేడ్పించుటకై దుర్యోధనుడు తమ్ములు, భార్యలతోసహా వచ్చి అడవిలో

విడిదివిగెను. ఆవిషయము తెలిసి ఇంద్రుడు అతనిని పరివారముతో కట్టితెమ్మని చిత్రసేనుని సేనతో పంపెను. అతడు వచ్చి కౌరవవీరులను చావగొట్టి దుర్యోధనుని పెడరెక్కలు విరిచికట్టి తీసికొనిపోవుచుండెను. దుర్యోధనుని భటులు వచ్చి ధర్మరాజువద్ద మొరపెట్టుకొనిరి. అతడు తమ్ముల నాజ్ఞాపించెను. అర్జునుడు 'నేను తప్పక విడిపింతు'నని ప్రతిజ్ఞపట్టి బయలుదేరెను. భీమాదులును వెడలిరి.

అర్జునుడు గంధర్వసేనకడ్డువెళ్లి ముందుగా 'మాఅన్న ధర్మరాజు దుర్యోధనుని విడువుమనున్నారు' అనెను. చిత్రసేనుడు 'మీఅన్న మాకు ప్రభువు కాడు. మా ప్రభువు ఇంద్రుడు. అతడు చెప్పినట్లు చేయుచున్నా'మనెను. మీరు మెత్తనిమాటలకు లొంగరని యెరుగుదును. ఇకకాచికొనుడు' అని, వారిమీందికి బాణములనుగుప్పుచుండెను. వారుపైకిపోబోవగా బాణములతో పంజరమువలె కట్టెను. వారందరునుదానిలో చిక్కుకొనిరి. అట్లయినను అర్జునాదులపై బాణములు వేయుచుండగా అర్జును డస్త్రప్రయోగముచేసి వారిని బాధించెను. అప్పుడు చిత్రసేనుడు అర్జునున కెదురుగా స్నేహపూర్వకముగా నిలబడెను. అర్జునుడుకూడ యుద్ధము మానివేసెను. చిత్రసేనుడు 'ఇంద్రుడు మిమ్ములను బాధించుటకై వచ్చిన కౌరవులదుర్వర్తనము విని వారిని కట్టి తెమ్మని మమ్ము పంపెను. ఇది మీకు మంచిదే కదా!' అనగా, అర్జునుడు 'అది కాదు, మాలో మే మెట్లైనను అన్నదమ్ములమే. ఇది మా అన్నగారి ఆజ్ఞ. నీవు వచ్చి మా అన్నకు చెప్పి వెళ్లుము' అనెను. చిత్రసేనుడు దుర్యోధన

కట్లతో తీసికొనివచ్చి ధర్మరాజు ముందర పారవేసెను. ధర్మరాజు చిత్రసేనుని బ్రతిమాలి పంపి, దుర్యోధనుని మందలించి పంపెను. ఆనాడు అర్జునుడుకాక మరెవరు గంధర్వులను పారద్రోలగలరు?

కొన్నాళ్ల తరువాత సైంధవుడు అడవికి వచ్చి ద్రౌపదిని చూచి వలచి, పాండవులు లేని సమయమున ఆమె యెంత చెప్పినను వినక బలాత్కారముగా రథముపై కెక్కించుకొని పోవుచుండెను. అది తెలిసి పాండవు లైదుగురును వెళ్లిరి. వారినిచూచి అతడు ద్రౌపదిని విడిచి పారిపోవుచుండగా, అర్జునుడు ద్రౌపదిని తీసికొనిధర్మరాజును వెళ్లుమని, తాను భీముడును సైంధవుని వెన్నాడిరి. అతనితో కొందరు రాజు లుండిరి. వారిని చంపి అర్జునుడు పీనుగు - పెంటలుచేసి, సైంధవుడు పారిపోవుట తెలిసికొనెను. అతని వెనుదరిమి రథపుగుర్రములను చంపగా సైంధవుడు క్రిందికి దిగి పరుగెత్తబోయెను. అతనిని భీముడు పట్టుకొని ముక్కునోట నెత్తురు కాల్వలయి పారునట్లు కొట్టెను. అప్పుడర్జునుడు 'అన్నా! ధర్మజునిమాట మరువకుము. సైంధవుని చంపినచో మన చెల్లెలు (ధృతరాష్ట్రుని కూతురు) దుస్సల విధవ యగు' నని హెచ్చరించెను. అట్టిసమయమునకూడ కార్యమంతయు తనవలన నెరవేరినను గర్వము లేక, అన్న మాట కెదురాడని నిగర్వి, ప్రతిజ్ఞానిర్వాహణధురంధరుడు నర్జునుడు. భీమునికి నితనికి కల భేదమే యిది. ఆ రీతిగా వనవాసము పూర్తియైనది.

— ౦ —

# నకులు - సహదేవులు

## అర్జునుడు

అజ్ఞాతవాస సంవత్సరము వచ్చినది. దీని నెట్లు గడచుటా యని పాండవులందరును ఒక్కచోటకలిసి వారువారు చేయవలసిన పనులను నిర్ణయించుకొనిరి. అం దర్జునుడు 'నాకు అదృష్టవశాత్తు ఒకటి కలిసివచ్చినది. స్వర్గమునకు నేను వెళ్లినపుడు నన్ను ఊర్వశి శపించగా ఇంద్రు డాశాపమును అజ్ఞాతవాస సంవత్సరములో అనుభవింపుమనెను. అట్లే నేను రవిక తొడిగికొని, చేతులకు శంఖాలకంకణాలు పెట్టుకొని విరాటు నొద్ద కేగి 'అంతఃపురకన్యలకు నృత్యము నేర్పుదు'నని అతని కొలువున చేరెదను. నృత్యముచేసిచూపి అతని మెప్పింతును. అప్పుడు నాపేరు 'బృహన్నల' అని యుండును' అనిచెప్పెను.

అందరును విరాటనగరమునకు బయలుదేరిరి. ఊరి వెలుపలకు వెళ్ళగానే వారికి ఆయుధములతో వెళ్ళినచో అనవాలు దొరకవచ్చునని వాటి నొకచోట భద్రముగ దాచ బుద్ధివేసినది. అక్కడ శ్మశానములో ఒకజమ్మిచెట్టుండగా ఆయుధములను కట్టకట్టి దానికొమ్మకు వ్రేలాడదీసిరి. ధర్మరాజే వాటిని చెట్టుకొమ్మకు గట్టుచు, వాటి కధిష్ఠానదేవతలకు నమస్కరించి 'అయ్యా! నాకు, అర్జునునకు తప్ప మరెవరు వచ్చినను మీరు కనబడరాదు. విషముగ్రక్కెడు క్రూరసర్పములవలె కనబడు' మని వేడెను. అర్జునునకు గాండీవము ఎక్కడించునప్పు డెంతో విచారము కల్గినది. దేవదానవయుద్ధ

ములలో అవ్యాహతముగా నుపయోగించిన దివ్యధనుస్సును కట్టి పెట్టవలసివచ్చెగదా యని యతడు విచారించెను. ఆ కట్టపై అక్కడ చచ్చిపడియున్న పశువు చర్మమును సహదేవునిచే ఒలిపించి వాటిపై కప్పించెను. మరియు, అక్కడనే అనాథ ప్రేతగా చచ్చిపడియున్న ఒకమానవుని శవముండగా దానిని కూడ ఆయుధములకట్టపై పెట్టించెను. ఇట్లు మహాబలశాలురైనపాండవులు విధివశమున ఆయుధములను విడిచి మారు రూపములతో విరాటునికొలువు చేరవలసివచ్చినది. అర్జునునంతటివానికి నపుంసకుడుగా నుండవలసివచ్చినది. హా హతవిధీ! నీ వెంత చేయగలవు!

యక్షునిఅనుగ్రహమువలన పాండవులకు వారివేషములకు తగినరూపములు వచ్చినవి. కాళ్లకు కడియములు, చేతులకు శంఖములు, మెడలో రవికె, శరీరకాంతి కన్పడకుండ మెడలో బంగారు పట్టెడ, ముఖమున కడ్డుగా ముంగురులు, చెవులకు పగడాలకమ్మలు ధరించి మంచుగప్పిన సూర్యునివలెను, నివురుగప్పిన నిప్పువలెను అర్జునుడు పేడివేషము ధరించి విరాటునొద్దకు వచ్చెను. ఎంత ఆడుదానిగా కన్పడదలచినను నడకమాత్రమే వచ్చినదికాని, అతనిలో ఏదో చెప్పరాని గొప్పతనము కన్పడుచున్నది. అతనిరీతి చూచి విరటుడు 'ఇతడు పై కాడుదానివలె నున్నను మహానుభావుడువలె దోచుచున్నది. ఎవరో జగత్పూజ్యుడు విలాసముగా నిట్లాడురూపమును ధరించి యుండవచ్చును' అని ప్రక్కవారితో పలికి అతనినేమనవలెనో తోచక ఊరకుండెను.

అప్పు డర్జునుడే (ఇంతనుండి బృహన్నలయనియే వ్యవహరింతము) 'రాజా! నిన్ను సేవింపవచ్చితిని. నేను కన్యకలకు నాట్యము నేర్పగలను. నాపేరు బృహన్నల' అనగా విరటుడు 'ఆహా! నీశరీరసౌష్ఠవమునకు వ్యతిరేకముగా భగవానుడు నిన్ను పేడిగా జేసెనా? నీకు నారాజ్యమిచ్చి గౌరవించవలెనని నే ననుకొనుచుండ, నీవు విరుద్ధముగా మాట్లాడుచుంటివే' అనెను. ఆమాటలకు బదులుగా 'రాజా! నిజముగా చూచినచో నా కాడుదనము లేదు. పుంస్త్వము వాసి తప్పియున్నది. నపుంసకజన్మము అవశ్యభోగ్యమై పురాకృతకర్మవశమున వచ్చిపడినది. కర్మ ననుభవింపక తప్పునా? మరొకపనులకు సెలవులేనందున చిన్నతనమునుండి వాదిత్రములు వాయించుట, గీతములు పాడుట, నాట్యముచేయుట నేర్చితిని. ఇంతవరకు నాట్యాచార్యుడనై జీవితము గడపితిని' అనుటతో అం దేమియు మాయ-మర్మములు లేకుండుటచే విరటు డతనిసేవ నంగీకరించెను. తనకూతురైన ఉత్తరను రప్పించెను. ఆమెను ముద్దాడి బృహన్నల కామెచే కర్పూరతాంబూల మిప్పించి, చీనిచీనాంబరములు బహూకరింప జేసి, బృహన్నలా! నీవు చాల నేర్పరివి. నీకు నే నీమె నప్పగింప నవసరములేదు. కాని నా కీమెపై నున్న గారాబముచే ఇట్లు చెప్పుచుంటిని. ఈమె యింతవరకు యథేచ్ఛగా తిరిగినది. ఈమెకు శిక్షణలేదు. కాని అదలించక, బెదరించక క్రమముగా ఆటలనుండి చనువుగా దానికి బుద్ధి మరలునట్లు చేయుము' అని ఆమె చేతి నతనిచేతిలో నుంచెను. ఆమెకు 'ఇతడు నీగురువు. నీ వితడు చెప్పినట్లు

నడచుకొనవలెను సుమా!' అని బుద్ధిచెప్పెను. రాజనుజ్ఞ నిచ్చుటతో బృహన్నల, ఉత్తరయు లోని కేగిరి.

దక్షిణగోగ్రహణమున విరాటునికి తోడుగా అర్జునుడుతప్ప తక్కిన నల్గురును వెళ్లిరి. ఉత్తరమునం దున్న గోవులను కౌరవసేనలు చుట్టుముట్టి తోలుకొని పోవుచున్నవి. చేతకాని ఆలకాపరులు వారల నడ్డగింపబోయిరి. కౌరవవీరులు వారిని చావమోదిరి. వా రింటికి పరుగెత్తుకొని వచ్చి ఉత్తరుని పొగడి, కౌరవసేనల గెల్చి ఆవులను విడిపింపు మనిరి. అప్పు డతను స్త్రీలమధ్య నున్నాడు. అతనికి పౌరుషము పెరిగినది. 'తగిన సారథి దొరకినచో కౌరవవీరుల నొక్కక్షణములో పార దోలుదు' నన్నాడు. ఆ మాటలు విని సైరంధ్రి అతనిడంబములకు సహించలేకపోయినది. సమయమునకు తమముందునకు వచ్చిన శత్రువులపై పగ దీర్చుకొనుట కదే అద ననుకొన్నది. చరచర వెళ్లి బృహన్నలతో జరిగినసంగతి చెప్పినది. అతడు 'నీవు పోయి 'బృహన్నల మంచిసారథి, నేర్పుకలవాడు. అర్జునునకు ఖాండవదహనాదులలో రథము తోలినవాడు' అని పదిమాటలు చెప్పి వారిని ఒప్పించుము' అని చెప్పి పంపెను. ఆమె వెళ్లి ఉత్తరతో బృహన్నల నేర్పుకలవాడని ఊదినది. ఉత్తర వెళ్లి అన్నగారితో చెప్పినది. అతడు నేనిదే మొదటిసారిగా మహావీరులపైకి పోవుచుండగా చూడకూడని పేడిమొగము వాడా నాకు సారథి. ఆహాహా! ఏమి మాటలు?' అని పరిహాసించెను. సైరంధ్రి 'బృహన్నల రథము నడపినచో ముల్లోకములవా రెత్తివచ్చినను నీ కేమియు భయము లేదు' అని

పల్కెను. అప్పటికి సారథికన్న గతిలేక ఉత్తరుడు ఒప్పు కొనెను.

ఉత్తర వచ్చి నాట్యశాలలో నున్న బృహన్నలతో 'కౌరవులువచ్చి పసువులబట్టిరని వార్తవచ్చినది. నీవు సారథ్యముచేయ నేర్పు కలవని సైరంధ్రి చెప్పగా, నీవద్ద నాకున్న చనవుకొలది నిన్ను తప్పక తీసికొనివత్తునని చెప్పి వచ్చితిని. నాచనవు కాదనక ఒప్పుకొనుమని వేడ్కొనగా పల్కినది. ఆ మాటకునవ్వుచు 'రాజకుమారీ! నాట్యాచార్యుడనైననాకు సారథ్యములో నేర్పున్నదా? కానిమ్ము; నీమాట కాదనలేను. పోదము. ఆపై ఎట్లుజరుగునో దైవమున్నాఁడు. నీవు కోరితివి కనుక సారథ్య మొకటన్నమాటేమిటి? ఎంత దుష్కరమైన పనినైనను సాధించి నీకు మనస్సంతోషము కల్గింతును' అని విలాసముగా మెల్లగ నడచుచు రాజకుమారు డున్నచోటికి వచ్చెను.

బృహన్నలను అంతంతలో చూచి ఉత్తరుడు 'వేగ రమ్ము. నీవు రథసారథ్యము చేయవలెను' అని పిలువగా బృహన్నల 'ఆట - పాటల అవసరమైనప్పుడు నన్నుపిలుచుట న్యాయముకాని, యుద్ధమునకు నన్ను పిలుచుట ఉచితమేనా?' అనుటతో ఉత్తరుడు 'నీవు అర్జునునకు ఖాండవదహనమున సారథ్యముచేసితి వటగా! ఇప్పుడుకూడ ఉత్సాహముగా చేయుము' అని చెప్పుటతో మారుమాటాడ జంకినట్లుగా బృహన్నల ఒప్పుకొనెను. సారథియై కవచము తెప్పించగా బృహన్నల చేతకానట్లు ఆ కవచమును తలక్రిందుగా తొడిగి కొని అక్కడి ఆడువారిని నవ్వించెను. ఉత్తరుడే. అతనికి

కవచము తొడిగి 'ఊ! చప్పున వెళ్ళి రథమునకు గుర్రములను కట్టుము. జెండా యెత్తుము. పోవలెను' అని హెచ్చరించెను. బృహన్నల అట్లేయని మంచివేగముగల గుర్రములనుకట్టి సింహధ్వజము నెత్తెను. అప్పుడు ఉత్తర బృహన్నలతో 'కౌరవ వీరుల గెలిచి, వారికండువాలలో మంచివిచూచి నాబొమ్మలకు తెండు' అన్నది. అతడు 'రాజకుమారుడు విజయము పొందగా నేను బొమ్మగుడ్డలు తేకుందునా? చూడుడు, తప్పక తెత్తును' అని వ్యంగ్యముగా పరిహసించెను. ఆయుధములను రథముపై పెట్టి ఉత్తరుడు కూర్చుండగా రథము నడచెను. పౌరస్త్రీలు వారికి జయసూచకముగా 'ఖాండవదహనమున అర్జునునకైన మంగళము నీసహాయమువలన ఉత్తరున కగు గాక!' అని దీవించుచు అక్షతలు, లాజలు, పుష్పాలు చల్లిరి.

ఇకపై అర్జునుని విజృంభణ మెంతో హృద్యముగా నుండును. దానిని సంక్షేపించినచో రసముతగ్గిపోవునని భయముతో వీలైనంతలో సంగ్రహించి వ్రాయుదును.

రథము కౌరవసేనదరికి వెళ్ళినది. ఉత్తరుడు మహా వీరులసేనను చూచుట కదే మొదటిసారేమో? అతనిగుండె గుభేలుమన్నది. బృహన్నలతో 'నేను బాలుడను. యుద్ధమన్నచో నిట్లుండునని యెరుగను. బ్రతికిబాగున్నచో తర్వాత సంగతి దైవమునకెరుక. రథముమరల్పుము' అనెను. బృహన్నల నవ్వుచు 'మానగోవులను తోలుకొనిపోవుచున్నవారిని గెల్వకుండ వెనుకకు మరల్తుమా? అంతఃపురములోని స్త్రీలు వంటలో మించువాట్లు పల్కితివే. ఇప్పుడు భయపడుదువా?' అను టతో 'బాబా! నాకునోటమాటవచ్చుటలేదు. పశువులమాట

దేవుని కెరుక. ఆడువారిగోల నాకేల? నేను యుద్ధముచేయలేను అనెను. బృహన్నల అంతిమాత్రమున వినునట్టివాడా? ఉత్తరునకు భయము హెచ్చినది. అంతకంతకు సేనలచప్పుడు హెచ్చుగా వినబడజొచ్చినది.

ఉత్తరుడు హడలిపోయి రథముపై ఉండలేక క్రిందికురికి పరుగెత్తసాగెను. అర్జునుడు మహావీరుడుకనుక రథము దిగి వెనుకపరుగున పరుగెత్తి పందఅడుగులలో ఉత్తరుని పట్టుకొని లాగుకొని వచ్చి రథముమీద కూలవేసెను. అతని భయము తగ్గునట్లు మెల్లగా చెప్పి 'నీవు యుద్ధముచేయనక్కరలేదులే. సారథ్యముచేయుచుంటే చాలు. నే నీ వీరులనందరిగెల్చి పశువులను మరల్చెదను' అనెను. అత డందులకును అంగీకరించలేదు. అతనిని నొగలపై (కాడికట్టుపై కూర్చుండబెట్టుకొని జమ్మిచెట్టుదగ్గరకు తోలుకొనువెళ్ళెను.

అతనిని చూచినారు కౌరవులు. ద్రోణుడాతని గుర్తించెను. సమయములోపల వచ్చెనేమో బాధయగునని భీష్మునితో సన్నగాననెను. అతడుకూడ రహస్యముగా ద్రోణునకు మాత్రమే తెలియునట్లు గడువుదాటనదనిచెప్పెను. అప్పుడు ద్రోణుడు మనస్సులో సంతోషించినను పైకి తెలియనియ్యక తనకున్న శిష్యవాత్సల్యము బయటపడునట్లుగా —

'సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటుమైనుండ మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యల్లోభియై వచ్చు నో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరశ్లాఘాభిరామాకృతిన్ ॥

(సింహము ఆకలితో గుహలో నుండగా బయట పసు
గుల గుంపు వెళ్లుచుండగా చూచి కోపముతో వచ్చినట్లు,
వనవాసముచే ఎంతో కష్టపడి ఆకోపమునంతయు తీర్చుకొను
నట్లు అర్జునుడు మనసేనపైకి వచ్చినాడు) ఇతనితో యుద్ధము
చేయుటకు తగినవీరులు మనసేనలో ఉన్నారన్నది సంశ
యము. వారి గోవులను వారికి వదలుట మంచిది. ఇతడు
ఇంద్రునితో మల్లయుద్ధముచేసి నొప్పించినవాడు' అనుటతో
కర్ణున కుగ్రక్రోధావేశము వచ్చినది. వారిలో వారు కోపావేశ
ముతో మాట్లాడుకొనుచున్నారు.

అంతలో రథమును జమ్మిచెట్టువద్ద నాపి ఉత్తరునితో
'అదిగో ఆ కన్పడు పెద్దపిల్లు గాండీవము. అదితప్ప తక్కి
నవి చిన్నవిండ్లు. అపమనబలమునకు చాలవు. దానిని తెమ్ము
నేను' ఉత్తరు షది శవమే అనుకొని 'నన్ను వెళ్ళి శవమును
ముట్టుకొనుమందువా? అది నీకు న్యాయమా!' అనగా అర్జు
నుడు 'అది పిల్లులకట్టగాని శవము కాదు. ఎక్కి తెమ్ము'
అనుటతో మారుపల్కలేక ఉత్తరుడా చెట్టుక్కి గాండీవమును
చూసి 'ఇదేమి!' అని యడుగగా 'అరే! గాండీవము. దీనిని
బ్రహ్మ లక్షయేండ్లు, ప్రజాపతి అరువదినాల్గువేల యేండ్లు,
ఇంద్రుడు ఎనుబది మైదు సంవత్సరములు, సోముడు అయిదు
వందలయేండ్లు, వరుణుడు వందేండ్లు ధరించిరి. వరుణునివద్ద
నుండి అగ్నిహోత్రుడు దీనిని పుచ్చుకొని అర్జునున కిచ్చెను.
అతడు దీనిని అరువదైదేండ్లు ధరింపగలడు' అని దాని
మహాత్మ్యము చెప్పెను.

అప్పు డుత్తరుడు 'అట్లయినచో ఆపాండవు లెక్కడి
కేగినారో? పాపము! నేను వారికి మేనల్లుడనగుదును.నీవెరుగు
దువా?' అనుటతో బృహన్నల 'వారికి దైవవశమున వచ్చిన
ఆపదకై విచారింపకుము. వారు వనవాసము పూర్తిచేసి
కొని ఇప్పుడు మననగరములోనే యున్నారు' అని వారినిజ
రూపములనుచెప్పి తానే అర్జునుడని చెప్పెను. 'నే నంత
మాత్రమున నమ్మను. అర్జునునకున్న పేర్లు చెప్పు'మనెను అర్జు
నుడు చెప్పెను. ఉత్తరుడా పేర్లనీకే కారణమువలన వచ్చెనో
చెప్పు మనెను.

'భూమండలమును జయించి ధనమును తెచ్చుటచే ధనం
జయుడనియు, ఎట్టివారినైన శత్రులను యుద్ధమున జయించెడి
వాడనగుటచే విజయుడనియు, నా రథమునకు తెల్లగుఱ్ఱము
లుండుటచే శ్వేతవాహనుడనియు, ఇంద్రుడు ఇచ్చిన కిరీటము
నాతలపై ప్రకాశించుచుండుటచే కిరీటియనియు, వీరులకు భీభ
త్సము (భయము) కల్గునట్లు తొట్రుపాటులేకుండ రణము
చేయుటచే భీభత్సుడనియు, యుద్ధమున రెండుచేతులతోను
బాణములు వదలుచు, అందును ఎడమచేతితో మిక్కిలిబాగు
గా వేయగల్గుటచే సవ్యసాచియనియు, ఆయనందు తెల్లని
రంగుండుటచే అర్జునుడనియు నందురు. ఖాండవదహనకాల
మున నాకు మెచ్చి దేవతలు 'కృష్ణు'డను పదునొకండవ పే
రిచ్చిరి. ఎన్నో దివ్యాస్త్రములు ఇచ్చిరి. కావున ఈ సేనలను
జయించి ఆవులను మరలింతును'

అని చెప్పుటతో ఉత్తరునికి భయమెగిరిపోయెను ఎంతో
ధైర్యము వచ్చినది. అర్జునునికాళ్ళమీదపడి 'నిన్ను తెలి

యము ఎప్పుడైనా తూలనాడినచో రక్షింపు'మని ప్రార్థించెను. 'నాకు అర్జునునకు సారథ్యము చేయవలెననుకోర్కె యున్నది. ఈ దినాటికి సిద్ధించినది' అని చెప్పి సారథ్యముచేయుచుండెను. జమ్మిచెట్టునకు ప్రదక్షిణముగా రథము పోనిమ్మని అర్జునుడు కవచము తొడగికొని, ఉత్తరుని జెండా చెట్టుపైన ఉంచి తాను ప్రార్థించగానే వచ్చిన కపిధ్వజము నెత్తెను. దానిపై భూతభేతాళము లెన్నోయున్నవి. తలపాగాదికి కిరీటము, చేతి లోనికి శంఖము, చెవులకు కుండలములు వచ్చినవి. శంఖము పూరించెను. ఆ శంఖధ్వనితో దిక్కులు దద్దరిల్లి నవి. రథాశ్వములు ముందునకు బోర్లగిల బడినవి. ఉత్తరుడు ముందునకు పడిపోయెను. అర్జునుడు క్రిందకిదిగి ఉత్త రుని లేవదీసి, గుర్రములను లేపనెత్తి 'ఉత్తరా! రాజకుమా రుడవు కదా! ఎప్పుడును శంఖధ్వనియే వినలేదా? అంత భయ మేల?' అనగా 'అతడు వినకేమి? కాని ఇట్టి ఘోరమైన శంఖముచప్పుడు నెప్పుడును వినలేదు' అనుటతో అతనికి తగినట్లు ధైర్యముచెప్పి తాను మరల శంఖము పట్టెను.

ఆధ్వని, నారిమ్రోత వినుటతో భీష్మద్రోణాదులు అర్జునుడేనని నిశ్చయించిరి. దుర్యోధనుడు 'అర్జునుడే వచ్చుచున్నాడని భయ మందనేల? అతడే వచ్చినచో మరీమంచిది. మరల వనవాస, అజ్ఞాతవాసముల చేయవలసినదే!' అనెను. భీష్ముడు లెక్కించి 'నిన్నటితో పదుమూడేండ్లు నిండినవి. లేకున్న అర్జును డింత తెలివితక్కువగా బయటపడునా?' అని వానినే సమర్థించెను. చివరికి వారిలో వారికి వాక్కలహములు పెరిగిపోయినవి. కర్ణుడు 'ఒక్క అర్జునుడు వచ్చినచో

భయమేమి? ఒక్కరికి ఒక్కడు చాలడా? నేను చాలు' అనెను. 'ఖాండవదహనమున, ద్రౌపదీస్వయంవరమున, రాక్షససంహారమున, గంధర్వులను గెలుచునపుడు ఎందరున్నారు? ఒక్కడే కదా! అది జ్ఞాపకము తెచ్చుకొనుము' అనెను. ఆ మాటకు కౌరవు లూపిరి పీల్చుకొనిరి. ఆఖరునకు భీష్ముడు వారిని ప్రోత్సహించి సర్దుబాటుకు తెచ్చెను.

అర్జునుడు రెండు బాణములు కాళ్ళవద్దను' రెండు చెవుల వద్దను పడునట్లుగా భీష్మ, ద్రోణ, కృపాచార్యులకు వేసెను. అప్పుడు ద్రోణుడు 'ఆహా! ఏమి నైపుణ్యము? నమస్కారసూచకముగా కాళ్ళవద్దను, చిరకాలము చూడనందున కుశల ప్రశ్న వేయుచున్నట్లుగా చెవులవద్దను బాణములేసి వీర మర్యాదను కాపాడినాడు' అని పొగడెను.

సేనదగ్గరగానున్నది. ఆ సేనలో కలియబడినాడు అర్జునుడు. అందులో దుర్యోధనుడు కనబడలేదు. సేనకు చాలముందుగా ఆవులను తోలుకొని వెళ్ళుచున్నాడు. అర్జునుడాతని చూచి 'రథము నావంకకు తోలుము. తక్కిన సేనలతో మనకు పనేమి? అతడు దుర్యోధనుడు. అతని పట్టినచో అంతయు దొరకినట్లే' అని రథమును సేనకు ప్రదక్షిణముగా త్రిప్పించి దుర్యోధనునివాడికి బాణములనేసెను. దేవదత్తము పూరించెను. జెండామీదికోతి గర్జించినది. భూతములు బొబ్బలిడినవి. అవన్నియు నొక్కసారిగా విని కౌరవసేన హాహాకారమొనర్చినది. బాణములతో ఆకాశముకప్పబడి చీకటివ్యాపించినది. ఆవులు తోకలెత్తుకొని పశువులశాలవైపునకు పరుగెత్తసాగినవి. సేన నుండ నష్టపడకుండ అర్జునుడు వారికడ్డముగవచ్చెను. కౌరవు లాగు

వేలథములతో నుండిరి. దుర్యోధనుని కందరును సాయమై నిలిచిరి.

అట్టి పరిస్థితిలో కూడ అర్జునుడు గురువునకు ప్రదక్షిణముగా రథమును పోనిమ్మని ప్రేరేపించెను. ఉత్తరునికి పేరు పేరు వరుసల కౌరవవీరులను చూపి తాను నానాను కర్ణునితో చేయబోవు యుద్ధమున జాగ్రత్తగానుండుమని హెచ్చరించెను. అంతేకాక నాకు దుర్యోధనునితో యుద్ధముకల్గినప్పుడు పందువేయగునని చెప్పి ప్రోత్సహించెను.

అప్పుడు అశ్వత్థామ కర్ణునితో 'నీమాటలు నిలబెట్టుకొనుసమయము వచ్చినది. సిద్ధముగా నుండు'మనెను. కర్ణునికి పౌరుషము వచ్చినది. అందరిని ప్రోత్సహించెను. పెద్దలందరును నడికట్టిరి. అర్జునున కెంతో యుత్సాహముకల్గినది. అందరికి అన్ని రూపులుగా బాణములకు బాణములను వేయుచు కుడి - యెడమ చేతులతో శరవర్షము కురిపించెను. సేనలుమూలల పీనుగుల పెంటలైనవి. సేనను రెండు పాయలుచేసి తానుమధ్య నుండి మహామత్స్యము సముద్రమును కలచునట్లుగా కలచి వైచెను. ఒకసారి అతని కెదురేగవారు మరల వెళ్లుటకు జంకెను. అతడందరికి భయంకరుడై మదపుటేనుగువలె విహరించెను. పాపులెక్కువైనపుడు యముడు పంపిన మహా మారిజనుల గణమున్నట్లుగా అర్జునుడొక్కడే సేనలను హత మార్చెను. చాలమంది హతశేషులు నిరుత్సాహులై పరుగు లెత్తిరి. ప్రొద్దుగ్రుంకినగాని యితడు పోడని భయపడిరి. ఈ యుద్ధమును పైనుండిచూచెడి సిద్ధ విద్యాధరాది దేవతలు ఈ సందడిలో తమ్మేమిచేయునోయని భయపడిరి.

అందరికి నొక్కసారిగా తన బాణములను చవిచూపి కర్ణునితమ్ముని చంపి కర్ణునిపైకి దుమికెను 'ఆహా! ఇదివరకు నాతో సరిలేరని బీరములు పల్కితివే. యుద్ధమువచ్చినది నీ లావుచూపుము. నాడు ద్రౌపదినిచూచి నవ్వినప్పుడు ధర్మరాజే యడ్డమైనె యూరకుంటిని. కాని యిప్పుడు తేలవలెను' అనగా కర్ణుడు 'ఓహో! ఆనాటి చేతకానితనమును అన్నగారిపై వంక పెట్టి తప్పించుకొంటివే మహాబలశాలివి. అరణ్యవాసము చేసి నచో రాజ్యమువచ్చునని ఆశపడినావు. చూడుము కాని నా బలము' అని బాణములేయ నారంభించెను. ఆయిద్దరియుద్ధము నెంతో చూడముచ్చటగా జరిగినది. అతనితరపున నెందరు వచ్చినను పారద్రోలి శరవర్షముగప్పగా కర్ణు డెదుట నిల్వలేక పారిపోయెను. అంతట శంఖమువూరించి అర్జునుడు ఉత్తరునితో ఈ పారిపోవువాడు మహావీరుడు చూచితివికదా యితని ప్రతాపము! ఇక మరొకనిపైకి వెళ్లుదము ద్రోలుము' అనెను.

ఉత్తరుడు వాడలిపోయెను. 'నీ కంతకంతకు బలము హెచ్చుచున్నది కాని, నాకు భయమువేయుచున్నది. నేను పుట్టి యెన్నడును నిట్టియుద్ధము చూడలేదు. కాన నాచేతులు పట్టులుతప్పుచున్నవి' అనగా, అర్జునుడు నవ్వుచు అతనికి ప్రోత్సాహమిచ్చి 'అదిగో ఆ యెఱ్ఱని గుఱ్ఱములరథమున్నదే అతడే ద్రోణుడు, మాగురువు. రాచపుట్టుకపుట్టినందులకు అన్యాయ మవలంబింపవలసివచ్చినది. అతనిమీదికి రథము తోలు' మని మీదికివెళ్లినతర్వాత నమస్కరించి 'ఆచార్యా! చిరకాలము వనవాసదుఃఖము లనుభవించితిమి. ఇప్పటికి బయటపడితిమి. మీరు దయజూడుడు నాపై కోపింపకుడు.

మీరారు ముందుగా నాపై బాణమువేసినగాని నేను వేయుటకు జంకుచున్నాను. కాన, ముందుగా మీరు వేయుడు' అనెను. ద్రోణు డాతని వినయమునకు సంతోషించి ముందుగాతానే ఇరువది బాణములు వేసెను. అర్జునుడు వాటిని మధ్యనే ముక్కలు చేసెను. వారిద్దరును ఘోరముగాపోరిరి. ద్రోణుని బాణములు వరుసగావెళ్లుచుండగా అర్జునుడన్నిటిని ధూళిగా ఎగురగొట్టు చుండెను. ఆ యిద్దరినేర్పుచూచి దేవతలు 'అర్జునున కెదురుగా ద్రోణుడుకాన నిలువబడినాడు; మరెవరు నిలువబడగలరు?' అనుకొనగా కౌరవసేనలోనివారు 'గురున కెదురుగా అర్జునుడు తప్ప మరెవ్వడు నిలువగలడు?' అనుకొనిరి. మధ్యగా అడ్డు వచ్చినవారినందరిని చంపి ద్రోణుని గుర్రములను, సారథిని, జెండాను కొట్టెను. అంతలో కౌరవసేనలు హాహాకారములు చేసిరి.

అశ్వత్థామ అర్జునుని పైకివచ్చి గట్టిగా యుద్ధము చేసెను. కాని చివరకు అమ్ములపొదిలోని బాణము లైపోగా తెల్లపోయెను. అప్పుడు కృపాచార్యుడు మున్నగువారు రాగా వారందరిని తరిమెను. అందరును భీష్మునిచాటున కేగిరి. అర్జునుడు భీష్మునితో కలియబడెను. అతడు చాల ఘోరముగా యుద్ధముచేసెను. కాని మధ్యలో అర్జునుడు తన వింటిని విరగగొట్టగా రెండవవిల్లందుకొనులోపున గుర్రములను, సారథిని చావగొట్టెను. అత డాధారములేక రథ చక్రము చాటున కొదిగెను.

అప్పు డశ్వత్థామ కర్ణునితో 'అదుగో అర్జునుడు మీద పడుచున్నాడు. నీవుతప్ప నెవరును నిలువలేరు. సహింపవలెను.

పారిపోకుము'ని వేళాకోళముచేసెను. అతని కళవళమునకు వచ్చినది. అర్జునునికి సాహసము హెచ్చినది. ఉత్తరుడు ధైర్యము చూచి, 'అయ్యో! నీ కంతకంతకు ధైర్యము హెచ్చుచున్నది. కాని, నాకు దాహము వేయుచున్నది. ఇక నేను రథము నడుపలేను' అనెను. అర్జునుడు 'నే నుండగా నీకు భయమేమిటి? అంతగా అవసరమైనచో నేనే సారథ్యము చేయుదునులే. కొంచెము ఓర్చుకొనుము. ఒక్క దుర్యోధనుడుమాత్రము మిగిలినాడు. అతని కాడికి పోనిమ్ము' అని హెచ్చరించి కవ్వించి దుర్యోధనునిపైకి రథమును తోలించెను.

దుర్యోధను డతని కెదురై నిలిచి కొంచెముసేపు యుద్ధముచేసి తాళలేకపోయెను. ఎందరో అడ్డమువచ్చిరి. కాని వారందరును అర్జునునిదెబ్బ కాగలేకపోయిరి. కర్ణుడు తక్కిన వారితో 'అయ్యో! మన మహారాజును కొట్టుచున్నాడు. అతని రక్షింతము' అనినను వినిపించుకొనక భీష్మాదులు ముందునకేగుచుండిరి. అప్పుడు దుర్యోధనుడు దీనముగా 'అయ్యో! నన్నువిడిచి మీరందరును పోవుచున్నారా?' అని పలవించెను. అదివిని పెద్దలు అతని నూరడించుచు రమ్మని పిలిచిరి. అందరును కలిసి వెనుక ముఖముపట్టి పోవుచుండిరి. అర్జునుడు వారినిచూచి 'ఓ దుర్యోధనా! నీవు నొకరాజువే? నేనొక్కడనే వచ్చితిని. కుంతీపుత్రులలో చిన్నవాడను. నీవు మహాబలశాలివి. యుద్ధమునకు పిల్వగా రాక పారిపోవు చున్నావా? ఇదియు నొక పౌరుషమేనా? యుద్ధములో చచ్చినను స్వర్గమువచ్చును. రమ్ము' అని పిలిచెను.

వారికందరికి ఆపలుకులు బాణములకన్న గాఢముగా తగిలినవి. అందరును పౌరుషమువచ్చి ఒకరి నొకరు ప్రోత్స హించుకొని వెనుదిరిగి అర్జునుని చుట్టుముట్టిరి. అత డందరికి నన్నిరూపులై బాణములేసెను. వారిని చంపుటకు తనఅన్న చేసిన ప్రతిజ్ఞలు తలచుకొని తాను చంపనొల్లక ఒక్కసారిగా దేవేంద్రుడు దేవతగాగల సమ్మోహనాస్త్రమును ప్రయోగించెను. దానితో అందరును ఉన్నవారున్నట్లు వెనుకకు పడిపోయిరి. అర్జును డుత్తరునకు వారినిచూపి 'నీవువెళ్ళివారితల పాగలు తెమ్ము. భీష్ముని వంకకుమాత్రము పోకుము. అతనికి అస్త్రము పట్టియ్యదు' అని పంపెను. ఉత్తరుడు వెళ్లి వారందరి తలపాగలును ప్రోగుచేసి తెచ్చెను. వారు రథమెక్కి కాంపిల్యపురితో వచ్చిరి. అర్జునుడు మరల భీష్మద్రోణులపైకి నమస్కారబాణములేసి ప్రయాణముసాగించెను. అంతట మూర్ఛతెలిసి దుర్యోధనుడు అర్జునుని తరుముద మనెను. భీష్ముడు 'అతడు దయతలచి మనలనువిడచినాడు. తలగుడ్డలు తెలియనివారిని కరుణించినాడు. ఇక పోదము' అని బుద్ధి చెప్పెను. వారిండ్లకుపోయిరి. అర్జునుడు దారిలోవిల్లమ్ములు దాచి బృహన్నలగా పురమున కేగెను.

విరటుడుత్తరుడే గెల్చెననుకొనెను. 'బృహన్నల యుండగా లోటేమి?' అనిన ధర్మరాజును పాచికతో కొట్టెను. అతని మొగముచిట్లి రక్తముకారజొచ్చినది. అది చూచినచో అర్జునుడు కోపించునని ధర్మరాజు అతనికి కన్పడకుండ గుడ్డఅడ్డము పెట్టుకొనెను. తరువాత అర్జునుడు కురువీరుల తలగుడ్డలు ఉత్తరకిచ్చెను.

ఆనాడే అన్నదమ్ములు ద్రౌపదియు రహస్యముగ సమావేశమైరి. ధర్మరాజు జరిగినది చెప్పుటతో అర్జునుడు 'అట్లు తనతర మెరుగని రాజాధముని కొట్టక విడువరా. దనెను. భీముడు ముందే ముక్కోపిగదా! ధర్మరాజు 'వీరిమరుగున బ్రతికి, తెలియకయనినవాని నేమియు చేయరా' దనివారి శాంతింపజేసెను. అంత పాండవులు స్నానముచేసి తెల్లని మడుపులు కట్టుకొని ధర్మరాజు సింహాసనముపై కూర్చుండగా తక్కినవారు కొల్చుచుండిరి. విరటుడువచ్చి యిదేమని యడుగగా, అర్జునుడుతమనిజకథను చెప్పెను. విరటుడువారికి మొక్కి క్షమింపుమనెను. తన చేసినతప్పులు మన్నించుటకు బంధుత్వము కలుపుకొనుటకై ఉత్తరను సింగారింపజేసి తెచ్చి ధర్మరాజుతో 'ఈకన్యను అర్జునున కిచ్చుచుంటిని అంగీకరించు' మనెను. అత డర్జునుని మొగము కేసిచూచెను. అర్జునుడు-ఈమెకు నిన్నటివరకు నేనేచదువుచెప్పి యీనాడు నే నీమెను పెండ్లాడుట న్యాయముకాదు. లోకము నన్ను నిగ్రహములేనివాడని నిందించును. కాన ఈమెను నాకోడలిగా గైకొందును' అని అభిమన్యునకు భార్యగా స్వీకరించి మహోత్సాహముతో పెండ్లి జరిపించెను.

కౌరవులు పాండవులును యుద్ధమేతప్పదని నిశ్చయించుకొని, పెండ్లికి పిలిచినట్లు బంధువులను మిత్రులను పిల్చుకొనుచుండిరి. అదిరాజులలో మామూలు. అందరునుకావలసినవారే యగుటచే ఎవరుముందుపిల్చిన, వారి కేమాట నిచ్చుచుండిరి. దుర్యోధనుడు శ్రీకృష్ణుని పిల్చుటకై స్వయముగా బయల్దేరినాడు. అర్జునుడును వచ్చినాడు. ముందుగా వచ్చినవాడు

దుర్యోధనుడు. కాని అప్పటికి కృష్ణుడు నిద్రపోవుచున్నందున దుర్యోధనుడు తలవైపున నున్న ఉన్నతాసనముపై కూర్చుండెను. అర్జునుడు కాలికడ నిలుచుండెను. కృష్ణుడు లేవగానే ముందుగా అర్జునుని చూచెను. కుశలమడిగెను, తర్వాత దుర్యోధనుని చూచి కుశలమడిగి వచ్చిన పని నడిగెను. వారు యుద్ధ సహాయము కోరి వచ్చితి మనిరి. అపుడు న్యాయముగా 'నిరాయుధుడైన తానొకవంక, సాయుధులైన పదివేలమంది గోపాలురొకవంకను ఉందుము. చిన్నవాడు కాన అర్జునుడే కోరుకొనవలె' ననెను. అర్జునుడు కృష్ణునే కోరెను. దుర్యోధనుడు పదివేలమందిని దొంగిలించినట్లు తలచెను.

కృష్ణుడు అర్జునుని ఉద్దేశ్యము తెలిసికొనదలచి 'పదివేలమందిని కోరుకొనక నన్నెందుకు కోరుకొంటివోయి?' అనగా అతడు 'నాకు యుద్ధములో సాయమక్కరలేదు. కాక మహాబలశాలివి నీవు యుద్ధముచేసినచో పేరు నీకేవచ్చును. మరియు నీ కెదురునిల్చినవారికి జయము రాదు. కనుక విజయము వచ్చెడి నీ సాయముకోరితిని. నేను చిరకాలము నుండియు నీ సారథ్యము కోరుచుందును. కాన నాముద్దు చెల్లింపుము' అని కోరెను. ఆ జవాబునకెంతో సంతోషించి కృష్ణుడు సారథ్యము చేయుట కంగీకరించెను.

సంజయుడు రాయబారమునకు వచ్చినపుడు అందరును తమ తమ యుద్దేశ్యముల జెప్పిరి. వాటినే అతడు ధృతరాష్ట్రునకు చెప్పెను. అందు అర్జును డేమనె నని యడిగిన ధృతరాష్ట్రునితో సంజయుడు 'అర్జునుడు కోపమువచ్చియు అణచుకొని, కనుకొలకుల ఎఱ్ఱనిజీరలు తేరగా నీతో చెప్పుమని

చెప్పినమాట లివి. ధర్మరాజు భాగమడుగగా సుయోధనుడు ఇయ్యనిచో మంచిదే. అత డిదివరలో చేసిన చెడుపనులకు మెరుగుపెట్టినట్లే. మా యుద్ధరంగ యుద్ధమున కొప్పుకొనెనేని నాకు, భీమునికిని పండువగును. వనవాసములో ధర్మరాజు భూమిమీద పరున్న బాధ దుర్యోధను డంపశయ్యపై పరుండ నిచో తప్పునా! ఇన్నాళ్లు లోన అణచినట్టి కోపానలము ఎం డుటడవిపై పడునట్లు పడి మండినగాని ధృతరాష్ట్రునిసుతులు ధర్మరాజును లెక్కసేయరు' అని యింకను వారివారి బల పరాక్రమములు చెప్పి, 'మేము భీష్మ ద్రోణ కృపాచార్యు లకు నమస్కరించి మా రాజ్య భాగమునకై మేము యుద్ధము చేసెదము. వారికింద్రాదులు సహాయులైనను జయముమాదే. ఒకవేళ జయము మాకు లభించనిచో అధర్మమే జయించిన దన్నమాట. తప్పక యుద్ధము జరు గును. అందు జయము తప్పదు. మానేర్చిన దివ్యాస్త్రము లకు పూర్తిగా పనిచెప్పి శాంతింతుము. అందరు వినుచుండగా చెప్పి, వారినిశ్చయము చెప్పను. మే మట్లు నడచెదము. సుయోధనాదులు ఆయుష్మంతు లగుదురుగాక!' అని చెప్పె ననుటతో అది విని భీష్మాదులు సంతోషించిరి. ఆమాట లెంత సమంజసముగానున్నవి.

కృష్ణుడు రాయబారమున కేగుచు అర్జునుని యుద్దేశ్య మడుగగా అతడు 'జరుగగల కార్యము నీవెరుగుదువు. కా వన్న కార్యము లై తీరును. దానికి ప్రయత్నము ముఖ్య కారణము, దైవము సాయము కావలెను. ఆ రెండును నీ వినోదములే! ధర్మరాజునకు ద్రోహముచేసినవాడువధ్యులు.

అదే నీకు మనస్సునకు నాటినది. నీకు నేను చెప్పెడివాఁడనా! అయినను వినుము. ఆ మూర్ఖుల నెట్లయినను ఒప్పించి సంధి చేయుము. నీ కదినచ్చనిచో 'వద్దు ఇటు రండు. ఇట్లు చేయుడు' అని మా కాజ్ఞయిమ్ము. ఏది హితము, ధర్మమో అదే యుపదేశింపుము. నీ వెట్లుచెప్పిన నట్లచేసి నిశ్చితముగా నుండగలము' అనెను. అ వెంతో ధర్మయుక్తములుగా నున్నవి.

భీష్ముడు ఉభయసేనలలోని వీరుల తారతమ్యము లెన్నుచు అర్జునునిగూర్చి 'అత డింతటివాఁడని చెప్పలేము. అంతటివా రెందును ఎవరునులేరు. ఇంక పుట్టరు' అని వర్ణించెను. అది యథార్థము.

యుద్ధమునకు వీరులందరును పెండ్లి కేగునట్లు వెళ్లిరి. అం దర్జునుడు దివ్యరథము, చురుకైన దివ్యాశ్వములు, కపి కేతనములు, అక్షయతూణీరములు, గాండీవము, దివ్య కిరీటములను ధరించి శోభాయమానుడై దేవదత్తమను శంఖ మును పూరించుచు కృష్ణుడు నొగలపై కూర్చుండి సారథ్యముచేయుచుండగా మహోత్సాహముతో వెడలెను.

సన్నద్ధమైన కౌరవసేనను చూచి ధర్మరాజు అర్జును నితో 'కౌరవసేన యెంతఉన్నదో చూచితివా? అందరిలోను ఆ భీష్ముని తాళధ్వజ మదిగో భీకరముగానున్నది. మనమెట్లు చేయగలమో?' అని దీనముగా ననగా. అతడు నవ్వి 'నారదు డిదివరకు చెప్పెను జ్ఞప్తిలేదా? 'అధర్మపరుల సేన లెంత యున్నను ఓడించెదమే' అని. కాక వ్యాసమహర్షి మనకు విజ యము తథ్య మనెనుగదా! నేను, భీముడు నున్నారము. ఇం

కను మనపక్షమున మహావీరు లున్నారు' అని హెచ్చరించుటతో అతడు దైన్యము వీడెను.

ధర్మరాజు మున్నగా పాండవు లందరును గురు భీష్మ కృపులకు నమస్కరించిరి. తరువాత శంఖములు పూరించిరి. ఇక యుద్ధ మారంభమగుననగా అర్జునుడు గాండీవమును ధరించి, బాణము సంధించి ఎదుటికి చూచినాడు. కృష్ణునితో 'ఒక్కసారి రెండుసైన్యములనడుమ రథము పోని'మ్మనెను. కృష్ణు డట్లు చేసెను. అర్జును డందరిని తేరిపార చూచెను. అందరును బంధువులు, మిత్రులు, తాతలు, తండ్రులు, గురువులే. వారిని చంపుట కతనికి చేయాడలేదు. గాండీవము చేతి నుండి జారజొచ్చినది. కాలుసేతులు వణకినవి. కృష్ణునితో 'ఇట్టి బంధువుల నందరిని చంపి నేను పడబోవు సుఖ మేమున్నది? ఎంతపాపము చేయ ప్రయత్నించితిమి? రాజ్యముపై లోభముచే బంధువులనందరిని చంపనగునా? నా వలనగాదు' అని విల్లమ్ములు క్రిందికివదలి రథముపై కూలబడెను. కన్నీరు కార్చుచుండెను. కృష్ణుడదిచూచి 'ఇదేమి తెలివితక్కువ? నీకేల యిట్లు వచ్చినది? లెమ్మ'ని ప్రేరేపించెను. కాని విజయుడు 'పూజ్యులగు భీష్మద్రోణాదులను, ప్రీతిపాత్రులైన దుర్యోధనాదులను చంపి నేనేమి సుఖింతును? ముల్లోకము రాజ్యము నాకు వచ్చినను నేనుమాత్రము యుద్ధముచేయను' అని దిగాలుపడి 'నా కేదో తెలియని బాధ వచ్చుచున్నది. ధర్మమేదో తెలియకున్నది. నీకు శిష్యుడ నగుదును. నన్ను శాసింపుము' అనెను.

శ్రీకృష్ణుడు కలకలనవ్వి 'విచారింపబని లేనివారినిగూర్చి విచారించుచున్నావు. పుట్టుట - చచ్చుట ప్రతిప్రాణికీ ధర్మములు. అవశ్యము జరిగెడివానికై వగవ బనిలేదు. ఆయుధములు శరీరమును ఛేదించునుగాని ఆత్మ నేమియు చేయజాలవు. మానవుడు ప్రాతబట్టలు విడిచి క్రొత్తబట్టలు కట్టుకొనునట్లే ఆత్మ(జీవుడు) ప్రాతదేహమును వదలి క్రొత్త దేహమును ధరించును. ఆ విషయమెరిగినవా డెవడును విచారింపడు. వీరందరును చావు సిద్ధమైనవారే. నీవు నిమిత్తమాత్రమే' అనుచు నతడడిగిన ప్రశ్న లన్నిటికిని చక్కగా ప్రత్యుత్తరము నిచ్చుచు తత్త్వజ్ఞానోపదేశము చేసెను. ఆ యుపదేశమే 'భగవద్గీత' అనుపేర ప్రసిద్ధమైనది. ఇంకను అతని అనుమానము తీరకపోగా కృష్ణుడు విశ్వరూపమును చూపి తన యథార్థస్థితి నాతనికి కనపరచెను. దానితో అర్జునునకు ఆవేశము కల్గినది. అతడు కృష్ణునకు సాష్టాంగ నమస్కారముచేసి ధైర్యముగా యుద్ధముచేయబూనెను.

మొదటినాడు యుద్ధమున అర్జునుడేమంత హెచ్చుగా పోరలేదు. అది చూచి ఆరాత్రి ధర్మరాజు 'అర్జును డేదో మహావీరు డని నమ్మియుండగా యుద్ధమే లేక యూరకున్నవాడు' అని సన్నగా హెచ్చరించెను. రెండవనాడు అర్జునుడు భీష్మునితో కలియబడెను. ఆనాడు భీష్ముడు మెచ్చునట్లుగా పోరెను. మూడవరోజున భీష్ముడు మహాక్రోధ సంరంభములతో పోరగా పాండవసేన లుపికాపికలు కాజొచ్చినవి. అదిచూచి కృష్ణుడు అర్జునునితో 'మనసేనలు పారిపోవుచుండగా చూచి యూరకుందు వేల? భీష్మునితో కలియ

బడుము' అని ప్రోత్సహించెను. అత డట్లేచేసెను. కాని ఆనాడు భీష్ముని దెబ్బ కొగలేకపోయెను. అప్పుడు కృష్ణుడే చక్రము చేపట్టి భీష్ముని చంపివైతునని అమాంతముగా భీష్మునిరథముపై కురికెను. భీష్ముడు తన్ను నరుకమనెను. కాని అర్జునుడు వెనుకనే పరుగెత్తుకొనివెళ్ళి 'కృష్ణా! కోప ముపసంహరింపుము. నీవు చేయిచేసికొనవలదు. నాకు మాట దక్కించుము' అని బతిమాలగా కృష్ణుడు కోపముతగ్గి వెను కకు వచ్చెను. తర్వాత రథమెక్కి అర్జునుడు భీకరముగా యుద్ధముచేసెను. ఆతనిధాటి కాగలేక కౌరవసేనలు పరువు లెత్తిరి.

ఎనిమిదవనాడు ఉలూపికి జనించిన ఇరావంతుడు యుద్ధములో చనిపోయెనని విని అర్జునుడు శోకావేశ ముతో కన్నులనీరునించుకొని యేడువ నారంభించెను. అది చూచి కృష్ణుడు నవ్వెను. తా నిదివరలో చేసిన యుపదేశము నిరర్థక మయ్యెనని. అతనియుద్దేశ్యమును గ్రహించి అర్జునుడు తెలివితెచ్చుకొని 'తెలిసినది. నడువుము వచ్చి యుద్ధము చేయుదును' అని యుద్ధరంగమున కేగి మహోత్సాహముతో పోరెను.

ఆతని ఆనాటి ధాటికి కౌరవులు హడలిపోయిరి. దుర్యోధనుడు భీష్ముని పిలిపించి 'అయ్యా! తమరు సరిగా యుద్ధము చేయుటలేదు. అర్జునునిధాటి కాగలేకపోవుచున్నా' మనగా నతడు 'చెప్పినవింటివా? అర్జునునిపౌరుషము మన మెరుగనిదా? అతనిని గెల్వలేను. శిఖండిని ఎదుర్కొనను. కాని తక్కినవారి నొకకూత కూయింతును' అనెను

ఆనాడు తొమ్మిదవరోజు భీష్ముడు విజృంభించినాడు. అతని కెవరు నెదురు నిలువలేకపోయిరి. కృష్ణుడదిచూచి 'భీష్ముడెట్లు వీరవిహారము సేయుచుండెనో చూచితివా?' అనగా అర్జునుడు చేయునదిలేక విచారముతో దైన్యము వహించెను. అతనిచూచి కృష్ణుడు 'ఆనాడు సంజయునితో డంబములాడితివే. ఈనా డిదేమి? నిన్నుచూచి శత్రువులు నవ్వరా!' అనుటతో పౌరుషము తెచ్చుకొని అర్జునుడు 'భీష్ముని పనిపట్టుదును. రథము నడుపు' మనెను. ఇద్దరును ఘోరముగా పోరిరి. అర్జునుడు భీష్ముని విల్లును నరికెను. అతడు మరి కవిల్లందుకొని అర్జును శరీరము నాటునట్లు బాణములు వేసెను. అవిగాఢముగా నాటినవి. అర్జునుడు సొలసినాడు. భీష్ముని పౌరుషము హెచ్చినది. కృష్ణు డదిగమనించినాడు. తాను రెండవసారిగా భీష్ముని చంపుదునని చక్రము పట్టి క్రిందికురికి భీష్మునిపైకి పరుగెత్తినాడు. 'అదే భీష్ముడు చచ్చె'నని కౌరవవీరులార్చిరి భీష్ముడు 'కృష్ణా! రా!' అని నమస్కరించినాడు. అర్జునుడు వెనువెంకనే పరుగెత్తికొనివచ్చి కృష్ణునిచేతులు పట్టుకొని నీవు యుద్ధము సేయనని ప్రతిజ్ఞచేసి తప్పుదువా? నాపై గవిసిన భీష్ముడు పడుట చూతువుగాని. రమ్మని వెనుకకు తీసికొని వెళ్ళెను.

ప్రొద్దుగ్రుంకినది యుద్ధమాపి వీరులు తమ తమ నివాసముల కేగిరి. ధర్మరాజునకు భీష్మునివలన భయము వేసినది. ఆరాత్రి రహస్యముగా తమవారితో కలిసివెళ్లి భీష్ముని మరణోపాయమడిగి తెలిసికొనెను. ఇంటికి పోవుచుండగా అర్జునుడు కృష్ణునితో 'కృష్ణా! పెద్దవాడు, ధర్మనిరతుడు, లోకమా

న్యాడు. దయాళుడున్నైన భీష్ముని వంచనచేసి చంపుటకు నా మన స్సంగీకరించుటలేదయ్యా! నేను చిన్నతనమున ధూళిలో ఆడుకొనుచుండగా ప్రేమతో వచ్చి నన్నెత్తి ముద్దు పెట్టి నాతండ్రి గుణముల కీర్తించుచు నెత్తుకొను వాడు. అట్టి ప్రేమమూర్తిని చేతులారా నాశనముచేసి చంపనా? తండ్రిలేనిమమ్ము పెంచిన తాతగారిని చంపనా? సేననంతను చంపిన చంపనీ, నేను చంపను. ధర్మరాజు తమ్ములు క్రూరకర్ములా?' అని వాపోయెను. కృష్ణుడు 'రాజ ధర్మ మదే. క్రూరతకు సహించియైన ప్రజలకు న్యాయము చేయవలెను. భీష్ముని కెదురు నేనున్నానని బీరములు పల్కి తివే. ఎట్లైన చంపవలెను నిన్నే చంపుదునని దైవము పంపి నాడు. తప్పదు' అనుటతో 'శిఖండికదా భీష్ముని చంపు వాడు. నేను మరొకరిమీదికి బాణములు వేయుదును. అతడు భీష్ముని కొట్టును' అనగా, కృష్ణుడు 'నీవుతప్ప భీష్ముని నొప్పి నట్లుగా కొట్టగల్గిన వారెవ్వరు? ఇది యారీతిగా జరుగవలసి యుండగా నీవు త్రోసిపుచ్చగలవా?' అనెను. అర్జునుడు దాని కొకటి జరుగునని సమ్మతించెను.

పదవరోజున శిఖండిని ముందుంచి అతనికి రెండు వైపుల భీమార్జును లున్నారు. భీష్ముడు శిఖండిమొగము చూడనొల్లక వెనుదిరిగి నిల్చుండెను. శిఖండి భీష్ముని తిట్టెను. అవకాశ మూచి అర్జునుడు 'ఈనాటి శిఖండిపౌరుషము వేరుగానున్నది నేడు భీష్మునికి పతనము తప్ప'దని, శిఖండితో 'అన్నిమాట లాడి యుద్ధముచేయనిచో మనలను చూచి అందరును నవ్వు దురు. కావున బాణములు వేయు మని ప్రోత్సహించెను.

శిఖండిని లెక్కసేయునట్టివాడు కాడు భీష్ముడు. అతడు బాణములువేయగా వర్షపుజల్లు కురియుచునపు డేనుగువలె భీష్ముడు నవ్వుచుండెను. అప్పు డర్జునుడు శిఖండిధనుస్సు వెనుకనే తన విల్లుపెట్టి కొట్టుచుండగా భీష్ముడు దుశ్శాసనునితో 'ఇవిగో పిడుగులవలె పడుచున్నవి అర్జున బాణములు' అనెను. అతని బాణాఘాతములతో భీష్ముడు తూర్పుతలగా క్రిందపడెను. అతడు వృద్ధుడు. ఇరుపక్షములవారికిని కావలసినవాడగుటచే అందరునతనివద్దకుచేరిరి. అతనికి వీపునిండ బాణములు గుచ్చుకొన్నందున శరతల్పమున పడెను. వానికి తగినట్లు తలగడ కావలెననికోరగా దుర్యోధనుడు దూదితలగడలకై భటుల నంపెను. భీష్ము డది విని నవ్వి, బాణములకే పై కుండునట్లు వేయుమనెను. కౌరవవీరు లెవ్వరును వేయలేకపోయిరి. అర్జునుని పిల్వగా అతడువచ్చి కన్నులనీరుకార్చుచు మూడుబాణములను మంత్రించి వేసెను. అవి భీష్మునికి తలగడగానైనవి.

అంతట భీష్ముడు 'నాకు దాహము వేయుచున్నది. శరతల్పముననున్నప్పుడు భూమినుండి బయులుదేరిన నీరే త్రాగవలెను. రప్పింపు'మనగా అర్జునుడు బాణమును మంత్రించి వేసి పాతాళజలధారనురప్పించి భీష్మునినోటిలో పడునట్లుచేసి అతనికి ప్రీతిపాత్రుడయ్యెను. ఆసమయమున నతడుతప్ప మరెవ డారీతిగా చేయగలడు?

భీష్ముడు పడిపోగానే ద్రోణుడు సేనాధిపతియయ్యెను. అతనిని సజీవముగా ధర్మరాజును పట్టితెమ్మని దుర్యోధనుడు కోరెను. 'అర్జునుడు దూరముగా పోయినచో తప్పక తెత్తును'

వహాంతముగా వారిమీద పడి యుద్ధము ఘోరముగా చేయసాగెను. వారికి తోడుగా నారాయణులను పదివేల గోపాలుర 'తమ్ము కృష్ణుడు తనకు తోడుగా నిచ్చె'నను గర్వముతో అర్జునునిపైకి వచ్చిరి. వారందరి నొక్కసారి శంఖముపూరించి యమలోకమున కంపెను. అదిచూచి మరింతభయపడినను వెనుదిరుగక ఒక్కమారుగా అర్జునునిపైకి కలిసిరి.

అటువారితో పోరుచుండగా వేరొకచోట భగదత్తుడు తనయేనుగును తోలి పాండవసేనను చెల్లాచెదరు చేసెను. అదిచూచి అర్జును డాదిక్కునకు రథముపోనిమ్మనెను. కృష్ణుడు తోలబోగా సంశప్తకులు తమమీదికి రమ్మని కేకలువేసిరి. వారిపైకి రథముపోనిచ్చి వారినందరిని చంపెను. తర్వాత భగదత్తునిపైకివెళ్ళెను. అతడు తనవద్ద గుప్తమైన వైష్ణవాస్త్రము నభిమంత్రించివేయగా కృష్ణుడు అర్జునున కడ్డుపడెను. ఆవచ్చిన అస్త్రము కృష్ణునిశరీరమున పూలమాలికవలె నిలిచిపోయెను. అదిచూచి అర్జునుడు 'కృష్ణా! నీవు సారథ్యముచేయుటయేకాని యిట్లు నా కడ్డువచ్చినచో నా కప్రతిష్ఠ కాదా?' అనగా, కృష్ణుడు 'నే నిదివరలో భూదేవికి వరమిచ్చితిని. ఇది నేనేతప్ప మరెవ్వరును భరింపలేరు' అని సర్దిచెప్పి 'ముందుగా భగదత్తుని చంపు'మని ప్రోత్సహించెను. అర్జునుడు భగదత్తుని, అతనియేనుగైన సుప్రతీకమును చంపెను.

వెంటనే శకునితమ్ములడ్డువచ్చిరి. వారి నందరిని చంపెను. అంతలో శకునివచ్చి మాయ లెన్నో ప్రయోగించెను. అర్జునుడు వాటినన్నింటిని ఉపసంహరించి 'మామా! నీమాయలు జూదములోనే పోయినవి. ఇవి నాబాణములు కాని.

అడ్డసాళ్లు కాదు. మరలు మరల అత డంతలో పోవకరి పది బాణములు వేయుగా శరీరమునొచ్చి పారిపోయెను. అప్పు డర్జునుడు తమసేనలోని సైనికులనుజూడ పోవసాగించుచుం డెను. అక్కడ కర్ణునితో యుద్ధముచేసి నొప్పించెను. ఆనాడు సాయంకాలమైనది. సాయంకాలమగుటతో యుద్ధమునాపి వేయుట ఆనాటిఆచారము.

ద్రోణుడు మూడవనాటి యుద్ధమున పద్మవ్యూహము పన్నెను. అందెవరును ప్రవేశించలేకపోగా అభిమన్యుడు ప్రవేశించి వారి అన్యాయయుద్ధమువలన చనిపోయెను. అర్జును డప్పుడు సంశప్తకులతో యుద్ధము చేయుచుండెను. మధ్యమధ్య అభిమన్యుని శంఖధ్వనులు సహాయమునకు రమ్మని వినవచ్చినను కదులుటకు వీలులేక సాయంకాలమగువరకు యుద్ధముచేసి వారినందరిని చంపి విడిదికివచ్చెను. దారిలో నతనికి దుశ్శకునములైనవి. అతడు 'నాకేకి కలచేమగునాయని శంకించుచు లోనికి వచ్చెను. అక్కడ నందరును సభదీర్చి యున్నను అందు అభిమన్యుడు మాత్రములేడు. అర్జునునకు అనుమానము దృఢమైనది. కంఠధ్వని బొంగురుపోగా 'ఏమి! ఒక్కరును చెప్పరేమి? అభిమన్యుడేడీ? ఈ రోజున ద్రోణుడు పన్నిన పద్మవ్యూహములోని కనుమానించక వీరాగ్రణి ప్రవేశింపుమనలేదుకదా! వాని కంపులోనికి ప్రవేశించుటేకాని తిరిగివచ్చుట తెలియదు. లోన ప్రవేశించినయతని నందరును కలిసి చంపలేదుగదా! ఏ ఒక్కరు నతని చంపలేరు. వాని నిక నే నీకన్నులతో చూడలేనా? నావంటి దురదృష్టవంతున కట్టకొడుకును పొందుభాగ్య మేల కల్గును?' అనుచు ఎన్నో

రీతుల విలపించి చతికిలపడి 'మీరందరు నుండిరికదా, ఒక్కరు నతని రక్షింపలేకపోయిరా? పోనీ చచ్చిన చచ్చినాడు. ఎందరిని చంపినాడు? తనశౌర్యము నెట్లు ప్రకటించినాడు?' అని అడుగుచు వాపోయెను. కృష్ణుడు 'నీవంటివానికి విచారింపదగదు. శూరులైనవా రెప్పుడు నిట్లే చనిపోదురు. దానికై నీవంటి వీరుడు విచారింపదగునా?' అని యూరడింపగా అతడు 'ఆహాహా! మిమ్ము నమ్మికొని వాని రక్షింపలేకపోతిని. మీరు యుద్ధముచేయలేని పిరికివారు. ఎరిగెరిగి మీ కప్పగించితిని. మీలో నొకమనుష్యు లేనా? ఎందు కీ ఆయుధములు? బాలుని రక్షింపలేరే?' అని రౌద్రముగా నున్న అర్జునునితో దీనముగా ధర్మరాజు యుద్ధము జరిగినరీతి చెప్పెను.

అది విని వినుటతో అర్జునుడు మూర్ఛపోయెను. ధర్మరాజు, కృష్ణుడు నుపచారములు చేయగా నతడు తేరుకొని సైంధవునిపేరు తలచుకొనుటతో కోపమువచ్చి పెదవి కరచి, కనుబొమ్మలు ముఖముపై నాట్యమాడగా, శరీరము కంపించుచుండగా ధర్మరాజుతో 'నా ప్రతిజ్ఞ వినుడు; రేపు సూర్యాస్తమయముగులోపల ఆ సైంధవుని చంపితీరుదును. భయపడి నిన్ను చేరినను, కృష్ణుని శరణువేడినను నన్నుచూచి పారిపోయినను విడువను. అట్లు చేయలేనిచో బ్రహ్మహత్యాపాతకము నందుదును. అదిగాక అట్లు చంపలేనిచో నేనే అగ్నిలో ప్రవేశింతును' అని ఘోరప్రతిజ్ఞపట్టెను.

అది చారులద్వారా కౌరవవీరులకు తెలిసినది. సైంధవుడు హడలిపోయి దుర్యోధనాదులున్న సభలో తనకిక చావు తప్పదని చెప్పి, రక్షింపుమని వేడెను. వారందరును రక్షింతు

మని అభయమిచ్చిరి. కాని అతనికి ధైర్యము లేదు. వాడకే పోవుచున్నాడు.

అర్జునునితో కృష్ణుడు రహస్యముగా 'నీవు తెలియక నాతో సంప్రదించకయే అట్టి ఘోర ప్రతిజ్ఞ చేసితివే! అట్టిట యినచో నెట్టులు?' అనగా అతడు 'నీవు సహాయుడవై, గాండివము ధనువుగానుండగా నాకు ప్రతిజ్ఞనెరవేరకుండునా' అని తనధైర్యము చెప్పెను. కృష్ణుడు అర్జునునితో పాటు అతనివిడిది కేగి పవిత్రోదకముతో నాచమనముచేసి, దర్భ శయ్యవేసి దాని నక్షతపుష్పములతో పూజించి 'నీవు నిత్యము చేయు రాత్రిపూజను మానితివే'మని అర్జునుని హెచ్చరించెను. అతడు కాలు సేతులు కడిగికొని ఆచమనము చేసి, నిత్యముచేయు శివపూజ నానాడు కృష్ణునకేచేసెను. తర్వాత కృష్ణుడు ద్వారపాలకులను జాగ్రత్తగా కావలియుండు మని చెప్పి, అర్జునునితో సుఖముగా పరుండుమనిచెప్పి, తన విడిది కేగెను. కృష్ణు డక్కడ తన కేమియు తోచక సారథితో 'నీవు రేపు నారథమును గుఱ్ఱములను పూన్చి సిద్ధముచేసి తీసి కొనిరమ్ము. నే నర్జునునికి సాయపడవలె'నని తన ఆదుర్దానం తను చెప్పెను.

ఇక్కడ అర్జునుడు సుఖముగా నిదురించినాడు. అంతట నతని కొక కల్ల వచ్చినది. 'కృష్ణు డతనివద్దకు వచ్చెనట. అత డతని కెదురేగి కూర్చుండుమని తనపక్క చూపెను. కృష్ణు డచ్చటకూర్చుండి, 'నీవు విచారించకుము. విచారించినవాడు శత్రువులచే చచ్చునుగాని, శత్రువులను చంపలేడు. ధైర్యము వహింపు' మనెను. అర్జునుడు 'ఇంకను విచారింతునా? తెల్ల

వారవలె; నా ప్రతిజ్ఞను పూర్తి చేయువలె. అదియే నా విచారము' అనుటతో కృష్ణుడు 'అదే! దాని కుపాయమేమా? అని ఆలోచించుచున్నాను' అని ఆచమనముచేసి తూర్పు దిక్కుగానుండి అర్జునునికేసి చూచి, 'నీకు పాశుపతాస్త్రము సన్నిహితమై యున్నచో సైంధవవధ జయము తేలికగా జరుగును' అనెను. అర్జునుడు ఆచమనముచేసి పరమేశ్వరధ్యానము చేయుచు, కృష్ణునితో కలిసి ఆకాశమార్గమున కైలాసమున కేగెను.

అక్కడ ప్రమథగణములమధ్య శివు డాసీనుడై యున్నాడు. ఆయనకు కృష్ణార్జును లిరువురును ఓంకారము నుచ్ఛరించి సాష్టాంగనమస్కారములు చేసిరి. శివుడు చిరునవ్వుతో వారినిచూచి 'స్వాగతము మీ రిద్దరును వచ్చినకారణమేమి?' అని ప్రశ్నించెను. వారు లేచి నిలువబడి దోసిలులొగ్గి భక్తితో పరమేశ్వరుని స్తుతించిరి. అంతట కృష్ణుడు 'పాశుపతాస్త్రమును కోరు'మని అర్జునునికి జ్ఞప్తి చేసెను. అతడు వరమును కోరదలచి శివునికేసి తేరిపారచూడగా తాను రాత్రి కృష్ణునికి చేసిన పూజా ద్రవ్యములైన పూలమాల లన్నియు శివుని మెడలో చూపట్టినవి. అదిచూచి అర్జునుడు శివకేశవులకు భేదములేదని తెలిసికొని 'దేవా! నీ దివ్యాస్త్రమును ప్రసాదింపు'మని కోరెను. శివుడు నవ్వుచు 'అదిగో ఆసరస్సులో నాధనుర్బాణము లున్నవి. తెండు' అనెను. వా రాసరస్సు నొద్దకేగగా అక్కడ భీకరమైన విషము గ్రక్కుచు రెండుసర్పము లున్నవి. వానినిచూచి ఆశ్చర్యపడి, అది ఆ మంత్ర ప్రభావమని తెలిసికొని పాదప్రక్షాళనచేసికొని, ఆచమనముచేసి

వాటికి నమస్కరించిరి. నమకము శ్రీరుద్రము స్తుతించిరి. దానితో ఆసర్పములు ధనుర్బాణములుగా కన్పడినవి. వారా రెంటిని తెచ్చి శివునిముందట బెట్టిరి.

అంతట శివుని ప్రక్కనుండి నొక బాలుడు వచ్చి ఆ వింటియందు బాణమునమర్చి తన్ను ఏకదృష్టిగా చూచు చున్న అర్జునునకు మంత్రమును గ్రహించెను. అర్జునుడు దానిని గ్రహించి శివునిమాట ప్రకారము ధనుర్బాణములను దివ్య సరస్సున పెట్టివచ్చెను. తర్వాత అర్జునుడు తనకానాడడవిలో కాన్పించినప్పుడు ఆను గ్రహించినరీతిని జ్ఞాపకముచేసెను. శివుడు దయార్ద్రదృష్టితో చూచుటతో అర్జునునకా మంత్రము స్ఫురించెను. అంతట కృష్ణార్జునులు శివునిపాదాభివందన ములుచేసి సెలవుతీసికొని తమశిబిరమును చేరిరి. అంతలో తెల్లవారినది.

అది ద్రోణుని సేనాధిపత్యమున నాల్గవరోజు. సైంధవుని చంపుదునన్న ప్రతిజ్ఞ విని, యెట్లైన నతని కాపాడవలెనని వీరులు పట్టుపట్టినారు. ద్రోణుని కోరినాడు దుర్యోధనుడు. అతడు సాధ్యమైనంతవరకు కాపాడుదు నన్నాడు. ఆనాడు పండ్రెండు క్రోసుల పొడవు, అయిదు క్రోసుల వెడల్పు కలుగు నట్లు శకటవ్యూహమునుపన్ని, దానికి పశ్చిమభాగమున పద్మ వ్యూహమును గర్భవ్యూహముగా పన్ని, దానిమధ్య మొదలు సేన కావలిదిక్కువరకు సూచీవ్యూహము పన్నెను. దాని చివ రను సైంధవుని నిలబెట్టినాడు. అనగా సేనాముఖమువకు మూడామడలు (24 మైళ్ళు) దూరమున నున్నాడు సైంధవుడు.

అర్జును డరిభీకరుడై వచ్చినాడు. అతని యెదుట నెంతటివాని కేని నిల్చుట సాధ్యముకా దన్నట్లున్నది.

ద్రోణు డా సేనాముఖమును రక్షించుచున్నాడు. అర్జునుడు గురువుగారి కెదురై నమస్కరించి 'అయ్యా! మీరు పాండురాజు, ధర్మరాజు, కృష్ణుడు వలెనే నా మేలు కోరువారు. ద్రోహియైన సైంధవుని జంప ప్రతిన బట్టితిని. కనికరించి నా కార్యసిద్ధి చేయు'మనెను. ద్రోణుడు చిరు నవ్వుతో 'నన్ను గెల్వకుండ నీ వెట్లు లోనికి ప్రవేశింతువు?' అని యుద్ధము సాగించెను. గురు శిష్యు లిద్దరును ఘోరముగా పోరిరి. కాని యర్జునుడు గురు నెదిరించుట కష్ట మనుకొనెను. అప్పుడు కృష్ణుడు 'మన కార్యము సాధించుకొనవలెగాని, ఇట్లు పట్టుదలకు పోరా'దని హెచ్చరించెను. అర్జునుడు 'సరే' అన ద్రోణునికి ప్రదక్షిణముగా రథమునుపోనిచ్చెను. ద్రోణుడు తన్నుదాటిపోవు నర్జునునిపై మరికొన్ని బాణములు వేసెను. వాటిని తనకు తగలకుండ మళ్ళించుకొనుచు అర్జునుడు వెళ్ళి పోయెను. ద్రోణుడు సేనాముఖరక్షణకై వెనుదిరిగెను.

అర్జునుడు విందానువిందులను చంపి, పోరు సల్పుచుం డెను. అప్పుడు గుర్రములకు శ్రమ హెచ్చినది. వాటి నొంటి నంటిన బాణములు తీయనందున అవి బాధపడుచున్నవి. అది చూచి అర్జునుడు కృష్ణునితో 'నీవు గుర్రములను రక్షింపుము, నేను నడచివెళ్ళెదు'నని రథముదిగి పాదచారియై సైంధవు డున్న మూలకు పోవుచుండెను. అదేసమయమని కొందరు రథికు లతని చుట్టుముట్టిరి. వారి నందరిని చావగొట్టి, అర్జునుడు మందహాసముచేసెను. కృష్ణు డతని కేసి చూసి 'ఇదిగో గుర్ర

ములనుుంటిమాది బాణములను తీసితిని, ఒళ్ళు నిమిరితిని. ఇప్పుడు దప్పిగొన్నవి. నీరు త్రాగించి చో నివ్విని గెల్పించును' అనెను. అర్జునుడు సరే అని దివ్యాస్త్రము సహాయమున అక్కడనే భూమిని పగులగొట్టి కొలను తయారుచేసి దాని చుట్టును బాణములతో గోడకట్టి నీరు త్రాగింపుమనెను. కృష్ణుడు గుఱ్ఱములను తోలుకొనివెళ్ళి నీరుపెట్టి కడిగివేసికొని వచ్చి రథమునకు కట్టెను. ఈ మధ్యలో వాటికి కే ప్రమాదమును రాకుండ అర్జునుడు సంరక్షించెను. అది చూచువారెల్లరును ఆశ్చర్యపోయిరి. ఇంతలోపల దుర్యోధనుడు గురుని యనుగ్రహమున కవచధారణమును గ్రహించెను. అనగా కవచమును మంత్రము నుచ్చరించుచు తొడిగికొందురు. దాని శక్తి వలన వారి కే బాధయు కల్గదు. అత డా గర్వముతో అర్జునునితో తలపడెను. అర్జునుడు బాణముల వేసెను. కాని అవి వృధాయైనవి. అప్పు డిదేమని యడిగిన కృష్ణునితో 'నీ వెరిగియుండి న న్నడుగుట యేటికి? ఈ విద్య గురుడెరుగును. నాతనశ్వత్థామకు నిచ్చినాడు. దానిబలమునన్నున్న వాడు ఇతని జయించుట దుస్సాధ్య'మని చెప్పెను. అతనికవచము తొలగునట్లు ఐంద్రాస్త్రమేసెను. కాని అశ్వత్థామ దారిలోనే ఆ యస్త్రము నుపసంహరించెను. దానిని మరల ప్రయోగింపరాదు. మరిక ర్తవ్యమేమూయని విచారించుచు నర్జునుడు దుర్యోధనుని సారథిని, గుర్రమును కూల్చెను. అతడు రథముపోయి కవచధారణవిద్యాబలము నెరుగని వాడగుటచే దానిబలము తగ్గినదనుకొని అది విప్పిపార వేసి మరొకకవచ

ముడు తొడిగికొనెను. ఆ సందుచూచి అర్జునుడు కొట్టగా నతడు పారిపోయెను.

తర్వాత నొక్కసారిగా తనమీదికివచ్చిన వృషసేనా దుల పారద్రోలెను. కర్ణుడతని కెదురునిల్వలేక పారిపోబోగా దుర్యోధను డాతని హెచ్చరించెను. దానితో నతడు మరల నిల్చి యుద్ధముచేసెను. కర్ణునిరథము కూల్చి విపన్నుని చేసెను.

అప్పటికి సైంధవునిదగ్గరగావచ్చినా డర్జునుడు. దుర్యోధను డేదోరీతిగా 'అప్పటికి కొంచెముప్రొద్దును కాలక్షేపము చేసినచో సైంధవుడు బ్రతుకును. అర్జునుడు చచ్చును' అని సైనికులను హెచ్చరించెను. అందరును నొక్కసారిగావచ్చి అర్జునుని చుట్టుముట్టిరి. కృపాశ్వత్థామవృషసేనులా సైంధవుని కడ్డుపడిరి. అర్జునుడు వారికేసి ప్రొద్దుకేసిచూచినాడు ప్రొద్దున నుండి తాను యుద్ధముచేయుచున్నను సైంధవుని చేరలేక పోయినాడు. ఇప్పటికైకను సావకాశము చిక్కునట్లు లేదు. ప్రతిజ్ఞానిర్వహణ మగునా లేదా అనిసందేహము. అప్పుడు కృష్ణుడు 'ప్రొద్దుగ్రుంకవచ్చినది. ఏదో మాయోపాయము పన్నినగాని కార్యసాధన కాదు. అదేదందువా? నేను సూర్య మండలమున కడ్డుకల్గించి చీకటిచేయుదును. అప్పుడు నీవు తటాలున సైంధవునితల నరకుము' అనెను కాని అర్జునున కట్లు చేయుట హితవులేదు. అది తనపౌరుషమునకు కొక మచ్చ యని అతని భావము. అది గమనించియు చూడనట్లుగా కృష్ణుడు మాయచీకటి కప్పెను. తాము గెల్చితిమని కౌరవులెల్లరును సంతోషించిరి. సైంధవుడుపూర్తిగాప్రొద్దుగ్రుంకెనాలేదాయని తలెత్తిచూచెను. అదిచూచి కృష్ణుడు 'అదుగో సైంధవుడుతలెత్తి

చున్నాడు. వెంటనే తల నరుకుము' అనెను. అర్జునుడుచూచి వెంటనే బాణమును వదలెను. ఆ దెబ్బతో ఆతనితల తెగి పడె. కృష్ణుడు 'అర్జునా! ఆతలను క్రిందపడకుండ చూడుము. దానికారణము చెప్పెదనులే' అని మాయచీకటిని తొలగించెను. ఇట్టే యెండ వచ్చినది. అదిచూచి కౌరవవీరులు ఈనగాచినక్కలపాలుచేసితి మని పెదవులు కరచికొని ఉవ్వెత్తుగా అర్జునునిమీదికి తలపడిరి. అతడు వారినందరిని కొట్టుచు 'కృష్ణా! ఈ తల నెంతసేపి ట్లుంచవలెను? ఎక్కడికి తీసికొనిపోవలెను?' అని యడిగెను.

అప్పుడు కృష్ణుడు 'సింధుదేశపురాజైన వృద్ధక్షత్రుడు తపస్సుచేసి సంతానముగా సైంధవుని కనెను. ఒకనాడాకాశ వాణి 'వీడు యుద్ధములో పొరపాటుగానుండి తల నరుకబడి చంపబడును' అన్నది. అదివిని అతడు 'వీనితల నెవడు క్రింద పడవేయునో వానితల వెయ్యివ్రక్కలగును' అని శపించెను. అత డిప్పుడు శమంతపంచకముదగ్గర తపస్సుచేయుచున్నాడు. ఈ తలను అతనితొడమీద పడవేయుము. ఆ తొడనుండి క్రిందికి పడుటచే అతడే చచ్చును. అట్లు పడవేయుట ఒక్క పాశుపతాస్త్రమువలనకాని కాదు' అని బోధింపగా అర్జునుడు వెంటనే ఆచమించి పాశుపతాస్త్రము ననుసంధించి ప్రయోగించెను. అది బాణపరంపరవలె తయారై ఆ తలను నెట్టుకొనిపోయి ఆశ్రమములో తపస్సుచేసికొనుచున్న వృద్ధక్షత్రునితొడపై బడెను. అతడు సమాధిలో నున్నందున ఉలికిపడెను. ఆతల నేలపై బడెను. అది నేలపైబడుట కతడే

కారణమైనందున అతనితలయే వేయి వక్కలయ్యెను. అతని శాప మతనికే తగిలినది.

అర్జును డాకాశమునకై సైంధవునితలను నడపుట చూచినవారందరు నాశ్చర్యపడిరి. ఆ తల క్రిందికిపడునంత వరకు రథముపై నిలిచియున్న అతని కళేబరము-అది క్రిందికి పడగానే క్రిందికి పడిపోయినది. అదంతయు మహాశ్చర్యజనకమైనది. అప్పటికి ప్రొద్దు గుంకినందున యుద్ధము చాలించిరి. ఈ రీతిగా తనుపట్టిన ప్రతిజ్ఞను నెరవేర్చుకొని అర్జునుడు సంతోషముతో తిరిగివచ్చి ధర్మరాజునకు నమస్కరించెను. ధర్మరాజు కష్టసాధ్యమైన ప్రతిజ్ఞను నిర్వహించుకొని వచ్చిన తమ్ముని కౌగిలించుకొని, కృష్ణునితో 'ఇదంతయు నీ దయ వలన నిర్విఘ్నముగా సాగిన'దనెను. అతడు 'నీ ధర్మనిష్ఠయే, నీ కోపమే యిట్లు శత్రుజయము చేసె'నని కృష్ణుడు సమర్థించెను.

ద్రోణుడు యుద్ధము చాలించినాడు. కర్ణుడు సేనాధిపతియైనాడు. కర్ణునకు జోడైనవా డొక్క అర్జునుడే. ఆ నాడు కర్ణుడు యుద్ధమున ధర్మరాజును పట్టుకొని, తన ప్రతిజ్ఞా ప్రకార మాతని చంపక శూలనాడి విడిచిపెట్టెను. అభిమానము కలవారికి బాణములకంటె మాటలే పదునైనవి. అతడు బాధపడినాడు. కాని, యేమిచేయును? శత్రువు చంపవలెను కాని, తనంతట తాను చచ్చునా? తనశిబిరమునకు పోయి విశ్రమించినాడు.

కృష్ణార్జునులు యుద్ధభూమిలో ధర్మరాజు లేనందున ఏమి జరిగెనో అని ఆందోళనపడి యుద్ధభూమివదలి ధర్మ

రాజుశిబిరమున కేగి కుశలప్రశ్నలు వేసిరి. అతడా పిదప చూడగానే కర్ణుని చంపివచ్చిరను భ్రాంతితో అతడెదురుగ వచ్చి కౌగిలించుకొని 'ఏమియు దెబ్బ తగులకుండ ప్రతిపక్షుని చంపివచ్చితివా?' అని అర్జునుని కుశలప్రశ్న వేసి అభినందించెను. అర్జునుడు 'నీవు కర్ణునితో యుద్ధము చేయుచుండగా నేను సంశప్తకులతో యుద్ధము చేయుచుంటిని. అంతలో అశ్వత్థామతో పోరుసల్పితిని. ఇప్పుడు వెళ్లి కర్ణుని చంపి వత్తును' అనుటతో ధర్మరాజు 'నావంటిచేతకానివాడు యుద్ధము చేయలేక తిరిగివచ్చిన చెల్లును కాని, నీవంటివీరుడు రాజెల్లునా? కర్ణున కింతవరకు నీవుతప్ప అందరము నోడితిమి. ఇప్పుడు నీవును ఓడితివా? ఇంక మనము యుద్ధభూమికి పోనవసరము లేదు. అడవి కేగి తపస్వులమై నిర్భయముగా శాంతముగా జీవితము గడుపుదము. లేదా సాధువులమై దుర్యోధనుడు చెప్పినట్లు చేయుదము. కృష్ణుడు వినుచుండగా ఎన్నో బిరములు పల్కితివే! నీవు పుట్టిననాడు ఆకాశవాణి 'యుద్ధములో నీతడు విజయముగొను' నని పల్కి అబద్ధమాడినది. నిన్నంతవానిగా దలచి నేను యుద్ధమునకు పూనుకొంటిని కాని కర్ణునకు జంకెదవనుకొనలేదు' అని కృష్ణునితో 'నేనిట్లురాగా భీము డొక్కడే పాపము! యుద్ధముచేయుచున్నాడు' అని, అర్జునునితో 'అభిమన్యుడు కాని ఘటోత్కచుడు కాని యున్నచో నిట్లగునా? నిన్నొకగడ్డిపరకగా తలచి ఆ దుర్మార్గుడు నన్ను అవమానించినాడు. కృష్ణుడుండగా నీకు భయమేమి వచ్చినది? అంతగా భయమున్నచో గాండీవ మతని కిచ్చి నీవేసారథ్యము చేయకపోతివా?' అనెను.

ఆమాటలు వినుటతో అర్జుని కెంతో కోపమువచ్చి నది. ఒరనుండి కత్తిదూసెను. అతని యుద్దేశ్యమును గుర్తించి కృష్ణుడు 'అర్జునా! మనము యుద్ధభూమిలో లేము. ధర్మరాజు నూరడించవచ్చితిమి. గుర్తున్నదా? శత్రువులు లేనిచోట కత్తెత్తుదు వేల?' అనగా, నతడు 'నన్ను గాండీవమును వదులు మని పల్కినవారితల నరుకుదునని ప్రతిజ్ఞ పట్టితిని. ఇప్పు డితడు నన్నామాట అన్నాడు. నే నది సహింపలేను. ఏమై ననేగాక! సత్యము తప్పను. నీ వన్నియు నెరిగినవాడవు. ఏది కృత్యమో చెప్పుము?' అనగా, నవ్వి కృష్ణుడు 'పోపొమ్ము! ఎక్కడివాడవు? ఇదా నీప్రతిజ్ఞ? పెద్దల సేవింపకపోవుటచే మంచిచెడ్డల నెరుగలేకున్నావు. సత్యాహింసలలో అహింస ద్వారా సత్యమును రక్షించవలెను. ఇది ధర్మసూక్ష్మము. నీవు తెలియక ధర్మాత్ముడైన అన్నను చంపుదు నందువు. కాక చిన్నతనమున పట్టిన ప్రతిజ్ఞ లెక్కయా? ప్రాణము తీయవలసివచ్చినచో అసత్యమే సత్యముకన్న గొప్ప దని పెద్ద లందురు' అనుటతో 'నా ప్రతిజ్ఞ సఫలమగు రీతిని బోధింపు'మని అర్జునుడు కోరగా, 'పెద్దలను నిందించుట చంపుటకు సరియైనదికనుక ధర్మజుని తిట్టు' మనెను. అప్పు డర్జునుడు ధర్మజుని 'నీమూలముగానే మా కిన్నిపాట్లు పడ వలసివచ్చినది. జూదమాడి రాజ్యము కోల్పోతివి. పిరికివాని కాయుధముగాపనిజేసెడి శాంతమును వహించుట నీవంటి వానికి దగదు. ఇ దేమి ధర్మము?' అని తిట్టుటతో అతనికే మనస్తాపము కల్గి, మరల కత్తి నెత్తబోయెను. కృష్ణు డదెందు కని యడుగగా 'ఎప్పుడును చేయరాని దుష్కార్యమును చేసిన

నాకు శిరచ్ఛేదమే నిష్కృతి. తల నరికికొని పాపవిముక్తుడ నగుదు' ననెను. కృష్ణు డుండగా ఆ పని జరుగనిచ్చునా? 'ఓరి వెఱ్ఱివాడా! అత్మస్తుతి శిరచ్ఛేదతుల్యమే. అట్లు చేయు' మని బోధించెను. అప్పుడు ధనువు నెత్తి 'నాకు శివుడుతప్ప మరెవడు నిలువగలడు? రాజులనందరిని నేనుగదా గెల్చినది! రాజసూయముపేరు నీకు దక్కినది. చూడు, కొంచెము మిగిలి వచ్చిన కౌరవసేన యెట్లున్నదో చూడు.' అని తన్ను తాను పొగడుకొని, వినయముతో ధర్మరాజునకు సాష్టాంగనమస్కారముచేసి, నిల్చుండి, చేతులు కట్టుకొని 'అన్నా! నేను తెలియక తప్పుచేసితిని. ఎన్నో మాటలు ప్రేలితిని. మన్నింపుము. అవన్నియు పెడచెవిని పెట్టుము. నన్ను పంపుము. యుద్ధమున కేగెదను. రాధను పుత్రుడులేనిదానిగా జేసెదను. లేదా కుంతికే కొడుకు లేకపోవలెను' అనుటతో ధర్మరాజు 'తమ్ముడా! మీకు నామూలముగా నెన్నో కష్టములు కల్గిన కులమునకంతకు బాధ తెచ్చిన నే నడవికి పోదును. మీరు సుఖముగా నుండుడు' అని వనవాసోన్ముఖుడయ్యెను

అప్పుడు కృష్ణుడతనిపాదములపై బడి 'ధర్మరాజా! అర్జునుడు కోపావేశమున తెలియక ఏదో అన్నాడు. సహింపుము. అతని ప్రతిజ్ఞ ధోరణియే అతనిది కాని, ముందువెనుక నాలోచింపలేదు. నిన్ను నేను శరణువేడుచున్నాను. మరలు' మనగా నతడు 'నేనును అవమానభారమున నోడలు తెలియక అట్లంటిని' అనెను. ధర్మరాజు అర్జునుడు నొకరినొకరు కౌగిలించుకొని యేడ్చిరి. నిజముగా పశ్చాత్తాపము కలిగిన ధర్మ

బుద్ధుల కట్లు మనఃపరితాపము వచ్చుటలో వింతయుండదు. తర్వాత వారు ముఖములు కడిగికొనిరి. ధర్మరాజు 'కర్ణుని చంపి తీరవలె' ననెను. అర్జునుడు 'ఈనాడు కర్ణుని చంపికాని తిరిగిరాను. నీ పాదములాన' అని, కృష్ణుని జూసి 'కృష్ణా! నీ వాక్కునారి కర్ణుని చంపదలచుదుము. నేను కృతకృత్యుడ నయ్యెదను' అనుటలో అతడు 'నీ వంతి చేయగలవు' అని ప్రోత్సహించెను. అర్జునుడు తన గుర్రములకు నీరు పెట్టించి గుగ్గిళ్లు తినిపించి వెళ్ళిపోవుచుండగా కృష్ణుడు 'తమ్ముని దీవింపు'మని ధర్మరాజుతో ననెను. అర్జును డన్నకు నమస్కరించెను. అతడు తమ్ముని లేవనెత్తి కౌగిలించుకొని ఒడలునిమిరి 'నీవేమియుమనస్సులో బాధపడకుము విజయా! నీకువిజయము సిద్ధము. కర్ణుని గెలువుము. వెళ్లిరమ్ము' అని దీవించిపంపెను.

అర్జునుడు రథమెక్కినాడు. కృష్ణుడు తోలుచున్నాడు. శకునములు మంచివైనవి. కాని కర్ణు నెట్లు చంపుదునా అని అర్జునునిమనస్సులో విచారమావహిల్లినది. కృష్ణు డది చూచి 'నీ వెంత బలశాలివి? కర్ణుని చంపుట కాలోచన యెందులకు భీష్మద్రోణులు నీ చేతిమీదుగా నోడిరే! నీకీ కర్ణు డొక లెక్కా? ఇంకను ఎందరు వీరులు చావవలెనో? బంధుప్రేమ వదలుము. ధైర్యసాహసములను తెచ్చుకొనుము. ఆహా కర్ణుడు ఎన్నిమాట లన్నాడు? ఆనాడు సభలో ద్రౌపదినిచూచి 'నీ మగలిక్కడ లేరు. జూదమున ఓడి నిన్ను విడిచినారు. మరొక మగని వెదకికొనుము' అన్నాడే! అవి మరపువచ్చెడి మాట లేనా?' అని పురికొల్పెను. అర్జునున కభిమానము వేసినది. ఈనాడు నావిల్లు చూచుటతో దుర్యోధనుని [illegible]

నకు పుణ్యలోకములు వచ్చుగాక! అనుటతో బ్రహ్మ మనము ముందే జయాపజయములు నిశ్చయింపగలమా?' అనెను శివుడు 'ఆఁ! నిశ్చయమే! వీరు మునిశ్రేష్ఠులు. వీరికే జయము తథ్యము' అని యింద్రునిమాటను ధ్రువపరచెను.

ఇక్కడ కర్ణార్జును లొండొరులతాకిరి. కృష్ణు డర్జునునకు శల్యుడు కర్ణునకు సారథ్యము చేయుచుండిరి. పాండవ వీరు లర్జునునికి ప్రోత్సాహము చేయుచుండ, కౌరవవీరులు కర్ణుని ప్రోత్సహింరాచుండిరి. కర్ణార్జునులు పరస్పరము దివ్యాస్త్రములు వేసికొనుచుండిరి. అర్జునుడు ప్రయోగించిన అస్త్రములను కర్ణుడు నుపసంహరించు చుండెను. కృష్ణుడు 'అర్జునా! నీ అస్త్రము లుపయోగించుటలేదు' అని ప్రోత్సహించగా అతడు బ్రహ్మాస్త్రమేసెను. దాని నా అస్త్రముతోనే కర్ణు డుపసంహరించెను. తక్కిన వారెల్లరును వారి యుద్ధము చూచుచుండగా దుర్యోధనుడు 'మీరు యుద్ధమంతయు కర్ణునితలపై వదలి మీరందరు నూరకుందురా?' అని ప్రేరేపించగా వారు అర్జునునిపై కెకలియబడిరి. అర్జునుడు వారి నెల్లరను పారద్రోలెను.

కర్ణునివద్ద అశ్వసేనుడను తక్షకుని కొడుకైన నాగుడు సర్పముఖబాణమై అర్జునుని చంపుటకై పగబూనియుండెను. ఇంద్రు డిచ్చిన శక్తి యను నాయుధము ఘటోత్కచునిపై ప్రయోగించుటచే వ్యర్థమైనను సర్పబాణ మున్నదికదాయని కర్ణుడు ప్రయోగించెను. అది అగ్నిజ్వాలలు గ్రక్కుచు వచ్చుచుండ ఇక అర్జునునకు చావుతప్పదని సైనికులు హాహాకారములు చేసిరి. కృష్ణు డది గమనించి రథము నైదంగు

ళములు క్రింది కదిమెను. దానితో కంఠమునకు గురిపెట్టిన బాణము కిరీటమునకు తగిలినది. కిరీటము క్రింద పడిపోయి నది. ఆకిరీటము ఇంద్రుడు బహూకరించినది. ఆ బాణ మట్లు వ్యర్థమైనను అంతలో పోక సుకల అర్జునుని మీదికి వచ్చు చుండగా అర్జును డిదేమి సామీ?' అని అడిగెను. కృష్ణుడు 'ఇది ఖాండవము తగులబడునప్పుడు నీవు పోనియ్యకున్నందున తగులబడిన తక్షకుని భార్యకు కొడుకు, అశ్వసేనుడు నీ మీద పగబట్టి యున్నాడు. సంహరింపుము' అనగా అతడు దాని నాలు బాణములతో తెగ నరికెను. కర్ణుడు బ్రహ్మా స్త్రము ప్రయోగించెను. అర్జును డదే ప్రయోగించి దాని నుపసంహరించి, నారి కదలుచున్నట్లు తెలియనంత నేర్పుగా బాణములు వేయుచుండెను. కర్ణుడు రౌద్రాస్త్రము సంధింప దలచి బాణ మెత్తునంతలో రథచక్రము క్రిందికి దిగబడెను. దానిచే రథ మేటవాలై బాణమును లక్ష్యశుద్ధితో వేయుట కనువు చిక్కుట లేదు. అప్పుడు పాపము! కర్ణుడు కోపముతో పాటు విచారము కల్గి కన్నుల నీరు పెట్టుకొనుచు అర్జునునితో 'నీ విప్పుడు కొట్టకుము నేను భూమిమీద నిలబడితిని. నీవు రథముపై నున్నావు. ఒక్క క్షణ మాగుము. రణధర్మ మెరి గినవాడవు. నేను భయపడి పల్కుట లేదు. ఒక్కింత తాళుము' అనెను. కృష్ణుడు 'ఓహోహో! ఏమి నీతిపరుడవు! ఈ నీతి నిన్నటివరకు నేమైనది? అభిమన్యుని చంపునా డే మైనది? వీటన్నిటికిని కర్తవు నీవేకదా!' అనుచుండ కర్ణు నకు కోపమువలన అగ్నిజ్వాలలు రోమకూపముల ద్వారా బయటికి వచ్చుచుండెను. అట్లే కర్ణుడు బాణము వేయుచుం

డెను. అర్జునుడు కర్ణునివెంటా కూర్చొను. కర్ణుడు రథ మెత్తుటలో భూమి ఆరంగుళములు పైకిలేచినది. అతను పైకెక్కి బాణము సంధింప బోగా మరల క్రుంగెను. కర్ణుడు దిగి మరల నెత్తుకొనుచుండెను. అర్జును డప్పుడు బాణమును సంధించి 'నేను తపశ్చర్యలో గొప్పవాడనేని, వ్రతశీలుడనేని ఈ బాణము కర్ణునితల నరకుగాక!' అని వేసెను. దానితో నతనితల తెగి పడమరదిక్కున సూర్యబింబము క్రిందికి పడునట్లు క్రిందికి పడెను. అప్పు డందరును చూచుచుండగా నతని దేహమునుండి యొకకాంతి సూర్యునిలో కలిసినది. పాండవవీరులు కేకలు వేయగా కౌరవసైనికులు భయముతో వెనుకకు తిరిగి తిరిగి చూచుచు పరుగెత్తిరి. దేవతలు నరనారాయణుల బొగడుచు నిజనివాసముల కేగిరి. ప్రొద్దు క్రుంకినది. యుద్ధము చాలించిరి. అర్జునుడు రథము దిగి అన్నకు నమస్కరించెను. అత డభినందించెను.

ఆ నాడు పదు నెన్మిదవ రోజు. భీమ దుర్యోధనులకు గదాయుద్ధము జరుగుచున్నది. కృష్ణార్జును లా యిద్దరి వీరుల బలాబలములను గూర్చి ముచ్చటించుకొనిరి. కృష్ణుడు 'దుర్యోధనునకు ఉపాయము-సాధన హెచ్చు, భీమునకు బలము హెచ్చు. ఇంక కొంతసేపటికి భీమునకు శ్రమ హెచ్చును. అత డిక ఓపలేకపోవును. కాని ఈ లోపుననే దుర్యోధనునితొడలు విరుగగొట్టవలెను. అది అతని ప్రతిజ్ఞయే! కనుక ఆలసింపక జ్ఞాపకముచేయుము' అనెను. అర్జునుడు భీముడు చూచుచుండగా తొడ లప్పళించెను. అత డది గమనించి తొడలు విరుగగొట్టి దుర్యోధనుని నేలగూల్చెను.

యుద్ధము పూర్తియైనది. విజయము పాండవులకే దక్కినది. ధర్మరాజు అనంతవిజయమును, భీముడు పౌండ్రమును, అర్జునుడు దేవదత్తమును, నకుల సహదేవులు సుఘోష మణిపుష్పకములు, శ్రీకృష్ణుడు పాంచజన్యము అను శంఖముల పూరించిరి. అందరును రథములు దిగుచుండగా కృష్ణుడు 'అస్త్రములపొదులను, గాండీవమును పుచ్చుకొని నీవు ముందుగా దిగుము, తర్వాత నేను దిగుదును' అని అర్జునునితో అనగా అతడు వెంటనే దిగెను. కృష్ణుడు దిగగానే ఆ రథము గుర్రములతో సహా దగ్ధమైనది. అ దగ్ధమైనదని యడుగగా 'యుద్ధములో భీష్మద్రోణులు, కర్ణుడు వేసిన అస్త్రములను నే నింతవరకు నాపుజేసితిని. ఇప్పుడు కాలనిచ్చితిని' అని కృష్ణుడు జవాబిచ్చెను. అందరు చూచి, విని ఆశ్చర్యపడిరి. అప్పుడు కృష్ణుడు ధర్మరాజునకు 'ఇదుగో నీతమ్ముడు. నీకు తిరిగి ఒప్పగించుచున్నా'నని యొప్పజెప్పెను. కృష్ణునిదయవలన అర్జునుడు యుద్ధమున విజయమందినందుల కెంతయో సంతోషించెను.

అశ్వత్థామ పదునెన్మిదవనాటిరాత్రి నిద్రించుచున్న శేషించిన పాండవసేనను లేకుండా నొక్కటే చంపెను. అందున్నారుపపాండవులైదుగురును. ద్రౌపదికి తనకొడుకులొక్కసారిగా చచ్చిరని విచారము కలిగినది. భీముని వెళ్ళి ప్రతికారము చేయుమన్నది. అశ్వత్థామ పాండవులు శిబిరమునకు వచ్చువేళకు పారిపోయినాడు. అతని వెన్నంటి పరుగెత్తినాడు భీముడు. కృష్ణుడు అశ్వత్థామ దివ్యాస్త్రముల నెరిగినవాడగుటచే భీముడతని కెదురునిల్వలేడని చెప్పి అర్జు

నుని తీసికొని తానేగెను. వెనుకనే వచ్చిన అర్జునుని చూచి భయ యశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రిమును సంధించి అపాండవంబగుగాకయని ప్రయోగించెను. కృష్ణు 'డర్జునా! అర్జునా! ఇది బ్రహ్మశిరోనామకాస్త్రిము. దీని నుప సంహరించుట కిదే కావలెను. వేగ ప్రయోగించి నిన్ను, సోదరులను రక్షించుకొనుము' అనెను. అతడు బ్రహ్మశిర మును ప్రయోగించినాడు. ఆరెండు నొకదానితో నొకటి డీకొన్నవి. మంటలుమండుచున్నవి. ఆయుపద్రవమును తగ్గిం చుటకై వ్యాసనారదులు మధ్య నిలిచి 'అయ్యా! దీనిని మానవులపై ప్రయోగింపరాదు. ఇది గొప్పదగుటచే లోక ములను తగులబెట్టును' అనిరి. అర్జునుడు 'అస్త్రమునస్త్రి ముతో నుపసంహరింపవలసివచ్చి ప్రయోగించితిని. మాన్ప మందురేని మాన్పుదును. కాని యీ దురాత్ముడు తన యస్త్రిములతో మమ్మందరిని తగులబెట్టును. కాన మీరు మాసేమము చూడవలెను' అనుచు తన యస్త్రము నుపసంహ రించెను. అది చాలగొప్ప మహిమకలది. దానిని ప్రయోగించి వృథాగా మరల్పరాదు. అట్లు మరల్చినచో ప్రయోగించిన వారినే చంపును. కాని వ్రతస్థుడు, గురుభక్తుడునగుటచే నతని నేమియు చేయలేదు. కాని అశ్వత్థామసూత్రము త్రిప్ప కొనలేకపోయెను. అతనియస్త్రమే పరీక్షిత్తును గర్భములో నుండగా చంపినది. అతని చూడామణిని లాగికొని అతని పరాభవించి అర్జును డతనిని వదలివేసెను.

అర్జును డా రీతిగా తా నెన్నిసాధించినను ధర్మరాజు దిగా నిశ్చయించి అతనికి పట్టాభిషేకము చేసెను. అతని

సేవించుచు, ప్రాణమిత్రుడు కృష్ణుని గూడి కాలక్షేపము చేయుచుండెను. ఆ రోజులలో ఇంకను అర్జునునకు తత్త్వజ్ఞానము స్థిరముగుటకై కృష్ణుడు మరల నెన్నో యోగోపదేశములను, వేదాంతోపదేశములను చేసెను.

ఒకప్పుడు ధర్మరాజు తమవద్దకు విచ్చేసిన వేదవ్యాసుని కర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించి 'మహాత్మా! మీ ప్రసాదమువలన లభించిన ధనము నశ్వమేధయాగము చేసి వినియోగింపదలచుకొంటిని. అనుజ్ఞనిమ్ము' అని కోరెను. వ్యాసు డనుమతించెను. కృష్ణానుమతితో ధర్మరాజశ్వమేధముచేయగోరి యజ్ఞాశ్వమును వదలెను. దానికి రక్షణకై అర్జునుని వినియోగించెను. అతడు గాండీవము చేత పట్టి, రెండమ్ములపొదులను పట్టి అశ్వరక్షణకై యేగెను.

గుఱ్ఱము తనయిష్టము వచ్చినట్లు తిరుగుచుండగా దాని వెనుకనే అర్జునుడు వెళ్ళుచుండెను. అతని వెనుక యాజ్ఞవల్క్య శిష్యుడు మరికొందరు బ్రాహ్మణులతో గూడి వెళ్ళెను. త్రిగర్త దేశాధిపతులగు సూర్యవర్మ, కేతువర్మ, ధృతవర్మలు దానిని పట్టుకొని సేనలతో యుద్ధమునకు సిద్ధముకాగా అర్జునుడు వారిని చంపక పారిపోవునట్లు కొట్టెను. అటనుండి ప్రాగ్జ్యోతిషపురమున కేగగా భగదత్తునికొడుకు వజ్రదత్తుడు దానిని పట్టెను. వానినియుద్ధమునుండి మరలునట్లుకొట్టి, ధర్మరాజు నాజ్ఞ ప్రకారము చంపుట కిష్టపడక విడిచెను. అచ్చటినుండి సింధు దేశముల కేగగా సైంధవుని కొడుకు, మనుమడును పూర్వవైరము మనసున నుంచుకొని సేనలతోవచ్చి ముట్టడించిరి. అర్జునుడు వారినందరిని చంపెను. ఆ విషయమెరిగి

దుస్సల వచ్చి 'అర్జునా! ఈ బాలుని, తండ్రి లేనివానిని చంప కుము. నా వంశము నిలబెట్టుము' అని బతిమాలినది. అతని సంకల్పము నదేకనక వానిని మన్నించి వదలెను.

అక్కడినుండి మణిపూరపురమునకు గుఱ్ఱము వెళ్ళెను. బభ్రు వాహనుడు దానికి రాజు. అతడు తనతండ్రివచ్చుచున్న దని యెదురేగి సత్కరింపబోయెను. అర్జునుడాతనివంక చూచుటకు అనాదరణ చేసెను. అతడు నా తప్పేమియని యడుగగా, 'రాజ వంశమునపుట్టి యుద్ధముచేయక పిరికిపందవలె నన్ను బతిమా లుదువా?' అనుటతో అతి డభిమానమువచ్చినను, తండ్రితో యుద్ధముచేయనొల్లక యింటికి తిరిగి వెళ్ళెను. అక్కడ జరి గినదంతయు తెలిసికొని ఉలూపి నాగలోకమునుండి వచ్చి బభ్రువాహనునితో 'నాయనా! నే నులూపిని. సీతల్లిని. మీ తండ్రికి యుద్ధము చేయుట యే హితమైనది. నీవు వెళ్ళి నీ పరా క్రమము చూపుము' అని పురికొల్పినది.

అతడు వెంటనే యుద్ధభూమి కేగి, ఘోరముగా యుద్ధము చేసెను. అందు బభ్రువాహనుని బాణముచే అర్జునుని తల తెగి క్రిందపడినది. అర్జునుని బాణపుదెబ్బచే బభ్రు వాహనుడును మూర్ఛపోయెను. కొంతసేపటికి కతడు లేచి తండ్రిని చంపినందులకు ప్రాయశ్చిత్త మేమా? ఎంత దారుణకృత్యము చేసితిని?' అని విచారించుచుండెను. అర్జు నుడు తల తెగి పడినట్లు తెలిసి చిత్రాంగద, ఉలూచియు యుద్ధభూమికి వచ్చిరి. చిత్రాంగద 'అక్కా! నీ కే మప కారము చేసెనే భర్త? కొడుకును యుద్ధమునకు ప్రేరేపించి తివి కదవే? చేజేతుల చంపించితివే?' అని యేడ్చుచుండెను.

బభ్రువాహనుడు అర్జునుని వెనుక వచ్చుచున్న యాజ్ఞవల్క్య శిష్యుని ప్రాయశ్చిత్తము చెప్పుమని కోరగా అతడు తండ్రి కపాలము చేతబట్టి పండ్రెండేండ్లు భిక్షాటన సేయుటయే నిష్కృతి యని చెప్పెను. అట్లు చేయుట కతడు శంకించు చుండగా ఉలూచి 'దీని కంతకును కారణ మున్నది. మన భర్తకు కొడుకు చేతిలో చనిపోవు యోగ మున్నది. అది చనిపోవుట కాదు. కొంత ప్రాయశ్చిత్తముగా పడిపోవుట మాత్రమే. కాక నరనారాయణులలో నొకడైన యతని చంప నెవనితరము?' అని సంజీవన మణిని తలచుకొనగా అది వచ్చి చేతిలో పడినది. దానిని చిత్రాంగద తండ్రిచేతి కిచ్చి, అర్జునుని శరీరమునకు తలకలిపి మణిని తగిలించు మన్నది. అత డట్లు చేయగా అర్జునుడు నిద్రపోయి లేచినట్లు లేచెను. అందరు నతనికి నమస్కరించిరి. అతడు వారి నందరిని చూచి 'మీరందరు నిక్కడి కేల వచ్చితిరి?' అని యడుగగా వారు ఉలూపి నడుగుమనిరి. అపుడు 'మే మేమియు నపరాధము సేయముగదా!' అనెను.

ఆమె 'తమవలన అపరాధమా? ఎన్నడు నుండదు. నీవు యుద్ధములో శిఖండిని ముందుంచుకొని భీష్ముని చంపినందున వచ్చిన పాతకమునకు ప్రాయశ్చిత్తముగా నిట్లు చేయవలసి వచ్చినది. దాని కథ వినుము. నే నొక నాడు చెలికత్తెలతో గంగకు స్నానమున కేగగా వసువు లక్కడికి వచ్చి స్నానముచేసి తమకు ప్రత్యక్షమైన గంగాదేవితో 'అర్జునుడు శిఖండిని ముందుంచుకొని తన్ను కొట్టుమని భీష్ముని బాణములచే గొట్టెను. అట్లు కుత్సితముగా జయముగొన్న అర్జునుని

మేము శపింతుము' అనిరి. ఆమెయు కొప్పుకొన్నది. నే నది విని భయపడి చరచర యింటికేగి నా తండ్రి నంపితిని. అతడు ప్రార్థేయపడగా వసువులు దయతలచి 'యుద్ధములో బభ్రువాహనుని చేతిలో అర్జునుడు కూలెనేని ఆశాపము పోవును' అని సెలవిచ్చిరి. ఆసంగతిని నా తండ్రి చెప్పగా నే నా సమయమునకై నిరీక్షించుచుంటిని. ఇప్పుడితడు యుద్ధము చేయనొల్లక యింటికి మరలగా నోహామునొప్పించి తండ్రితో యుద్ధముచేయునట్లుచేసితిని. క్షమింపుము' అన్నది. అదివిని తనకు రాబోవు మహానరక శాపముల నారీతిగా పోగొట్టి నందుల కెంతో సంతోషించి అర్జును డామె నభినందించెను. బభ్రువాహనుడు తనపురమునకు వచ్చి విశ్రమింపుమని కోరి నను అశ్వరక్షణము కర్తవ్యమని చెప్పి, అర్జునుడు గుర్రము వెనుక నేగెను.

తర్వాత గుర్రము రాజగృహంబున కేగగా నర్జును డక్కడికేగి జరాసంధుని మనుమని జయించెను. అటనుండి చేదదేశమున శిశుపాలుని కొడుకగు శరభుని జయించి, కొంకణకిరాత దేశాధీశుల గెల్చెను. నిషాదదేశమున ఏకల వ్యుని కొడుకును గెల్చెను. తర్వాత ద్రవిడ, ఆంధ్ర, కేరళ కర్ణాట, సౌరాష్ట్ర దేశములవారిని జయించెను ద్వారకలోని వారిచే పూజలనొందెను. గాంధార దేశమున శకునికొడుకు యుద్ధముసేయుగా వానితల్లివచ్చి శరణు వేడినది. అతని వదలి వేసెను. ఇన్నియుద్ధములలోను అర్జునుడు రాజులను పరాభ వించెనే కాని చంపలేదు. తనకు దెబ్బలుతగులకుండ కాపాడు కొనెను. ధర్మరాజు యజ్ఞమునకు రమ్మని అందరిని ఆహ్వానిం

చెను. ఆరీతిగా నందనందనుగురించి పశ్చాత్తాపమున కిరీటి ముక్తాశ్వముతోసహా చేరెను.

శ్రీకృష్ణుఁ డవతారము చాలించుచు సకల యాదవ నాశనముగుచున్నదని పాండవులతో చెప్పి అర్జునుని రమ్మని దారుకునంపెను. అతడు రథముతోలుకొనివెళ్లి అర్జునుని తీసికొని వచ్చెను. అతడు వచ్చునప్పటికే శ్రీకృష్ణుడు స్వర్గస్థుడయ్యెను. రుక్మిణి మున్నగువారు ఆవృత్తాంతము చెప్పి విలపించిరి. అర్జునుడక్కడి మంత్రివర్గమును రావించి విచారముతో 'ప్రజలారా! ఏడవనాడు సముద్రము ద్వారకను ముంచును కాన మీరందరును ఇంద్రప్రస్థమునకు చేరుడు' అని హెచ్చరించెను. వారందరికిని తగు ప్రయాణసాధనములు కల్పించి పంపెను. కృష్ణునికి బలరామునికి అగ్నిసంస్కారముచేసి, కృష్ణ బలరాముల భార్యలను తోడ్కొని పోవుచుండగా, దారిలో బోయలు ధనము నపహరించుటకై వారి నడ్డగించిరి. అర్జునుడు వారితో యుద్ధముచేయబోయెను. కాని మంత్రములు స్ఫురింపలేదు. అది దైవకృతనిరోధమని తలచి అతడు తలవంచుకొనెను. చివరికి కృష్ణుని అష్టమహిషులను, బలరాముని భార్యలను మాత్రము రక్షింపగల్గెను. వారందరికిని కృష్ణనిర్యాణము సంగతిచెప్పగా వారు విచారించి అనుమరణము చేయుమనిరి. అర్జునుడు చందనకాష్ఠములతో చితి పేర్పించి, వారికోరిక తీర్చెను. అక్కడినుండి వ్యాసుని వద్దకేగి జరిగినదంతయు చెప్పెను. వ్యాసుడు 'నాయనా! దైవతంత్రము; దానికన్యథా జరుగబోదు. నిన్ను కాచినవాడు యాదవులరక్షింపలేడా? అది జరుగుటకు వీలులేదు.

సర్వము కాలవశమున కాన జరిగినదానికి విచారింపకుము'
అని హితోపదేశము చేసెను.

అర్జును డక్కడినుండి ఇంద్రప్రస్థపురమునకు వచ్చి ధర్మరాజుతో జరిగినదంతయు చెప్పెను. అతడు 'ఇప్పుడు మనకు కర్మత్యాగము కర్తవ్య' మనగా అర్జునుడు 'కాలము కేమియు ననలేము. కాలమును పోలినది కాలమేగాక మరొక దానికి లీలలు గలవా?' అని అన్నగారిపలుకుల నాచరించెను. అప్పు డందరును గలిసి మహాప్రస్థానము చేసిరి.

యోగశక్తితో మహాప్రస్థానము సేయుచుండగా సముద్రతీరమున కేగుసరికివృద్ధబ్రాహ్మణరూపమున అగ్నిదేవుడు ప్రత్యక్షమై 'అర్జునా! నీ కింకను గాండీవ మెందుకు? సముద్రములో పారవేయుము. అది వరుణునిది. నీవు కార్యార్థివై భగవదాజ్ఞచే తెచ్చియిచ్చితిని' అని చెప్పెను. అర్జునుడుతన కెంతో ఉపకరించినదను అభిమానముతో వదలలేక వదలలేక గాండీవమును అమ్ములపొదులను సముద్రములోనికి పారవైచెను.

మహాప్రస్థానమున అర్జునుడు ముందుగా పడుటకు కారణమే మని భీము డడుగగా ధర్మరాజు 'ఇతడు కౌరవుల నెల్ల నొక్కరోజులో చంపుదునని పలికెనే కాని చంపలేక పోయెను. పలుకొకటిచేత మరొకటియగుట మహాదోషము. అదిగాక ఇతడు ధనుర్ధారుల నందరిని నిందించుచుండును. అందుచేత నిట్లైనది' అనెను.

నరకంబున యాతనల ననుభవించుచున్న అర్జునునిచూచి ధర్మరాజు విచారించెను. తాను చేసిన కొద్ది పాతకమును అనుభవించినతరువాత దేవత్వమును పొందిసుఖము లనుభవించెను.

నరనారాయణులను పురాణములలో నొక్కడైన నరుడే అర్జునుడుగా నవతరించెను. శ్రీకృష్ణు డతని నిమిత్త మాత్రముగా నుంచి భారత యుద్ధమునందే భూభారమును తీర్చెనుచివరకిఅర్జునునకు దేవదత్తములైనకిరీటాదులుకాలిపోయి నవి. గాండీవమును నీటిలో పారవేయవలసివచ్చినది. తాను బోయలను సైతము కొట్టలేకపోయెను. అంతవరకు నంత పరాక్రమముచూపిన వీరాధివీరుడంతటిలో నంతచేతకాని వాడగుట చూచినచో పరమేశ్వరుని చిద్విలాసములు మనకర్థముకావు. పరమేశ్వరుడు స్వస్వకర్మానుసారము మానవులను నడపువాడే కాని స్వతంత్రుడు కాడు. అతని కొకరిమీద దయయులేదు. మరొకనిపై క్రోధములేదు. తను తలచిన కార్యము పూర్తి యగువరకు నొక్కొక్కని పరికరముగా వాడుకొనును. వాడు సర్వము చేతిలోనిదే యని విఱ్ఱవీగును. అంతియే మిగులునది.

పరాక్రమశాలియైన అర్జునుడు అన్నగారెంత ధర్మముగా జూదమాడి తనోడినను అంగీకరించుటయేగాక, తాను గెల్చి తెచ్చి అన్నదమ్ములను భార్యగా నర్పించిన భామకు సహింపరాని పరాభవము తన కన్నులముందు జరుగుచుండగా సహించి యూరకుండెను. అన్న ప్రతిన ప్రకారము అతనితో పాటు పదుమూడేండ్లు వనవాసాజ్ఞాతవాసము లనుభవించెను అదంతయు నతని సౌభ్రాత్రమునకు ప్రథమోదాహరణములు ఏవిషయమునను లోటులేనిగుణగణములుకలవాడర్జునుడు

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ।

# నకుల - సహదేవులు

వీరు పంచపాండవులలో కడగొట్టువారు. బలపరాక్రమములు కలవారే యైనను భీమార్జునులచాటున వీరిబలము మరుగుపడినది. అందమునకు పేరెన్నికగన్నవారు. సవతి యన్నలైనను ధర్మరాజాదులును భ్రాతృస్నేహమున సేవించిరి. వీరిద్దరును చెరియొకవిద్యలోను పండితులు. వీరిని పెంచుటచే కుంతియొక్క సమానము, ధర్మరాజు సమబుద్ధి వీరి సౌభ్రాత్రమును వెల్లడి యగుచున్నవి. భారతమున వీరిపాత్ర చాలతక్కువదైనను, పంచపాండవులలోని వారగుటచే కౌంతేయులతర్వాత చెప్పుచున్నాను.

పాండురాజు శాపకారణముగా భార్యలతోడి సంపర్కమువీడి శతశృంగ పర్వతముపై తపస్సు చేయుచుండెను. అంతలో అపుత్రస్యగతిర్నాస్తి యని విని కుంతికిదుర్వాసుడుపదేశించినమంత్రము సాధనముగా ముగ్గురు కొడుకులను పొందెను. ఆ ముగ్గురును కుంతికిపుట్టినవారే. అతని చిన్న భార్య మాద్రి. ఆమె పాతివ్రత్యమున కుంతికి తీసిపోదు. బ్రహ్మచర్యాదుల నామెయు భర్తతో సమముగా పాటించుచున్నది. కాని సవతికే పిల్లలు కలిగి తనకు కల్గకున్నందున ఆమెకును కొంచెము విచారము కల్గినది. అది అసూయకాదు. తనకు లేదే, కల్గిన బాగుండునను బాధయే. సంసారమునకు సత్సంతానమే ఫలితము. సంతానములేని సంసారము గొడ్డు చెట్టువలె విసుగుజనింపజేయును ఆమెకు సంతానము లేనిచో ఆమెపేరు నెవరుతలంతురు! అందుచే ఒకనాడు మాద్రి రహస్యముగా 'నాథా! నా కడుపుకూడ పండునట్లు అనుజ్ఞ నిమ్ము. నీ వాజ్ఞనిచ్చినచో కుంతి నాకుకూడ సంతానము

కల్గునట్లుచేయుము' అని కోరినది. అతడు 'నేను నదే అనుకొను చున్నాను. నేను కుంతితో చెప్పెదను' అని వెంటనే ఆమెను పిలిచెను. ఆమె వచ్చినది. పాండురాజు మాద్రి కోరికను తెల్పెను. ఆమె అట్లుచేయుట కంగీకరించెను. పాండురాజు సుందరాకారులైన అశ్వినీదేవతలనాహ్వానింపుమనెను. కుంతీదేవి జపముచేసి వారి నాహ్వానించినది. అశ్వినులు వచ్చిరి. కుంతి వారికి నమస్కరించి 'మాద్రికి సంతానమును ప్రసాదింపు'మని కోరినది. వారట్లే కరుణించిరి. మాద్రి గర్భవతియై కవలను కన్నది. వారి కాకాశవాణి 'నకుల సహదేవు'లని నామకరణ చేసెను. వారు దైవానుగ్రహము వలన పెరిగిరి. కౌంతేయు లతోపాటు వారును తండ్రిపోయిన తర్వాత తండ్రితో సహ సహగమనము చేసి తల్లి చనిపోయినను సవతితల్లి పెంపకమున హస్తినాపురమున ధృతరాష్ట్రుని అదుపు ఆజ్ఞలలో పెరిగి విద్యా బుద్ధులు నేర్చిరి.

ధర్మరాజు రాజసూయముచేయుటకు ముందు భీమార్జునులువలెనే నకుల సహదేవులును దిగ్విజయమున కేగిరి. అందు నకులుడు పశ్చిమ దిక్కునకేగి మహీంతక రాజ్యము నేలెడి మహాసేనుని, మరు మాళవ, బర్బర, శైవపక, దశార్ణ దేశాధిపతులను, దత్తకమయూరకాది శూద్రులను పుష్కరారణ్య నివాసులైన గొల్లలను, పంచనద ప్రాంతీయులను అమరపర్వతని వాసులను జయించి స్వాధీనము చేసికొని వారి వలనకప్పముగొన్న ధనమును పదివేలఒంటెలమీద వేసికొని వచ్చెను.

సహదేవుడు దక్షిణ దిగ్విజయము సేయనేగెను. సుమిత్ర, శూరసేన, దంతపత్ర్ర యవనులను, గోశృంగ పర్వత నివాసులను జయించెను. కుంతిభోజుని మర్యాదలను పరిగ్రహించెను. కృష్ణుని శత్రువగు జంభకుడను వానిని జయించి వానివద్దనుంచి ఉత్తమజాతి భద్రగజములను కప్పముగా గొనెను. వింద్యాను వింద్యుల జయించి మాహిష్మతీ పురమును ముట్టడించెను.

ఆ పట్టణరాజు నీలుడు. అతని పూర్వికుడు నిషధుడను రాజు రాజ్యముసేయు రోజులలో అగ్నిహోత్రుడు బ్రాహ్మణ వేషమున మాహిష్మతిలోనుండి చదువుకొనుచు పారదారికుడయ్యెను. అది తెలిసి రాజభటు లతనిపట్టితెచ్చి రాజసముఖమున నిలువబెట్టిరి. అగ్ని కవమానముచే కోపము వచ్చినది. ఆకోపమున నిప్పులు రాల్చెను. అదిచూచి నిషధుడు తన తప్పు మన్నింపుమనికోరెను. అతడుకరుణజూచికోరినకోరికనిత్తుననెను. నిషధుడు మావంశీయుల కెవరికైనను సరే నీవు శత్రుసైన్యములువచ్చి ముట్టడించినపుడు తెగుబెట్టుచు సహాయము చేయగోరెద' ననెను. అగ్ని అట్లే అనుగ్రహించెను.

ఆకారణమున సహదేవుని సైన్యములను అగ్నిమండింపసాగెను. సహదేవు డదిచూచి చలింపక శుచియై సంధ్యవార్చి దర్భశయనమున కూర్చుండి అగ్నిసూక్తములు పఠించుచు అగ్ని భట్టారకుని స్తుతించెను, 'ఓ దేవా! నీవు పవిత్రులలోకెల్ల పవిత్రుడవు. ధర్మనిత్యుడవు. ధర్మరాజు చేయు క్రతువునప్రీతికై కదా! దానికి విఘ్నము చరించుట నీకు న్యాయమా?' అని పొగడుటతో అగ్నిహోత్రుడు కరు

శించెను. వర్లూరెను. అది తెలిసి నీలుడు ఇక తాను గెలవలేనని సహదేవునకు గజాశ్వరథములను కానుకగా నిచ్చెను. అక్కడినుండి సౌరాష్ట్రమును జయించి, సాగరద్వీపవాసులైన నిషాధ, పురుషాద, ఏకపాదులను జయించెను. కర్ణప్రావరణులను, నరరాక్షసజన్ములను, రామశైల తామ్రద్వీప సంజయంతీ పురివాసులను స్వాధీనము చేసికొనెను. అదిగాక, తాళవన, పాండ్య, కేరళ, కళింగ, ద్రవిడ యవన కరహాటక రాజులజయించి పలానన ప్రదేశములందు విడిసి లంకకు దూతనంపెను. అతని వాక్యమునంగీకరించి విభీషణుడు రత్నాభరణాదులు కానుకగా నిచ్చిపంపెను. ఈరీతిగా దక్షిణ దిగ్విజయముచేసి ధనరాసులను తెచ్చెను.

రాజసూయమున ధర్మరాజు శ్రీకృష్ణున కర్ఘ్యమిచ్చినపుడు శిశుపాలుడు నిందించగా సహదేవుడులేచి 'అచ్యుతునకు అర్ఘ్యమిచ్చితిమి. దీనికి సభలో ఒప్పుకొనమని దౌర్జన్యముగా పక్కనవారల నెత్తిపై పెట్టుదునని యెడమకాలి నెత్తెను. సభ్యులెల్లరు భయపడి యూరకుండిరి. సహదేవునిపై పుష్పవర్షము కురిసినది. 'బాగుబాగు' అని పైనుండి దేవతలు మెచ్చుకొనిరి. నారదుడు 'బలే' యని నాట్యము చేసెను.

వనవాసమున కేగునప్పుడు తన సుందర రూపమును చూచి జనులు విచారింపకుండ ఒంటినిండ దుమ్ము చల్లుకొని నకులుడు వెళ్లెను. దీనమైనముఖము చూచినవారికి కీడు కల్గునని సహదేవుడు ముఖము వంచుకొని వెళ్ళెను.

సైంధవుడు ద్రౌపదిని బలాత్కారముగా తీసికొని పోవునపుడు ఆమె అతనితో 'నకులసహదేవులను రెచ్చగొట్టుట సుహాలో గనిపొస్నిజ్వాలలు। గక్కడి సర్పమును రెచ్చగొట్టుటవంటిదే' అన్నది.

ధర్మరాజు దప్పికవేసి మంచితీర్థము తెమ్మన్నప్పుడు ముందుగా వెళ్లి యక్షుని మాట నిరాకరించి పడిపోయినవారు నకులసహదేవులే!

అజ్ఞాతవాసము చేయవలసి వచ్చినప్పుడు ధర్మరాజు నకులునికేసి చూచి 'అయ్యో! ఇతడు వాలుగు సుకుమారశరీరుడు. అన్నై నాగరికత కలవాడు. ఇతడెట్లు సేవచేయునో!' అనగా నకులుడు నేను 'దామగ్రంథి' అను పేరుపెట్టుకొని గుర్రపుశాల కధ్యక్షుడనై సేవింతును. నా కెరిగిన అశ్వభేదములను చెప్పి రాజును ఒప్పింతును. నా నేర్పుచూచి రాజును సంతోషపరతును. మంచిగుర్రములను పుష్టిగనట్లు చూస్తాను. క్రొత్తగుర్రములకు నడకలు నేర్పెదను. కళ్లెముపెట్టనియ్యని వాటిని సాధింతును' అని తన నేర్పును చెప్పినాడు. ఇతడశ్వశాస్త్రమును రచించెను.

సహదేవుడు 'ఇతడు కుంతికి ముద్దుబిడ్డడు. మృదువైన శరీరముకలవాడు శ్రమపడలేడు.' అని యనిన ధర్మరాజుతో నేను గో సంరక్షకుడనై విరాటుని సేవింతును. గొడ్డుటావులనైనను పాలు చేపెదను. బక్కబడుగులుగా నున్నవాటిని కండపట్టునట్లు మేపెదను. తెవులుగొంటులను(రోగిష్ఠి గొడ్లు) మామూలుగా తయారుచేయుదును. క్రొత్త గిత్తలను స్వాధీనముచేసికొని పని నేర్పెదను. తంత్రీపాలుడను పేర రాజును

సేవింపుము' అని చెప్పెను. అంతేకాక అతడా కాలములో వ్రాసినదేమోగాని 'సహదేవ పశువైద్యశాస్త్ర' మను పేర ప్రసిద్ధమైన పశువైద్యశాస్త్రమున్నది.

యుద్ధములో వారు మహారథులై పోరిరి. ఒకనాడు నకులసహదేవులతో యుద్ధముచేసి దుశ్శాసనుడు మూర్ఛిల్లెను. అంతట కర్ణుడు అడ్డవచ్చి నకులుని మీదికి వెళ్లెను. అతడు 'ఆహా! నా భాగ్యముకొలది భగవంతుడు నిన్ను నా వద్దకు తెచ్చినాడు. నీమూలాననే కౌరవపాండవులకింత వరకు వచ్చినది. నిన్ను నాబాణముల కెరచేసి మరలెద; చూడు' మనెను. కర్ణుడు 'నీవు రాచబిడ్డవు, వీరుడవు మాటలతో నేల? చేతల చేసి చూపుము' అని యుద్ధమునకు గడంగెను. దివ్యాస్త్రవేదియైన కర్ణునితో నకులు డేమి యుద్ధముచేయ గలడు? అయినను చాలసేపు చేసెను. చివరికి కర్ణుడు నకులుని రథమును, గుఱ్ఱములను అన్నిటిని భగ్నముచేసెను. అతడు అందరును చూచుచుండగా సిగ్గువిడిచి పారిపోవుచుండెను. కర్ణుడు వెనుకనే వెళ్ళి, వింటి నతనిమెడకు తగిలించి తనవైపునకు లాగి 'ఓ బిడ్డా! ఏమి వదరితివోయి! ఇప్పుడు వాగుము నాబలము తెలిసికొంటివి. అంతేచాలు. ఓపికయున్నదా ఈడు-జోడుచూచుకొని యుద్ధముచేయుము. లేదా సిగ్గుతెచ్చుకొని యుద్ధమునుండిమరలి యింటు కేగుము. విచ్చలవిడిగా అర్జునుని వద్దకేగు నాయనా! కుమారా!' అని బుజ్జగించి పంపెను. కర్ణుడు కుంతి కిచ్చినమాట ప్రకారము చేతికిచిక్కినను ధర్మరాజాదుల నేమియు చేయక ప్రాణములతో వదలెను.

పదునెన్మిదవరోజున శకుని పాండవవీరులపైకి రాగా, ధర్మరాజు సహదేవుని శకునిమీది కేగుమని యాజ్ఞాపించెను. అతడట్లే అయిదువేల గుఱ్ఱముల తీసికొని శకుని నెదుర్కొనెను. అతనితో ఘోరముగా పోరు సల్పెను. శకుని ఆగలేక దుర్యోధను డున్నచోటికి పారిపోయెను.

తర్వాత కొంతసేపటికి శకునియు, అతని కొడుకైన ఉలూకుడును యుద్ధమునకు తలపడగా నకులసహదేవులు వారిపై కలియబడిరి. సహదేవుడు బాణములతో ఉలూకుని తల తెగగొట్టెను. అట్లు కొడుకుపడినతర్వాత శకుని విదురుని మాటలతలచెను. ఆ విచారముతో కోపము మరింతకాగా సహదేవునితో కలియబడెను సహదేవునిధాటికాగలేక సైనికులుపారిపోయిరి. శకునియుపారిపోబోయెను. సహదేవుడు వానినడ్డగించి 'మామా! పారిపోదువా? రాజధర్మము ప్రకారము యుద్ధరంగముననిలబడవలెగాని, పారిపోవుట న్యాయమా? జూదము నెపమున మమ్మెంత బాధించితివి? నీమాటవిన్న అవివేకులందరును చచ్చిరి. మమ్ముచూచి నవ్వినవారిలో నీవొక్కడవే దిగబడితివి. నాఅన్నచూచుచుండగా నీతలను తాటిపండు నూడవేసినట్లు ఊడనేసెదను. మామా! నిలువుము!' అని అతనిమీద శరవర్షము కురిపించి రథము గుర్రములు, సారథిని చంపి, అతనితల నరికెను. అదిచూచి మాయకు మూలమైన శకుని చచ్చుటతో అందరును హర్షధ్వానములు చేసిరి. శంఖములు పూరించిరి.

ధర్మరాజు రాజ్యమునియు రోజులలో నకుల సహ-
దేవులు అతని నెంతో గౌరవముగా సేవించిరి.

మహాప్రస్థానము చేయునపుడు సహదేవుడు ముందుగా పడిపోయెను. దానికి కారణమేమనియడిగినభీమునకు ధర్మరాజు 'వీడుతనకంటె తెలివైనవాడు లేడని తలచుచుండును. అందుచే ఇట్లైనది' అనెను. తర్వాత నకులుడు పడిపోయెను. అందుకు కారణము 'తనతో రూపమునందు సాటివచ్చువాడు జగత్తులో లేడని తలచును. అంతగర్వము పనికిరాదు. ఆ యహంకారమే యితనికి కీడైనది' అనెను ఆఖరున వారు అశ్వినీదేవతల సాన్నిధ్యము పొందిరి.

పంచపాండవుల రథాశ్వములలో భేదమున్నది. ధర్మరాజునకు చంద్రధ్వజము, హంసలవంటి గుఱ్ఱముల పూన్చిన రథమును కలవు. భీమునకు లేళ్ళవంటి గుఱ్ఱములును, సింహము ధ్వజముగానుకలవు. అర్జునునకు అగ్నిదత్తమైనరథము, శ్వేత వర్ణములైన అశ్వములు, కపిధ్వజమునున్నవి. నకులునకు విలుకరంగుగుఱ్ఱాలు, శరభధ్వజమును; సహదేవునకు నల్లని గుఱ్ఱములును, ఏనుగుజండాయునుకలవు వారి కందరికి నెన్నో గుఱ్ఱముల నొకేరంగువాటిని చిత్రరథు డిచ్చినాడు. వాటిని వారు తాత్కాలికముగా అతనివద్దనేయుంచి తమ కవసరము కల్గినపుడు వాడుకొనిరి.

జగత్తులో పాపము పెరిగి భూభారము హెచ్చగా దాని నణచుటకై భగవానుడు తా నవతరించుచు తనకు తోడుగా మరికొందరు దేవతల నవతరింపచేసెను. అట్టివారి

లోనివారే పంచపాండవులు. వారిజీవితమునందలి ప్రతిఘట్ట
మును ఆదర్శప్రాయమైయున్నది.

నకులసహదేవులు తనకు సవతితిమ్ముళ్ళగు కౌంతేయుల
తో గౌరవముగా మన్నించిరి. వారు వీరినెంతో ముద్దుగా
పెంచిరి. అందరును యావజ్జీవమును కలిసియుండుటచేతనే
వారు 'పంచపాండవులు' గా వ్యవహారమును పొందిరి.
లేనిచో కౌంతేయులు, మాద్రేయులు అని వ్యవహరింప
బడెడివారు. ఐకమత్యముతో వారు సాధించిన విషయములు
లోకుల కాదర్శప్రాయములైనవి. భారతమందలి సుగుణ
ములను గ్రహించి భారతపౌరులను పేరును సార్థకపరతురు
గాక!

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తునిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు!